శ్రీరామ దైవజ్ఞ విరచిత

# ముహూర్త చింతామణి




జ్యోతిషవిశారద - వాస్తు సమ్రాట్

**డా॥ ముదుండి విశ్వనాథరాజు**

పిహెచ్.డి

శ్రీరామ దైవజ్ఞ విరచిత

# ముహూర్త చింతామణి

(ప్రామాణిక ముహూర్త గ్రంథము)




వ్యాఖ్యానం

జ్యోతిష విశారద, వాస్తు సమ్రాట్

**డా. ఎం. విశ్వనాథ రాజు**

భాషాప్రవీణ

**ఎం.ఏ.** తెలుగు, హిందీ, సంస్కృతం, జ్యోతిషం (గోల్డ్‌మెడలిస్ట్ )



ప్రకాశకులు

**శ్రీ సాయి వాస్తు పబ్లికేషన్స్**

హైదరాబాదు - 500052

ఫోన్ : 9440945403, 040-24017595

# ముందు మాట

**నక్షత్రగ్రహ తారాణామధిపో విశ్వభావన:**
**తేజసామపి తేజస్వీద్వాదశాత్మన్ నమో౽స్తు తే**

కాలము రెండు విధములు. ఒకటి సృష్టిని నాశనము చేయునది. రెండు సమయగణన చేయునది. సమయసూచక కాలము కూడ రెండు విధములు. 1. మూర్తసంజ్ఞకము – స్థూలసమయము దీనిని నిత్యవ్యవహారములో నుపయోగించ వచ్చును. 2. అమూర్తము–అంత్యంత సూక్ష్మకాలము దీని అస్తిత్వమును మాత్రమే తెలిసికొనవచ్చును. కాని దీనినుపయోగించవలేమని సూర్యసిద్ధాంతకారుడు తెలిపెను.

**లోకానామన్తకృత్ కాల: కాలో౽న్య: కలనాత్మక:**
**స ద్విధా స్థూలసూక్ష్మత్వాత్ మూర్తశ్చామూర్త సంజ్ఞక: (సూ.సి,1,20)**

వేదవిహితకార్యములను నిర్వహించుటలో కాలమత్యంత మహత్వపూర్ణమైనది. షోడశ సంస్కారముల నిర్వహణలో కాలమధిక ప్రాధాన్యత వహించుచున్నది. మానవ జీవనములో పుట్టుకనుండి మరణము వరకు కలుగు వివిధ సమస్యలకు అనుకూల ప్రతికూల సమయములను తెలుసుకొని ప్రతికూల స్థితి నుండి అనుకూల స్థితికి రావడానికి తగిన కాలమే అనుకూల సమయముగా అభ్యుదయ ముహూర్తముగా నిర్ణయించవచ్చును. జ్యోతిర్విజ్ఞానము ద్వారా తిథి,వార,నక్షత్ర,కరణ,యోగముల నాధారము చేసుకొని అనుకూల సమయమును నిర్ణయించుటను ముహూర్తమని స్థూలముగా చెప్పవచ్చును.

త్రిస్కంధయుతమైన జ్యోతిషశాస్త్రములో ముహూర్త విషయము సంహితా స్కంధములోనిదిగా భావింపబడినది. క్రమముగా ముహూర్త ప్రాధాన్యత పెరుగుతు దాని ఉపయోగమధికమగుట వలన స్వతంత్ర అస్తిత్వము పొందినది. లోకవ్యవహారములో ముహూర్త ప్రాధాన్యతను గుర్తించిన పండితులు ముహూర్త మార్తాండము, ముహూర్త చూడామణి, ముహూర్త కల్పద్రుమము, ముహూర్తమాల, ముహూర్తదీపికాది గ్రంథముల రచన చేసిరి.

శ్రీరామ దైవజ్ఞుడు రచించిన ముహూర్త చింతామణి గ్రంథము ముహూర్త బోధక గ్రంథములలో అత్యంత ప్రామాణికమై లోకములో ప్రసిద్ధి పొందినది. రామదైవజ్ఞుని మూల నివాసస్థానము విదర్భదేశములోని గోదా సమీపములోని ధర్మపురి గ్రామము. ఇతని తండ్రి అనంత దైవజ్ఞుడు. తమగ్రామము విడిచి కాశీలో స్థిరపడెను. రామదైవజ్ఞుడు కాశీలో జన్మించెను. ఇతని అగ్రజుడు నీలకంఠుడు 'తాజక నీలకంఠి' గ్రంథమును రచించెను. శకసంవత్సరము 1522లో ఈ గ్రంథ రచన కాశీలో జరిగినదని రచయిత తెలిపెను. గ్రంథకారుడైన రామదైవజ్ఞుడు ఈ గ్రంథమునకు ప్రతిమాక్షర నామక సంస్కృత వ్యాఖ్యానమును రచించెను. ఇతని సోదరుని కుమారుడు శ్రీ గోవిందుడు అతి విపులముగా పీయుషధార' వ్యాఖ్యానమును

రచించెను. దీనిలో శృతి, స్మృతి, పురాణ, వ్యాకరణ, మీమాంస, ధర్మశాస్త్ర, జ్యోతిషశాస్త్ర విషయములతి వివరముగా సమన్వయ పూర్వకముగా తెలియజేసెను. పలువురు పండితులు ఈ గ్రంథమునాధారముగా చేసుకొని యాత్రా వివాహ యజ్ఞోపవీతాది సంస్కారములకు ముహూర్త నిర్ణయము చేయుట జరుగుతున్నది.

ఈ గ్రంథమింతకు పూర్వము తెలుగులో సంపూర్ణముగా ననువదింపబడలేదు. జ్యోతిషశాస్త్రాభిలాషులకు, ముహూర్త విషయజ్ఞానము నాశించు విద్యార్థులకు పయోగపడునను తలంపుతో నీగ్రంథమును తెలుగులోనికి అనువదించుట జరిగినది. అనువాదములో మూల విషయముతో పాటు మధ్యమధ్యలో ముఖ్య విషయములను సులభముగా తెలుసుకొనుటకు పట్టికల రూపములో ఇచ్చుట జరిగినది.

నాచే ఇంతకు ముందు అనువదింపబడిన విశ్వకర్మప్రకాశము,నారద సంహిత,మయమతము,వాస్తురాజ వల్లభము, బృహత్సంహిత గ్రంథములు పలువురి పండితుల మన్ననలు పొందినవి.వారిప్రేరణ, ప్రోత్సాహము ఈగ్రంథాను వాదమునకు కారణమైనది. శాస్త్రాభిలాషులైన పాఠకులు, జ్యోతిష విద్యార్థులు ఈ గ్రంథమును చదివి శాస్త్రజ్ఞానమును పొందగలరని యాశించుచున్నాను. ఈ గ్రంథాధ్యయనము వలన ఏ కొంత ప్రయోజనము పొందినను నాకృషి సఫలమైనదని తలంతును.

ఈ గ్రంథమునకు సంస్కృతములో హిందీభాషలో అనేక వ్యాఖ్యానములు వెలువడినవి. వాటిని ఆధారముగా చేసుకొని ముఖ్యముగా పీయుషధారా వ్యాఖ్యానాను సారముగా అనువాదకార్యము నిర్వహించుట జరిగినది.అనువాదకార్యమతి కఠినతరమైనను శాస్త్రవిషయమును నలుగురికి తెలియజేయవలెనను తలంపుతో నీకార్యమునకు పూనుకొంటిని. పండితులు స్ఖాలిత్యములను తెలియజేసిన కృతజ్ఞుడను కాగలను.

**గచ్ఛత: స్ఖలనం క్వాపి భవత్యేవ ప్రమాదత:**
**హసన్తి దుర్జనస్తత్ర సమాదధతి సజ్జనా:**

ఈ గ్రంథ రచన చేయుటకు ప్రోత్సాహించిన ప్రియమిత్రులు ప్రముఖ జ్యోతిష వాస్తు పండితులు శ్రీపల్లావఝుల శ్రీరామకృష్ణశర్మ గారికి, శ్రీ ఎమ్.ఎల్ బి శాస్త్రిగారికి కృతజ్ఞతలు తెలియజేయుచున్నాను.డి టి పి కార్యాన్ని సక్రమంగా నిర్వహించిన ప్రియశిష్యుడు జ్యోతిషపండితుడైన శ్రీ వై.సత్యనారాయణ మూర్తికి ఆశీ:పూర్వక అభినందనలు తెలియ జేయుచున్నాను.

పండితులు ఈ గ్రంథముద్రణలో దొర్లిన దోషములను తెలియజేసిన మలి ముద్రణలో సరిజేయగలవాడను. ఈగ్రంథ ముద్రణలో సహకరించి ప్రోత్సహించిన మిత్రులు శ్రేయోభిలాషులకు హృదయపూర్వక నమస్సులతో

భవదీయుడు

**డా. ఎం విశ్వనాథ రాజు**

## కృతి సమర్పణం



మా కులదైవమైన కాళ్ళకూరు వేంకటేశ్వరస్వామికి భక్తి పూర్వక నమస్సులతో సమర్పణం.

 

## గ్రంథకర్త ఇతర రచనలు



1. ప్రాచీన వాస్తు శాస్త్రాలు – ఆధునిక వాస్తు పరిశీలన (వాస్తులో మొట్టమొదటి పరిశోధనా గ్రంథము)– రూ॥ 300/–
2. విశ్వకర్మ ప్రకాశము – వచనము – రూ॥ 100/– (ఆధునిక వాస్తు సమస్యలకు సమాధాన గ్రంథము )
3. నారద సంహిత – మూలానువాదము – రూ॥ 170/–
4. వాస్తురాజ వల్లభము – మూలానువాదము – రూ॥ 72/–
5. మయమతము – వచనము – రూ॥ 90/–
6. బృహత్సంహిత – వచనము – రూ॥ 180/–

## విషయ సూచిక


**1. శుభాశుభ ప్రకరణము (1-20)**

తిథిస్వాములు 1
తిథిస్వామి బోధక పట్టిక
నందాది సంజ్ఞలు 3
వారములందు నిషిద్ధ తిథి నక్షత్రములు
అధమ యోగము 4
తిథులందు వర్జిత కార్యములు
శూన్యతిథులు 5
అశుభయోగములు
శూన్య నక్షత్రములు 6
శూన్యరాశులు
శూన్య బోధక పట్టిక
శూన్యలగ్నములు 7
శూన్య నక్షత్ర లగ్నబోధక పట్టిక
శూన్యతిథి నక్షత్రముల పరిహారము
స్థిరయోగములు 8
అశుభ యోగపరిహారము 9
రవి యోగము
వారక్రమములో సర్వార్థసిద్ధి యోగములు
ఉత్పాత-మృత్యు-కాణ-సిద్ధయోగ లక్షణములు 10
అశుభయోగ పరిహారము
శుభకార్యములందు వర్జ్యయోగములు 11
గ్రహణ భేదముతో శుభాశుభ విచారము
సామాన్యముగా వర్జిత కార్యములు 12
పక్షరంధ్ర తిథుల పరిహారము
కులికాది అశుభ ముహూర్తము
వారక్రమములో దూషిత ముహూర్తములు 13
హోరాలాష్ట విచారము
అశుభయోగ పరిహారము 14
భద్ర విచారము
భద్రముఖ పుచ్ఛ విచారము
సమయశుద్ధి 15
సింహస్థ గురుదోషము 16
మకరస్థ గురుదోషము 17
లుప్త సంవత్సరదోషము
వారప్రవృత్తి
కాలహోరలు 18
మన్వాది యుగతిథులు 20

**2. నక్షత్ర ప్రకరణము (21-42)**

నక్షత్రాదిపులు 21
నక్షత్రాధిప పట్టిక
నక్షత్ర సంజ్ఞాబోధక పట్టిక
స్ఫుటిత వస్త్రఫలము 24
లతాపాదపరోపణ రాజదర్శన
విక్రయాది ముహూర్తము 25
పశరక్షా ముహూర్తము
ఔషధసేవన-సూచీకర్మ ముహూర్తము
క్రయవిక్రయ ముహూర్తము 26
హస్త్యశ్వ ముహూర్తము
భూషణ నిర్మాణ ముహూర్తము
ముద్రాపాతన వస్త్రప్రక్షాళన ముహూర్తము
ఖడ్గాదిధారణ ఉపయోగ
శయ్యా ముహూర్తము
అంధాది నక్షత్ర సంజ్ఞ 28

| | | | |
|---|---|---|---|
| ధనవ్యవహార ముహూర్తము | | అభుక్త మూల ప్రమాణము | 39 |
| జలాశయ ఖనన నృత్యారంభ ముహూర్తము | | మూల జాతకుల పాదఫలము | |
| సేవా ముహూర్తము | | మూల నివాసఫలము | 40 |
| హలప్రవహణ ముహూర్తము | 30 | జన్మనిషిద్ధ కాలము | 41 |
| బీజవపన ముహూర్తము | | నక్షత్రతారలు | |
| శిరామోక్షణ విరేచన ధర్మక్రియల ముహూర్తము | | నక్షత్ర స్వరూపము | 42 |
| ధాన్యఛేదన ముహూర్తము | 31 | జలాశయారామ సురప్రతిష్ఠా ముహూర్తము | |
| సస్యరోపణ కణమర్దన ముహూర్తము | | **3. సంక్రాంతి ప్రకరణము (43-49)** | |
| శాంతి మంగల-పౌష్టిక-కర్మముహూర్తము | 32 | సంక్రాంతి నామములు | 43 |
| హెూమాహుతి ముహూర్తము | | కాలవశ సంక్రాంతి ఫలము | 44 |
| హవనములో అగ్నివాస ముహూర్తము | | రాశివశ సంక్రాంతి ఫలము | |
| నవాన్న భక్షణ ముహూర్తము | 33 | సంక్రాంతి పుణ్యకాలము | 45 |
| నౌకాఘటన ముహూర్తము | | అయన సంక్రమణ విశేషము | |
| అభిచారవీర ముహూర్తము | | పుణ్యకాల విశేషము | |
| రోగయుక్త స్నాన ముహూర్తము | | చల సంక్రాంతి విశేషము | 46 |
| శిల్పవిద్యా ముహూర్తము | 34 | సమ-బృహత్-జఘన్య సంజ్ఞక నక్షత్రములు | |
| మైత్రీ ముహూర్తము | | రవిసంక్రమణ ఫలము | 47 |
| పరిక్షా ముహూర్తము | | సంక్రాంతులలో వాహనాదులు | |
| సామాన్య శుభకార్యములలో లగ్నశుద్ధి | 35 | సంక్రాంతి శుభాశుభ ఫలము | 48 |
| నక్షత్రవశమున జ్వరఫలము | 36 | గ్రహబలములలో చేయుకార్యములు | 49 |
| శీఘ్రమరణయోగము | | క్షయాది మాసలక్షణము | |
| ప్రేత-క్రియాది కార్యములు | | **4. గోచార ప్రకరణము (50-56)** | |
| కంత గోమయపిండ ముహూర్తము | 37 | జన్మగత గ్రహణ ఫలము | 51 |
| కాష్ఠస్థాపన పట్టిక | | చంద్రబల విశేషము | |
| త్రిపుష్కర-ద్విపుష్కర యోగ లక్షణములు | 38 | నవరత్నధారణ విధి | 52 |
| శవప్రకృతి వహన నిషిద్ధకాలము | | | |
| శతప్రకృతి దహనకర్త శుభాశుభ సమయము | | గ్రహానుకూల రత్నధారణము | 53 |

తారల నామములు
తారాదోష పరిహారము
చంద్రావస్థజ్ఞానము 54
అవస్థల నామములు
అవస్థాబోధక చక్రము
గ్రహదోష పరిహార ఓషధులు 55
గంతవ్యరాశి ఫలకాలము 56
దుష్ట తిథ్యాదుల పరిహారము
గ్రహముల ఫలకాలము
**5. సంస్కార ప్రకరణము (57–75)**
ఆద్యరజోదర్శన ప్రశస్తకాలము 57
ఆద్యరజోదర్శన నిషిద్ధకాలము
ఋతిమతి స్నానముహూర్తము
ఆధాన ముహూర్తము 58
గర్భాధాన ముహూర్తము
సీమంత సంస్కార ముహూర్తము 59
గర్భమాసదేవతలు
పుంసవన ముహూర్తము
జాతకర్మ–నామకరణ ముహూర్తము 60
సూతికాస్నాన ముహూర్తము
దంతోత్పత్తి ఫలము
డోలారోహణ చక్రము 61
డోలారోహణ నిష్క్రమణ ముహూర్తము
సూతికలో జలపూజా ముహూర్తము
అన్నప్రాశన ముహూర్తము
అన్నప్రాశమున గ్రహముల స్థానబలము 62
భూమ్యుపవేశన ముహూర్తము 63
బాలుని తాంబూల భక్షణ ముహూర్తము
కర్ణవేధ ముహూర్తము
గురు శుక్రుల బాల్యవృద్ధత్వ
నిరూపణము 64
ముండన ముహూర్తము 65
అక్షరారంభ ముహూర్తము 68
వ్రతబంధ ముహూర్తము 69
ఉపనయనమున కశుభ స్థానములు 70
ఉపనయనములో లగ్నశుద్ధి
బ్రాహ్మణాదుల స్వాములు
వర్ణేశుల ప్రయోజనము
వ్రతబంధములోజన్మమాసవిచారము 71
శుభకర్మలందు గురు విచారము
ఉపనయన నిషిద్ధకాలము 72
చంద్ర నవాంశ వైశిష్ట్యము
ఉపనయనము నందు
అనాధ్యాయములు 73
ప్రదోష లక్షణము
బ్రహ్మోదన సంస్కారము 74
వ్రతక్రమ నక్షత్రములు
మాతారజస్వల పరిహారము
ఛురికాబంధ ముహూర్తము 75
కేశాంత సమావర్తన ముహూర్తము
**6. వివాహ ప్రకరణము (76–119)**
వివాహ ప్రయోజనము 76
ప్రశ్నవలన వివాహ యోగము
ప్రశ్నలగ్నము వలన వివాహము 77
ప్రశ్నలగ్నమున వైధవ్యయోగము
వివాహభంగ యోగము
వైధవ్య పరిహార యోగము 78
ప్రశ్నలగ్నము వలన సంతాన

| విషయము | | నాడీవేధ చక్రము 92 | |
|---|---|---|---|
| కన్యావరణ ముహూర్తము | 79 | నవాంశ బోధక పట్టిక | 93 |
| వరవరణ ముహూర్తము | | హోరాజ్ఞానము | |
| వివాహ మాసములు | 80 | గండాంత దోషము | 96 |
| వివాహములో జన్మమాస నిషేధము | | కర్తరీ దోషము | 97 |
| జ్యేష్ఠమాస విచారము | 81 | చంద్రయుతి ఫలము | |
| స్వకులములో పుత్రకన్యల వివాహ నిషేధము. | | అష్టమలగ్న ఫలము | |
| | | ద్వాదశాష్టమ సంబంధ దోషము | 98 |
| అశౌచములో వివాహముహూర్త నిర్ణయము. | | నక్షత్రముల విషఘటీ దోషము | |
| | | నక్షత్ర విషఘటీ బోధక పట్టిక | 99 |
| వివాహముతర్వాత ముండన నిషేధము | 82 | పగలు పదిహేను ముహూర్తములు | 100 |
| పాదభేదముతో మూలాది నక్షత్ర జాతఫల పరిహారము | | రాత్రి పదిహేను ముహూర్తములు | |
| | | పగలు నిందిత ముహూర్తములు | |
| అష్టకూట నామములు | 83 | తాజ్యముహూర్త బోధక పట్టిక | 101 |
| వర్ణము | | వివాహమునకు నక్షత్రాదులు | |
| వర్ణగుణబోధక పట్టిక | | పంచశలాక వేధ | |
| వశ్య విచారము | 84 | క్రూరవేధ పరిహారము | 102 |
| వశ్య గుణ బోధకపట్టిక | | లత్తాదోషము | 103 |
| తారా విచారము | | పాతదోషము | |
| గుణబోధక పట్టిక | 85 | క్రాంతిసామ్య మహాపాతదోషము | |
| యోని గుణబోధక పట్టిక | 86 | ఖర్జూరదోషము | 104 |
| గ్రహమైత్రి పట్టిక | 87 | ఏకార్గల దోషము | |
| గణ విచారము | | ఉపగ్రహ దోషము | 105 |
| గణ విభాగ పట్టిక | 88 | పాతోపగ్రహ లత్తా దోష పరిహారము | |
| రాశికూట విచారము | | కులిక దోషము | 106 |
| రాశికూట పరిహారము | 89 | దగ్ధ తిథులు | |
| గణభకుట పరిహారము | | జామిత్రదోషము | |
| నాడీ విచారము | | ఏకార్గలాది దోషపరిహారము | 107 |
| గుణబోధక పట్టిక | 90 | దేశభేదము వలన పరిహారము | |

| | | | |
|---|---|---|---|
| వేధచక్రము | 108 | మేషాది రాశులలో రవి గతి | 118 |
| పంచబాణ దోషము | | నవాంశాయనము | |
| వ్యాసోక్తబాణ దోషము | 109 | లగ్నజ్ఞానము ఇష్టజానము | 119 |
| బాణదోష పరిహారము | | వివాహ వర్జ్య దోషములు | |
| గ్రహదృష్టి విచారము | | **7. వధూప్రవేశ ప్రకరణము(120-121)** | |
| ఉదయాస్త శుద్ధి | 110 | వధూప్రవేశ కాలము | 120 |
| అర్కసంక్రాంతి దోషము | 111 | వధూప్రవేశ ముహూర్తము | |
| గ్రహముల సంక్రాంతి దోషము | | వివాహానంతరము పతి గృహములో | |
| పంగ్వంధ బధిరదోషము | | మాస ఫలము | 121 |
| పంగ్వంధాదుల మతాంతరము | 112 | **8. ద్విరాగమన ప్రకరణము (121-122)** | |
| బధిరాదుల ప్రయోజనము | | సమ్ముఖ శుక్రవిచారము | 121 |
| వివాహములో తెల్పిన నవాంశములు | | సమ్ముఖ శుక్రదోష పరిహారము | 122 |
| లగ్నభంగ యోగములు | 113 | **9.అగ్న్యాధాన ప్రకరణము** | |
| గ్రహముల శుభస్థానములు | | అగ్న్యాధాన ముహూర్తము | 123 |
| కర్త్ర్వాదిదోషాపవాదములు | | అగ్నిహోత్ర లగ్నశుద్ధి | |
| అబ్దాదిదోష పరిహారము | | యాగ కర్తృత్వ యోగము | |
| అన్యపరిహారము | 114 | **10.రాజాభిషేక ప్రకరణము(124-125)** | |
| దోష సమూహ పరిహారము | | రాజాభిషేక కాలము | 124 |
| గ్రహముల వలన శ్వశురాదుల జ్ఞానము | 115 | లగ్నశుద్ధి విచారము | |
| సంకీర్ణజాతుల వివాహ ముహూర్తము | | పాపగ్రహస్థితి ఫలము | 125 |
| గాంధర్వ వివాహ ముహూర్తము | | రాజాభిషేక లగ్న సంపత్తి జ్ఞానము | |
| వివాహమునకు ముందు చేయు | | **11.యాత్రా ప్రకరణము(125-156)** | |
| కార్యములు | 116 | యాత్రాముహూర్తము విధానము | 125 |
| వేదికా ప్రమాణములు | | ప్రశ్న వలన యాత్రాఫలము | |
| తైలాది లాపనము | | శకున ఫలము | 126 |
| మండపాది స్థానములు | 117 | యాత్రాభంగ యోగము | |
| గోధూళి ప్రశంస | | యాత్రలో దిక్‌జ్ఞానము | |
| గోధూళి కాలవర్జ్యములు | | సౌరమాస క్రమములో | |

| | |
|---|---|
| యాత్రాఫలము | 127 |
| యాత్రలో తిథి నక్షత్ర యోగ ఫలము | |
| వారశూల విచారము | 128 |
| దిక్శూల పరిహార పట్టిక | |
| కాలశూల జ్ఞానము | |
| త్యాజ్యనక్షత్ర ఘడియలు | 129 |
| నక్షత్రముల జీవాదిసంజ్ఞ | |
| జీవపక్షాది నక్షత్రఫలము | 130 |
| అకుల-కుల-కులాకుల సంజ్ఞ | |
| పథిరాహు చక్రము | 131 |
| పథిరాహు చక్రపట్టిక | 132 |
| పథిరాహు చక్రఫలము | |
| తిథిబోధక పట్టిక | 133 |
| యాత్రలో సర్వాంక సాధనము | 134 |
| మహాదల భ్రమదోషములు | |
| హింబర యోగము | |
| ఘాతచంద్రత్యాజ్య నక్షత్రపాదములు | 135 |
| ఘాత తిథులు | |
| ఘాతవారములు | |
| ఘాత నక్షత్రములు | 136 |
| ఘాత లగ్నములు | |
| ఘాతబోధక పట్టిక | |
| యోగినీవాస జ్ఞానము | 137 |
| కాలపాశ యోగములు | |
| కాలపాశ పట్టిక | |
| పరిఘదండ యోగములు | |
| పరిఘదండ పట్టిక | 138 |
| పరిఘదండ పరిహారము | |
| యాత్రలో నక్షత్ర లగ్నశుద్ధి | |
| యాత్రలో అయన విచారము | 139 |
| యాత్రలో సమ్ముఖ శుక్రదోషము | |
| శుక్రవక్రత్వ దోషము అపవాదము | 140 |
| ప్రతిశుక్రాపవాదము | |
| యాత్రలో లగ్నశుద్ధి | |
| యాత్రలో అశుభలగ్నములు | 141 |
| శుభలగ్నము | |
| దిక్కులకు స్వాములు | 142 |
| దిగీశుల ప్రయోజనము | |
| లలాటియోగము | |
| పర్యుషిత యాత్రా యోగము | 143 |
| సమయ బలము | |
| ద్వాదశభావ సంజ్ఞ | |
| గ్రహముల భావఫలము | 144 |
| యోగయాత్రాది బలము | |
| రాజ్యలాభ యోగము | 146 |
| విజయప్రద యోగము | |
| యోగము-యోగాధియోగము | 147 |
| విజయదశమి సిద్ధ ముహూర్తము | |
| యాత్రలో శకున విచారము | 148 |
| యాత్రలో నిషిద్ధకాలము | |
| ఏకదిన సీమ యాత్రా విశేషము | |
| యాత్రలో త్రినవమి దోషము | 149 |
| యాత్రాకాలిక కర్తవ్యము | |
| యాత్రలో నక్షత్రదోషము | |

| | |
|---|---|
| దిగ్దోహదము | 150 |
| వారదోహదము | |
| తిథిదోహదము | |
| దిశాయానము | 151 |
| యాత్రలో నిర్గమస్థానము | |
| వర్ణానుసార యాత్రా వస్తువులు | |
| ప్రస్థాన ప్రమాణము | |
| యాత్రలో త్యాజ్యవస్తువులు | 152 |
| త్యాజ్య వస్తుసేవనము వలన | |
| దుష్పరిణామము | |
| అకాలవృష్టి జన్యదోషము | 153 |
| అకాలవృష్టి దోషశాంతి | |
| శుభశకునము | |
| ఇతర శకునములు | 154 |
| అశుభ శకునము పరిహారము | 155 |
| యాత్రలో నిషిద్ధయోగములు | 156 |
| **12 వాస్తు ప్రకరణము (157–168)** | |
| స్థాన శుభాశుభ విచారము | 157 |
| రాశి వశమున నిషిద్ధ స్థానములు | 158 |
| నామానుకూల పట్టిక | |
| ఆయవశమున ద్వారజ్ఞానము | 159 |
| గృహారంభములో కాలశుద్ధి | 160 |
| వ్యయఅంశల జ్ఞానము | |
| ధ్రువాంక సాధనము | 161 |
| పిండ అంశాదుల సాధనము | |
| ఆయాదిసాధన పట్టిక | 162 |
| గృహారంభములో వృషభవాస్తు చక్రము | |
| వృషభచక్ర పట్టిక | 163 |
| గృహారంభములో మతాంతరము | |
| తిథివశమున ద్వార నిషేదము | 164 |
| గృహారంభములో పంచాంగ శుద్ధి | |
| దేవాలయాది నిర్మాణములో | |
| రాహుముఖ జ్ఞానము | |
| రాహుముఖ పృష్ఠ బోధక పట్టిక | 165 |
| కూపనిర్మాణ ఫలము | |
| గృహవిభాగ పట్టిక | 166 |
| లగ్నము వలన గృహఫలము | |
| చిరాయు యోగము | 167 |
| గృహ హస్తాంతర యోగము | |
| గృహారంభ నక్షత్ర వారఫలము | |
| ద్వారచక్ర మతాంతరము | 168 |
| **13.గృహప్రవేశ ప్రకరణము (169–171)** | |
| జీర్ణగృహ ప్రవేశ ముహూర్తము | 169 |
| వామార్క జ్ఞానము | 170 |
| గృహప్రవేశ కుంభజ్ఞానము | |
| కుంభఫల పట్టిక | 171 |
| ఉపసంహారము | |
| **14. గ్రంథకర్త వంశ వర్ణనము** | |
| గ్రంథకార పరిచయము | 172 |



# ముహూర్త చింతామణి

## 1. శుభాశుభ ప్రకరణము

**గౌరీశ్రవ: కేతకపత్ర భఙ్గమాకృష్య హస్తేన దదన్ముఖాగ్రే**

**విఘ్నం ముహూర్తా కలిత ద్వితీయదన్త ప్రరోహో హరతు ద్విపాస్య:** 1

తల్లియైన పార్వతి చెవులలో కర్ణభూషణముగా నున్న కేతకీపుష్పపు రేకును తన చేతులతో లాగి తనముఖములో నుంచుకొని కొన్ని క్షణములవరకు రెండవ దంతము ఉత్పత్తి జరిగినట్లుగ ప్రదర్శించిన గజాననుడు విఘ్నములను దూరము చేయుగాక.

**క్రియాకలాపప్రతిపత్తిహేతుం సంక్షిప్తతారార్థ విలాసగర్భమ్**

**అనన్తదైవజ్ఞసుత: సరామో ముహూర్త చిన్తామణిమాతనోతి** 2

సమస్త క్రియా కలాపములు (షోడశ సంస్కారములు, వ్యాపారము, యాత్రాది కర్మలు) నిర్వహించుటకు శుభసమయమును తెలిసికొనుటకు అనంత దైవజ్ఞుని పుత్రుడు రామదైవజ్ఞుడు అత్యంత సంక్షిప్తముగా,శాస్త్రముల మూలతత్త్వమును గంభీరమైన అర్థములను పరిపూర్ణము చేయుటకు ముహూర్తచింతామణి పేరుకలిగిన గ్రంథమును రచించుచున్నారు.

**తిథి స్వాములు :-**

**తిథీశా వహ్నికౌ గౌరీ గణేశోఽహిర్గుహో రవి:**

**శివో దుర్గాన్తకో విశ్వే హరి: కామ: శివ: శశీ** 3

పాడ్యమాది తిథులకు క్రమముగా అగ్ని, బ్రహ్మ, గౌరి, గణేశుడు, సర్పము, కార్తికేయుడు, సూర్యుడు, శివుడు, దుర్గ, యమరాజు, విశ్వేదేవుడు, విష్ణువు, కామదేవుడు, శివుడు, చంద్రుడు స్వాములగుదురు.

**తిథిస్వామి బోధక పట్టిక :-**

| | 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|---|
| తిథి | పాడ్యమి | విదియ | తదియ | చవితి | పంచమి |
| స్వామి | అగ్ని | బ్రహ్మ | గౌరి | గణేశ | సర్ప |

| | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|
| తిథి<br>స్వామి | షష్ఠి<br>కార్తికేయ | సప్తమి<br>సూర్య | అష్టమి<br>శివ | నవమి<br>దుర్గ | దశమి<br>యమ |
| | 11 | 12 | 13 | 14 | 15 |
| తిథి<br>స్వామి | ఏకాదశి<br>విశ్వేశ్వర | ద్వాదశి<br>విష్ణు | త్రయోదశి<br>కామదేవ | చతుర్దశి<br>శివ | పూర్ణిమ<br>చంద్రుడు |

15వ తిథికి అధిపతి చంద్రుని తెల్పెను. కానిపైశ్లోకములో అమావాస్య,పూర్ణిమ లలో ఏతిథికి చంద్రుడు స్వామియని స్పష్టముగా తెలుపలేదు. కొంతమంది ఆచార్యులు పూర్ణచంద్రుడగుట వలన పూర్ణిమకు స్వామి చంద్రుడని అమావాస్యకు అధిపతి పితురులని తెల్పిరి.

గ్రంథములో ప్రతి తిథి యొక్క కార్యము వివరించి తెలుపలేదు.పీయూషధారా వ్యాఖ్యలో ఈ విషయమును స్పష్టముగా తెలిపెను.

1. పాడ్యమిలో - వివాహము, యాత్ర, ఉపనయనము, ప్రతిష్ఠ, సీమంతము, చౌలము, వాస్తుకర్మ, గృహప్రవేశాది, మంగళకార్యములు చేయరాదు.

2. విదియలో - యాత్ర,వివాహము,భూషణము,సంగీతము,శిల్పాదికర్మలు చేయవలెను.

3. తదియలో - విదియలో తెల్పిన కార్యములు చేయవలెను.

4. చవితిలో - విద్యుత్కర్మ, వధ, బంధనము, శస్త్ర , విష, అగ్నిఘాతాది కార్యములు చేయవలెను.

5. పంచమిలో - విదియ తదియలలో తెల్పిన శుభకర్మలు చేయవలెను.

6. షష్ఠిలో - యాత్ర, పితృకర్మ, దంతకాష్ఠాది సంచయము చేయరాదు.

7. సప్తమిలో - విదియ తదియ పంచమిలలో చేయుశుభ కర్మలు చేయవలెను.

8. అష్టమిలో - సంగ్రామము,వాస్తు,శిల్పము,రాజప్రమోదము,లేఖనము, స్త్రీరత్నము, ఆభూషణము మున్నగునవి చేయవలెను.

9. నవమిలో - చవితి తిథివలనే చేయవలెను.

10. దశమిలో - విదియ, తదియ, పంచమి, సప్తమిలో వలె చేయవలెను.

11. ఏకాదశిలో - వ్రత ఉపవాసములు,ధర్మకార్యములు, దేవోత్సవములు ఉద్యాపనము కథాదులు చేయవలెను.

12. ద్వాదశిలో - యాత్రాదులను వదలి పుష్టికారకమైన అన్నిధర్మములు శుభ కార్యములు చేయవలెను.

13. త్రయోదశిలో - విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమిలో తెల్పిన కార్యములు చేయవలెను

14. చతుర్దశిలో - చవితిలోని కార్యములు చేయవలెను.

15. పౌర్ణమిలో - వివాహము, శిల్పము, మంగళ సంగ్రామము, వాస్తుకర్మ, యజ్ఞక్రియ, ప్రతిష్ఠాదులు చేయవలెను.

16. అమావాస్యలో - పితృకర్మ చేయవచ్చును. అమావాస్యలో చేసిన శుభకర్మలు నష్టమును కలిగించును.

**నందాది సంజ్ఞలు :-**

**నన్దా చ భద్రా చ జయా చ రిక్తా పూర్ణేతి తిథ్యోఽశుభమధ్యశస్తాః**
**సితేఽసితే శస్తసమాధమాః స్యుః సితజ్ఞభౌమార్కిగురౌ చ సిద్ధాః 4**

శుక్లపక్షములో నంద,భద్ర,జయ,రిక్త, పూర్ణ తిథులలో ప్రతిదానిలో ప్రథమ తిథి. (1,2,3,4,5)అశుభము. రెండవతిథులు(6,7,8,9,10) మధ్యమము, మూడవ తిథులు (11,12,13,14,15) శుభమును కలిగించును. కృష్ణపక్షములో నందాది ప్రథమ తిథులు శుభమును,ద్వితీయతిథులు మధ్యమము,తృతీయతిథులు అశుభమును కలిగించును. శుక్రవారము నందసంజ్ఞక తిథి,బుధవారము భద్రతిథి, సోమవారము జయ తిథి, శనివారము రిక్త తిథి, గురువారము పూర్ణతిథియైన సిద్ధయోగమగును.

**నందాది తిథుల పట్టిక**

| శుక్లపక్షము | నంద | భద్ర | జయ | రిక్త | పూర్ణ | కృష్ణపక్షము |
|---|---|---|---|---|---|---|
| అశుభము | 1 | 2 | 3 | 4 | 5 | శుభము |
| మధ్యమము | 6 | 7 | 8 | 9 | 10 | మధ్యమము |
| శుభము | 11 | 12 | 13 | 14 | 15 | అశుభము |
| యోగము | శుక్ర | బుధ | మంగళ | శని | గురు | సిద్ధయోగము |

**వారములందు నిషిద్ధ తిథి నక్షత్రములు :-**

**నందా భద్రా నన్దికాఖ్యా జయా చ రిక్తా భద్రా పూర్ణసంజ్ఞా మృతార్కాత్**
**యామ్యం త్వాష్ట్రం వైశ్వదేవం ధనిష్ఠార్యమ్ణం జ్యేష్ఠాన్త్యం రవేర్ద గ్ధభం స్యాత్ 5**

రవివారము మొదలుకొని క్రమముగా నంద, భద్ర, నంద, జయ, రిక్త, భద్ర, పూర్ణ, సంజ్ఞక తిథులున్న మృత్యుసంజ్ఞక యోగమగును. రవివారము నంద, సోమవారము భద్ర,మంగళవారము నంద,బుధవారము జయ,గురువారము రిక్త,శుక్రవారము భద్ర, శనివారము పూర్ణసంజ్ఞక తిథులు అశుభమగును. ఇదేవిధముగా రవివారము భరణీ నక్షత్రము, సోమవారము చిత్త, మంగళవారము ఉత్తరాషాఢ,బుధవారము ధనిష్ఠ, గురు

వారము ఉత్తర,శుక్రవారము జ్యేష్ఠ,శనివారము రేవతి నక్షత్రములు దగ్ధసంజ్ఞకము లగును.

**అధమయోగము :-**

**షష్ఠ్యాది తిథయో మన్దాద్విలోమం ప్రతిపద్బుధే**
**సప్తమ్యర్కేऽ ధమా: షష్ఠ్యాద్యామాశ్చ రదధావనే 6**

శనినుండి విపరీత క్రమములో వారములలో షష్ఠి మున్నగు తిథులు క్రమముగా నున్న – అనగా శనివారము షష్ఠి, శుక్రవారము సప్తమి, గురువారము అష్టమి, బుధవారము నవమి, మంగళవారము దశమి, సోమవారము ఏకాదశి, రవివారము ద్వాదశి యైన, అధేవిధముగా బుధవారము పాడ్యమి, రవివారము సప్తమి, తిథియైన అధమయోగమగును. షష్ఠి, పాడ్యమి, అమావాస్య తిథులలో దంతధావనము చేయరాదు.

**తిథులందు వర్జిత కార్యములు :-**

**షష్ఠ్యష్టమీ భూతవిధుక్షయేషు నో సేవేత నా తైలపలేక్షురం రతమ్**
**నాభ్యఞ్జనం విశ్వదశద్వికే తిథౌ ధాత్రీఫలై: స్నానమమాద్రిగోష్వసత్ 7**

షష్ఠి, అష్టమి, చతుర్దశి, అమావాస్య తిథులలో క్రమముగా తైలము, మాంసము, క్షౌరము, స్త్రీప్రసంగము, మనుష్యులు చేయరాదు. అనగా షష్ఠి తిథిలో తైలమర్దనము (నూనె రాసుకొనుట) అష్టమితిథిలో మాంసము తినుట, చతుర్దశిలో క్షౌరము చేయించు కొనుట, అమావాస్యలో స్త్రీతో కలియుట చేయరాదు. త్రయోదశి,దశమి, విదియ తిథులలో నలుగుపిండి నూనెలను ఒంటికి రాసుకొనరాదు. అమావాస్య, సప్తమి, నవమితిథులలో ఉసిరికాయతో స్నానము చేయరాదు.

**స్నానము నలుగుపిండి రాసుకొనుట, దంతధావనము, మైథునము జన్మమృత్యు విషయములలో తాత్కాలిక తిథి (ఆపనిని చేయునపుడున్న తిథి)నే గ్రహించవలెనని స్మృతివచనము.**

**సూర్యేశపఞ్చాగ్నిరసాష్టనన్దా వేదాఙ్గసప్తాశ్విగజాఙ్కశైలా:**
**సూర్యాఙ్గ సప్తోరగగోదిగీశా దగ్ధా విషాఖ్యాశ్చ హుతాశనాశ్చ 8**
**సూర్యాదివారే తిథయో భవన్తి ముఘావిశాఖా శివమూలవహ్నిః**
**బ్రాహ్మం కరోऽర్యాద్యమఘణ్టకాశ్చ శుభే వివర్జ్యా గమనేత్వవశ్యమ్ 9**

రవివారములో ద్వాదశి, సోమవారములో ఏకాదశి, మంగళవారములో పంచమి, బుధవారములో తదియ, గురువారములో షష్ఠి,శుక్రవారములో నవమితిథి ఉన్న దగ్ధ సంజ్ఞక యోగమగును. రవివారములో చవితి, సోమవారములో షష్ఠి, మంగళవారములో సప్తమి, బుధవారములో తదియ, గురువారములో అష్టమి, శుక్రవారములో నవమి, శనివారములో సప్తమి తిథులున్న 'విష' సంజ్ఞక యోగమగును.

రవివారము ద్వాదశి,సోమవారము షష్ఠి,మంగళవారములో సప్తమి,బుధవారములో

అష్టమి, గురువారములో నవమి, శుక్రవారములో దశమి, శనివారములో ఏకాదశి యున్న 'హుతాశన'యోగమగును. శుభకార్యములలో యాత్రలలో ఈ యోగములను తప్పక వదలవలెను.

**అశుభ యోగముల ప్రభావము పగలు అధికముగా నుండును. రాత్రులందు విశేషప్రభావముండదు. వివాహాది ముహూర్తములలో ఈకుయోగములను తప్పక వదల వలెను.మిగిలిన కార్యములలో పగలు దోషమును కలిగించును. మృత్యుయోగము 12 గంటలు విశేషించి వదలవలెను. మిగిలిన పాపయోగములు మధ్యాహ్నము తర్వాత శుభమును కలిగించును.**

**శూన్యతిథులు :-**

**భాద్రే చన్ద్రదృశౌ నభస్యనలనేత్రే మాధవే ద్వాదశీ**
**పౌషే వేదశరా ఇషే దశశివా మార్గేఽద్రినాగా మధౌ**
**గోష్టౌ చోభయపక్షగాశ్చ తిథయ: శూన్యా బుధై: కీర్తితా**
**ఊర్జాషాఢ తపస్యశుక్రతపసాం కృష్ణే శరాఙ్గాబ్ధయ: 10**
**శక్రా: పఞ్చసితే శక్రాద్యగ్నివిశ్వరసా: క్రమాత్ 10 1/2**

భాద్రపదమాసములో పాద్యమి విదియలు, శ్రావణమాసములో విదియ తదియలు, వైశాఖమాసములో ద్వాదశి, పుష్యమాసములో చవితి పంచమిలు, ఆశ్వయుజమాసములో దశమి ఏకాదశులు, మార్గశీర్షమాసములో సప్తమి అష్టములు, చైత్రమాసములో అష్టమి నవమి తిథులు రెండు పక్షములలో శూన్యసంజ్ఞకములని తెలుపబడినవి. కేవలము కృష్ణపక్షములో కార్తీకమాస పంచమి,ఆషాఢషష్ఠి, ఫాల్గుణ చవితి, జ్యేష్ఠ చతుర్దశి, మాఘ పంచమి తిథులు శూన్య సంజ్ఞకములగును. ఇదేవిధముగా కేవలము శుక్లపక్షములో కార్తీక చతుర్దశి,ఆషాఢసప్తమి,ఫాల్గుణతదియ, జ్యేష్ఠత్రయోదశి, మాఘషష్ఠి శూన్య సంజ్ఞకము లగును.

**అశుభయోగములు :-**

**తథా నిన్ద్యం శుభౌ సార్పం ద్వాదశ్యాం వైశ్వమాదిమే 11**
**అనూరాధా ద్వితీయాయాం పఞ్చమ్యాం పిత్ర్యభం తథా**
**త్ర్యుత్తరాశ్చ తృతీయాయామేకాదశ్యాం చ రోహిణీ 12**
**స్వాతీ చిత్రే త్రయోదశ్యాం సప్తమ్యాం హస్త – రాక్షసే**
**నవమ్యాం కృత్తికాష్టాభ్యాం పూభా షష్ఠ్యాం చ రోహిణీ 13**

మాసములలో శూన్యతిథులవలె ద్వాదశిలో ఆశ్లేష, పాద్యమిలో ఉత్తరాషాఢ, విదియలో అనూరాధ, పంచమిలో మఘ, తదియలో ఉత్తరాత్రయం, ఏకాదశిలో రోహిణి, త్రయోదశిలో స్వాతి చిత్త, సప్తమిలో హస్త మూల, నవమిలో కృత్తిక, అష్టమిలో పూర్వాభాద్ర,

షష్ఠితిథిలో రోహిణి నక్షత్రములు శుభకార్యములలో నిందితములగును.

**శూన్య నక్షత్రములు :-**

**కదాస్రభే త్వాష్ట్రవాయూ విశ్వేజ్యౌ భగవాసవౌ**
**వైశ్వశ్రుతీ పాశిపౌష్ణే అజపాదగ్నిపిత్ర్యభే** **14**
**చిత్రాద్వీశౌ శివాశ్వ్యర్కాః శ్రుతిమూలే యమేన్ద్రభే**
**చైత్రాదిమాసే శూన్యాఖ్యాస్తారా విత్తవినాశదా:** **15**

చైత్రమాసములో రోహిణి, అశ్విని, వైశాఖమాసములో చిత్త - స్వాతి, జ్యేష్ఠలో ఉత్తరాషాఢ - పుష్యమి, ఆషాఢలో పుబ్బ - ధనిష్ఠ, శ్రావణములో ఉత్తరాషాఢ - శ్రవణము, భాద్రపదములో శతభిషము - రేవతి,ఆశ్వయుజములో పూర్వాభాద్ర, కార్తీకములో కృత్తిక - మఘ,మార్గశీర్షములో చిత్త - విశాఖ,పుష్యమాసములో ఆర్ద్ర-అశ్విని - హస్త, మఘలో శ్రవణము - మూల, ఫాల్గుణములో భరణి - జ్యేష్ఠ శూన్యసంజ్ఞక నక్షత్రములగును. వీటిలో శుభకార్యములు చేసిన ధననాశము కలుగును.

**శూన్యరాశులు :-**

**ఘటో ఝషో గౌర్మిథునం మేషకన్యాలి - తౌలిన:**
**ధను: కర్కో మృగ: సింహశ్చైత్రాదౌ శూన్యరాశయ:** **16**

చైత్రాదిమాసములలో క్రమముగా చైత్రములో కుంభము, వైశాఖములో మీనము, జ్యేష్ఠములో వృషభము, ఆషాఢములో మిథునము, శ్రావణములో మేషము, భాద్రపదములో కన్య, ఆశ్వయుజములో వృశ్చికము, కార్తీకములో తుల, మార్గశిరములో ధనుస్సు, పుష్యములో కర్కాటకము, మాఘములో మకరము, ఫాల్గుణములో సింహరాశులు శూన్యసంజ్ఞకము లగును.

**శూన్యబోధక పట్టిక**

| మాసములు | శూన్య తిథులు | | శూన్య నక్షత్రములు | శూన్యరాశులు |
|---|---|---|---|---|
| | కృష్ణపక్షము | శుక్లపక్షము | | |
| చైత్రము | 9,8 | 9,8 | రోహిణి,అశ్విని | కుంభము |
| వైశాఖము | 12 | 12 | చిత్త, స్వాతి | మీనము |
| జ్యేష్ఠము | 14 | 13 | ఉ॥షా, పుష్యమి | వృషభము |
| ఆషాఢము | 6 | 7 | పుబ్బ, ధనిష్ఠ | మిథునము |
| శ్రావణము | 2,3 | 2,3 | ఉ॥షా శ్రవణము | మేషము |
| భాద్రపదము | 1,2 | 1,2 | శతభిషం, రేవతి | కన్య |
| ఆశ్వయుజము | 10,11 | 10,11 | పూర్వాభాద్ర | వృశ్చికము |
| కార్తీకము | 5 | 14 | కృత్తిక, మఘ | తుల |
| మార్గశిరము | 7,8 | 7,8 | చిత్త, విశాఖ | ధనుస్సు |

| | | | | |
|---|---|---|---|---|
| పుష్యమి | 4, 5 | 4, 5 | అశ్విని ఆర్ద్ర హస్త | కర్కాటకము |
| మాఘము | 5 | 6 | శ్రవణ మూల | మకరము |
| ఫాల్గుణము | 4 | 3 | భరణి, జ్యేష్ఠ | సింహము |

**శూన్యలగ్నములు :–**

**పక్షాదితస్త్వోజ తిథౌ ఘటైణౌ మృగేన్ద్రనక్రౌ మిథునాఙ్గనే చ**
**చాపేన్దుభే కర్కహరీ హయాన్త్యౌ గోన్త్యౌ చ నేష్టే తిథిశూన్యలగ్నే 17**

పాడ్యమిలో తుల–మకరములు, తదియలో సింహ–మకరములు, పంచమిలో మిథున–కన్యలు,సప్తమిలో ధనుస్సు–కర్కాటకములు,నవమిలో కర్కాటకము– సింహములు, ఏకాదశిలో ధనుస్సు–మీనములు, త్రయోదశిలో వృషభ–మీనలగ్నములు శూన్య సంజ్ఞకములగును. ఇవి శుభమునీయవు. వీటిలో శుభకార్యములు చేయరాదు.

**శూన్యనక్షత్ర లగ్నబోధక పట్టిక**

| **తిథులు** | **అశుభ నక్షత్రములు** | **శూన్యలగ్నములు** |
|---|---|---|
| పాడ్యమి | ఉత్తరాషాఢ | తుల,మకరము |
| విదియ | అనూరాధ | ×× |
| తదియ | ఉత్తర,ఉ॥షాఢ, ఉ.భాద్ర | సింహము, మకరము |
| చవితి | ×× | ×× |
| పంచమి | మఘ | మిథునము, కన్య |
| షష్ఠి | రోహిణి | ×× |
| సప్తమి | హస్త, మూల | ధనుస్సు, కర్కాటకము |
| అష్టమి | పూర్వాభాద్ర | ×× |
| నవమి | కృత్తిక | కర్కాటకము, సింహము |
| దశమి | ×× | ×× |
| ఏకాదశి | రోహిణి | ధనుస్సు, మీనము |
| ద్వాదశి | అశ్విని | ×× |
| త్రయోదశి | చిత్త, స్వాతి | వృషభము, మీనము |
| చతుర్దశి | ×× | ×× |
| పౌర్ణమి – అమావాస్య | ×× | ×× |

**శూన్యతిథి నక్షత్రముల పరిహారము :–**

**తిథియో మాసశూన్యాశ్చ శూన్యలగ్నాని యాన్యపి**

**మధ్యదేశే వివర్జ్యాని న దూష్యాణీతరేషు తు**
**పఙ్గ్వన్ధకానలగ్నాని మాసశూన్యాశ్చ రాశయ:**
**గౌడమాలవయోస్త్యాజ్యా అన్యదేశే న గర్హితా:** **19**

మాసశూన్య తిథులు, తిథులలో శూన్యలగ్నముల దోషము మధ్యదేశములో మాత్రమేకలుగును. అందువలన మధ్యదేశవాసులు వీటిని వదిలిపెట్టవలెను. ఇతరదేశములో వీటి దోషములేదు. పంగువు,అంధ, కాన సంజ్ఞక లగ్నములు, మాసశూన్యరాశుల పరి త్యాగమును గౌడ, మాలవదేశవాసులు చేయవలెను. అన్యదేశములలో నిందితములు కావు.

**వర్జయేత్సర్వకార్యేషు హస్తార్క పఞ్చమీతిథౌ**
**భౌమాశ్వినీం చ సప్తమ్యాం షష్ఠ్యా చన్ద్రే న్దవం చ** **20**
**బుధానురాధాష్టమ్యాం దశమ్యాం భృగురేవతీమ్**
**నవమ్యాం గురుపుష్యం చైకాదశ్యాం శనిరోహిణీమ్** **21**

(రవివారము హస్త నక్షత్రమైన సిద్ధయోగమగును. కాని పంచమి తిథియోగముతో కుయోగమైనది)రవివారము హస్తానక్షత్రము పంచమి తిథియైన వదలవలెను. ఇదేవిధముగా మంగళవారము అశ్వినీ నక్షత్ర సప్తమతిథిని, సోమవారము మృగశీరా నక్షత్ర షష్ఠితిథిని బుధవారము అనూరాధ నక్షత్ర అష్టమ తిథిని, శుక్రవారము రేవతీనక్షత్ర దశమితిథిని, గరువారము పుష్యమి నక్షత్ర నవమితిథిని, శనివారము రోహిణీ నక్షత్ర ఏకాదశీ తిథిని శుభకార్యములలో వదలవలెను.

**గృహప్రవేశే యాత్రాయాం వివాహేచ యథాక్రమమ్**
**భౌమాశ్వినీం శనౌ బ్రహ్మం గురౌ పుష్యం వివర్జయేత్** **22**

మంగళవారము అశ్విని నక్షత్రమైన గృహప్రవేశము చేయరాదు. ఇదేవిధముగా యాత్రా విషయములో శనివారము రోహిణీ నక్షత్రమును, వైవాహిక కార్యక్రమములో గురువారము పుష్యమీ నక్షత్రమును వదలవలెను.

**స్థిరయోగములు :-**

**ఆనన్దాఖ్య: కాలదణ్డశ్చ ధూమ్రో ధాతాసౌమ్యో ధ్వాంక్షకేతూ క్రమేణ**
**శ్రీవాత్సాఖ్యో వజ్రకం ముద్గరశ్చ ఛత్రం మిత్రం మానసం పద్మలుమ్బౌ** **23**
**ఉత్పాత మృత్యూకిల కాణ-సిద్ధీ శుభోఽమృతాఖ్యో ముసలం గదశ్చ**
**మాతఙ్గరక్షశ్చర సుస్థిరాఖ్య - ప్రవర్ధమానా: ఫలదా: స్వనామ్నా** **24**

1. ఆనందము 2. కాలదండము 3. ధూమ్రము 4. ధాత 5. సౌమ్యము 6. ధ్వాంక్షము 7. కేతు 8. శ్రీవత్సము 9. వజ్రము 10. ముద్గరము 11. ఛత్రము 12. మిత్రము 13. మానసము 14. పద్మము 15. లుంబము 16. ఉత్పాతము 17. మృత్యువు 18. కాణము

19. సిద్ధి 20. శుభము 21. అమృతము 22. ముసలము 23. గద 24. మాతంగము 25. రక్ష 26. చరము 27. సుస్థిరము 28. ప్రవర్ధమానము - ఇవి 28 యోగములు వీటి ఫలము వీటినామము ననుసరించి యుండును. వీటిలో 2,3,6,7,9,10, 15,16, 17,18,22,23,25 ఈ పదమూడు యోగములు అశుభములు. మిగిలిన పదిహేను యోగములు శుభమునిచ్చును.

**దాస్రాదర్కే మృగాదిన్దౌ సార్పాద్భౌమే కారాద్బుధే**
**మైత్రాద్గురౌ భృగౌ వైశ్వాద్గణ్యా మన్దే చ వారుణాత్ 25**

రవివారము అశ్వినీ నక్షత్రము నుండి , సోమవారము మృగశిర నుండి, మంగళ వారము ఆశ్లేష నుండి, బుధవారము హస్తనుండి గురువారము అనూరాధ నుండి, శుక్రవారము ఉత్తరాషాఢ నుండి, శనివారము శతభిషము నుండి (వర్తమాన నక్షత్రము వరకు) గణన చేయవలెను. వర్తమాన నక్షత్రము వరకు వచ్చు సంఖ్య కలిగిన ఆనందాది యోగము స్థిరయోగమగును.

**ఉదాహరణకు - 1983 శ్రావణ శుక్లపంచమి శనివారము హస్తానక్షత్రమైన శనివార మగుట వలన శతభిషము నుండి హస్త నక్షత్రము వరకు లెక్కించిన 17వ సంఖ్య వచ్చును. ఆసంఖ్య కలిగిన 17వ నక్షత్రము మృత్యునామక యోగమగును.**

**అశుభయోగ పరిహారము :-**

**ధ్వాంక్షే వజ్రే ముద్గరే చేషునాడ్యో వర్జ్యా వేదా: పద్మలుమ్బే గదేఽశ్వా:**
**ధూమ్రే కాణే మౌసలే భూర్ద్వయం ద్వే రక్షోమృత్యూత్పాతకాలాశ్చ సర్వే 26**

అవసరమైనపుడు ధ్వాంక్ష, ముద్గర వజ్రయోగములకు ఐదేసి ఘడియలు,పద్మ, లంబములకు,నాలుగుఘడియలు,గదకు ఏడుఘడియలు,ధూమ్రయోగమునకు ఒకఘడియ, కాణ, ముసలములకు రెండేసి ఘడియలు వదలి మిగిలిన భాగములో కార్యములు చేయవలెను. రక్ష, మృత్యు ఉత్పాత కాలయోగములలో అన్నిఘడియలను వదలవలెను.

**రవియోగము :-**

**సూర్యభాద్వేద - గో - తర్క - దిగ్విశ్వ - నఖ - సమ్మితే**
**చన్ద్రేర్క్షే రవియోగా: స్యుర్దోష సంఘ వినాశకా: 27**

సూర్యుడున్న నక్షత్రమునుండి నాలుగు, తొమ్మిది,ఆరు, పది,పదమూడు, ఇరవదవ నక్షత్రములపై చంద్రుడున్న దోషసమూహమునకు నష్టము కలిగించు రవియోగమగును. రవి ఆశ్లేషా నక్షత్రములోనున్న చంద్రుడు ఉత్తర, అనూరాధ, చిత్త, జ్యేష్ఠ, ఉత్తరాషాఢ, అశ్విని నక్షత్రములలో నున్నపుడు రవియోగమగును.

**వారక్రమములో సర్వార్థసిద్ధ యోగములు :-**

**సూర్యేఽర్కమూలోత్తరపుష్యదాస్రం చన్ద్రే శ్రుతిబ్రాహ్మ శశీజ్యమైత్రమ్**

**భౌమేఽశ్వ్యహిర్బుధ్న్య కృశానుసార్పం క్ష్మేబ్రాహ్మమైత్రార్కకృశానుచాన్ద్రమ్ 28**
**జీవేఽన్త్య మైత్రాశ్వ్యదితీజ్యధిష్ణ్యం శుక్రేఽన్త్యమైత్రాశ్వ్యదితిశ్చవోభమ్**
**శనౌ శ్రుతిబ్రాహ్మసమీరభాని సర్వార్థసిద్ధ్యై కథితాని పూర్వైః 29**

రవివారములో హస్త,మూల,ఉత్తర,ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, పుష్యమి, అశ్విని నక్షత్రములు, సోమవారములో శ్రవణము,రోహిణి,మృగశిర, పుష్యమి, అనూరాధ నక్షత్రములు, మంగళవారములో అశ్విని,ఉత్తరాభాద్ర, కృత్తిక,ఆశ్లేష నక్షత్రములు, బుధవారములో రోహిణి, అనూరాధ, హస్త, కృత్తిక, మృగశిర నక్షత్రములు, గురువారములో రేవతి, అనూరాధ, అశ్విని,పునర్వసు,పుష్యమి నక్షత్రములు, శుక్రవారములో రేవతి, అనూరాధ, అశ్విని,పునర్వసు శ్రవణ నక్షత్రములు,శనివారములో శ్రవణ,రోహిణి, స్వాతి నక్షత్రములున్న అన్ని విధములైన శుభములనిచ్చు సర్వార్థసిద్ధి యోగమగును. ఇది పుర్వాచార్యులమతము.

**ఉత్పాత-మృత్యు-కాణ-సిద్ధయోగ లక్షణములు :-**

**ద్వీశాత్తోయాద్వాసవాత్పౌష్ణభాచ్చ బ్రాహ్మాత్పుష్యాదర్యమర్క్షాచ్చతుర్భైః**
**స్యాదుత్పాతో మృత్యుకాణౌ చ సిద్ధిర్వారేఽర్కాద్యే తత్ఫలం నామతుల్యమ్ 30**

సూర్యాది వారములలో క్రమముగా విశాఖ,పూర్వాషాఢ, ధనిష్ఠ, రేవతి, రోహిణి, పుష్యమి, ఉత్తర నక్షత్రముల నుండి నాలుగేసి నక్షత్రముల క్రమముతో ఉత్పాతము మృత్యువు కాణ సిద్ధయోగములగును. వీటిఫలము వీటినామము ననుసరించి యుండును. అనగా రవివారము విశాఖ నక్షత్రమైన ఉత్పాతము, అనూరాధయైన మృత్యువు, జ్యేష్ఠయైన కాణము, మూలయైన సిద్ధయోగమగును. సోమవారము పూర్వాషాఢయైన ఉత్పాతము, ఉత్తరాషాఢయైన మృత్యువు, శ్రవణమైన కాణము,ధనిష్ఠయైన సిద్ధయోగమగును. ఇదేవిధముగా మంగళ వారము ధనిష్ఠతో, బుధవారము రేవతితో,గురువారము రోహిణితో, శుక్రవారము పుష్యమితో శనివారము ఉత్తరతో ప్రారంభించి నాలుగేసి నక్షత్రములు క్రమముగా ఉత్పాత, మృత్యు, కాణ,సిద్ధయోగము లగును.

| యోగములు | రవి | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| ఉత్పాత | విశాఖ | పూ.షా | ధనిష్ఠ | రేవతి | రోహిణి | పుష్యమి | ఉత్తర |
| మృత్యు | అనూరాధ | ఉ.షా | శతభిషం | అశ్విని | మృగశిర | ఆశ్లేష | హస్త |
| కాణ | జ్యేష్ఠ | ఉ.షా | పూ.భాద్ర | భరణి | ఆర్ద్ర | మఘ | చిత్త |
| సిద్ధ | మూల | ధనిష్ఠ | ఉ.భాద్ర | కృత్తిక | పునర్వసు | పుబ్బ | స్వాతి |

**అశుభయోగ పరిహారము :-**

**కుయోగాస్తిథి వారోత్థాస్తిథి భోత్థా భవారజాః**
**హూణబఙ్గ ఖశేష్వేవ వర్జ్యాస్త్రితయజాస్తథా 31**

తిథి వారములతో ఉత్పన్నము, తిథి నక్షత్రములతో తిథివార నక్షత్రములతో ఉత్పన్నమగు అశుభ యోగముల పరిత్యాగము కేవలము పూర్వదేశములు హూణ (మణిపూర్,నాగాలాండు) వంగ(బెంగాల్) ఖశ (నేపాలు,భూటాన్,సిక్కిమ్) దేశములలో చేయవలెను.

**శుభ కార్యములందు వర్జ్యయోగములు :-**

**సర్వస్మిన్విధు పాపయుక్తనులవావర్ధే నిశాహ్నోర్ఘటీ**
**త్ర్యంశం వై కునవాంశకం గ్రహణత: పూర్వం దినానాం త్రయమ్**
**ఉత్పాతగ్రహతోఽ ద్ర్యహాంశ్చ శుభదోత్పాతైశ్చ దుష్టం దినం**
**షణ్మాసం గ్రహభిన్నభం త్యజ శుభే యౌద్ధం తథోత్పాతభమ్ 32**

చంద్రుడు పాపగ్రహములతో కూడిన లగ్నము నవాంశము, దినార్ధము, రాత్ర్యర్ధములో 20-20పలములు (మధ్యాహ్నమునకు పూర్వము 10 పలములు (నాలుగు నిమిషాలు) మధ్యాహ్నము తర్వాత 10 పలములు, మధ్యరాత్రికి పూర్వము 10 పలములు, తర్వాత 10 పలములు) పాపగ్రహముల నవమాంశము,గ్రహణమునకు ముందు మూడు దినములు, అంతరిక్షము,దివ్య,భౌమ ఉత్పాతముల దినము నుండి ఖగ్రాసగ్రహణ దినము నుండి ఏడురోజులు ఉత్పాతములు జరిగిన దినము, గ్రహములచే భేదించబడిన దినము నుండి 6 మాసముల వరకు, ఉత్పాతము జరిగిన నక్షత్రములో ఆరుమాసముల వరకు శుభకార్యమును చేయరాదు.

**ప్రకృతిలో ప్రతికూలత ఏర్పడినపుడు ఉత్పాతములు కలుగును. ఈ ఉత్పాతములు మూడు విధములు**

**దివ్య ఉత్పాతము - కేతు తోకచుక్కల దర్శనము**

**అంతరిక్ష ఉత్పాతము - అకస్మాత్తుగా గంధర్వ నగరము, ఇంద్రధనుస్సు కనపడుట**

**భౌమ ఉత్పాతము - భూకంపాదులు**

**ఈ ఉత్పాతములు కలుగు దినములో ఏనక్షత్రముండునో దానిని శుభకర్మలలో వదలవలెను. ఈ ఉత్పాతముల వివరణ బృహత్సంహితలో వరాహమిహిరుడు తెల్పెను.**

**గ్రహణ భేదముతో శుభాశుభ విచారము :-**

**నేష్టం గ్రహర్క్షం సకలార్ధ పాదగ్రాసే క్రమాత్తర్కగుణేన్దుమాసాన్**
**పూర్వం పరస్తాదుభయో స్త్రిషుస్రా గ్రస్తేఽస్తగే వాభ్యుదితేఽర్ధఖణ్డే 33**

సూర్యచంద్ర గ్రహణములు జరుగు నక్షత్రములో సర్వగ్రాస గ్రహణమైన ఆరునెలలు, అర్ధగ్రాస గ్రహణమైన మూడుమాసములు,చతుర్ధాంశ గ్రహణమైన ఒకమాసము శుభ కార్యములను చేయరాదు. గ్రహణము పట్టినపుడు గ్రహణమగుటకు

ముందు మూడుదినములు, గ్రహణమునకు తర్వాత మూడు దినములు అర్ధగ్రాస గ్రహణ మైన ముందు వెనుకలందు మూడేసి దినములు అశుభమగును.

**సామాన్యముగా వర్జిత కార్యములు :-**

**జన్మర్క్షమాసతిథయో వ్యతీపాతీపాత భద్రావైధృత్యమాపిత్రుదినాని తిథిక్షయర్ధీ**
**న్యూనాధిమాసకులికప్రహరార్ధపాత విష్కమ్భ వజ్రఘటికాత్రయమేవ వర్జ్యమ్ 34**
**పరిఘార్థం పఞ్చశూలే షట్ చ గణ్డాతిగణ్డయో:**
**వ్యాఘాతే నవ నాద్యశ్చ వర్జ్యా: సర్వేషు కర్మషు 35**

తమ జన్మ నక్షత్రము, జన్మమాసము, జన్మతిథి, వ్యతీపాతయోగము, భద్ర, వైధృతి యోగము, అమావాస్యతిథి, మాతాపితల శ్రాద్ధ దినము, తిథిక్షయము, తిథివృద్ధి, క్షయమాసము, అధికమాసము, గులిక, ప్రహరార్ధము, పాతములను శుభకార్యములందు వదిలి పెట్టవలెను. విష్కంభ వజ్రయోగములలో మూడేసి ఘడియలను వదలవలెను.

పరిఘయోగములో సగము, శూలయోగములో 5ఘడియలు, అతిగండములో 6 ఘడియలు, వ్యాఘాతములో 9 ఘడియలు అన్నిశుభకార్యములలో వదలవలెను.

**పక్షరంధ్ర తిథుల పరిహారము :-**

**వేదాఙ్గాష్టనవార్కేన్ద్ర పక్ష రన్ధ్ర తిథౌ త్యజేత్**
**వస్వఙ్కమను తత్వాశా: శరా నాడీ: పరా: శుభా: 36**

చతుర్థి, షష్ఠి, అష్టమి, నవమి, ద్వాదశి, చతుర్దశి తిథులు పక్షరంధ్ర సంజ్ఞకములు. ఇవి శుభకార్యములలో వర్జింపబడినవి. కాని అవసరమైనపుడు వీటిలో క్రమముగా 8,9,14, 25,10,5 ఘడియలను ప్రారంభములో వదిలి మిగిలిన వాటిని శుభమైనవిగా తలంచవలెను. అనగా చతుర్థిలో 8 ఘడియలు, షష్ఠిలో 9 ఘడియలు, అష్టమిలో 14 ఘడియలు నవమిలో 25 ఘడియలు, ద్వాదశిలో 10 ఘడియలు,చతుర్దశిలో 5 ఘడియలు అశుభములు. మిగిలినవి శుభములగును.

**కులికాది అశుభ ముహూర్తములు :-**

**కులిక: కాలవేలాచ యమ ఘణ్టశ్చ కణ్టక:**
**వారాద్విఘ్నే క్రమాన్మన్దే బుధే జీవే కుజే క్షణ: 37**

కోరినదినము నుండి శని, బుధ, గురు, మంగళవారముల వరకు దిన సంఖ్యను ద్విగుణము చేసిన దానికి సమానమైన ముహూర్తములో క్రమముగా కులిక, కాలవేల, యమఘంట, కంటక యోగములగును. అనగా కోరినదినము నుండి శనివారము వరకు గణనచేసి, వచ్చిన దినసంఖ్యను రెట్టింపు చేసిన కులికనామక ముహూర్తము, బుధవారము వరకు వచ్చు సంఖ్యను రెట్టింపు చేసిన కాలవేలము, గురువారము వరకు **వచ్చుసంఖ్యను రెట్టింపు చేసిన కంకట నామక ముహూర్తమగును.**

**ఉదాహరణకు -**

**అభీష్టవారము బుధవారమైన శనివార పర్యంతము సంఖ్య 4, బుధవార పర్యంతము 2, మంగళవార పర్యంతము దినసంఖ్య 7 అగును.**

**4 X 2 = 8 - ఎనిమిదవ ముహూర్తము - కులికము**

**1 X 2 = 2 - రెండవ ముహూర్తము - కాలవేలము**

**2 X 2 = 4 - నాల్గవ ముహూర్తము - యమఘంటము**

**7 X 2 = 14 - పద్నాలుగు ముహూర్తము - కంటకము**

**ఈ కులికాది ముహూర్తములలో యాత్రచేసిన మృత్యువు, వివాహము చేసిన విధవరాలు, వ్రతబంధములో వేదశాస్త్ర శూన్యత్వము కలుగును.**

**వార క్రమములో దూషిత ముహూర్తములు :-**

**సూర్యే షట్-స్వర-నాగ-దిజ్- మనుమితాశ్చన్ద్రేఽబ్ధిషట్ కుఞ్జరా**
**ఙ్కార్కావిశ్వపురన్దరా: క్షితిసుతే ద్వ్యబ్ధ్యగ్ని తర్కా దిశ:**
**సౌమ్యే ద్వ్యబ్ధి-గజాఙ్క-దిజ్-మనుమితా-జీవే ద్వి-షడ్-భాస్కరా:**
**శక్రాఖ్యాస్తిథయ: కలాశ్చ భృగుజే వేదేషు తర్క గ్రహా: 38**
**దిగ్ భాస్కరా మనుమితాశ్చ శనౌ శశి ద్వి**
**నాగా దిశో భవ దివాకర సమ్మి తాశ్చ**
**దుష్టక్షణ: కులిక కణ్టక కాలవేలా:**
**స్యుశ్చార్ధయామ యమఘంటగతా: కలాంశా: 39**

రవివారములో 6,7,8,10,14, సోమవారములో 4,6,8,9,12,13,14 మంగళవారములో 2,3,4,6, బుధవారములో 2,4,8,9,10,14, గురువారములో 2,6,12, 14,15,16 శుక్రవారములో 4,5,6,9,10,12,14,శనివారములో 1,2,8,10,11,12 సంజ్ఞకలిగిన ముహూర్తములు అశుభమును కలిగించును. వీటికి దుష్ట, కులిక, కాలవేల, అర్ధయామ, యమఘంట సంజ్ఞలగును.

ప్రతిరోజు భిన్నభిన్నముహూర్తములో దుష్ట, కులిక, కంటకాది ముహూర్తములు వచ్చును. రవివారము ఆరవముహూర్తము కంఠకము, ఏడవది అర్ధయామము, ఎనిమిదవది కాలవేల,పదవది యమఘంటము,పద్నాలుగవది కులిక ముహూర్తమగును. ఇదేవిధముగా అన్ని వారములకు అశుభముహూర్తములను గ్రహించవలెను.

**హోలాష్ట విచారము :-**

**విపాశేరావతీ తీరే శుతుద్ర్యాశ్చ త్రిపుష్కరే**
**వివాహాదిశుభే నేష్టం హోలికాప్రాగ్దినాష్టకమ్ 40**

విపాశ, ఐరావతి, సట్లజ్ నదుల మధ్య త్రిపుష్కర క్షేత్రములో హోళీకి ముందు ఎనిమిదిదినముల వరకు వివాహాది శుభకార్యములు చేయరాదు. ఈ హోలాష్టక దోషము

పంజాబు,హిమాచలము,రాజస్థాన్ రాష్ట్రములకు వర్తించును. ఇతరప్రాంతములకు వర్తించదు.

**అశుభయోగ పరిహారము :-**

**మృత్యు-క్రకచ-దగ్ధాదీనిన్దౌ శస్తే శుభాఙ్గుః**
**కేచిద్యామోత్తర ఇచ్ఛన్యే యాత్రాయామేవ నిన్దితాన్ 41**

మృత్యు,క్రకచ,దగ్ధ మున్నగు అశుభయోగములు చంద్రుడు శుభుడైన శుభమైన విగా చెప్పబడెను. కొందరి ఆచార్యుల మతముననుసరించి పైన తెల్పిన యోగములకు ఒకప్రహర అశుభమై తర్వాత శుభమగును. కొందరిమతము ననుసరించి యాత్రలో మాత్రమే నిందితమగును.

**అయోగే సుయోగోఽపి చేత్ స్యాత్తదానీమయోగం నిహత్యైష సిద్ధిం తనోతి**
**పరే లగ్నశుద్ధ్యా కుయోగదినాశం దినార్ధోత్తర విష్టిపూర్వం చ శస్తమ్ 42**

అశుభయోగములతో పాటు శుభయోగమున్న, శుభయోగము అశుభయోగములను నష్టపరచి సిద్ధిని కలిగించును. కొందరి ఆచార్యుల మతముననుసరించి లగ్నశుద్ధి యున్న అశుభయోగముల ఫలముండదు. విష్టి మున్నగు యోగముల దోషము దినము ఉత్తరార్ధములో శుభమునిచ్చును.

**భద్రవిచారము :-**

**శుక్లే పూర్వార్ధేఽష్టమీ-పఞ్చదశ్యోర్భద్రైకాదశ్యాం చతర్థ్యాం పరార్ధే**
**కృష్ణేఽన్త్యార్ధే స్యాత్తృతీయా దశస్యోః పూర్వేభాగే సప్తమీ శమ్భుతిథ్యోః 43**

శుక్లపక్షములో అష్టమి, పూర్ణిమ తిథి పూర్వార్ధములో, చతుర్థి, ఏకాదశి తిథులలో ఉత్తరార్ధము భద్ర(విష్టి)కరణమగును. కష్ణపక్షములో తదియ, దశమిలలో ఉత్తరార్ధము, సప్తమి చతుర్దశిల పూర్వార్ధములో భద్రకరణమగును.

**తిథిలో సగము కరణమగును. ఒకతిథిలో రెండు కరణము లుండును.ఏడు చరకరణములు నాలుగు స్థిరకరణములుండును. కృష్ణపక్ష చతుర్దశి ఉత్తరార్ధము నుండి స్థిరకరణములుండును. చతుర్దశి ఉత్తరార్ధములో శకుని, అమావాస్య పూర్వార్ధములో చతుష్పదము,ఉత్తరార్ధములో నాగ,శుక్లపక్ష పాడ్యమి పూర్వార్ధములో కింస్తుఘ్న కరణముండును. పాడ్యమి ఉత్తరార్ధము నుండి చర కరణములారంభమగును. పాడ్యమి ఉత్తరార్ధములో బవ,విదియ పూర్వార్ధములో బాలవ, ఉత్తరార్ధములో కౌలవ, తదియ పూర్వార్ధములో తైతిల, ఉత్తరార్ధములో గర, చవితి పూర్వార్ధము లో వణిజ, ఉత్తరార్ధములో విష్టి (భద్ర) కరణమగును. ఇవి చరకరణములు.**

**భద్రపుముఖ పుచ్ఛ విభాగము :-**

**పఞ్చ ద్వ్యద్రి కృతాష్టరామరస భూయామాదిఘట్యః శరాః**
**విష్టేరాస్య మసద్గజేన్దురసరామాద్ర్యశ్వ బాణా బ్ధిషు**

**యామేష్వన్త్యఘటీత్రయం శుభకరం పృచ్ఛం తథావాసరే**
**విష్టిస్తిథ్యపరార్ధజా శుభకరీ రాత్రౌ తు పూర్వార్ధజా** **44**

భద్ర తిథులలో(శుక్లపక్షములో4,8,11,15,కృష్ణపక్షములో3,7,10,14) క్రమముగా 5,2,7,4,8,3,6,1 ప్రహరలలో మొదటి ఐదేసి ఘడియలు భద్రముఖమగును. అవి అశుభములని చెప్పబడెను. ఉక్త (తెలుపబడిన) తిథులలో క్రమముగా 8,1,6,3,7, 7,5,4 ప్రహరల చివరి మూడేసి ఘడియలు పుచ్ఛ (తోక)మగును. ఇవి శుభకారకములు. పగలు భద్ర ఉత్తరార్ధము, రాత్రిలో భద్రపూర్వార్ధము శుభకారకమగును. తిథులలో ఎనిమిదవ భాగము ప్రహరయగును.

**ముఖపుచ్ఛ జ్ఞాన పట్టిక**

| తిథి | శు.ప 4 | శు.ప 8 | శు.ప 11 | శు.ప 15 | కృ.ప 3 | కృ.ప 7 | కృ.ప 10 | కృ.ప 14 | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ప్రహర | 5 | 2 | 7 | 4 | 8 | 3 | 6 | 1 | భద్రముఖము |
| ప్రారంభఘడియలు | 5 | 5 | 5 | 5 | 5 | 5 | 5 | 5 | (అశుభము) |
| ప్రహర | 8 | 1 | 6 | 3 | 7 | 7 | 5 | 4 | భద్రపుచ్ఛము |
| అంతిమఘడియలు | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | శుభము |

శుక్లపక్షములో చవితి తిథిలో ఐదవప్రహర ఆరంభములో 5 ఘడియలు భద్రముఖ మగును. 8 ప్రహర చివర మూడు ఘడియలు భద్ర పుచ్ఛమగును. ముఖము అశుభము. పుచ్ఛము శుభమగును. ఇదేవిధముగా మిగిలిన తిథులను గ్రహించవలెను.

**కుమ్భ కర్కద్వయే మర్త్యే స్వర్గేஉబ్జేஉజాత్రయేஉలిగే**
**స్త్రీధనుర్జూకనక్రేஉధో భద్రా తత్రైవ తత్ఫలమ్** **45**

కుంభము,మీనము, కర్కాటకము సింహరాశులలో చంద్రుడున్న భద్ర భూలోకములో, మేష వృషభ మిథున వృశ్చిక రాశులలో చంద్రుడున్న భద్ర స్వర్గలోకములో, కన్య ధను తుల మకర రాశులలో నున్నపుడు భద్ర పాతాళ లోకములో నుండును.

**సమయ శుద్ధి :-**

**వాప్యారామ తడాగకూప భవనారమ్భ ప్రతిష్ఠే వ్రతా**
**రమ్భోత్సర్గ వధూప్రవేశనమహాదానానిసోమాష్టకే**
**గోదానాగ్రయణ ప్రపాప్రథమకోపాకర్మ వేదవ్రతం**
**నీలోద్వాహమథాతిపన్న శిశుసంస్కారాన్ సురస్థాపనమ్** **46**
**దీక్షామౌఞ్జి వివాహ ముణ్డనమపూర్వం దేవతీర్థేక్షణం**
**సంన్యాసాగ్నిపరిగ్రహౌ నృపతి సన్దర్శా భిషేకౌ గమమ్**

**చాతుర్మాస్య సమావృతీ శ్రవణయోర్వేధం పరీక్షాం త్యజేద్**
**వృద్ధత్వాస్త శిశుత్వ ఇజ్యసితయోర్న్యూనాధిమాసే తథా** **47**

జలాశయము,ఉద్యానవనము,బావి, కూపము, శిలాన్యాసము, భవన నిర్మాణము, వ్రతారంభము,ఉద్యాపనము,వధూప్రవేశము,మహాదానము,సోమయోగము, అష్టకా శ్రాద్ధము,గోదానము,నవాన్న యజ్ఞము,(కొత్తఅన్నము మొదటిసారి తినటము) చలిపందిరి, శ్రావణీకర్మ, ఉపనిషదాది మూడు విధములైన వేదవ్రతము, నీలోద్వాహము, సమయమై పోయినతర్వాత క్రియామాన శిశువులకు జాతకర్మాది సంస్కారము, దేవప్రతిష్ఠ, దీక్షా గ్రహణము, ఉపనయనము, వివాహము, ముండనము, ప్రథమముగా తీర్థదర్శనము, సన్యాసము, అగ్నిహోత్రము, రాజదర్శనము, రాజ్యాభిషేకము, విశిష్టయాత్ర, చాతుర్మాస్య యజ్ఞము,సమావర్తనము(అధ్యయనము పూర్తిచేయుట, బ్రహ్మచర్య పరిత్యాగము) కర్ణఛేదనము,విశిష్ట పరీక్షాకార్యములు; గురు శుక్రుల వృద్ధావస్థ,బాల్యావస్థ అస్తంగతము లలో క్షయ మాస, అధికమాసములలో చేయరాదు.

**సింహస్థ గురు దోషము :-**

**అస్తేవర్జ్యం సింహనక్రస్థజీవే వర్జ్యం కేచిద్వక్రగే చాతిచారే**
**గుర్వాదిత్యే విశ్వఘస్రేఽపి పక్షే ప్రోచుస్తద్వద్దన్త రత్నాదిభూషామ్** **48**

గురుడస్తమించిన సింహ మకరరాశులలో నున్న పూర్వోక్తకార్యముల నన్నింటిని వదలవలెను. కొందరి విద్వాంసుల మతము ననుసరించి గురుడు వక్రి అతిచారుడైన పైన తెల్పిన కార్యములను చేయరాదు. గురుసూర్యులు ఒకరాశిలో నున్న, పదమూడు రోజుల పక్షమైన పైన తెల్పిన కార్యములు చేయరాదు. ఈ విధముగా తెలిపిన యోగములలో ఏనుగుదంతము, రత్నభూషణములను ధరించరాదు.

**సింహే గురౌ సింహలవే వివాహో నేష్టోఽథ గోదోత్తరతశ్చ యావత్**
**భాగీరథీయామ్యతటం హి దోషో నాన్యత్రదేశే తపనేఽపి మేషే** **49**

గురుడు సింహరాశిలో నున్న లేక సింహనవాంశలో నున్నపుడు కూడ దోషకారకుడగును. $13^0.20'$నుండి$16^0.40'$లలో సింహనవాంశయగును. ఇది అధిక దోషమును కలిగించును. గోదావరికి ఉత్తరతీరము గంగకు దక్షిణతీరముల మధ్య ప్రవేశములోని వారికి సింహములోనున్న గురుడు దోషమును కలిగించును. ఇతర దేశములలో దోషముండదు. సూర్యుడు మేషరాశిలో నున్నచో సింహములో నున్న గురునికి దోషములేదు.

**మఘాదిపఞ్చపాదేషు గురు: సర్వత్ర నిన్దిత:**
**గఙ్గాగోదాన్తరం హిత్వా శేషాఙ్ఘ్రిషు న దోషకృత్** **50**

సింహరాశిలో మఘ ప్రథమ చరణము నుండి ఐదు చరణముల వరకు గురుడున్న

అన్నిదేశములలో అశుభమగును. మిగిలిన చరణములలో (పుబ్బ 3, ఉత్తర 1చరణము) గురుడున్న గంగా గోదావరి మధ్యప్రదేశములను వదలి మిగిలిన ప్రదేశములలో దోషము కలుగదు.

**సింహస్థ గురు దోషము :-**

**మేషేఽర్కే సన్వ్రతోద్వాహౌ గఙ్గాగోదాన్తరేఽపి చ**
**సర్వ: సింహగురుర్వర్జ్య: కలిఙ్గే గౌడగుర్జరే 51**

సూర్యుడు మేషరాశిలో నున్న గంగ గోదావరి నదుల మధ్యదేశములలో కూడ (సింహములో గురుడున్న) వ్రతబంధ, వివాహాది కార్యములు చేయవచ్చును. కలింగము, గౌడ(బెంగాల్) గుర్జర(గుజరాతు) ప్రాంతములో పూర్వరూపముతో సింహస్థ గురుడు నిషిద్ధమగును. అనగా గురుడు సింహరాశిలో నున్నంత వరకు వివాహాది శుభ కార్యములు చేయరాదు.

**మకరస్థ గురు దోషము :-**

**రేవాపూర్వే గణ్డకీపశ్చిమే చ శోణస్యోదగ్దక్షిణే నీచ ఇజ్య:**
**వర్జ్యో నాయం కౌఙ్కణే మాగధే చ గౌడే సింధౌ వర్జనీయ: శుభేషు 52**

రేవా(నర్మద)నది పూర్వభాగము గండకినది పశ్చిమము, సోన నది ఉత్తరము, దక్షిణ దేశములలో నీచస్థుడైన (మకరరాశిలో నున్న గురుడు) గురుడు దోషమునీయడు. ఈగురుని కొంకణము,మగధ (బీహారు) గౌడ(బెంగాలు) సింధుదేశములలో శుభ కార్యము లలో వర్జింపవలెను.

**లుప్త సంవత్సర దోషము :-**

**గోజాన్త్య కుమ్భేతరభేఽతి చారగో నో పూర్వరాశిం గురురేతి వక్రిత:**
**తదా విలుప్తాబ్ద ఇహాతినిన్దిత: శుభేషు రేవా-సురనిమ్నగాన్తరే 53**

మేష, వృషభ, కుంభ, మీన రాశులను వదలి మిగిలిన రాశులలో గురుడు అతిచారుడై (వర్తమానరాశిని వదలి) ముందురాశికి వెళ్ళినపుడు,వక్రియై తిరిగి గత రాశిలోనికి రానపుడు గతరాశి సంబంధ సంవత్సరము లుప్తసంవత్సరమగును. లుప్త సంవత్సరము నర్మద,గంగానదుల మధ్యదేశములలో శుభకార్యములో అత్యంత నిందిత మగును. అనగా గంగా నర్మదా నదుల మధ్యప్రదేశములు వదలి మిగిలిన ప్రదేశములలో దోషముండదు. మేష, వృషభ, కుంభ, మీనరాశులలో అతిచారి, లేక లుప్తసంవత్సర దోషముండదు.

**వారప్రవృత్తి :-**

**పాదోనరేఖాపర పూర్వయౌజనై: పలైర్యుతో నాస్తిథయో దినార్ధత:**
**ఊనాధికాస్తద్విపరోద్భవై: పలైరూర్ధ్వం తథాఽధో దినపప్రవేశనమ్ 54**

రేఖాదేశపు (శూన్యదేశాంతరము, ప్రాచీనకాలములో ఉజ్జయిని నగరములోని సూర్యోదయము ననుసరించి గ్రహగణిత సాధన చేసెడివారు ఇప్పుడు శూన్యదేశాంతరమును గ్రీన్‌విచ్‌గా నిర్ణయించిరి) పూర్వము లేక పశ్చిమములో ఎంతదూరములో వారప్రవేశ మభీష్టమో దానిలో నాల్గవవంతు దేశాంతర యోజనను తగ్గించి మిగిలిన దానికి 15 ఘడియలు కలిపిన లేక తగ్గించిన కలుగు ఫలప్రాప్తి, దినార్ధముకన్న తక్కువైన రెండింటి అంతరముతో సమానమైన కాలములో సూర్యోదయము తర్వాత వార ప్రవృత్తి యగును. ఒకవేళ దినార్ధము కన్న అధికమైన రెండింటి తేడాతో సమానమైన కాలము సూర్యోదయము కన్న ముందు వారప్రవృత్తియగును.

**ఉదాహరణకు - 1983 సం. శ్రావణ శుక్ల పూర్ణమ మంగళవారము దినమానము (పగలు కొలత) 32.10 సూర్యోదయ కాలము 5.36, ఉజ్జయిని నుండి కాశికి దేశాంత యోజనములు 63**

**63 ÷ 4 = 15.45 పలములు**

**63 - 15.45 = 47.15 పలములు**

**కాశి ఉజ్జయినికి పూర్వముతో నున్నది. అందువలన 15ఘడియలలో తగ్గించిన**

**15.00.00 - 00.47.15 = 14.12.45 ఘడియలు**

**దినార్ధము 32.20 ÷ 2 = 16.5**

**16.5 - 14.12.45 = 1.52.15 ఘడియలు.వారప్రవేశ కాలముకన్న దినార్ధము అధిక మగుట వలన కాశీలో జరుగు సూర్యోదయమునకు 1.52.15 ఘడియల తర్వాత వారప్రవృత్తి జరుగును.అనగా ఉజ్జయిని కన్న 1.52.15 ఘడియల ముందు కాశీలో సూర్యోదయమగును.**

**వారప్రవృత్తి అనగా రేఖాదేశములలో వార ప్రవేశకాలము.భిన్నభిన్న ప్రదేశము లలో భిన్నభిన్న కాలములలో సూర్యోదయమగును.సూర్యోదయముతోనే వారప్రవృత్తి జరుగును. అన్నిదేశములలో వారప్రవృత్తి కాలము వేరువేరుగా నుండును. స్టాండర్డు టైమువలె రేఖాదేశము (శూన్యదేశాంతరము)నే వారప్రవృత్తి కాలముగా గుర్తించవలెను. పైన తెల్పిన ఉదాహరణ ననుసరించి కాశీలో 1.52.15 ఘడియల కాలము తర్వాత రేఖాదేశము (ఉజ్జయిని)లో వారప్రవేశమగును.**

**కాలహోరలు :-**

వారదేర్ఘటికా ద్విఘ్నా: స్వాక్షహృచ్ఛేష వర్జితా:
సైకాస్తష్టా నగై: కాలహోరేశా దినపాత్ క్రమాత్ **55**

వారప్రవేశ కాలములో ఇష్టసమయము వరకు గడచిన ఘడియలను రెండుచే గుణించిన గుణఫలమును ఐదుచే భాగించిన వచ్చు శేషమును గుణఫలములో తగ్గించి, శేషములో ఒకటి కలిపి 7తో భాగించిన శేషకాలహోరేశుడగును. వారస్వామి నుండి

క్రమముగా శేషసంఖ్యా దినమునకు స్వామి, గ్రహ ఇష్టకాల హోరేశుడగును.

**ఉదాహరణము - 1983 శ్రావణ శుక్ల మంగళవారము పగలు 14.30 గంటలకు హోరే శుని గుర్తించవలెను.**

**కాశిలో సూర్యోదయకాలము 5.36,వారప్రవృత్తి కాలము 1.52.15 ఘడియలు 0. 44.54 నిమిషాలు**

**సూర్యోదయము 5.36+0.44.54 = 6.20.54 గంటలకు వారప్రవృత్తి కాలము.**

**14.30-6.20.54 = 8. 9.06 ఘడియలలోనికి మార్చిన 20.22.45.**

**2చే గుణించిన 40.45.30**

**5 చే భాగించిన 40.45.30 ÷ 5 = శేషము 0.45.30**

**40.45.30 - 45.30 = 40.00.00**

**40+1 = 41÷7 = శేషము 6**

**అందువలన మంగళవారమునకు ఆరవ దినాధిపతి సూర్యుడు కాంతిహోరేశు డగును.**

**వారే ప్రోక్తం కాలహోరాసు తస్య ధిష్ణ్యే ప్రోక్తం స్వామితిథ్యంశకేऽస్య**
**కుర్యాద్దిక్ఛూలాది చిన్త్యం క్షణేషు నైవోల్లంఘ్యు: పారిఘశ్చాపి దండ: 56**

ఏదినములో ఏకార్యము ప్రశస్తమని తలంచెదమో ఆకార్యమును ఆదినములోని హోరాకాలములో చేయవలెను. ఏకార్యమునకు ఏనక్షత్రము తెలుపబడెనో ఆనక్షత్రము లోని పదిహేనుముహూర్తములలో ఏసమయము మంచిదో ఆసమయమున చేయవలెను. కానిముహూర్తములలో దిక్శూల వారశూల నక్షత్ర శూలలను తెలిసికొనవలెను. పరిఘ దండాది యోగముల ఉల్లంఘనము చేయరాదు.

కొన్ని సమయములలో అవసరమైన పనులు చేయుటకు ముహూర్తములు దొరకవు. ఆసమయములో ఆదినములోనున్న గ్రహముల హోరలో అభీష్టకార్యమును చేయవలెను. గురు శుక్రవారములు శుభదినములైనపుడు మంగళవారము రోజున అకస్మాత్తుగా కార్యముచేయవలసి వచ్చిన, మంగళవారములో గురు శుక్రహోరలలో ఆకార్యమును చేయవచ్చును. మంగళవారములో ప్రథమహోర మంగళగ్రహహోర యగును. ఒకగంట తర్వాత సూర్యహోర యగును. తర్వాత గంటలో శుక్రహోర యగును. తర్వాత బుధ హోర,చంద్రహోర,శనిహోర,గురుహోర యగును. మంగళవారము సూర్యోదయము 6గంటలకైన 6 నుండి 7గంటల వరకు మంగళహోర,7 నుండి 8 గం,వరకు రవిహోర,8 నుండి 9గం.వరకు శుక్ర హోర, 9 నుండి 10 గం. వరకు బుధహోర, 10 నుండి 11

గం. వరకు చంద్రహోర, 11 నుండి 12 గం.వరకు శనిహోర, 12 నుండి 1గం.వరకు గురుహోర యగును.అందువలన మంగళవారములో గురు,శుక్రహోరలలో శుభ కార్యములను చేయవచ్చును.

**మన్వాదియుగ తిథులు :-**

**మన్వాద్యాస్త్రి తిథీ మధౌ తిథిరవీ ఊర్జే శుచౌ దిక్తిథీ**
**జ్యేష్ఠేఽన్త్యే చ తిథిస్త్విషే నవ తపస్యశ్వాః సహస్యే శివాః**
**భాద్రేఽగ్నిశ్చ సితే త్వమాష్టనభసః కృష్ణే యుగాద్యాః సితే**
**గోఽగ్నీ బాహులరాధయోర్మదనదర్శౌ భాద్రమాఘాసితే 57**

చైత్రశుక్ల తదియ, పూర్ణిమ, కార్తీక శుక్లద్వాదశి–పూర్ణిమ, ఆషాఢశుక్ల దశమి–పూర్ణిమ, జ్యేష్ఠశుక్ల మరియు పాల్గుణశుక్ల పౌర్ణమి, ఆశ్వయుజ శుక్ల నవమి, మాఘశుక్ల సప్తమి, పుష్యశుక్ల ఏకాదశి, భాద్రపదశుక్ల తదియ, శ్రావణశుక్ల అష్టమి, అమావాస్య – ఈ 14 తిథులు మన్వాది సంజ్ఞకములు.(ఈతిథులలో క్రమముగా 14మన్వంతరములు ఆరంభ మగును.) కార్తీకశుక్ల నవమి, వైశాఖశుక్లతదియ, భాద్రపదకృష్ణ త్రయోదశి, మాఘకృష్ణ అమావాస్య ఈ నాలుగు యుగాది తిథులగును.వీటిలో క్రమముగా కృత, త్రేత, ద్వాపర, కలియుగములారంభమగును.

**పైన తెల్పిన 14తిథులలో క్రమముగా 1.స్వయంభువ 2. స్వారోచిష 3. ఔత్తమ 4. తామస 5. రైవత 6. చాక్షుష 7.వైవస్వత 8. సావర్ణి 9. దక్షసావర్ణి 10. బ్రహ్మసావర్ణి 11.ధర్మసావర్ణి 12. రుద్రసావర్ణి 13. దేవసావర్ణి 14. ఇంద్రసావర్ణి - మన్వంతరములారంభమగును. ఈ మన్వాదియుగ తిథులలో చేసిన జప, యజ్ఞ దానములు విశేషఫలదాయకమగును.**

**మొదటి శుభాశుభ ప్రకరణము సమాప్తము**



## 2. నక్షత్ర ప్రకరణము

**నక్షత్రాధిపులు :-**

**నాసత్యాన్తకవహ్ని ధాత్రుశశభృద్రుద్రాదితీజ్యోరగా**
**ఋక్షేశా: పితరో భగోఽర్యమరవీ త్వష్టా సమీర: క్రమాత్**
**శక్రాగ్నీ ఖలు మిత్ర ఇన్ద్ర నిరృతిక్షీరాణి విశ్వేవిధి**
**ర్గోనిన్ధో వసుతోయపాఽజ చరణాఽహిర్బుధ్న్య పూషాభిధా: 1**

అశ్విని ఆది నక్షత్రములకు క్రమముగా అశ్వినీకుమార,యమరాజు,అగ్ని, బ్రహ్మ, చంద్ర, శివ, అదితి, బృహస్పతి, సర్ప, పితర, భగ, అర్యమ, సూర్య, వాయు, ఇంద్ర, అగ్ని, మిత్ర, ఇంద్ర, నిరృతి, (రాక్షసుడు),జల,విశ్వేదేవ,బ్రహ్మ,విష్ణు,వసు,వరుణ,అజపాత్, అహిర్బుధ్న్య, పూష స్వాములగుదురు.

**నక్షత్రాధిప చక్రము**

| నక్షత్రము | స్వామి | నక్షత్రము | స్వామి | నక్షత్రము | స్వామి | నక్షత్రము | స్వామి |
|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | అశ్వినీకుమార | పుష్యమి | బృహస్పతి | స్వాతి | వాయు | అభిజిత్ | బ్రహ్మ |
| భరణి | యమ | ఆశ్లేష | సర్పము | విశాఖ | ఇంద్రాగ్ని | శ్రవణం | విష్ణు |
| కృత్తిక | అగ్ని | మఘ | పితరులు | అనూరాధ | మిత్ర | ధనిష్ఠ | వసు |
| రోహిణి | బ్రహ్మ | పుబ్బ | భగ | జ్యేష్ఠ | ఇంద్ర | శతభిషం | వరుణ |
| మృగశిర | చంద్రుడు | హస్త | అర్యమ | మూల | నిరృతి | పూ భాద్ర | అజపాద |
| ఆర్ద్ర | శివ | చిత్త | రవి | పూ షా | జల | ఉభాద్ర | అహిర్బుధ్న్య |
| పునర్వసు | అదితి | స్వాతి | త్వష్ట | ఉ షా | విశ్వేదేవ | రేవతి | పూష |

**ఉత్తరాత్రయ రోహిణ్యో భాస్కరశ్చ ధ్రువం స్థిరమ్**
**తత్ర స్థిరం బీజగేహశాన్త్యారామాది సిద్ధయే 2**

ఉత్తరాత్రయం,(ఉత్తర,ఉత్తరాభాద్ర,ఉత్తరాషాఢ) రోహిణీ నక్షత్రములు, రవివారము ధ్రువసంజ్ఞకములగును. వీటిలో విత్తనములు చల్లుట, గృహనిర్మాణము, శాంతికర్మ, (యజ్ఞఅనుష్ఠానము) వాటికాది నిర్మాణములు చేయవలెను. (మృదుసంజ్ఞక నక్షత్రములలో చేయుకర్మలు ధ్రువ సంజ్ఞక నక్షత్రములలో చేయవచ్చును)

**స్వాత్యాదిత్యే శ్రుతేస్త్రీణి చన్ద్రశ్చాపి చరం చలమ్**
**తస్మిన్ గజాదికారోహో వాటికాగమనాదికమ్ 3**

స్వాతి, పునర్వసు, శ్రవణ, ధనిష్ఠ, శతభిష నక్షత్రములు సోమవారము చర లేక చలసంజ్ఞయగును. వీటిలో గుర్రము మున్నగు వాహనములపై ఎక్కుట, ఉద్యానవనములో

తిరుగుట,ఉద్యానవనము చూచుటకు యాత్ర చేసిన శుభమగును. (లఘు సంజ్ఞక నక్షత్రము లలో చేయు కార్యములు చరనక్షత్రములలో చేయవచ్చును.)

**పూర్వాత్రయం యామ్యమఘే ఉగ్రం క్రూరం కుజస్తథా**
**తస్మిన్ ఘాతాగ్ని శాఠ్యాని విషశస్త్రాది సిద్ధ్యతి 4**

పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, భరణి, మఘ నక్షత్రములు మంగళవారము ఉగ్ర మరియు క్రూరసంజ్ఞకమగును. దీనిలో ఘాతకర్మ (మోసముతో చంపుట) అగ్నికర్మ, శఠత(దుష్టమైనపని) విప్రయోగము,శస్త్రకర్మ,(శస్త్ర నిర్మాణము,ప్రయోగము) శుభము నిచ్చును. (దారుణసంజ్ఞక నక్షత్రములలో చేయుకర్మలు ఈ నక్షత్రములలో చేయవచ్చును)

**విశాఖాగ్నేయభే సౌమ్యో మిశ్రం సాధారణం స్మృతమ్**
**తత్రాగ్ని కార్యం మిశ్రం చ వృషోత్సర్గాది సిద్ధ్యతి 5**

విశాఖ, కృత్తిక నక్షత్రములు, బుధవారము మిశ్రసంజ్ఞక మరియు సాధారణ సంజ్ఞకము లగును. వీటిలో అగ్నికార్యము, మిశ్రమకార్యము(అనేక కార్యములు ఒకసారి చేయుట) అభీష్టకర్మలు (కోరిన పనులు) వృషోత్సర్గము,(ఎద్దును అచ్చువేసి వదులుట) ఉగ్రకార్యములు చేయవచ్చును.

**హస్తాశ్వి – పుష్యాభిజిత: క్షిప్రం లఘు గురుస్తథా**
**తస్మిన్ పణ్యరతిజ్ఞానం భూషాశిల్ప కలాదికమ్ 6**

హస్త, అశ్విని, పుష్యమి, అభిజిత్తు నక్షత్రములు గురువారము క్షిప్ర లేక లఘు సంజ్ఞకమగును.వీటిలో వ్యాపారము, స్త్రీసహవాసము, ఆభూషణ నిర్మాణము, ధారణము, శిల్పము, గీతవాద్య నృత్య సంబంధ కళల అభ్యాసము చేసిన శుభప్రదమగును.

**మృగాన్త్య చిత్రా మిత్రర్క్ష మృదు మైత్రం భృగుస్తథా**
**తత్ర గీతామ్బరక్రీడా మిత్రకార్యం విభూషణమ్ 7**

మృగశిర,రేవతి, చిత్త, అనూరాధ నక్షత్రములు శుక్రవారము మృదు లేక మైత్ర సంజ్ఞకమగును. వీటిలో సంగీతాభ్యాసము,నవవస్త్రధారణము, క్రీడల అభ్యాసము, మిత్ర సంబంధ కార్యము చేయవచ్చును.

**మూలేన్ద్రా ర్ద్రాహిభం సౌరీస్తీక్ష్ణం దారుణసంజ్ఞకమ్**
**తత్రాభిచారఘాతోగ్ర భేదా: పశుదమాదికమ్ 8**

మూల, జ్యేష్ఠ, ఆర్ద్ర, ఆశ్లేష, నక్షత్రములు శనివారము తీక్ష్ణ లేక దారుణ సంజ్ఞక ములగును. వీటిలో మంత్ర ప్రయోగము ద్వారా ఘాతము,మోసముతో కొట్టుట. కఠోరకర్మ, కలహము, పశువులకు శిక్షణము, బంధనాది కార్యములు శుభమును కలిగించును.

**మూలాహిమిశ్రోగ్రమధోముఖం భవేదూర్ధ్వాస్యమార్ద్రేజ్యహరిత్రయం ధ్రువమ్**
**తిర్యఙ్ముఖం మైత్రకరానిలాదితి జ్యేష్ఠాశ్విభానీ దృశకృత్యమేషు సత్ 9**

మూల,ఆశ్లేష,మిశ్రసంజ్ఞక(విశాఖ, కృత్తిక) ఉగ్రసంజ్ఞక (పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, భరణి,మఘ) అధోముఖ సంజ్ఞక నక్షత్రములు. ఆర్ద్ర,పుష్యమి, శ్రవణము,

ధనిష్ఠ, శతభిషం, ధ్రువసంజ్ఞక (ఉత్తర ఉత్తరాషాఢ,ఉత్తరాభాద్ర, రోహిణి) నక్షత్రములు ఊర్ధ్వముఖ సంజ్ఞక నక్షత్రములగును. మైత్రసంజ్ఞక (మృగశిర, రేవతి, చిత్త,అనూరాధ) హస్త స్వాతి పునర్వసు జ్యేష్ఠ అశ్విని నక్షత్రములు, తిర్యఙ్ముఖ సంజ్ఞకనక్షత్రము లగును.నక్షత్రముల స్వరూపముననుసరించి కార్యములు చేసినశుభము కలుగును. ఊర్ధ్వముఖ నక్షత్రములో గృహనిర్మాణము, దేవాలయాది నిర్మాణము, వృక్షారోపణము, అధోముఖ నక్షత్రములలో కూపము, తటాకములను త్రవ్వుట,తిర్యఙ్ముఖ నక్షత్రములలో రహదారి వంతెనల నిర్మాణము, వాహనముల ప్రయాణము శుభమును కలిగించును.

**నక్షత్ర సంజ్ఞాబోధక పట్టిక**

| సంజ్ఞ | నక్షత్రములు | వారము |
|---|---|---|
| ధ్రువ (స్థిర) | ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రోహిణి | రవివారము |
| చర(చల) | స్వాతి, పునర్వసు, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం | సోమవారము |
| ఉగ్ర(క్రూర) | పుబ్బ, పూర్వాషాఢ,పూర్వాభాద్ర,భరణి,మఘ | మంగళవారము |
| మిశ్ర(సాధారణ) | విశాఖ, కృత్తిక | బుధవారము |
| క్షిప్ర (లఘు) | అశ్విని, హస్త, పుష్యమి, అభిజిత్తు | గురువారము |
| మృదు(మైత్ర) | మృగశిర, రేవతి, చిత్త, అనూరాధ | శుక్రవారము |
| తీక్ష్ణ (దారుణ) | మూల, జ్యేష్ఠ, ఆర్ద్ర, ఆశ్లేష | శనివారము |
| అధోముఖ నక్షత్రములు | మూల, ఆశ్లేష, విశాఖ, కృత్తిక, పుబ్బ పూర్వాషాఢ,పూర్వాభాద్ర, భరణి, మఘ | |
| ఊర్ధ్వముఖ నక్షత్రములు | ఆర్ద్ర,పుష్యమి,శ్రవణ,ధనిష్ఠ,ఉత్తర,ఉత్తరాషాఢ ఉత్తరాభాద్ర, రోహిణి | |
| తిర్యఙ్ముఖ నక్షత్రములు | అనూరాధ,మృగశిర,రేవతి,చిత్త,హస్త,స్వాతి పునర్వసు, జ్యేష్ఠ, అశ్విని | |

**పౌష్ణధ్రువా శ్వికరపఞ్చకవాస వేజ్యా**
**దిత్యే ప్రవాల - రద - శఙ్ఖ - సువర్ణ - వస్త్రమ్**
**ధార్యం విరిక్త - శని - చంద్ర - కుజేఽహ్ని రక్తం**
**భౌమే ధ్రువాదితియుగే సుభగా న దధ్యాత్** **10**

రేవతి, ధ్రువసంజ్ఞక (ఉత్తరాత్రయం రోహిణి) అశ్విని,హస్త,చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, ధనిష్ఠ, పుష్యమి,పునర్వసు నక్షత్రములలో రిక్త (4,9,14) తిథులు, చంద్ర కుజ శనివారములను వదలి మిగిలిన తిథివారములలో పగడము ఏనుగుదంతము శంఖము, బంగారు ఆభరణములు ధరించవలెను.ఎరుపు వస్త్రమును మంగళవారము ధరించవలెను.ధ్రువసంజ్ఞక నక్షత్రములు,పునర్వసు,పుష్యమి నక్షత్రములలో సౌభాగ్య శాలి

యైన స్త్రీ నూతన వస్త్రభూషణములను ధరించరాదు.

**స్త్రీలకు శతభిషనక్షత్రములో స్నానము,ధ్రువాది పుష్యనక్షత్రములలో నూతన వస్త్ర ధారణము,ఆభూషణముల ధారణము నిషేధించబడినది. రోహిణి పునర్వసు ఉత్తరాత్రయము నక్షత్రములలో నవవస్త్రములు భూషణములు ధరించిన స్త్రీ పతిహీను రాలగును.**

**స్ఫుటితవస్త్ర ఫలము :-**

**వస్త్రాణాం నవభాగకేషు చ చతుష్కోణేఽమరా రాక్షసా**
**మధ్యత్ర్యంశగతా నరాస్తు సదశే పాశే చ మధ్యాంశయో:**
**దగ్ధే వా స్ఫుటితేఽమ్బరే నవతరే పఙ్కాదిలిప్తే న స**
**ద్రక్ష్యోంఽశే నృసురాంశయో: శుభమసత్సర్వాంశకే ప్రాంతత: 11**

క్రొత్తవస్త్రము ఆకస్మాత్తుగా అగ్నిలో కాలిన, చిరిగిన, బురదతో మలినమైన దాని శుభాశుభ ఫలమీవిధముగా నుండును.

నవీనవస్త్రమును తొమ్మిదిభాగములుగా విభజించిన నాలుగువైపుల ఉన్న భాగము లలో దేవతలను మధ్యనున్న మూడుభాగములలో రాక్షసులను, దేవతల మధ్య మనుష్యులను స్థాపన చేయవలెను. రాక్షసులభాగములో కాలిన చిరిగిన మలినమైన అశుభఫలము దేవమనుష్యభాగములలో కాలిన,చిరిగిన,మలినమైన శుభము కలుగును. అన్నిభాగములలో చివరలందు పైన తెల్పిన విధముగా జరిగిన అశుభమగును.

**వస్త్ర నవవిభాగ పట్టిక**

| | | |
|---|---|---|
| దేవతలు | మనుష్యులు | దేవతలు |
| రాక్షసులు | రాక్షసులు | రాక్షసులు |
| దేవతలు | మనుష్యులు | దేవతలు |

**రాక్షసులస్థానములో కాలిన,చిరిగిన,మలినమైన వస్త్రము అశుభమును కలిగించును. దేవ మనుష్యుల భాగములలోనైన శుభము, వస్త్రము చివరలందు జరిగిన అశుభమగును. పైచిత్రములో స్పష్టము చేయబడినది. వస్త్రము కాలినపుడు చిరిగినపుడు వివిధ ఆకృతులను పొందును.వాటి స్వరూపానుసారము ఫలితములను కశ్యపాదులు సంహితలలో తెలిపెను.**

**విప్రాజ్ఞయా తథోద్వాహే రాజ్ఞా ప్రీత్యా ర్పితఞ్చ యత్**
**నిన్ద్యేఽపి ధిష్ణ్యే వారాదౌ వస్త్రం ధార్యం జగుర్బుధా: 12**

బ్రాహ్మణుల ఆజ్ఞతో, వివాహ సమయములో, రాజు ప్రసన్నతా పూర్వకముగా నిచ్చినపుడు నిందిత నక్షత్ర దినయోగములలో నవీన వస్త్రధారణ చేయవచ్చును. ఇది విద్వాంసులమతము

**లతాపాదపరోపణ రాజదర్శన విక్రయాది ముహూర్తము :-**

**రాధా మూల మృదు ధ్రువర్క్ష వరుణక్షిప్రైర్లతాపాదపా**
**రోపోఽథో నృపదర్శనం ధ్రువమృదుక్షిప్రశ్రవోవాసవై:**
**తీక్ష్ణోగ్రామ్బుపభేషు మద్యముదితం క్షిప్రాన్త్యవహ్నీన్ద్వభా**
**దిత్యేన్ద్రామ్బుపవాసవేషు హి గవాం శస్త: క్రయోవిక్రయ: 13**

విశాఖ, మూల, మృదుసంజ్ఞక (మృగశిర, రేవతి, చిత్త, అనూరాధ) ధ్రువసంజ్ఞక (ఉత్తరాత్రయం,రోహిణి) శతభిషం, క్షిప్రసంజ్ఞక (హస్త, అశ్విని,పుష్యమి, అభిజిత్తు) నక్షత్రము లలో లత,పౌధ,వృక్షాదులను నాటుట, ధ్రువ (ఉత్తరాత్రయం,రోహిణి)శతభిషం, క్షిప్రసంజ్ఞక (హస్త,అశ్విని,పుష్యమి,అభిజిత్)నక్షత్రములలో లత,వృక్షములరోపణము ధ్రువ (ఉత్తరా త్రయం,రోహిణి మృగశిర,రేవతి చిత్త, అనురాధ, హస్త,అశ్విని,పుష్యమి,అభిజిత్తు శ్రవణ, ధనిష్ఠ) నక్షత్రములలో రాజదర్శనము, తీక్ష్ణసంజ్ఞక (మూల, జ్యేష్ఠ, ఆర్ద్ర, ఆశ్లేష) ఉగ్ర సంజ్ఞక (పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర భరణి, మఘ) శతభిష నక్షత్రములలో మద్య నిర్మాణము విక్రయము,క్షిప్ర (హస్త, అశ్విని అభిజిత్తు, పుష్యమి) రేవతి, విశాఖ,పునర్వసు, జ్యేష్ఠ, శతభిషం,ధనిష్ఠ నక్షత్రములలో ఆవు ఎద్దుల విక్రయము శుభమునిచ్చును.

**పశురక్షా ముహూర్తము :-**

**లగ్నే శుభే చాష్టమ శుద్ధిసంయుతే రక్షా పశూనాం నిజయోనిభే చరే**
**రిక్తాష్టమీ దర్శకుజశ్రవోధ్రువ - త్వాష్ట్రేషు యానం స్థితివేశనం న సత్ 14**

శుభలగ్నములో (2,3,4,6,7,9,12) లగ్నమునుండి అష్టమభావము శుద్ధమైనపుడు, చరసంజ్ఞక (స్వాతి,పునర్వసు,శ్రవణ,ధనిష్ఠ,శతభిషం) నక్షత్రములు, తమతమయోని నక్షత్రములలో పశుపాలనము పశురక్షణ చేయవలెను.

రిక్తతిథి(4,9,14) అష్టమి, అమావాస్య తిథులలో మంగళ రవివారములలో శ్రవణ,ఉత్తరాయణం,రోహిణి,చిత్త నక్షత్రములలో పశువులను ఒకస్థానము నుండి వేరొక స్థానమునకు తెచ్చుట,తీసికొనిపోవుట,పశువులశాలలో నుంచుట శుభకారక మగును.

**ఔషధసేవన - సూచీకర్మ ముహూర్తము :-**

**భైషజ్యం సల్లఘు మృదు చరే మూలభే ద్వ్యఙ్గలగ్నే**
**శుక్రోన్దీజ్యే విది చ దివసే చాపి తేషాం రవేశ్చ**
**శుద్ధే రిష్ఫద్యూన మృతిగృహే సత్తిథౌ నో జనేర్భే**
**సూచీకర్మాప్యదితి - వసుభ - త్వాష్ట్ర - మిత్రాశ్వి - పుష్యే 15**

లఘు (హస్త అశ్విని పుష్యమి అభిజిత్తు) మృదు (మృగశిర రేవతి చిత్త అనూరాధ) చర(స్వాతి, పునర్వసు,శ్రవణ,ధనిష్ఠ శతభిష) మూల నక్షత్రములలో ద్విస్వభావ (3,6,9,12) లగ్నములలో శుక్ర చంద్ర గురు బుధులు ద్విస్వభావ రాశులలో నున్న ఈ గ్రహముల దినములలో అనగా రవ్యాది వారములో(రవి,సోమ,బుధ,గురు,శుక్రవారములు)

లగ్నమునుండి ద్వాదశ సప్తమ అష్టమభావములు శుద్ధిగా నున్న శుభతిథులలో తమ జన్మరాశి నక్షత్రమును వదిలి ఔషధసేవనము చేసిన శుభకారకమగును. పునర్వసు, ధనిష్ఠ,చిత్త, అనూరాధ, అశ్విని, పుష్యమి నక్షత్రములలో సూచీకర్మ (కుట్టుట)శుభమునిచ్చును.

**క్రయవిక్రయ ముహూర్తము :–**

**క్రయ – విక్రయో నేష్టో విక్రయర్క్షే క్రయోఽపి న**
**పౌష్ణామ్బుపాశ్వినీవాతరశ్రవశ్చిత్రా: క్రయే శుభా: 16**

క్రయము (కొనుట) చేయుటకు తెల్పిన నక్షత్రములలో వస్తువిక్రయము చేయుట, విక్రయము (అమ్ముట) చేయు నక్షత్రములో క్రయము చేయుట శుభమునీయదు. వస్తువులు కొనుటకు రేవతి, శతభిషం, అశ్విని, స్వాతి, శ్రవణము, చిత్త నక్షత్రములు శుభమునిచ్చును.

**విక్రయ ముహూర్తము :–**

**పూర్వాద్వీశ కృశాను సార్పయమభే కేన్ద్ర ద్వికోణే శుభై:**
**షట్ త్ర్యాయేష్వశుభైర్వినా ఘటతనుం సన్విక్రయ: సత్తిథౌ**
**రిక్తాభౌమ ఘటాన్వినా చ విపణిర్మిత్ర ధ్రువక్షిప్రభై**
**ర్లగ్నే చన్ద్రసితే వ్యయాష్టరహితై: పాపై: శుభైర్ద్వ్యాయఖే 17**

పుబ్బ, పూర్వాషాఢ,పూర్వాభాద్ర, విశాఖ, కృత్తిక, ఆశ్లేష, భరణి నక్షత్రములలో కేంద్ర (1,4,7,10) ద్వితీయ కోణము (5,9)లలో శుభగ్రహములున్నపుడు 6,3,11 భావము లలో అశుభగ్రహములున్నపుడు కుంభలగ్నమును వదలి మిగిలిన లగ్నములలో శుభ తిథులలో విక్రయము చేసిన శుభము కలుగును.

రిక్త(4,9,14)తిథులు, మంగళవారము కుంభలగ్నములను వదలి శేష తిథివార లగ్నములలో మిత్ర (మృగశిర,రేవతి, చిత్త, అనూరాధ) ధ్రువ (ఉత్తరాత్రయము, రోహిణి) క్షిప్ర (హస్త, అశ్విని, పుష్య, అభిజిత్)నక్షత్రములలో, లగ్నములో చంద్రుడు శుక్రుడున్నపుడు, ద్వాదశ అష్టమభావములు పాపగ్రహరహితములైనపుడు ద్వితీయ ఏకాదశ దశమ భావములు శుభగ్రహములతో నున్న **దుకాణప్రారంభమునకు** శుభముహూర్తమగును.

**హస్త్యశ్వ ముహూర్తము :–**

**క్షిప్రాన్త్యవస్విన్దు మరుజ్జలేశాది త్యేష్వరిక్తారదినే ప్రశస్తమ్**
**స్యాద్వాకికృత్యం త్వథ హస్తికార్యం కుర్యాన్మృదు క్షిప్రచరేషు విద్వాన్ 18**

క్షిప్రసంజ్ఞక (హస్త,అశ్విని, పుష్యమి, అభిజిత్తు) రేవతి, ధనిష్ఠ, మృగశిర, స్వాతి, శతభిషం,పునర్వసునక్షత్రములలో రిక్తతిథులు మంగళవారములను వదలి మిగిలిన తిథి వారములలో గుర్రములకు సంబంధించిన కార్యము చేయవలెను. ఇదేవిధముగా మృదు (మృగశిర,రేవతి, చిత్త, అనూరాధ) క్షిప్ర (హస్త, అశ్విని, పుష్యమి, అభిజిత్తు) చర(స్వాతి, పునర్వసు, శ్రవణ, ధనిష్ఠ, శతభిషం) నక్షత్రములలో విద్వాంసులైన పురుషులు గజసంబంధ

కార్యమును చేయవలెను.

**భూషణ నిర్మాణ ముహూర్తము :-**

**స్యాత్భూషాఘటనం త్రిపుష్కర చర క్షిప్రధ్రువే రత్నయుక్**
**తత్తీక్ష్ణోగ్ర విహీనభే రవి కుజే మేషాదిసింహే తనౌ**
**తన్ముక్తాసహితం చరధ్రువమృదుక్షిప్రే శుభే సత్తనౌ**
**తీక్ష్ణోగ్రాశ్విమృగే ద్విదైవదహనే శస్త్రం శుభం ఘట్టితమ్ 19**

త్రిపుష్కర యోగములో చర - క్షిప్ర - ధ్రుత సంజ్ఞక నక్షత్రములలో భూషణముల నిర్మాణము శుభమునిచ్చును. తీక్ష ఉగ్రసంజ్ఞక నక్షత్రములను వదలి మిగిలిన నక్షత్రములలో, రవి మంగళవారములలో మేష వృశ్చిక సింహలగ్నములలో రత్నముతో కూడిన భూషణముల నిర్మాణము శుభమునిచ్చును. చర, ధ్రువ, మృదు క్షిప్రసంజ్ఞక నక్షత్రములలో శుభవారములో శుభలగ్నములో ముత్యాల ఆభరణముల నిర్మాణము శుభమునిచ్చును. తీక్ష్ణ ఉగ్రసంజ్ఞక నక్షత్రములలో అశ్విని,మృగశిర, విశాఖ, కృత్తిక, నక్షత్రములలో శస్త్ర నిర్మాణము శుభము నిచ్చును.

**ముద్రాపాతన - వస్త్రప్రక్షాళన ముహూర్తము :-**

**ముద్రాణాం పాతనం సధ్రువమృదుచరభక్షిప్రభైర్వీన్దుసౌరే**
**ఘస్రే పూర్ణాజయాఖ్యే న చ గురుభృగుజాస్తే విలగ్నే శుభైః స్యాత్**
**వస్త్రాణాం క్షాలనం సద్వసుహయదినకృత్పఞ్చకాదిత్యపుష్యే**
**నో తిక్తాపర్వషష్ఠీపితృదినరవిజజ్ఞేషు కార్యం కదాపి 20**

ధ్రువ (ఉత్తరాత్రయం, రోహిణి) మృదు(మృగశిర, రేవతి,చిత్త,అనూరాధ) క్షిప్ర (హస్త, అశ్విని,పుష్యమి) నక్షత్రములలో సోమ శనివారములను వదలి మిగిలిన వారములలో పూర్ణ(5,10,15) జయ (3,8,13) తిథులలో గురు శుక్రలుదయమైనపుడు లగ్నములో శుభగ్రహములున్నపుడు నాణెముల ముద్రణచేసిన శుభము కలుగును.

ధనిష్ఠ, హస్త,హస్త నుండి ఐదునక్షత్రములు (హస్త, చిత్త,స్వాతి, విశాఖ, అనూరాధ) పునర్వసు,పుష్యమి నక్షత్రములలో వస్త్రముల ప్రక్షాళనము (ఉతుకుట)శుభము నిచ్చును. రిక్త (4,9,14) అమావాస్య షష్ఠితిథులలో మాతాపితల శ్రాద్ధదినములలో శని బుధవారములలో ఎప్పుడుకూడ వస్త్రముల ప్రక్షాళన చేయకూడదు.

**ఖడ్గాది ధారణ ఉపయోగ శయ్యా ముహూర్తము :-**

**సన్ధార్యాః కున్తవర్మేష్వసనశర కృపాణాసి పుత్రో విరిక్తో**
**శుక్రేజ్యార్కేఽహ్ని మైత్రధ్రువ లఘుసహితాదిత్యశాక్ర ద్విదైవే**
**స్యుర్లగ్నేఽపి స్థిరాఖ్యే శశిని చ శుభదుష్టేశు భైః కేన్ద్రగైః స్యా**
**ద్భోగః శయ్యాసనాదేర్ధ్రువ మృదులఘు హర్యన్తకాదిత్యఇష్టః 21**

రిక్తతిథులను విడిచి మిగిలిన తిథులలో శుక్ర గురు రవివారములలో మైత్ర – ధ్రువ – లఘు సంజ్ఞకనక్షత్రములలో,పునర్వసు జ్యేష్ఠ విశాఖ నక్షత్రములలో,స్థిర (2,5,8,11) లగ్నములలో,చంద్రుడు శుభగ్రహములతో చూడబడినపుడు, కేంద్రములో (1,4,7,10) శుభ గ్రహములున్నపుడు భాల,కవచము, ధనుస్సు, బాణము,కత్తుల నిర్మాణముచేయవలెను. ధ్రువ–మృదు–లఘు న।త్రములలో శ్రవణ,భరణి, పునర్వసు నక్షత్రములలో శయ్యాదుల ఉపయోగమనుకూలమగును.

**అంధాది నక్షత్ర సంజ్ఞ :–**

**అన్ధక్షం వసుపుష్యధాతృజలభద్వీశార్యమాన్త్యాభిధం**
**మన్దాక్షం రవి విశ్వమిత్రజలపాశ్లేషాశ్వి చాన్ద్రం భవేత్**
**మధ్యాక్షం శివపిత్రజైక చరణ త్వాష్ట్రైన్ద్రవిధ్యన్తక**
**స్వక్షం స్వాత్యదితిశ్రవోదహన బాహిర్బుధ్న్యరక్షో భగమ్ 22**

ధనిష్ఠ, పుష్యమి, పూర్వాషాఢ, విశాఖ, ఉత్తర, రేవతి నక్షత్రములు 'అంధాక్ష' సంజ్ఞ; హస్త, ఉత్తరాషాఢ, అనూరాధ, శతభిషం, ఆశ్లేష, అశ్విని, మృగశిర నక్షత్రములు 'మందాక్ష' సంజ్ఞ; ఆర్ద్ర, మఘ, పూర్వాభాద్ర, చిత్త, జ్యేష్ఠ, అభిజిత్తు, భరణి నక్షత్రములు 'మధ్యాక్ష' సంజ్ఞ; స్వాతి, పునర్వసు, శ్రవణ, కృత్తిక, ఉత్తరాభాద్ర, మూల, పుబ్బ నక్షత్రములు 'సులోచన'సంజ్ఞ కలిగినవగును.

**వినాష్టార్థస్య లాభోఽన్ధే శీఘ్రం మన్దే ప్రయత్నత:**
**స్యాద్దూరే శ్రవణ మధ్యే శ్రుత్యాప్తీ న సులోచనే 23**

అంధాక్ష సంజ్ఞక నక్షత్రములలో పోయిన వస్తువు వెంటనే దొరుకును. మందాక్ష సంజ్ఞక నక్షత్రములలో పోయిన వస్తువు ప్రయత్నముతో దొరుకును. మధ్యసంజ్ఞక నక్షత్రములలో పోయిన వస్తువు దూరముగానున్నదని తెలియును. సులోచన సంజ్ఞక నక్షత్రములలో నష్టవస్తువు విషయము తెలియదు. దొరకదు.

**ధనవ్యవహార ముహూర్తము :–**

**తీక్ష్ణ మిశ్రధ్రువోగ్రైర్యద్ ద్రవ్యం దత్తం నివేశితమ్**
**ప్రయుక్తం చ వినిష్టం చ విష్ట్యాం పాతే చ నాప్యతే 24**

తీక్ష్ణ,మిశ్ర,ధ్రువ,ఉగ్రసంజ్ఞక(మూల,జ్యేష్ఠ,ఆర్ద్ర,ఆశ్లేష,విశాఖ,కృత్తిక,ఉత్తరాత్రయం, రోహిణి, పుబ్బ, పూర్వాభాద్ర, పూర్వాషాఢ, భరణి, మఘ) నక్షత్రములలో భద్ర వ్యతీపాతలలో ధనము ఎవరికైన ఇచ్చిన, ఎవరిదగ్గరనైన ఉంచిన వ్యాపారములో నుపయోగించిన, నష్టమైన మరల తిరిగిరాదు.

**జలాశయ ఖనన నృత్యారంభ ముహూర్తము :-**

**మిత్రార్క ధ్రువాసవామ్బుప మఘాతోయాన్త్య పుష్యేన్దుభి:**
**పాపైర్హీనబలైస్తనౌ సురగరౌ జ్ఞేవా భృగౌ ఖే విధౌ**
**ఆప్యే సర్వజలాశయస్య ఖననం వ్యమ్భోమఘై: సేన్ద్రభై**
**స్తైర్నృత్యం హిబుకే శుభైస్తనుగృహే జ్ఞేఽబ్జే జ్ఞరాశౌ శుభమ్ 25**

అనూరాధ,హస్త, ఉత్తరాత్రయం, రోహిణి, ధనిష్ఠ, శతభిషం, మఘ, పూర్వాషాఢ రేవతి,పుష్యమి, మృగశిర నక్షత్రములలో, పాపగ్రహములు బలహీనమైనపుడు, లగ్నములో గురువు బుధుడు దశమభావములో శుక్రుడున్నపుడు, చంద్రుడు జలచరరాశు (కర్కాటకము, మకర కుంభ మీన)లలో నున్నప్పుడు అన్ని విధములైన జలాశయముల నిర్మాణము చేసిన శుభము కలుగును.

పైన తెల్పిననక్షత్రములలో మఘ పూర్వాషాఢలను వదలి మిగిలిన నక్షత్రములలో జ్యేష్ఠలో, చతుర్థభావములో శుభగ్రహములు, లగ్నములో బుధుడు, బుధరాశులైన కన్యా మిథునములలో చంద్రుడున్నపుడు నృత్యారంభము శుభకారకమగును.

**సేవాముహూర్తము :-**

**క్షిప్రే మైత్రే విత్సితార్కేజ్యవారే సౌమ్యే లగ్నేఽర్కే కుజే వా ఖలాభే**
**యోనేర్మైత్ర్యాం రాశిపోశ్చాపి మైత్ర్యాం సేవా కార్యా స్వామిన: సేవకేన 26**

క్షిప్ర, మిత్ర సంజ్ఞక (హస్త,అశ్విని,పుష్యమి,మృగశిర,అనూరాధ,చిత్త, రేవతి) నక్షత్రములలో బుధ,శుక్ర,రవి,గురువారములు శుభగ్రహలగ్నములలో నున్నపుడు, పాప గ్రహములు దశమ ఏకాదశస్థానములకు వెళ్ళినపుడు సేవకుడు తనస్వామి కార్యమును ప్రారంభించవలెను. స్వామిసేవకుల స్థిర సంబంధము కొరకు ఇద్దరికి యోనిమైత్రి గ్రహ మైత్రుల విచారణ తప్పక చేయవలెను.

**స్వాత్యాదిత్య మృదు ద్విదైవగురుభే కర్ణత్రయాశ్వే చరే**
**లగ్నే ధర్మసుతాష్ట శుద్ధిసహితే ద్రవ్యప్రయోగ: శుభ:**
**నారే గ్రాహ్యమృణం తు సంక్రమదినే వృద్ధౌ కరేఽర్కేఽహ్నియత్**
**తద్వంశేషు భవేదృణం న చ బుధే దేయం కదాచిద్ధనమ్ 27**

స్వాతి,పునర్వసు,విశాఖ మృదు సంజ్ఞక (మృగశిర, రేవతి,చిత్త, అనూరాధ)పుష్యమి, శ్రవణ, ధనిష్ఠ, శతభిషం, అశ్విని నక్షత్రములలో చరలగ్నములో నవమ,పంచమ,అష్టమ భావములు శుద్ధముగా నున్నపుడు ద్రవ్యప్రయోగము (ధనము ఇచ్చుట,తీసుకొనుట) శుభము నిచ్చును. మంగళవారము, సంక్రాంతి దినము, వృద్ధియోగము, రవివారము హస్త నక్షత్రములో ఋణమును తీసికొనరాదు. ఉక్తయోగములో తీసికొన్న ధనప్రభావము సంతానముపై పడును. (పుత్ర పౌత్రులు కూడ తీర్చలేరు) **బుధవారము ధనమును ఇవ్వరాదు.**

**హలప్రవహణ ముహూర్తము :-**

**మూలద్వీశమఘాచరధ్రువ మృదుక్షిప్రైర్వినార్కం శనిం**
**పాపైర్హీన బలైర్విదౌ జలలవే శుక్రే విధౌ మాంసలే**
**లగ్నే దేవగురౌ హలప్రవహణం శస్తం న సింహే ఘటే**
**కర్కాజైణఘటే తనౌ క్షయకరం రిక్తాసు షష్ఠ్యాం తథా** **28**

మూల,విశాఖ, మఘ, స్వాతి,పునర్వసు,శ్రవణ, ధనిష్ఠ,శతభిషం,మృగశిర, రేవతి చిత్త, హస్త, అశ్విని, పుష్యమి,అభిజిత్తు నక్షత్రములలో శని రవివారములను వదలి మిగిలిన దినములలో పాపగ్రములు బలహీనమైనపుడు, చంద్రుడు జలచర రాశుల నవాంశలో నున్నపుడు శుక్రచంద్రులు బలవంతులైనపుడు, లగ్నములో గురుడున్నపుడు హలప్రవరణ (పొలము దున్నుట) శుభమునిచ్చును.సింహ కుంభ కర్కాటక మేష మకర తులా లగ్నములలో,రిక్త(4,9,14) షష్ఠి తిథులలో నాగలితో దున్నుట అశుభదాయకమగును.

**బీజా వపన ముహూర్తము :-**

**ఏతేషు శ్రుతివారుణాదితి విశాఖోడూని భౌమం వినా**
**బీజోప్తిర్గదితా శుభా త్వగుభతోఽష్టాగ్నీన్దు రామేన్దవ:**
**రామేన్ద్వగ్ని యుగాన్యసచ్ఛుభకరాణ్యుప్తౌ హలేఽర్కో జ్ఝితాద్**
**భాద్రామాష్టనవాష్టభాని మునిభి: ప్రోక్తాన్యసత్సన్తి చ** **29**

హలప్రవహణములో తెల్పిన నక్షత్రములు,వారములలో శ్రవణం,శతభిషం పునర్వసు విశాఖ నక్షత్రములు, మంగళవారము వదలి మిగిలిన నక్షత్రములు వారములు విత్తనములు చల్లుటకు శుభకారకములగును. రాహువున్న నక్షత్రము నుండి ఎనిమిది నక్షత్రముల వరకు అశుభము.తర్వాత మూడునక్షత్రములు శుభము,తర్వాత ఒక నక్షత్రము శుభము,తర్వాత మూడు శుభము, ఒకటి అశుభము, మూడు శుభము, నాలుగు నక్షత్రములు అశుభమగును. రాహుచక్రానుసారము శుభనక్షత్రములలో హలప్రవహణము చేయవలెను.

**శిరామోక్షణ - విరేచన - ధర్మక్రియల ముహూర్తము :-**

**త్వాష్ట్రాన్మిత్రకభా ద్వయేఽమ్బు పలఘుశ్రోత్రే శిరామోక్షణం**
**భౌమార్కేజ్యదినే,విరేకవమనాద్యం స్యాద్బుధార్కీ వినా**
**మిత్ర క్షిప్రచరధ్రువే రవిశుభాహే లగ్నవర్గే విదో**
**జీవస్యాపి తనౌ గురౌ నిగదితా ధర్మక్రియా తద్బలే** **30**

చిత్త, అనూరాధ, రోహిణి నక్షత్రముల నుండి రెండేసి నక్షత్రములు అనగా చిత్త - స్వాతి, అనూరాధ-జ్యేష్ఠ రోహిణి-మృగశిరలు, శతభిషము, లఘు(హస్త, అశ్విని,పుష్యమి) శ్రవణ నక్షత్రములలో, రవి మంగళ గురువారములలో శిరామోక్షణము (శిరల నుండి రక్తము తీయుకార్యము) హితకరమగును. బుధ శనివారములను వదలి మిగిలిన దినము

లలో ఉక్త నక్షత్రములలో విరేచనము (ఎనెమా)వమనక్రియ శరీరశోధక క్రియలు చేసిన లాభము కలుగును. అనూరాధ క్షిప్ర, చర, ధ్రువసంజ్ఞక (హస్త, అశ్విని, పుష్యమి స్వాతి, పునర్వసు,శ్రవణ,ధనిష్ఠ,శతభిష ఉత్తరాత్రయము, రోహిణి) నక్షత్రములలో రవివారము శుభదినములలో (సోమవారము బుధ గురు శుక్రవారములు) బుధ గురు షడ్వర్గులలో, గురువు లగ్నములో బలవంతుడైనపుడు ధార్మికకార్యములు శుభదాయకమగును.

**ధాన్యఛేదన ముహూర్తము :-**

**తీక్ష్ణా జపాదకరవహ్నివసుశ్రు తీన్దు**
**స్వాతీ మఘోత్తరజలాన్తక తక్ష పుష్యే**
**మన్దారరిక్తరహితే దివసేఽ తి శస్తా**
**ధాన్యచ్ఛిదా నిగదితా స్థితభే విలగ్నే** **31**

తీక్ష్ణ సంజ్ఞక (మూల, జ్యేష్ఠ,ఆర్ద్ర,ఆశ్లేష) పూర్వాభాద్ర,హస్త, కృత్తిక,ధనిష్ఠ, శ్రవణ మృగశిర,స్వాతి, మఘ, ఉత్తరాత్రయము,పూర్వాషాఢ, భరణి, చిత్త, పుష్యమి నక్షత్రములలో శని మంగళవారములు రిక్త (4,9,14) తిథులను వదలి మిగిలిన దిన,తిథులలో స్థిరసంజ్ఞక (2,5,8,11)లగ్నములలో ధాన్యఛేదన (పంటకోయుట)ము శుభదాయకమగును.

**సస్యరోపన కణమర్దన ముహూర్తము :-**

**భాగ్యార్యమ శ్రుతిమఘేన్ద్ర విధాతృమూల**
**మైత్రాన్త్యభేషు కథితం కణమర్దనం సత్**
**ద్విశాజపాన్నిరృతిధాతృశతార్యమర్క్షే**
**సస్యస్య రోపణమిహార్కికుజౌ వినా సత్** **32**

పుబ్బ,ఉత్తర, శ్రవణ, జ్యేష్ఠ, రోహిణి, మూల, అనూరాధ, రేవతి నక్షత్రములలో కుప్పనూర్చిన శుభము కలుగును. విశాఖ,పూర్వాభాద్ర, మూల, రోహిణి, శతభిషం, ఉత్తర నక్షత్రములలో శని మంగళవారములను వదలి మిగిలిన రోజులలో సస్యరోపణము (విత్తనములను నాటుట) శుభమునిచ్చును.

**ధాన్యస్థాపన ముహూర్తము :-**

**మిశ్రోగ్రరౌద్ర భుజగేన్ద్ర విభిన్నభేషు**
**కర్కాజతౌలిరహితే చ తనౌ సుభాహే**
**ధాన్యస్థితి: శుభకరీ గదితా ధ్రువేజ్య**
**ద్విశేన్ద్ర దస్రచరభేషు చ ధాన్యవృద్ధి:** **33**

మిశ్రసంజ్ఞక (విశాఖ కృత్తిక) ఉగ్రసంజ్ఞక (పుబ్బ,పూర్వాషాఢ, పూర్వాభాద్ర, భరణి,మఘ) ఆర్ద్ర,ఆశ్లేష, జ్యేష్ఠ నక్షత్రములను వదలి మిగిలిన నక్షత్రములలో, కర్కాటక మేష తులా లగ్నములను వదలి మిగిలిన లగ్నములలో శుభదినములలో అన్నస్థాపనము

(ధాన్యము నిలువ ఉంచుట) శుభకరమగును. ధ్రువసంజ్ఞక (ఉత్తరాత్రయం, రోహిణి) పుష్యమి విశాఖ, జ్యేష్ఠ, అశ్విని,చరసంజ్ఞక (స్వాతి, పునర్వసు, శ్రవణ, ధనిష్ఠ, శతభిషం) నక్షత్రములలో అన్నవ్యవహారము (తీసికొనుట ఇచ్చుట) వృద్ధికారకమగును.

**శాంతి మంగల–పౌష్టిక–కర్మ ముహూర్తము :–**

**క్షిప్రధ్రువాన్త్య చరమైత్రమఘాసు శస్తం**
**స్యాచ్ఛాన్తి కం చ సహమఙ్గలపౌష్టికాభ్యామ్**
**ఖేఽర్కే విధౌ సుఖగతే తనుగే గురౌనో**
**మౌఢ్యాది దుష్టసమయే శుభదం నిమిత్తే** **34**

హస్త, అశ్విని, పుష్యమి, అభిజిత్తు, ఉత్తరాత్రయం, రోహిణి,రేవతి, స్వాతి, పునర్వసు ధనిష్ఠ, శతభిషం, అనూరాధ, మఘ నక్షత్రములలో, లగ్నమునుండి దశమభావములో సూర్యుడు, చతుర్థభావములో చంద్రుడు లగ్నములో గురుడున్నప్పుడు గ్రహశాంతి, మంగళపౌష్టిక కర్మలు చేసిన శుభము కలుగును. గురు శుక్రులు బాల–వృద్ధ అస్తంగతులై నపుడు పైకార్యము చేయరాదు. కాని అశుభ శకునశాంతిని నిర్వహించిన శుభప్రదమగును.

**హోమాహుతి ముహూర్తము :–**

**సూర్యభాత్ త్రిత్రిభే చాన్ద్రే సూర్యవిచ్ఛుక్రపఙ్గవ:**
**చన్ద్రారేజ్యాగుశిఖినో నేష్టా హోమాహుతి:ఖలే** **35**

సూర్యనక్షత్రము నుండి వర్తమాన చంద్ర నక్షత్రము వరకు, మూడేసి నక్షత్రములలో క్రమముగా సూర్య, బుధ, శుక్ర, శని, చంద్ర, మంగళ, గురు, రాహు, కేతు ముఖములో ఆహుతి కలుగును. పాపగ్రహముఖములో కలుగు ఆహుతి అశుభమగును.

**శుభఫలము కలుగుటకు హవన ముహూర్తమావశ్యకమగును. హవనములో నిచ్చు ఆహుతి అగ్నిదేవుని ద్వారా అభీష్ట దేవతలకు చేరును.అగ్నిదేవుని నివాసము భిన్న భిన్న గ్రహముల ముఖములో నుండును.శుభగ్రహ ముఖములలో అగ్నినివాసము చేసిన శుభఫలము, పాపగ్రహముల ముఖములో అగ్నివాసము చేసిన అశుభఫలము కలుగును.**

**శుభాశుభ ఫలచక్రము**

సూర్య నక్షత్రము నుండి నిత్య నక్షత్రము వరకు

| నక్షత్ర సంఖ్య | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| గ్రహ హవన | రవి | బుధ | శుక్ర | శని | చంద్ర | కుజ | గురు | రాహు | కేతు |
| ఫలము | అశుభ | శుభ | శుభం | అశు | శుభ | అశు | శుభ | అశుభ | అశుభ |

**హవనములో అగ్నివాస విచారము :–**

**సైకా తిథిర్వారయుతా కృతాప్తా శేషే గుణేఽభ్రే భువి వహ్నివాస:**
**సౌఖ్యాయ హోమే శశియుగ్మశేషే ప్రాణార్థనాశా దివి భూతలే చ** **36**

వర్తమానతిథికి ఒకటి కలిపి రవివారము నుండి వర్తమాన దినము వరకు సంఖ్యను కలిపి యోగఫలమును నాలుగుతో భాగించిన శేషము 3,0 వచ్చిన అగ్నివాసము భూమిపై యగును. ఆదినమున హవనమువలన శుభముకలుగును. ఒకటిశేషము వచ్చిన అగ్నివాసము స్వర్గములోనగును. ఆదినమున హవనము చేసిన ప్రాణనాశము, రెండు శేషము వచ్చిన అగ్నివాసము పాతాళములో నగును. ఈ హవనము వలన ధననాశము కలుగును.

**శుక్లపూర్ణిమకు రవివారమునకు హవనము కొరకు అగ్నివాసము చూడవలెనన్న తిథి సంఖ్య 15 + 1 + 16 వారసంఖ్య - 1 16 + 1 = 17**

**17 ను 4చే భాగించిన శేషము 1 వచ్చును. 1 వచ్చిన అగ్నివాసము పాతాళమగుట వలన హవనము చేసిన ధననాశము కలుగును.**

**నవాన్న భక్షణ ముహూర్తము :-**

**నవాన్నం స్యాచ్చరక్షిప్రమృదుభే సత్తనౌ శుభమ్**
**వినా నన్దా - విషఘటీ - మధు - పౌషార్కి భూమిజాన్ 37**

చర, క్షిప్ర మృదుసంజ్ఞక (స్వాతి,పునర్వసు,శ్రవణ,ధనిష్ఠ,శతభిషం, మృగశిర,రేవతి, అనూరాధ హస్త, అశ్విని, పుష్యమి) నక్షత్రములలో శుభలగ్నములలో నంద (1,6,11) తిథులను వదలి మిగిలిన తిథులలో శని మంగళవారములను వదలి మిగిలిన దినములలో క్రొత్తబియ్యమును తినిన శుభము కలుగును.

**నౌకాఘటన ముహూర్తము :-**

**యామ్యత్రయ విశాఖఖేన్ద్ర సార్ప పిత్ర్యేశ భిన్నభే**
**భృగ్వీజ్యార్క దినే నౌకాఘటనం సత్తనౌ శుభమ్ 38**

భరణి, కృత్తిక, రోహిణి, విశాఖ, జ్యేష్ఠ, ఆశ్లేష,మఘ,ఆర్ద్ర నక్షత్రములను వదలి మిగిలిన నక్షత్రములలో శుక్ర గురు రవివారములలో శుభలగ్నములలో నౌకానిర్మాణము చేసిన శుభముకలుగును.

**వీరఅభిచార ముహూర్తము :-**

**మూలార్ద్రా భరణీ ప్రిత్ర్యమృగే సౌమ్యే ఘటే తనౌ**
**సుఖే శుక్రేఽష్టమే శుద్ధే సిద్ధిర్వీరాభి చారయోః 39**

మూల, ఆర్ద్ర, భరణి, మఘ, మృగశిర నక్షత్రములలో కుంభలగ్నములో బుధుడు, చతుర్థభావములో శుక్రుడున్నపుడు అష్టమశుద్ధి కలిగినపుడు వీర (బేతాళ యోగినీ) సిద్ధి అభిచార (తాంత్రిక ప్రయోగ)సిద్ధి జరుగును.

**రోగముక్త స్నానముహూర్తము :-**

**వృన్త్యాదితి ధ్రువమఘానిల సార్పదిష్ణ్యే**
**రిక్తే తిథౌ చరతనౌ వికవీన్దువారే**

స్నానం రుజా విరహితస్య జనస్య శస్తం
హీనే విధౌ ఖలఖగైర్భవ కేన్ద్రకోణే 40

రేవతి,పునర్వసు,ఉత్తరాత్రయం, రోహిణి, మఘ, స్వాతి, ఆశ్లేష నక్షత్రములను వదలి మిగిలిన 18 నక్షత్రములలో రిక్త(4,9,14) తిథులలో చరలగ్నములో,శుక్ర సోమ వారములను వదలి మిగిలిన వారములలో చంద్రుడు నిర్బలుడైనపుడు, పాపగ్రహములు, పదకొండవ, కేంద్ర (1,4,7,10) కోణ (5,9) భావములలో నున్నపుడు రోగముక్తుడైన వ్యక్తి స్నానము చేసిన శుభము కలుగును.

**శిల్పవిద్యా ముహూర్తము :-**

మృదు-ధ్రువ క్షిప్ర చరే జ్ఞే గురౌ వా ఖలగ్నగే
విధౌ జ్ఞజీవవర్గస్థే శిల్పవిద్యా ప్రశస్యతే 41

మృదు, ధ్రువ క్షిప్ర చరసంజ్ఞక (మృగశిర, రేవతి, చిత్త, అనూరాధ, ఉత్తరాత్రయం రోహిణి,హస్త,అశ్విని,పుష్యమి,అభిజిత్తు,స్వాతి,పునర్వసు,శ్రవణ,ధనిష్ఠ శతభిష)నక్షత్రము లలో బుధుడు మరియు గురువు దశమ,లగ్నములలో నున్నపుడు చంద్రుడు బుధ గురు షడ్వర్గులలో నున్నపుడు శిల్పవిద్యారంభము చేసిన శుభము కలుగును.

**మైత్రీముహూర్తము :-**

సురేజ్య మిత్ర భాగ్యేషు చాష్టాభ్యాం తైతిలే హరౌ
శుక్ర దుష్ట తనౌ సౌమ్యవారే సన్ధానమిష్యతే 42

పుష్యమి,అనూరాధ,పుబ్బ నక్షత్రములలో అష్టమి ద్వాదశితిథులలో తైతిల కరణములో శుక్రదృష్టి కలిగిన లగ్నములలో శుభగ్రహములున్న దినములో స్నేహము చేసిన శుభము కలుగును.

**అన్నిముహూర్తములలో తిథి వార నక్షత్రములకు ప్రాధాన్యముండును. కరణము నకు ఏముహూర్తములో ప్రాధాన్యత నీయలేదు.కాని ఇక్కడ తైతిల కరణమును తెలిపి దానికి ముహూర్తములో ప్రాధాన్యతనిచ్చెను.కృష్ణపక్షములో తైతిలకరణము విదియ నవమి తిథుల పూర్వార్ధములో, పంచమి ద్వాదశిల ఉత్తరార్ధములో నుండును.ఇదేవిధము శుక్ల పక్షములో తదియ దశమిల పూర్వార్ధములో, షష్ఠి, త్రయోదశుల ఉత్తరార్ధములోనగును. అష్టమిలో తైతిలతిథి ఉండును. కృష్ణపక్షములో ద్వాదశి ఉత్తరార్ధములో మాత్రమే తైతిల కరణముండును.దీనిననుసరించి స్నేహముచేయుటకు కృష్ణపక్షద్వాదశి తిథి సర్వోత్తమముగా భావించవలెను.**

**పరీక్షా ముహూర్తము :-**

త్యక్త్వాష్టభూతశని విష్టి కుజాఙ్గసుర్భ
మాసౌ మృతౌ రవివిధూ అపి భానినాద్యా:
ద్వ్యఙ్గే చరే తనులవే శశిజీవతారా

శుద్ధౌ కరాదితి హరీన్ద్రకపే పరీక్షా 43

అష్టమి,చతుర్దశులు,శని మంగళవారములు భద్రకరణము,జన్మనక్షత్రము, జన్మ మాసము,నాడీసంజ్ఞక నక్షత్రములనువదలి మిగిలిన తిథివారనక్షత్రములలో, సూర్య చంద్రులు అష్టమభావములోలేనపుడు,ద్విస్వభావ లగ్నములలో,చరలగ్న నవాంశము లో,చంద్ర గురుగ్రహములు తారలశుద్ధి యున్నపుడు హస్త, పునర్వసు, శ్రవణ, జ్యేష్ఠ, శతభిష నక్షత్రములలో పరీక్ష (రత్న,సువర్ణముల దొంగతనములను తెలిసి కొనుటకు తప్తశలాకాది పరీక్ష)ను చేయవలెను.

**ప్రాచీనకాలములో దివ్యపరీక్ష చేయు ఆచారముండెడిది. ఈ పరీక్ష ఘోరమైన పాతకములు జరిగినప్పుడు చేయుబడేది.ఇది మూడువిధములు,కాగుతున్న నూనె, మండితున్న అగ్ని,తప్తశలాక (కాలుతున్న ఇనుపకడ్డి)ల ద్వార అనుమానము కలిగిన వ్యక్తితో స్పర్శను కలిగించిన కాలిన దోషిగ, కాలకున్న నిర్దోషిగ భావించెడివారు.**

**జన్మనక్షత్రము, 'జన్మసంజ్ఞకము' జన్మనక్షత్రము నుండి పదవ నక్షత్రము 'కర్మ సంజ్ఞకము; పదహారవ నక్షత్రము'సంఘాతము' ఇరువది ఐదవ నక్షత్రము 'మానసము' పద్దెనిమిదవ నక్షత్రము'సముదాయము' - పదమూడవది 'వినాశము'-ఈ ఆరు నాడీ సంజ్ఞక నక్షత్రములు, సాధారణ జనులకు తెలుపబడినవి.వీటితోపాటుజాతి,దేశ,అభిషేక నక్షత్రములు మూడు కలిపి మొత్తము తొమ్మిదినాడీ సంజ్ఞకములు రాజులకొరకగును. ఈ నాడీ సంజ్ఞక నక్షత్రములను వదిలి పరీక్షచేయవలెను.**

**జాతిసంజ్ఞక నక్షత్రములను టీకాకారుడు తెలియజేసెను.**

| | | |
|---|---|---|
| **బ్రాహ్మణులకు** | - | **పుబ్బ పూర్వాషాఢ పూర్వాభాద్ర కృత్తిక** |
| **క్షత్రియులకు** | - | **ఉత్తరాత్రయము పుష్యమి** |
| **వైశ్యులకు** | - | **పునర్వసు హస్త అభిజిత్తు అశ్విని** |
| **శూద్రులకు** | - | **మృగశిర జ్యేష్ఠ చిత్త ధనిష్ఠ** |
| **వ్యవసాయదారులకు** | - | **రేవతి అనూరాధ మఘ శతభిషం** |
| **ఉగ్రజాతులకు** | - | **మూల ఆర్ద్ర స్వాతి శతభిషం** |
| **చండాలురకు** | - | **ఆశ్లేష విశాఖ శ్రవణ భరణి.** |

**దేశనక్షత్రము అభీష్టదేశ నామాక్షరముతో గ్రహించవలెను.**

**ఉదాహరణకు - మద్రదేశము - మొదటి అక్షరము మ - మఘనక్షత్రమగును. ఏనక్షత్రము లో రాజ్యాభిషేకము జరిగెనో ఆనక్షత్రము రాజ్యాభిషేక నక్షత్రమగును.**

**సామాన్య శుభకార్యములలో లగ్నశుద్ధి :-**

వ్యయాష్టశుద్ధోపచయే లగ్నగే శుభదృగ్యుతే
చన్ద్రే త్రిషడ్దశాయస్థే సర్వారమ్భః ప్రసిధ్యతి 44

తమజన్మరాశి,లేక జన్మలగ్నము నుండి ఉపచయభావ(3,6,10,11) గతరాశిలో

లగ్నమైన,లగ్నము నుండి ద్వాదశ అష్టమభావములు శుద్ధి కలిగిన (గ్రహములు లేకున్న) లగ్నముపై శుభగ్రహదృష్టి యున్న, చంద్రుడు 3,6,10,11 భావములలో నున్నపుడు అన్నివిధములైన కార్యములకు శుభము కలుగును.

**నక్షత్రవశమున జ్వర ఫలము :-**

**స్వాతీంద్ర పూర్వా శివ సార్ప భే మృతిర్జ్వరేఽ న్త్యమైత్రే స్థిరతా భవేద్రుజః**
**యామ్యశ్రవోవారుణతక్ష భే శివా ఘస్రా హి పక్షో ద్వ్యధిపార్కవాసవే 45**
**మూలాగ్ని దాస్రే నవ పిత్ర్యభే నఖా బు ధ్న్యార్యమే జ్యాదితిధాతృభే నగాః**
**మాసోఽ బ్జవైశ్వేఽ థ యమాహిమూలభే మిశ్రేశపిత్ర్యే ఫణిదంశనే మృతిః 46**

స్వాతి, జ్యేష్ఠ, పుబ్బ, పూర్వాషాఢ,పూర్వాభాద్ర,ఆర్ద్ర ఆశ్లేష నక్షత్రములలో జ్వరము వచ్చిన మృత్యువు కలుగును. రేవతి, అనూరాధ నక్షత్రములలో జ్వరము వచ్చిన తొందరగా పోదు. భరణి,శ్రవణ,చిత్త,శతభిష నక్షత్రములలో జ్వరమువచ్చిన పదకొండు రోజులుండును. విశాఖ, హస్త, ధనిష్ఠ నక్షత్రములలో పదిహేనురోజులుండును. మూల కృత్తిక అశ్విని నక్షత్రములలో తొమ్మిదిరోజులుండును. మఘ నక్షత్రములో జ్వరము వచ్చిన ఇరువది దినముల వరకుండును. ఉత్తరాభాద్ర, ఉత్తర, పుష్యమి, పునర్వసు రోహిణి నక్షత్రములలో ఏడుదినములు రోగముండును. మృగశిర,ఉత్తరాషాఢ నక్షత్రములలో జ్వరము వచ్చిన ఒకమాసము వరకుండును. భరణి, ఆశ్లేష, మూల, విశాఖ, కృత్తిక, ఆర్ద్ర, మఘ నక్షత్రములలో సర్పము కరచిన మృత్యువు కలుగును.

**సర్పదంశ సమయమున, గోచారవశమున చంద్రుడు బలముగా లేకున్న మృత్యువు వెంటనే కలుగును. చంద్రబలమధికమూగానున్న వ్యక్తికి మృత్యువు కలుగదు.**

**శీఘ్ర మరణయోగము :-**

**రౌద్రాహి శాక్రామ్బుపయామ్యపూర్వాద్విదైవ వస్వగ్నిషుపాపవారే**
**రిక్తాహరిస్కంధదినే చ రోగే శీఘ్రం భవేద్రోగిజనస్య మృత్యుః 47**

ఆర్ద్ర, ఆశ్లేష, జ్యేష్ఠ, శతభిష, భరణి, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, విశాఖ, ధనిష్ఠ, కృత్తిక నక్షత్రములలో పాపగ్రహదినములలో (రవి మంగళ శని) 4,9,14,12,6 తిథులలో రోగము ప్రారంభమైన వానికి వెంటనే మృత్యువు కలుగును.

**ప్రేత-క్రియాది కార్యములు :-**

**క్షిప్రాహి మూలేన్దు హరీశవాయుభే ప్రేతక్రియా స్యాజ్ఝషకుమ్భగే విధౌ**
**ప్రేతస్య దాహం యమదిగ్గమం త్యజేచ్ఛయ్యావితానం గృహగోపనాది చ 48**

క్షిప్రసంజ్ఞక (హస్త, అశ్విని, పుష్యమి, అభిజిత్తు)నక్షత్రములు, ఆశ్లేష, మూల మృగశిర, శ్రవణ, ఆర్ద్ర, స్వాతి నక్షత్రములలో ప్రేతక్రియ దహనసంస్కారము, పిండదానము చేయవలెను. మీన కుంభరాశులలో చంద్రుడున్న ప్రేతదాహము, దక్షిణదిశకు యాత్ర,

మంచము నేయుట, గృహమును కప్పుట మున్నగు కార్యములు చేయరాదు.

**కంఠగోమయపిండ ముహూర్తము :-**

**సూర్యర్క్షాద్ర సభైరధ: స్థలగతై: పాకో రసై: సంయుత:**
**శీర్షే యుగ్మమితై: శవసదయదహనం మధ్యే యుగై: సర్పభీ:**
**ప్రాణాశాదిషు వేదభై: స్వసుహృదాం స్యాత్సజ్గమో రోగభీ:**
**క్వాథాదే: కరణం సుఖం చ గదితం కాష్ఠాదిసంస్థాపనే** **49**

సూర్యుడున్న నక్షత్రమునుండి ఆరునక్షత్రములు కాష్ఠస్థాపన చక్రము క్రింది భాగములో నుండును. ఈ నక్షత్రములలో నిలువచేయు ఇంధనముతో రసయుక్త భోజనము తయరగును. రెండు నక్షత్రములు శిరస్సుపై నుండును. వీటిలో సంగ్రహించిన కాష్ఠాదులు అశుభమునిచ్చును. ఇవి శవదహనములోనుపయోగపడును. తర్వాత నాలుగు నక్షత్రములు మధ్యభాగములో నుండును. వీటిలో సంగ్రహించిన కాష్ఠముల వలన సర్పభయము కలుగును. పూర్వాదిదిశలలో నాలుగేసి నక్షత్రములుండును. వీటిలో నిలువ చేసిన ఇంధనము వలన క్రమముగా మిత్రసమాగమము (అతిథి సత్కారము) రోగభయము, కషాయ నిర్మాణము, సుఖలాభము కలుగును. అనగా పూర్వదిశలో నున్న నాలుగు నక్షత్రము లలో నిలువ ఉంచు ఇంధనము వలన అతిథిసత్కారము, దక్షిణదిశ నక్షత్రముల వలన రోగభయము, పశ్చిమదిశ నక్షత్రముల వలన ఔషధనిర్మాణము, ఉత్తరదిశలోనున్న నక్షత్రముల వలన సుఖప్రాప్తి కలుగును.

**కాష్ఠస్థాపన చక్రము**

| | | |
|---|---|---|
| | శీర్షము(అశుభము) 2 నక్షత్రములు శవదహనము | |
| ఉత్తరము(శుభము) 4వ నక్షత్రములు ముఖము | | |
| పశ్చిమము (శుభము) 4 నక్షత్రములు సుఖము | మధ్యము(అశుభము) 4 నక్షత్రములు సర్పభయము | పూర్వము (శుభము) 4 నక్షత్రములు |
| దక్షిణము అశుభము 4 నక్షత్రములు రోగభయము | | |
| | అధోభాగము (శుభము) 6 నక్షత్రములు స్వాధు భోజనము | |

**త్రిపుష్కర – ద్విపుష్కర యోగ లక్షణము :–**

**భద్రా తిథి రవి జభూతనయార్కవారే ద్వీశార్యమాజచరణాదితి వహ్నివైశ్వే**
**త్రైపుష్కరో భవతి మృత్యువినాశవృద్ధౌ త్రైగుణ్యదో ద్విగుణకృద్వసుతక్ష చాన్ద్రే 50**

శని మంగళ, రవివారములలో భద్రాతిథుల (2,7,12)తో పాటు విశాఖ, ఉత్తర, పూర్వాభాద్ర, పునర్వసు, కృత్తిక, ఉత్తరాషాఢ నక్షత్రములున్న మృత్యువు, హాని మరియు వృద్ధిలో త్రిగుణితఫలమునిచ్చు త్రిపుష్కర యోగమగును. ఇదేవిధముగా ఉక్త తిథి వారములలో ధనిష్ఠ, చిత్త, మృగశిర,నక్షత్రములలో మృత్యువు,హాని, వృద్ధిలో ద్విగుణిత ఫలమునిచ్చు ద్విపుష్కర నామక యోగమగును.

**శవప్రకృతి దహన నిషిద్ధకాలము :–**

**శుక్రారార్కిషు దర్శభూతమదనే నన్దాసు తీక్ష్ణోగ్రభే**
**పౌష్ణే వారుణభే త్రిపుష్కరదినే న్యూనాధిమాసేఽ యనే**
**యామ్యేఽ బ్దాత్పరతశ్చ పాతపరిఘే దేవేజ్య శుక్రాస్తకే**
**భద్రావైధృతయో: శవప్రతికృతేర్దాహో న పక్షే సితే 51**

శుక్ర,శని,మంగళవారములలో అమావాస్య,చతుర్దశి,త్రయోదశి, నంద సంజ్ఞక (,6,11) తిథులలో,తీక్ష్ణసంజ్ఞక (మూల,జ్యేష్ఠ,ఆర్ద్ర,ఆశ్లేష) ఉగ్రసంజ్ఞక (పుబ్బ పూర్వాషాఢ పూర్వాభాద్ర,భరణి,మఘ)రేవతి,శతభిష నక్షత్రములలో త్రిపుష్కరయోగములో, క్షయాది మాసములలో,ఒకవర్షముతర్వాత దక్షిణాయనములో పాత,పరిఘ,వైధృతి భద్రయోగములో గురు,శుక్రుల అస్తమయమగునపుడు, శుక్లపక్షములో శవపుబొమ్మను దహనము చేయరాదు.

**కొన్ని సమయములలో వ్యక్తి మృత్యుసమాచారము తెలియును. కాని శవము దొరకదు. అటువంటి పరిస్థితి ఏదైన దుర్ఘటన, యుద్ధము, అజ్ఞాతప్రవాస సమయములలో జరుగును. ఆసమయములో శవపుబొమ్మను దహనము చేయువిధానమున్నది. శవప్రతి కృతి దహనము కాలభేదముతో మూడువిధములుగా జరుగును.1.అశౌచము లోపల, 2. శనిపోయిన తర్వాత ఒకసంవత్సరము లోపల 3.ఒకసంవత్సరము తర్వాత. అశౌచములో శవపుబొమ్మను దహనము చేయవలెనన్న దినశుద్ధిని చూడవలెను.అశౌచానంతరము ఒకసంవత్సరము లోపల,లేక తర్వాత దహనము చేయవలెనన్న ముహూర్తవిచారము చేయవలెను.**

**శవప్రతికృతి దహనకర్త శుభాశుభ సమయము :–**

**జన్మప్రత్యరితారయో ర్మృతి సుఖాన్త్యేఽ బ్జే చ కర్తుర్న సన్**
**మధ్యో మైత్రభగాదితి ధ్రువవిశాఖాద్యుజ్గ్రి భే జ్ఞేఽ పి చ**
**శ్రేష్ఠోఽ ర్కేజ్య విధోర్దినే శ్రుతికరస్వాత్యశ్విపుష్యే తథా**
**త్వాశౌచాత్పరతో విచార్యమఖిలం మధ్యే యథాసమ్భవమ్ 52**

బొమ్మను దహనము చేయు సమయములో దహనము చేయువ్యక్తికి జన్మ ప్రత్యక్ తారలైన,చంద్రుడు అష్టమ,చతుర్థ,ద్వాదశభావములలోనున్న దహనకర్తకు అశుభ మగును. అనూరాధ,పుబ్బ,పునర్వసు, ఉత్తరాత్రయము, రోహిణి, విశాఖ, మృగశిర, చిత్త, ధనిష్ఠ నక్షత్రములలో బుధవారము బొమ్మను దహనముచేసిన మధ్యమమగును. రవి, గురు,సోమవారములు శ్రవణ,హస్త,స్వాతి,అశ్విని,పుష్యమినక్షత్రములలో బొమ్మను దహనము చేసిన శ్రేష్ఠమగును.

**శుభాశుభ సమయముల సంపూర్ణ విచారణ అశౌచకాలము తర్వాత చేయవలెను. అశౌచకాలము మధ్యలో బొమ్మను దహనము చేయవలెనన్న యథాసంభవము శుభా శుభ విచారణము చేయవలెను.**

**అభుక్త మూల ప్రమాణము :-**

**అభుక్తమూలం ఘటికాచతుష్టయం జ్యేష్ఠాన్త్యమూలాదిభవం హి నారద:**
**వసిష్ఠ ఏకద్విఘటీమితం జగౌ బృహస్పతిస్త్వేక ఘటీప్రమాకమ్ 53**

జ్యేష్ఠ నక్షత్రములో చివరి రెండు ఘడియలు, మూలకు మొదటి రెండు ఘడియలు మొత్తము నాలుగు ఘడియలు అభుక్త మూల ప్రమాణముగా నారదుడు తెలిపెను. వశిష్ఠుడు జ్యేష్ఠ అంతిమ ఘడియ మూల ఆరంభములో రెండు ఘడియలు మొత్తము మూడు ఘడియలు, బృహస్పతి జ్యేష్ఠ అంతిమ అర్ధఘడియ, మూల ప్రథమ అర్ధఘడియ మొత్తము ఒకఘడియ కాలము అభుక్తమూలమని తెలిపెను.

**అథోచరన్యే ప్రథమాష్ట ఘట్యో మూలస్య శాక్రాన్తిమపఞ్చ నాద్య:**
**జాతం శిశుం తత్ర పరిత్యజేద్వా ముఖం పితాస్యాష్టసమా న పశ్యేత్ 54**

కొంతమంది ఆచార్యుల మతానుసారము మూల నక్షత్రపు మొదటి ఎనిమిది ఘడియలు,జ్యేష్ఠచివరి ఐదుఘడియలు, మొత్తము పదమూడు ఘడియలు అభుక్త మూల మగును. అభుక్తమూలములో నుత్పన్నమగు శిశువును వదలి పెట్టవలెను. లేనియెడల ఆశిశువు ముఖము ఎనిమిది సంవత్సరముల వరకు తండ్రిచూడరాదు.

**మూలజాతకుల పాదఫలము :-**

**ఆద్యే పితా నాశముపైతి మూలపాదే ద్వితీయే జననీ తృతీయే**
**ధనం చతుర్థోఽస్య శుభేఽథ శాన్త్యా సర్వత్ర సత్యాదహిభే విలోమమ్ 55**

మూల ప్రథమపాదములో శిశువు జన్మించిన తండ్రికి నాశము, ద్వితీయ పాదమైన తల్లికి నాశము, తృతీయమైన ధననాశము, నాల్గవపాదము శుభము కలిగించును. మూల నక్షత్రశాంతి చేసిన అన్నిపాదములలోని దోషము పోయి శుభము కలుగును. ఆశ్లేష నక్షత్రఫలము మూలనక్షత్రమునకు విపరీతముగా నుండును. ఆశ్లేష చతుర్థపాదములో జన్మించిన తండ్రికి నాశము,మూడవపాదములో జన్మించిన తల్లికి నాశము, రెండవ పాదములో జన్మించిన ధననాశము, మొదటిపాదములో జన్మించిన శుభము కలుగును.

**వశిష్ఠమతము** ననుసరించి

**మూల నక్షత్ర ప్రథమపాదములో రాత్రి శిశువు జన్మించిన తండ్రికి నాశము కలుగదు.ద్వితీయచరణము పగలైన తల్లికి దోషము కలుగదు.**

**నారదమతానుసారము –**

**గండమూల నక్షత్రములలో (జ్యేష్ఠ మూల, ఆర్ద్ర, మఘ, అశ్విని, రేవతి) జన్మించిన శిశువుకు మూలశాంతి తప్పక చేయవలెను.**

**మూలనివాస ఫలము :–**

**స్వర్గే శుచిప్రౌష్ఠ పదేషమాఘే భూమౌ నభ: కార్తికచైత్ర పౌషే**
**మూలం హ్యధస్తాత్తు తపస్యమార్గవైశాఖ శుక్రేశుభం చ తత్ర 56**

ఆషాఢ,భాద్రపద,ఆశ్వయుజ,మాఘ మాసములలో 'మూల' నివాసము స్వర్గములో, శ్రావణ,కార్తిక,చైత్ర,పుష్యమాసములలో భూమిపై,ఫాల్గుణ,మార్గశీర్ష, వైశాఖ,జ్యేష్ఠ మాసములలో పాతాళములో నగును. మూల ఉన్నచోట అశుభఫలమగును.

**మూలనక్షత్రమును గూర్చి అనేక విధములుగా వివరణ కనపడుతున్నది. ప్రతి మాక్షరములో మూల వృక్షవిచారము స్పష్టముగా చేయబడినది. నక్షత్రమును 60 ఘడియలుగా తలంచి వృక్ష నిర్మాణము చేయవలెను. మూల నక్షత్రము మొదట 7 ఘడియలు వృక్షమూలము, తర్వాత 8 ఘడియలు స్తంభము, తర్వాత 10 ఘడియలు చర్మము, తర్వాత 11 ఘడియలు శాఖలు, తర్వాతి 12 ఘడియలు పత్రములు, తర్వాతి 5 ఘడియలు పుష్పములు, తర్వాతి 4 ఘడియలు ఫలములు, చివరి మూడు ఘడియలు శిఖలగును. వృక్షపు శాఖలో జన్మమగు స్థితి ననుసరించి దానిఫలితమును తెలిసికొనవలెను.**

**మూలములో జన్మమైన పూర్వపురుషులకు నాశము, స్తంభములో నైన వంశవిచ్ఛేదము, తర్వాత చర్మములోనైన తల్లికి కష్టము, శాఖలోనైన మామకు కష్టము, పత్రములలోనైన రాజ్యలాభము, పుష్పములోనైన మంత్రిపదలాభము, ఫలములోనైన అపారధనలాభము, శిఖలోనైన అల్పాయువు కలుగును.**

**మూలవృక్ష చక్రము**

| **వృక్షాంగములు** | **మూలము** | **స్తంభము** | **త్వచ** | **శాఖ** | **పత్రము** | **పుష్పము** | **ఫలము** | **శిఖ** |
|---|---|---|---|---|---|---|---|---|
| నక్షత్రఘడియలు | 7 | 8 | 10 | 11 | 12 | 5 | 4 | 3 |
| యోగము | 7 | 15 | 25 | 36 | 48 | 53 | 57 | 60 |
| ఫలము | మూల నాశము | వంశ నాశము | మాతృ క్లేశము | మాతుల కష్టము | రాజ్య లాభము | మంత్రి పదలాభము | లక్ష్మీ లాభము | అల్పా యువు |

**మూల వృక్షము వలె 'మూలపురుష' వర్ణన కూడ కనపడును.**

మూల పురుష చక్రము

| మూలపురష అంగములు | శిరము | ముఖ | స్కంధ | బాహువు | అర | హృద | నాభి | గుహ్యము | మోకాలు | కాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| నక్షత్రఘడియలు | 5 | 7 | 4 | 8 | 3 | 9 | 2 | 10 | 6 | 6 |
| యోగము | 5 | 12 | 16 | 24 | 27 | 36 | 38 | 48 | 54 | 60 |
| ఫలము | రాజ్య లాభము | పిత్రు మరణము | బల వృద్ధి | బలము | హస్తా న్వితము | రాజు మంత్రి | బ్రహ్మ జ్ఞాని | అతి కామి | అతిబుద్ధి మంతుడు | మృత్యువు |

**పైచక్రములు 60 ఘడియల నక్షత్ర ప్రమాణముతో చేయబడినవి. కాని నక్షత్రమానము 60 ఘడియలకు ఎక్కువ తక్కువగానుండును.అందువలన జన్మనక్షత్ర ప్రమాణమును అనుపాతము ద్వారా విభజించవలెను.**

**జన్మనిషిద్ధకాలము :-**

గణ్డాన్తే త్వభశూల పాతపరిఘవ్యాఘాత గణ్డావమే
సంక్రాన్తి వ్యతిపాతవైధృతి సినీవాలీ కుహూదర్శకే
వజ్రే కృష్ణ చతుర్దశీషు యమఘణ్టే దగ్ధయోగే మృతౌ
విష్టౌ సోదరభే జనిర్న పితృభే శస్తా శుభా శాన్తిత: **57**

తిథి,నక్షత్ర లగ్న గండాంతములలో, జ్యేష్ఠ నక్షత్రములో శూల-పాత-పరిఘ-వ్యాఘాత-గండ యోగములలో, తిథి క్షయములో సంక్రాంతి కాలము (సూర్యుడు రాశిలో ప్రవేశించు కాలము) వ్యతీపాతయోగము, వైధృతియోగములలో సినీవాలీ కుహు ధర్మ సంజ్ఞక మూడు అమావాస్యలలో,వజ్రయోగములో, కృష్ణపక్ష చతుర్దశిలో, యమఘంట, దగ్ధ మృత్యుయోగములలో, భద్రలో తనసోదరుడు, సోదరిజన్మ నక్షత్రములలో, మాతాపితల జన్మనక్షత్రములలో జన్మము శుభమునీయదు. శాంతి చేసిన శుభము కలుగును.

**అమావాస్యకు మూడు భేదములుండును. 1.సినీవాలీ 2.కుహు 3. దర్శ**

**అమావాస్యలో చంద్రకళ శేషము మిగిలిన 'సినీవాలీ' యగును. అమావాస్యలోచంద్ర కళ నష్టమైన 'కుహు' యగును.సూర్యచంద్రులిద్దరు ఒకరినొకరు చూస్తు అమావాస్యలో నున్న దర్శ యగును.**

**కుయోగములో దోషశాంతిని మూడు విధములుగా తెలిపెను.**

**1. ఔషధ స్నానము 2. దానము 3.జపము (సంబంధిత మంత్ర జపము)**

**నక్షత్ర తారలు :-**

**త్రిత్ర్యఙ్గ పఞ్చాగ్ని కువేదవహ్నయ: శరేషు నేత్రాశ్వి శరేన్దు భూకృతా:**
**వేదాగ్ని రుద్రాశ్వియమాగ్ని వహ్నయోఽబ్ధయ: శతం ద్విద్విరదా భతారకా: 58**

అశ్వినికి 3, భరణికి 3, కృత్తికకు 6, రోహిణికి 5, మృగశిరకు 6, ఆర్ద్రకు 1,

పునర్వసుకు 4, పుష్యమికి 3, ఆశ్లేషకు 5, మఘకు 5, పుబ్బకు 2, ఉత్తరకు 2, హస్తకు 5, చిత్తకు 1, స్వాతికి 1, విశాఖకు 4, అనూరాధకు 4, జ్యేష్ఠకు 3, మూలకు 11, పూర్వాషాఢకు 2, ఉత్తరాషాఢకు 2, అభిజిత్తుకు 3, శ్రవణమునకు 3, ధనిష్ఠకు,4. శతభిషమునకు 100, పూర్వాభాద్రకు 2, ఉత్తరాభాద్రకు 2, రేవతికి 32 తారలున్నవి.

**నక్షత్ర స్వరూపము :-**

**అశ్వాది రూపం తురగాస్య యోనిక్షురోఽన ఏణాస్యమణిర్గృహం చ**
**పృషత్కచక్రే భవనం చ మఞ్చః శయ్యా కరో మౌక్తిక విద్రుమం చ 59**
**తోరణం బలినిభం చ కుణ్డలం సింహ పుచ్ఛగజదన్తమఞ్చకాః**
**త్ర్యస్రి చ త్రిచరణాభమర్దలౌ వృత్తమఞ్చయమ లాభమర్దలాః 60**

అశ్వన్యాది నక్షత్రముల ఆకారము ఈ విధముగా నుండును.

అశ్విని-అశ్వముఖము, భరణి-యోని, కృత్తిక-కత్తి, రోహిణి-బండి, మృగశిర-మృగశిరము,ఆర్ద్ర-మణి, పునర్వసు-గృహము,పుష్యమి-బాణము, ఆశ్లేష-చక్రము, మఘ-గృహము, పుబ్బ-మంచము, ఉత్తర-మంచము, హస్త-అరచేయి, చిత్త-ముత్యము, స్వాతి-పగడము, విశాఖ-తోరణము, అనూరాధ-బియ్యము, జ్యేష్ఠ-కుండలము, మూల-సింహపుతోక, పూర్వాషాఢ-ఏనుగుదంతము, ఉత్తరాషాఢ-మంచము, అభిజిత్తు-త్రికోణము, శ్రవణము-త్రిచరణము, ధనిష్ఠ-మృదంగము, శతభిషము-వృత్తము, పూర్వాభాద్ర-మంచము, ఉత్తరాభాద్ర-యుగము(రెండు సమాన తారలు) రేవతి- మృదంగ ఆకృతిలో నుండును.

**నక్షత్రములు తారలు భౌతిక రూపముతో చూచిన ఒకేవిధముగా నుండును. కాని వీటిలో అంతరమున్నది. తార ఒక జ్యోతిర్మయ పిండము, నక్షత్రము ఒకటికన్న ఎక్కువ జ్యోతిర్మయ పిండముల సమూహము. ఆకాశములో కాంతి మండలము ను 27 తుల్యభాగములలో విభజించి ప్రత్యేక ఖండములో వచ్చిన తారల సమూహము ఒక నక్షత్రముగా పిలువబడెను. ప్రతి నక్షత్ర సమూహములో ఒకతారను కేంద్రముగా భావించి వేధాది కార్యము చేయబడును. దానినే యోగతారయని యందురు.**

**జలాశయారామ సురప్రతిష్ఠా ముహూర్తము :-**

**జలాశయారామ సురప్రతిష్ఠా సౌమ్యాయనే జీవశశాఙ్కశుక్రే**
**దృశ్యే మృదుక్షిప్ర చరధ్రువే స్యాత్పక్షే సితే స్వర్క్షతిథిక్షణే వా 61**
**రిక్తారవర్జ్యే దివసేఽతిశస్తా శశాఙ్క పాపైస్త్రిభవాఙ్గ సంస్థైః**
**వ్యన్త్యాష్టగైః సత్ఖచరైర్మృగేన్ద్రే సూర్యోఘటే కో యువతౌ చ విష్ణోః 62**
**శివో నృయుగ్మే ద్వితనౌ చ దేవ్యః క్షుద్రాశ్చరే సర్వఇమే స్థితర్క్షే**
**పుణ్యే గ్రహా విఘ్నపయక్ష సర్పం భూతాదయోఽన్త్యే శ్రవణే జినశ్చ 63**

జలాశయ,(వాపి,కూప,తటాకము) నిర్మాణము,ఉద్యానవనము,ఉపవనము, మున్నగువాని నిర్మాణము,దేవాలయములలో ప్రతిమల ప్రాణప్రతిష్ఠ, సూర్యుడు ఉత్తరాయణములోనున్నపుడు,గురు,చంద్ర,శుక్రులు ఉదయమైనపుడు,మృదు, క్షిప్ర, చర,ధృవసంజ్ఞక నక్షత్రములలో(మృగశిర,రేవతి,చిత్త,అనూరాధ,హస్త,అశ్విని, పుష్యమి,అభిజిత్తు,స్వాతి, పునర్వసు, శ్రవణ, ధనిష్ఠ,శతభిష, ఉత్తరాత్రయం,రోహిణి) శుక్ల పక్షములో, తమ నక్షత్ర తిథి ముహూర్తములలో (ఏనక్షత్రము లేక తిథికి ఏస్వామి యగునో ఆస్వాములస్థాపన ఆతిథి,నక్షత్రములలో) రిక్త(4,9,14) తిథులలో మంగళవారము వదలి మిగిలిన వారములలో,చంద్రుడు పాపగ్రహములు మూడవ ఆరవ,పదకొండవ భావములలో నున్నపుడు, ద్వాదశ అష్టమభావములను వదిలి మిగిలిన భావములలో శుభగ్రహము లున్నపుడు చేసిన శుభము కలుగును.

**సింహాలగ్నములో సూర్యుని, కుంభములో బ్రహ్మను,కన్యలో విష్ణువును మిథునములో శివుని, ద్విస్వభావ (3,6,9,12) లగ్నములలో దుర్గ,లక్ష్మీ ప్రభృతి దేవతలను, క్షుద్ర దేవతలను (64 యోగినులు, 16 మాతృకలు) చర (1,4,7,10) లగ్నములలో, మిగిలిన అందరు దేవతలను స్థిర (2,5,8,11) లగ్నములలో ప్రతిష్ఠ చేయవలెను.**

**గ్రహములస్థాపన పుష్యమి నక్షత్రములో, గణేశ, యక్ష, సర్ప, భూతాదుల స్థాపన శ్రవణ నక్షత్రములో చేయవలెను.**

రెండవ నక్షత్రప్రకరణాధ్యాయము సమాప్తము

## 3. సంక్రాంతి ప్రకరణము

**సంక్రాంతి నామములు :-**

**ఘోరాఽర్క సఙ్క్రమణ ముగ్ర రవౌ హి శూద్రాన్**
**ధ్వాంక్షీ విశో లఘువిధౌ చ చరర్క్ష భౌమే**
**చౌరాన్మహోదరయుతా నృపతీన్ జ్ఞమైత్రే**
**మందాకినీ స్థిరగురౌ సుఖ యేచ్చమందా** **1**
**విప్రాంశ్చ మిశ్రభభృగౌతు పశూంశ్చ మిశ్రా**
**తీక్ష్ణార్కజేఽన్త్యజసుఖా ఖలు రాక్షసీ చ** **1 1/2**

సూర్యసంక్రమణము (రాశిమారుట) ఉగ్రసంజ్ఞక (పుబ్బ,పూర్వాషాఢ, పూర్వాభాద్ర, భరణి, మఘ) నక్షత్రములలో రవివారములోనైన దానిపేరు '**ఘోర**'యగును. ఇది శూద్రులకు శుభమునిచ్చును. లఘుసంజ్ఞక (హస్త,అశ్విని, పుష్యమి, అభిజిత్) నక్షత్రములలో సోమవారము సంక్రాంతియైన **ధ్వాంక్ష** సంజ్ఞకమగును. వైశ్యులకు శుభము నిచ్చును. చరసంజ్ఞక (స్వాతి,పునర్వసు,శ్రవణ,ధనిష్ఠ,శతభిష)నక్షత్రములలో మంగళవారములో మహోదర నామక సంక్రాంతి దొంగలకు శుభమును కలిగించును. బుధవారము మైత్ర

సంజ్ఞక (మృగశిర, రేవతి, చిత్త అనూరాధ) నక్షత్రములలో **మందాకిని** నామక సంక్రాంతి. క్షత్రియులకు(రాజులకు) శుభమునిచ్చును. గురువారము స్థిరసంజ్ఞక (ఉత్తరాత్రయం, రోహిణి) నక్షత్రములలో **మందా**నామక సంక్రాంతి బ్రాహ్మణులకు శుభమునిచ్చును. మిశ్ర సంజ్ఞక (విశాఖ, కృత్తిక) నక్షత్రములలో శుక్రవారము **మిశ్రా** సంజ్ఞక సంక్రాంతిలో పశువులకు శుభము కలుగును. తీక్ష్ణసంజ్ఞక (మూల, జ్యేష్ఠ, ఆర్ద్ర, ఆశ్లేష) నక్షత్రములలో శనివారము **రాక్షసీ** నామక సంక్రాంతి అంత్యజులకు సుఖదాయకమగును.

**ఒక మాసమునకు ఒకరాశి చొప్పున 12రాశులలో సూర్యుడు ఒకవర్షములో భ్రమణము చేయును. సూర్యుడు ఒకరాశి నుండి రెండవ రాశిలోనికి ప్రవేశించు కాలమును 'సంక్రాంతి'యందురు. ఒకసంవత్సరములో 12 సంక్రాంతులగును. అవి 12 రాశుల నామము లతో తెలుపబడును. మేషాది పన్నెండు సంక్రాంతుల వార నక్షత్రముల భేదముతో శు భాశుభములను తెలిసి కొనుటకు ఏడుభాగములలో విభజించెను. 1,ఘోర 2. ధ్వాంక్ష 3. మహోదరి 4. మందాకిని 5. మంద 6. మిశ్ర 7. రాక్షస సంజ్ఞకముగా తెలుపబడినవి.**

**కాలవశ సంక్రాంతి ఫలము :-**

**త్ర్యశే దినస్య నృపతీన్ ప్రథమే నిహన్తి**
**మధ్యే ద్విజానపి విశో౽పరకే చ శూద్రాన్** **2**
**అస్తే నిశాప్రహరకేషు పిశాచకాదీ**
**న్నక్తఞ్చరానపి నటాన్పశుపాలకాంశ్చ**
**సూర్యోదయే సకలలిఙ్గిజనం చ సౌమ్య**
**యామ్యాయనం మకరకర్కటయోర్న్ని రుక్తమ్** **3**

దినమును (పగలు)మూడు భాగములుగా విభజించి ప్రత్యేకభాగములో సంక్రమణ ఫలము తెలుపబడును. దినములో ప్రథమ తృతీయాంశములలో సంక్రమణమైన క్షత్రియులకు నాశము,ద్వితీయ తృతీయాంశములో సంక్రమణమైన బ్రాహ్మణులకు నాశము, తృతీయభాగమైన వైశ్యులకు నాశము, సూర్యాస్తమయములో సంక్రాంతి కలిగిన శూద్రులకు నాశము. ఇదే విధముగా రాత్రిని నాలుగుభాగములుగా విభజించిన ప్రత్యేకభాగము ప్రహర అగును. రాత్రిప్రథమ ప్రహరలో సూర్యసంక్రాంతి కలిగిన భూతప్రేత యోనులకు నాశము, ద్వితీయ ప్రహరలోనైన రాక్షసులకు, తృతీయప్రహరలో నటులకు, చతుర్థప్రహరలో పశుపాలకులకు నాశము కలుగును. సూర్యోదయ కాలములో సంక్రమణమైన కృత్రిమ రూపధారణ చేయవారికి నాశము కలుగును. మకరరాశిలో సూర్యుడు ప్రవేశించిన ఉత్తరాయణము, కర్కాటకరాశిలో ప్రవేశించిన దక్షిణాయనమగును.

**రాశివశ సంక్రాంతి ఫలము :-**

**షడశీత్యాననం చాపనృయుక్కన్యాఝషే భవేత్**
**తులాజౌ విషువం విష్ణుపదం సింహాలిగేగోఘటే**

ధనుస్సు,మిథునము,కన్య,మీనరాశులలో సంక్రాంతి జరిగిన 'షడశీతిసుఖ' సంక్రాంతి యందురు.తుల మేషములలోనైన 'విషువము', సింహ,వృశ్చిక,వృషభ, కుంభము లలోనైన 'విష్ణుపద' సంజ్ఞకమగును.

**సంక్రాంతి పుణ్యకాలము :-**

**సంక్రాంతి కాలాదుభయత్ర నాడికా: పుణ్యామతా: షోడశ షోడశోష్ణగో:**
**నిశీథతోఽర్వాగపరత్ర సంక్రమే పూర్వాపరాహాన్తిమపూర్వభాగయో: 5**

సూర్యసంక్రాంతి కాలములో పూర్వము, పరము 16-16 ఘడియలు పుణ్యకాలమగును. సూర్యసంక్రాంతి మధ్యరాత్రికి పూర్వమైన రాత్రికి ముందురోజు ఉత్తరార్ధము (మధ్యాహ్నము) 16ఘడియలు, మధ్యరాత్రి తర్వాత సంక్రమణమైన రాత్రి తర్వాత రోజు పూర్వార్ధము (ఉదయము) 16ఘడియలు సంక్రాంతి పుణ్యకాలమగును.

**పూర్ణే నిశీథే యది సంక్రమ: స్యాద్దినద్వయం పుణ్యమథోదయాస్తాత్**
**పూర్వం పరస్తాద్యది యామ్యసౌమ్యాయనే దినే పూర్వపరే తు పుణ్యే 6**

మధ్యరాత్రిలో సంక్రాంతియైన రాత్రికి పూర్వదినము, తర్వాతి దినము రెండురోజులు పుణ్యకాలమగును. సూర్యోదయము కన్నముందు దక్షిణాయణ (కర్కాటక సంక్రాంతి)మారంభ మైన పూర్వదినములో పుణ్యకాలమగును. సూర్యాస్తమయమైన తర్వాత మకరసంక్రాంతి (ఉత్తరాయణమారంభము)యైన తర్వాతిరోజు పుణ్యకాలమగును.

**అయన సంక్రమణ విశేషము :-**

**సన్ధ్యా త్రినాడీ ప్రమితార్క బిమ్బాదర్ధోదితాస్తాదధ ఊర్ధ్వమత్ర**
**చేద్యామ్య సౌమ్యే అయనే క్రమాత్ స్త: పుణ్యౌ తదానీం పరపూర్వఘస్రౌ 7**

సూర్యబింబము సగము ఉదయమైన 3 ఘడియల పర్యంతము ప్రాత:కాలీన సంధ్య, సూర్యబింబము సగభాగము అస్తమయమైన 3ఘడియల పర్యంతము సాయంసమయ సంధ్య యగును. ప్రాత:కాలీన సంధ్యలో కర్కాటక సంక్రాంతియైన సూర్యోదయము తర్వాత దినము పుణ్యకాలమగును.సాయంసంధ్యలో మకర సంక్రాంతియైన సంధ్యనుండి పూర్వదినములో పుణ్యకామగును.

**పుణ్యకాల విశేషము :-**

**యామ్యాయనే విష్ణుపదే చాద్యా మధ్యాస్తులా జయో:**
**షడశీత్యాననే సౌమ్యే పరా నాడ్యోఽతి పుణ్యదా 8**

కర్కాటక సంక్రాంతి, విష్ణుపద (వృష, సింహ, వృశ్చిక, కుంభ, స్థిరరాశులు) సంక్రాంతులలో పుణ్యకాల పూర్వార్ధము,(16 ఘడియలు) మేష తుల సంక్రాంతులలో మధ్యభాగపు 16 ఘడియలు, షడశీత్యానన (ద్విస్వభావ మిథున, కన్య, ధన, మీనరాశు లు) సంక్రాంతిలో ఉత్తరార్ధపు 16 ఘడియలు అత్యధిక పుణ్యప్రదములగును.

**చల సంక్రాంతి సాధనము :-**

**తథా యనాంశా: ఖరసాహతాశ్చ స్పష్టార్కగత్యా విహృతా దినాద్యై:**
**మేషాదిత: ప్రాక్ చలసంక్రమా: స్యుర్దానే జపాదౌ బహుపుణ్యదాస్తే 9**

అయనాంశమును 60చే గుణించి సూర్యుని స్పష్టమైన గతికాలముతో భాగించిన వచ్చు దినలబ్ధ ఘడియలతో సమానముగా నిరయణ మేషాది సంక్రాంతులకు పూర్వము సాయన సంక్రాంతి యగును. సాయన సంక్రాంతి కూడ జపదానాది కార్యములలో అతిపుణ్య ప్రదమగును.

**సమ- బృహత్ - జఘన్య సంజ్ఞక నక్షత్రములు :-**

**సమం మృదు క్షిప్ర వసుశ్రవోఽగ్నిమఘాత్రిపూర్వా స్రిపభం బృహత్స్యాత్**
**ధ్రువద్విదైవాదితిభం జఘన్యం సార్పామ్బుపార్ద్రానిలశాక్రయామ్యమ్ 10**

మృదు క్షిప్ర సంజ్ఞక (మృగశిర, రేవతి, చిత్ర, అనూరాధ, హస్త, అశ్విని, పుష్యమి, అభిజిత్) నక్షత్రములు, ధనిష్ఠ, శ్రవణ, కృత్తిక, మఘ, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర నక్షత్రములు సమసంజ్ఞయగును. ధ్రువసంజ్ఞక (ఉత్తరాత్రయం, రోహిణి) విశాఖ పునర్వసు నక్షత్రములు 'బృహత్ సంజ్ఞ', ఆశ్లేష, శతభిష, ఆర్ద్ర, స్వాతి, జ్యేష్ఠ, భరణి నక్షత్రములు జఘన్య సంజ్ఞయగును.

**జఘన్య భే సంక్రమణే ముహూర్తా: శరేన్దవో బాణకృతా బృహత్సు**
**ఖరామసంఖ్యా సమభే మహర్ఘ - సమర్ఘ - సామ్యం విధుదర్శనేఽపి 11**

జఘన్య సంజ్ఞక నక్షత్రములో సంక్రాంతియైన భోగకాలము 15 ముహూర్తములు (3 ఘడియలు) బృహత్ సంజ్ఞక నక్షత్రములలో భోగకాలము 45 ముహూర్తములు (90 ఘడియలు) సమసంజ్ఞక నక్షత్రములలో భోగకాలము 30 ముహూర్తము(60 ఘడియలు) లగును. ఇదేవిధముగా జఘన్యసంజ్ఞక నక్షత్రములలో మొదటగా చంద్రదర్శనమైన(శుక్ల ద్వితీయకు చంద్రోదయము)మహర్ఘతా(మూల్యవృద్ధి), బృహత్సంజ్ఞక నక్షత్రములలోనైన మూల్యములో హ్రాసము(తగ్గుట)సమసంజ్ఞక నక్షత్రములలో చంద్రోదయమైన మూల్యము లో సమానత్వము కలుగును.

**అర్కాదివారే సంక్రాన్తౌ కర్కస్యాబ్ద వింశోపకా:**
**దిశో నఖా గజా: సూర్యా ధృత్యోఽష్టాదశ సాయకా: 12**

సూర్యాదివారములలో సంక్రాంతి జరిగిన క్రమముగా 10,20,8,12,18,18, 5 వర్షములు వింశోపకమగును. అనగా రవివారము కర్కాటక సంక్రాంతియైన 10, సోమవారమైన 20, మంగళవారమైన 8, బుధవారమైన 12, గురువారమైన 18, శుక్ర వారమైన 18, శనివారమైన 5 వర్షములు వింశోపకమగును.

**రవి సంక్రమణ ఫలము :-**

**స్యాత్తైతిలే నాగచతుష్పదే రవి: సుప్తో నివిష్టస్తు గరాదిపఞ్చమే**
**కింస్తుఘ్నే ఊర్ధ్వ: శకునౌ సకౌలవే నేష్ట: సమ: శ్రేష్ఠ ఇహార్ఘవర్షణే** **13**

తైతిల, నాగ చతుష్పద కరణములలో సూర్యసంక్రాంతియైన శయనావస్థ'లో సూర్యుడు సంక్రమణము చేయును. గర,వణిజ, విష్టి, బవ,బాలవ కరణములలో సంక్రమణమైన 'కూర్చొని',కింస్తుఘ్న,శకుని,కౌలవ కరణములలో 'నిలబడి' రవి సంక్రమణము చేయును. ఈ మూడు అవస్థలలో వస్తువుల మూల్యము,వృష్టిఫలము క్రమముగా అశుభము, సమము, ఉత్తమమగును. అనగా సుప్తావస్థలో సంక్రాంతియైన అనావృష్టి మూల్యవృద్ధి,కూర్చొన్నప్పుడు సమముగా,నిలబడినపుడు ఉత్తమవృష్టి వస్తువుల కనుకూల మూల్యము కలుగును.

**సంక్రాంతులలో వాహనాదులు :-**

**సింహవ్యాఘ్ర వరాహరాసభగజా వాహద్విషద్ఘోటకా:**
**శ్వాజో గౌశ్చరణాయుధశ్చ బవతో వాహో రవే: సంక్రమే**
**వస్త్రం శ్వేతసుపీతహారిత కపాండ్వా రక్త కాలాసితం**
**చిత్రం కమ్బల దిగ్ఘనాభమథ శస్త్రం స్యాద్భుశుణ్డీ గదా** **14**
**ఖడ్గో దణ్డశరాసతోమరమథో కున్తశ్చ పాశోఽఙ్కుశో**
**ఽస్త్రం భాణద్వథ భక్ష్యమన్నపరమాన్నం భైక్ష్యపక్వాన్నకమ్**
**దుగ్ధం దధ్యపి చిత్రితాన్నగుడ మధ్వాజ్యం తథా శర్కరా**
**ఽథో లేపో మృగనాభికుఙ్కుమమథో పాటీరమృద్రోచనమ్** **15**
**యావశ్చా తుమదో నిశాఞ్జనమథో కాలాగురుశ్చన్ద్రకో**
**జాతిర్దైవతభూతసర్పవిహగా: పశ్వేణ విప్రాస్తత:**
**క్షత్రీవైశ్యకశూద్ర సఙ్కరభవా: పుష్పం చ పున్నాగకం**
**జాతీబాకులకేతకాని చ తథా బిల్వార్కదూర్వామ్బుజమ్** **16**
**స్యాన్మల్లికా పాటలికా జపా చ సంక్రాన్తి వస్త్రాశన వాహనాదే:**
**నాశశ్చ తద్వృత్త్యుపజీవినాం చ స్థితోప విష్టస్వపతాం చ నాశ:** **17**

రవిసంక్రమణ సమయములో బవాదికరణానుసారము సూర్యసంక్రాంతి వాహనము, భోజనము, లేపము, అన్నశస్త్రాది వివేచనము క్రింద తెలుపబడినది.

**వాహనము :** బవాది కరణములలో సంక్రాంతి వాహనము క్రమముగా 1. సింహము 2, వ్యాఘ్రము 3.పంది 4. గాడిద 5.ఏనుగు 6.దున్నపోతు 7.గుర్రము 8. కుక్క 9. పొట్టేలు(గొర్రె) 10.ఎద్దు 11.కోడి

**వస్త్రము :** 1.తెలుపు 2.పసుపు 3.పసుపుపచ్చ 4.పాండు(లేతపసుపు) 5.ఎరుపు

6.నలుపు 7. నలుపు 8. చితకబర (చిత్రవర్ణము)9. కంబల 10. దిగంబర 11. మేఘవర్ణము

**శస్త్రము :** 1.భుశుండి 2.గద 3.కత్తి 4.దండము 5.ధనుస్సు 6. బల్లెము 7. బరిశ 8. పాశము 9. అంకుశము 10. అస్త్రము 11.బాణము.

**భక్ష్యపదార్థములు :** 1.అన్నము 2.పాయసము 3.భిక్షాన్నము 4.పక్వాన్నము(వండిన అన్నము) 5.పాలు 6.పెరుగు 7.ఖిచిడి 8.బెల్లము 9. తేనె 10. నెయ్యి

**లేపములు :** 1.కస్తూరి 2. కుంకుమ 3.చందనము 4.మట్టి 5.గోరోచనము 6.అలక్తకము (లత్తుక) 7. జవ్వాది(పిల్లిమదము) 8.పసుపు 9.కాటుక 10.నల్లని అగరు 11.కర్పూరము

**జాతి :** 1.దేవత 2.భూతము 3.సర్పము 4.పక్షి 5.పశువు 6.మృగము 7.విప్రుడు 8.క్షత్రియుడు 9.వైశ్యుడు 10.శూద్రుడు 11.వర్ణసంకరులు.

**పుష్పము :** 1.నాగకేసరము 2.చమేలి (సన్నజాజి) 3.పొగడ 4.మొగలి 5.మారేడు 6.జిల్లేడు 7.గరిక 8. కమలము 9. మాలతి(మల్లిక) 10.గులాబి 11.జపాకుసుమము (ఎరుపురంగు పూలు)

ఏ సంక్రాంతిలో ఏవాహన వస్త్రభక్ష్యాదులను తెలిపెనో వాటన్నింటికి నాశనము కలుగును. పైన తెల్పిన పదార్థములతో జీవించు వారు (రైతులు వ్యాపారులు) నాశనమగుదురు. ఏసంక్రాంతులలో రవి నిద్రించునో ఆ కాలములో నిద్రించు ప్రాణులకు, ఊర్ధ్వ రవి నిలబడిన ప్రాణులకు, కూర్చొన్న రవి కూర్చొనిన ప్రాణులకు నాశనము కలిగించును.

**సంక్రాంతి నక్షత్ర శుభాశుభ ఫలము :-**

**సంక్రాన్తిధిష్ణ్యాధర ధిష్ణ్యతస్త్రిభే స్వభే నిరుక్తం గమనం తతోఽజ్గభే**
**సుఖం త్రిభే పీడనమజ్గ భేంఽశుకం త్రిభేఽర్థహాని రసభే ధనాగమః** 18

సూర్యుడున్న సంక్రాంతి నక్షత్రమునకు పూర్వనక్షత్రమునండి లెక్కించినపుడు తన జన్మనక్షత్రము మొదటిమూడు నక్షత్రములలోనున్న యాత్ర జరుగును. తర్వాతి ఆరు నక్షత్రములలో తన జన్మ నక్షత్రమున్న సుఖము, తర్వాతి మూడు నక్షత్రములలో పీడ, తర్వాతి ఆరు నక్షత్రములలో వస్త్రలాభము, తర్వాతి మూడు నక్షత్రములలో ధనహాని,తర్వాతి ఆరు నక్షత్రములలో ధనలాభము కలుగును. ఈ విధముగా సంక్రాంతిలో జన్మ నక్షత్రము ననుసరించి ఫలితమును తెలుపవలెను.

**ఉదాహరణకు సూర్యసంక్రాంతి అనూరాధ నక్షత్రములోనైన, వ్యక్తి నక్షత్రము కృత్తికయైన, సంక్రాంతికి పూర్వనక్షత్రము విశాఖ నుండి కృత్తిక 15 నక్షత్రమైనది. కావున ఆవ్యక్తికి వస్త్రలాభము కలుగును.**

సులభ పట్టిక

| సంక్రాంతి పూర్వ నక్షత్రము నుండి జన్మ నక్షత్రసంఖ్య | 3 | 6 | 3 | 6 | 3 | 6 |
|---|---|---|---|---|---|---|
| ఫలితము | యాత్ర | సుఖము | పీడ | వస్త్రలాభము | ధనహాని | ధనలాభము |

**గ్రహబలములలో చేయుకార్యములు :-**

**నృపేక్షణం సర్వకృతిశ్చ సఙ్గర: శాస్త్రం వివాహో గమ - దీక్షణే రవే:**
**వీర్యేఽథ తారాబలతో విధుర్విధోర్బలాద్రవిస్తద్బలత: శుభా: పరే 19**

సూర్యుని నుండి ప్రారంభించి,క్రమముగా సూర్యుడు బలవంతుడైన రాజ దర్శనము, చంద్రుడు బలవంతుడైన అన్నివిధములైన కార్యములు, కుజుడు బలవంతుడైన యుద్ధము, బుధుడు బలవంతుడైన శాస్త్రాభ్యాసము, గురువు బలవంతుడైన వివాహము, శుక్రుడు బలవంతుడైన యాత్ర, శని బలవంతుడైన మంత్రదీక్షను చేయవలెను.కొంతమంది విద్వాంసులు ఉక్తకార్యములు బలవంతుడైన గ్రహదినములలోనే చేయవలెనని తెలిపిరి. తార బలమైనదైన చంద్రుడు బలవంతుడగును. చంద్రబలము వలన సూర్యబలము, సూర్యబలముచే కుజాదిగ్రహములు బలవంతులగును.

**క్షయాది మాసలక్షణము :-**

**స్పష్టార్క సంక్రాన్తి విహీన ఉక్తో మాసోఽధిమాస: క్షయమాసకస్తు**
**ద్విసంక్రమస్తత్ర విభాగయో: స్తస్తిథేర్హి మాసౌ ప్రథమాన్త్య సంజ్ఞౌ 20**

సూర్యసంక్రాంతి కలుగని మాసమును అధికమాసమని తెల్పిరి.(ఏ చంద్ర మాసములో రెండు అమావాస్యల మధ్య సూర్యసంక్రాంతి జరుగదో ఆమాసమును అధికమాసమందురు)ఏమాసములో రెండు సంక్రాంతులు కలుగునో దానిని క్షయమాస మందురు.క్షయమాసములో తిథిపూర్వార్ధము, ఉత్తరార్ధము రెండు భాగముల వలన క్షయమాసపు పూర్వ ఉత్తర మాసములను గ్రహించవలెను. అనగా క్షయమాసములో తిథికి మొదటి భాగములో (పూర్వార్ధము) ఉత్పన్నమైన లేక మృతి పొందిన వ్యక్తికి తిథి సంబంధక్రియ క్షయమాసమునకు ముందు మాసములో, తిథికి రెండవభాగములో (ఉత్తరార్ధము) ఉత్పన్నమైన లేక మృతిచెందిన వ్యక్తి వర్ధాపనాది తిథి క్రియలు క్షయమాసము తర్వాతి మాసములో చేయవలెను.అధికమాసము 975రోజుల అనంతరము వచ్చును. కాని క్షయ మాసమును నిశ్చయముగా చెప్పుటకు వీలుపడదు. తరచుగా క్షయమాసము 141 సంవత్సరములకు ఒకసారి జరగవచ్చును.

**మూడవ సంక్రాంతి ప్రకరణాధ్యాయము సమాప్తము**

# 4. గోచార ప్రకరణము

సూర్యో రసాన్త్యే ఖయుగేఽగ్నినన్దే శివాక్షయో ర్భౌమశనీ తమశ్చ
రసాఙ్కయోర్లాభశరే గుణాన్త్యే చన్ద్రోమ్బరాబ్ధౌ గుణనన్దయోశ్చ 1
లాభాష్టమే చాద్యశరే రసాన్త్యే నగద్వయే జ్ఞో ద్విశరేఽబ్ధిరామే
రసాఙ్కయోర్నాగవిధౌ ఖనాగే లాభవ్యయే దేవగురు: శరాబ్ధౌ 2
ద్వ్యన్త్యే నవాశేఽద్రిగుణే శివాహౌ శుక్ర: కునాగే ద్వినగేఽగ్నిరూపే
వేదామ్బరే పఞ్చనిధౌ గజేషౌ నన్దేశయోర్భానురసే శివాగ్నౌ 3
క్రమాచ్ఛుభో విద్ధ ఇతిగ్రహ: స్యాత్ పితు: సుతస్యాత్ర న వేధమాహు:
దుష్టోఽపి ఖేటో విపరీతవేధాచ్ఛుభో ద్వికోణే శుభద: సితేఽబ్జ: 4

జన్మరాశి నుండి సూర్యుడు ఆరవభావములో నున్న శుభము, పన్నెండవభావములో విద్ధుడగును. (ఇతర గ్రహములతో కూడి అశుభుడగును) దశమ–చతుర్ధ, తృతీయ –నవమ, ఏకాదశ– పంచమభావములలో సూర్యుడు క్రమముగా శుభుడు విద్ధుడగును. కుజ,శని,రాహువులు ఆరవభావములో శుభులు. నవమభావములో నున్న గ్రహములతో విద్ధమగును. ఇదే విధముగా మూడవ, పదకొండవ భావములలో శుభులు క్రమముగా ఐదు పన్నెండవ భావములలో నున్న గ్రహములతో విద్ధులగును.

చంద్రుడు 10,3,11,1,6,7 భావములలో శుభుడు క్రమముగా 4,9,8,5, 12,2 భావములలోనున్న గ్రహములతో విద్ధుడగును.

బుధుడు 1,2,6,8,10,11భావములలో శుభుడు, క్రమముగా 5,3,9,1,8,12 స్థానములలో నున్న గ్రహములతో విద్ధుడగును.

గురుడు 5,2,9,7,11 భావములలో శుభుడు క్రమముగా 4,12,10,3,8 స్థానములలో నున్న గ్రహములతో విద్ధుడగును.

శుక్రుడు 1,2,3,4,5,8,9,12,11 స్థానములలో శుభుడు. క్రమముగా 8,7,1,10,9,5,11,6,3 భావములలో నున్న గ్రహములతో విద్ధుడగును. తండ్రి కొడుకులకు పరస్పరము వేధ కలుగదు. (సూర్య శనులు, చంద్ర బుధులకు పరస్పరము వేధ కలుగదు)

**విపరీత వేధ కలిగిన దుష్టగ్రహము కూడ శుభమునిచ్చును. (వేధస్థానములో నున్న గ్రహము శుభస్థానములో నున్న గ్రహముతో విద్ధమైన) చంద్రుడు శుక్లపక్షములో రెండవ, కోణ (5,9)భావములలో నున్నప్పుడు శుభకారకుడగును.**

స్వజన్మరాశేరిహ వేధమాహురన్యే గ్రహాధిష్ఠితరాశిత: స:
హిమాద్రి విన్ధ్యాన్తర ఏవవేధో న సర్వదేశేష్వితి కాశ్యపోక్తి: 5

నారదాది ఆచార్యుల మతానుసారము పూర్వకథిత వేధ తమ జన్మరాశితో చూడవలెను. ఏస్థానములలో వేధకలుగునో ఆస్థానములను తమజన్మరాశితో లెక్కించవలెను.

కాని కాశ్యపమతానుసారము గ్రహము ఏరాశిలో నున్నదో ఆరాశినుండి వేధ విచారణ చేయవలెను. ఈ గ్రహవేధ హిమాలయము నుండి పర్వత మధ్యప్రదేశ భాగముల వారికి వర్తించును. ఇతరదేశ వాసులకు వర్తించదు.

**వేధ రెండు విధములుగా నుండును. 1. క్రమవేధ 2. వామవేధ 'సూర్యోరసాన్త్యే' ఇత్యాది శ్లోకములననుసరించి ఆరవస్థానములో నున్న సూర్యునికి ద్వాదశభావములోనున్న గ్రహములతో వేధకలుగును. దీనిని క్రమవేధ యందురు. వేధకారక గ్రహము శుభ స్థానములోనుండి వేధస్థానములోనున్న గ్రహమును వేధించిన విపరీతవేధ యగును. సూర్యుడు ద్వాదశస్థానములో నున్నపుడు ఆరవస్థానములోనున్న శనిని వదలి మిగిలిన గ్రహములకు వేధ కలిగించును. దీనిని విపరీతవేధ లేక వామవేధ యందురు.**

**పైశ్లోకములో రెండు మతములను సమన్వయము చేసి తెలిపెను. క్రమవేధను జన్మరాశి నుండి వామవేధను గ్రహాక్రాంతరాశి నుండి విచారణచేయవలెను.**

**జన్మగత గ్రహణఫలము :-**

**జన్మర్క్షే నిధనం గ్రహే జనిభతో ఘాత: క్షతి: శ్రీర్వ్యథా**
**చిన్తా సౌఖ్యా కలత్రదౌస్థ్య మృతయ: స్యుర్మాననాశ: సుఖమ్**
**లాభోపాయ ఇతి క్రమాత్తదశుభధ్వస్త్యై జప: స్వర్ణగో**
**దానం శాన్తిరథో గ్రహం త్వశుభదం నో వీక్ష్యమాహు: పరే 6**

జన్మనక్షత్రములో గ్రహణమైన మృత్యువు కలుగును (సూర్యచంద్రులు గ్రహణ సమయములో ఏనక్షత్రములో నుందురో ఆనక్షత్రము గ్రహణ నక్షత్రమగును) జన్మరాశిలో గ్రహణమైన శరీరమునకు పీడ, రెండవరాశిలోనై హాని, మూడవరాశిలోనైన లక్ష్మీప్రాప్తి, నాల్గవదైన కష్టము,ఐదవదైన చింత,ఆరవదైన సుఖము, ఏడవదైన స్త్రీకష్టము, ఎనమిదవదైన మృత్యువు, తొమ్మిదవదైన మానహాని, పదవదైన సుఖము, పదకొండవదైన లాభము, పన్నెండవదైన విఘ్నము హాని కలుగును.

ఈ అశుభఫలములను దూరముచేయుటకు జపము స్వర్ణ గోదానములు శాంతి క్రియలు చేయవలెను.కొందరి మతము ననుసరించి అశుభగ్రహణములను చూడరాదు. గ్రహణశాంతి కొరకు చేయు విధులు గ్రహణకాలములోనే చేయవలెను. గ్రహణ కాలములో నాలుగుస్థితులుండును. 1.స్పర్శ 2.సమ్మీలనము 3.ఉన్మీలనము 4. మోక్షము..గ్రహణ స్పర్శ జరిగినపుడు స్నానము,బింబగ్రస్తమైనపుడు హవనము, ఉన్మీలన (గ్రహణము నుండి బయట వచ్చుట ప్రారంభించిన) సమయములో దానము, మోక్ష (సమాప్తము) సమయములో మరల స్నానము చేయవలెను.

**చంద్రబల విశేషము :-**

**పాపాన్త: పాపయుగ్ద్యూనే పాపాచ్చన్ద్ర: శుభోఽప్యసన్**
**శుభాంశే వాధిమిత్రాంశే గురుదృష్టోఽశుభోఽపి సన్ 7**

చంద్రుడు పాపగ్రహముల మధ్యలోనున్న పాపగ్రహములతో కూడిన, పాపగ్రహము లకు ఏడవభాగములో నున్న శుభుడైనప్పటికి అశుభఫలమునిచ్చును. ఇదేవిధముగా చంద్రుడు శుభగ్రహ నవాంశలలో లేక తన అధిమిత్ర గ్రహనవాంశములో, లేక గురుదృష్టి ఉన్న అశుభమైనప్పటికి శుభఫలమునిచ్చును.

**అధిమిత్ర గ్రహముల వర్ణన పంచవిధముల్లైన మైత్రి సందర్భమున తెలుపబడినది. గ్రహముల మైత్రి రెండు విధములుగా తెలుపబడినది. 1 నైసర్గికము 2. తాత్కాలికము. నైసర్గిక తాత్కాలిక పద్ధతిలో మిత్రుల్లైన గ్రహములు అధిమిత్ర గ్రహములగును. రెండు విధములుగా శత్రువుల్లైన అధిశత్రువు,ఒకవిధముగా మిత్రుడు రెండవ విధముగా శత్రువైన సమము, సమ శత్రువులు కలిసిన శత్రువు, సమమిత్రులు కలిసిన మిత్రులగుదురు.**

**సితాసితాదౌ సద్దృష్టే చన్ద్రే పక్షా శుభావుభౌ**
**వ్యత్యాసే చాశుభౌ ప్రోక్తో సఙ్కటేఽబ్జబలం త్విదమ్ 8**

శుక్లపక్ష చంద్రుడు శుభుడై, కృష్ణపక్ష పాడ్యమికి అశుభుడైన రెండు పక్షములలో చంద్రుడు శుభకారకుడగును. దీనికి వ్యతిరేక స్థితిలో అనగా కృష్ణపాడ్యమికి శుభుడు, శుక్ల పాడ్యమికి అశుభుడైన రెండు పక్షములలో చంద్రుడు అశుభుడగును. ఈవిధముగా ఒకరోజున జరుగు శుభాశుభములతో సంపూర్ణ పక్షమునకు చంద్రుని శుభాశుభా విచారము సంకటకాలములో తెలియజేయబడినది.

**నవరత్నధారణ విధి :-**

**వజ్రం శుక్రేబ్జే సుముక్తాప్రవాలం భౌమేఽగౌ గోమేదమార్కౌసునీలమ్**
**కేతౌవైడూర్యం గురౌపుష్పకం జ్ఞేపాచి: ప్రాజ్మాణిమర్కే తు మధ్యే 9**

గ్రహదోష నివారణకు నవరత్న ఉంగరము ఈ విధముగా నిర్మించవలెను. పూర్వభాగములో శుక్రునికి వజ్రము, అగ్నికోణములో చంద్రునికి ముత్యము, దక్షిణములో కుజునికి పగడము, నైరృతిలో రాహువుకి గోమేధికము, పశ్చిమములో శనికి నీలము, వాయువ్యములో కేతువుకి వైడూర్యము, ఉత్తరములో గురునికి పుష్యరాగము, ఈశాన్యములో బుధునికి పచ్చ, మధ్యభాగములో సూర్యునికి మాణిక్యము(కెంపు)ను ధరించవలెను.

నవరత్న ఉంగర నిర్మాణ విధానము

| వాయువ్యము | | ఉత్తరము | | ఈశాన్యము |
|---|---|---|---|---|
| | వైడూర్యము<br>కేతువు | పుష్యరాగము<br>గురువు | పచ్చ<br>బుధుడు | |
| పశ్చిమము | నీలము<br>శని | కెంపు<br>రవి | వజ్రము<br>శుక్రుడు | పూర్వము |
| | గోమేధికము<br>రాహువు | పగడము<br>కుజుడు | ముత్యము<br>చంద్రుడు | |
| నైరృతి | | దక్షిణము | | ఆగ్నేయము |

**గ్రహానుకూల రత్నధారణము :-**

**మాణిక్య ముక్తాఫలవిద్రుమాణి గారుత్మకం పుష్పకవజ్రనీలమ్**
**గోమేదవైదూర్యకమర్కత: స్యూ రత్నాన్యథో జ్ఞస్య ముదే సువర్ణమ్ 10**

సూర్యాది నవగ్రహముల ప్రసన్నత కొరకు సూర్యునికి మాణిక్యము, చంద్రునికి ముత్యము, కుజునికి పగడము, బుధునికి పచ్చ, గురునికి పుష్యరాగము, శుక్రునికి వజ్రము, శనికి నీలము, రాహువుకి గోమేధికము, కేతువుకి వైడూర్యము ధారణచేయవలెను. బుధుని ప్రసన్నత కొరకు బంగారమును ధరించవలెను.

**ధార్య లాజావర్తకం రాహుకేత్వో రౌప్య శుక్రేన్ద్వోశ్చ ముక్తా గురోస్తు**
**లోహం మన్దస్యార - భాన్వో: ప్రవాలం తారా జన్మర్క్షాత్ త్రిరావృత్తిత: స్యాత్ 11**

పైన తెల్పిన రత్నధారణ చేయుటకు సమర్థత లేకున్న స్వల్పమూల్య రత్నధారణ గ్రహానుసారము తెలుపబడెను. రాహుకేతువుల ప్రసన్నత కొరకు లాజావర్తము, శుక్ర చంద్రుల కొరకు వెండి, గురుని కొరకు ముత్యము, శనికొరకు లోహము, కుజ సూర్యులకు పగడము ధారణచేయవలెను.

**తారల నామములు :-**

**జన్మాఖ్య సమ్పద్విపద: క్షేమప్రత్యరిసాధకా:**
**వధమైత్రాత్రిమైత్రా: స్యుస్తారా నామసదృక్ఫలా: 12**

జన్మ, సంపత్, విపత్, క్షేమ,ప్రత్యరి,సాధక,వధ, మైత్ర,అతిమైత్ర నామక తొమ్మిది తారలుండును. వీటినామముల ననుసరించి ఫలితములుండును. జన్మ,సంపత్, క్షేమ, సాధక,మైత్ర,అతిమైత్రతారలు శుభములు,విపత్, ప్రత్యరి,వధ తారలు అశుభములు.

**తారాదోష పరిహారము :-**

**మృత్యౌ స్వర్ణ తిలాన్విపద్యపి గుడం శాకం త్రిజన్మస్వథో**
**దద్యాత్ప్రత్యరితారకాసు లవణం సర్వో విపత్ప్రత్యరి:**
**మృత్యుశ్చాదిమపర్యయే న శుభదోఽథైషాం ద్వితీయేంఽశకా**
**నాదిప్రాన్త్య తృతీయకా అథ శుభా: సర్వే తృతీయే స్మృతా: 13**

వధతారకు స్వర్ణము, నువ్వులు, విపత్తారకు బెల్లము, మూడు ఆవృత్తులలో జన్మతారకు ఆకుకూరలు, ప్రత్యరి తారకు ఉప్పు దానము చేసిన దోషము పరిహారమై శాంతి కలుగును. ప్రథమ ఆవృత్తిలో విపత్, ప్రత్యరి వధతారలకు సంపూర్ణముగా దోషము కలుగును. ద్వితీయ ఆవృత్తిలో విపత్తార ప్రథమ చరణము, 'పత్యరి' అంతిమ చరణము 'వధ' తృతీయ చరణము అశుభమగును. తృతీయ ఆవృత్తిలో విపత్, ప్రత్యరి, వధ తారలు సంపూర్ణముగా శుభమగును.

**చంద్రావస్థ జ్ఞానము :-**

**షష్టిఘ్నం గతభం భుక్త ఘటీయుక్తం యుగాహతమ్**
**శరాబ్ధి హృల్లబ్ధతోఽర్క శేషేఽవస్థా: క్రియాద్విధో: 14**

అశ్విని నుండి ప్రారంభించి ఇష్టకాల నక్షత్రమునకు పూర్వనక్షత్ర సంఖ్యను 60చే గుణించి వర్తమాన నక్షత్ర ఘడియలను జోడించి 4చే భాగించిన వచ్చు లబ్దమును 12 చే భాగించిన వచ్చు శేషసంఖ్య ననుసరించి చంద్రునికి ప్రవాసాదులు మేషాదిక్రమముగా అవస్థలగును.

మేషరాశి వారికి ప్రవాసాది, వృషభరాశి వారికి నాశాది క్రమములో అవస్థను గ్రహించవలెను.

**ఉదాహరణకు - 1983 ఫాల్గుణమాసము శుక్ల తదియ సోమవారము ఉదయం 8.30 గంటలకు స్పష్ట చంద్రుడు 11-16-43 రేవతీ నక్షత్ర భయాగ ఘటిక 0.27 రేవతికి ముందు నక్షత్ర సంఖ్య 26 X 60 = 1560 + 0.27 = 1560.27**

**1560.27 X 4 = 6241.48**

**624 ÷ 45 = 138 లబ్ధి**

**138 ÷ 12 = 8 శేషము**

**అందువలన స్థిర అవస్థల క్రమములో ఎనిమిది 'క్రీడా' గతఅవస్థ మరియు వర్తమాన చంద్ర అవస్థ 'సుప్త' అయినది.**

**అవస్థల నామములు :-**

**ప్రవాశనాశౌ మరణం జయశ్చ హాస్యారతిక్రీడిత సుప్తభుక్తా:**
**జ్వరాఖ్య కమ్పస్థిరతా అవస్థా మేషాత్క్రమాన్నామగదృక్ఫలా:స్యు 15**

1.ప్రవాసము 2.నాశము 3.మరణము 4.జయము 5.హాస్యము 6. రతి 7.క్రీడితము 8.సుప్తము 9. భుక్తము 10.జ్వరము 11.కంపము 12.స్థిరము - ఇవి చంద్రునికి పన్నెండు అవస్థలు. మేషాది పన్నెండు రాశులలో ప్రవాసాది క్రమములో పన్నెండు అవస్థలు ఆరంభమగును. మేషాదివారికి ప్రథమ అవస్థ ప్రవాసము, రెండవది నాశము వృషభరాశి వారి మొదటి అవస్థ నాశము రెండవది మరణము వీటి నామానుసారము ఫలము కలుగును.

**అవస్థా బోధక చక్రము**

| అవస్థలు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మేషము | ప్రవాసము | నాశము | మరణము | జయము | హాస్యము | రతి | క్రీడితము | సుప్తము | భుక్తము | జ్వరము | కంపము | స్థిరము |
| వృషభము | నాశము | మరణము | జయము | హాస్యము | రతి | క్రీడితము | సుప్తము | భుక్తము | జ్వరము | కంపము | స్థిరము | ప్రవాసము |
| మిథునము | మరణము | జయము | హాస్యము | రతి | క్రీడితము | సుప్తము | భుక్తము | జ్వరము | కంపము | స్థిరము | ప్రవాసము | నాశము |

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కర్కాటకము | జయము | హాస్యము | రతి | క్రీడితము | సుప్తము | భుక్తము | జ్వరము | కంపము | స్థిరము | ప్రవాసము | నాశము | మరణము |
| సింహము | హాస్యము | రతి | క్రీడితము | సుప్తము | భుక్తము | జ్వరము | కంపము | స్థిరము | ప్రవాసము | నాశము | మరణము | జయము |
| కన్య | రతి | క్రీడితము | సుప్తము | భుక్తము | జ్వరము | కంపము | స్థిరము | ప్రవాసము | నాశము | మరణము | జయము | హాస్యము |
| తుల | క్రీడితము | సుప్తము | భుక్తము | జ్వరము | కంపము | స్థిరము | ప్రవాసము | నాశము | మరణము | జయము | హాస్యము | రతి |
| వృశ్చికము | సుప్తము | భుక్తము | జ్వరము | కంపము | స్థిరము | ప్రవాసము | నాశము | మరణము | జయము | హాస్యము | రతి | క్రీడితము |
| ధనుస్సు | భుక్తము | జ్వరము | కంపము | స్థిరము | ప్రవాసము | నాశము | మరణము | జయము | హాస్యము | రతి | క్రీడితము | సుప్తము |
| మకరము | జ్వరము | కంపము | స్థిరము | ప్రవాసము | నాశము | మరణము | జయము | హాస్యము | రతి | క్రీడితము | సుప్తము | భుక్తము |
| కుంభము | కంపము | స్థిరము | ప్రవాసము | నాశము | మరణము | జయము | హాస్యము | రతి | క్రీడితము | సుప్తము | భుక్తము | జ్వరము |
| మీనము | స్థిరము | ప్రవాసము | నాశము | మరణము | జయము | హాస్యము | రతి | క్రీడితము | సుప్తము | భుక్తము | జ్వరము | కంపము |

## గ్రహదోష పరిహార ఓషధులు :-

**లాజాకుష్ఠబలాప్రియఙ్గు ఘన సిద్ధార్థై ర్నిశాదారుభి:**
**పుంఖాలోధ్రయుతైర్జలైర్ని గదితం స్నానం గ్రహోత్థాఘ హృత్**
**ధేను: కమ్బురుణో వృషశ్చ కనకం పీతామ్బరం ఘోటక:**
**శ్వేతో గౌరసితా మహాసిరజ ఇత్యేతా రవేర్దక్షిణా: 16**

లాజ, కుష్ఠ, బాల, ప్రియంగు, ఘన, సిద్ధార్థ, నిశ, దేవదారు, పుంఖ, లోధ్ర – ఈ ఔషధములతో కలిసిన జలముతో స్నానము చేసిన గ్రహముల ద్వార ఉత్పన్నమగు అరిష్టములు నివారణ మగును.

ఆవు,శంఖము, ఎరుపురంగు ఎద్దు, బంగారము, పీతాంబరము, తెల్లని గుర్రము, నల్లనిఆవు, కత్తి, మేకలను క్రమముగా సూర్యాది నవగ్రహముల అరిష్ట నివారణకు దానము చేయవలెను. సూర్యునికి ఆవు, చంద్రునికి శంఖము, కుజునికి ఎరుపురంగు ఎద్దు, బుధునికి బంగారము, గురునికి పీతాంబరము, శుక్రునికి తెల్లని గుర్రము, శనికి నల్లనిఆవు, రాహువుకి కత్తి, కేతువుకి మేకును దానము చేయవలెను.

**గ్రహముల శాంతి కొరకు అనేక విధముల్లైన పద్ధతులు గ్రంథములలో తెలుపబడినవి. గ్రహముల తాంత్రిక మంత్రము జపసంఖ్య సమయము తెలుపబడును.**

| గ్రహము | జపసంఖ్య | సమయము | తాంత్రిక మంత్రము | హవనీయ సమిధ |
|---|---|---|---|---|
| రవి | 7000 | ఉదయము | ఓం హ్రాం హ్రీం హ్రౌం స: సూర్యాయ నమ: | మందారము |
| చంద్ర | 11000 | సంధ్య | ఓం శ్రాం శ్రీం శ్రౌం స: చంద్రాయ నమ: | పలాశము |
| కుజ | 10000 | అపరాహ్ణము | ఓం క్రాం క్రీం క్రౌం స: భౌమాయ నమ: | ఖదిర(చంద్ర) |
| బుధుడు | 19000 | అపరాహ్ణము | ఓం బ్రాం బ్రీం బ్రౌం స: బుధాయ నమ: | అపామార్గము |
| గురుడు | 19000 | సంధ్య | ఓం గ్రాం గ్రీం గ్రౌం స: గురవేనమ: | రావి |
| శుక్రుడు | 6000 | ఉదయము | ఓం ద్రాం ద్రీం ద్రౌం స: శుక్రాయ నమ: | మేడి |

| | | | | |
|---|---|---|---|---|
| శని | 13000 | మధ్యాహ్నము | ఓం ప్రాం ప్రీం ప్రౌం స: శనైశ్చరాయ నమ: | జమ్మి |
| రాహువు | 18000 | రాత్రి | ఓం భ్రాం భ్రీం భ్రౌం స: రాహవన్నమ: | గరిక |
| కేతువు | 17000 | రాత్రి | ఓం స్రాం స్రీం స్రౌం స: కేతవే నమ: | దర్భలు |

**గంతవ్యరాశి ఫలకాలము :-**

**సూర్యారసౌమ్యాస్ఫుజితోఽ_క్ష - నాగ - సప్తాద్రిఘస్రాన్ విధురగ్నినాడీ:**
**తమోయమేజ్యాస్త్రిరసా శ్విమాసాన్ గన్తవ్యరాశే: ఫలదా: పురస్తాత్ 17**

సూర్యుడు ముందురాశిలోనికి వెళ్ళుటకు ఐదు దినములముందు, కుజుడు ఆరు దినముల ముందు, బుధుడు ఏడుదినముల ముందు, శుక్రుడు ఏడుదినముల ముందు, తన ఫలితము నిచ్చుట ప్రారంభించును. ఇదేవిధముగా చంద్రుడు మూడు ఘడియల ముందు, రాహు కేతువులు మూడు మాసముల ముందు, శని ఆరుమాసముల ముందు, ముందురాశి లోనికి వెళ్ళుటకు ముందు తన ఫలితమునిచ్చుట ప్రారంభించును.

**దుష్ట తిథ్యాదుల పరిహారము :-**

**దుష్టే యోగే హేమ చన్ద్రే చ శఙ్ఖం ధాన్యం తిథ్యర్ధే తిథౌ తణ్డులాంశ్చ**
**వారే రత్నం భే చ గాంహేమ నాద్యాం దద్యాత్సి న్ధుత్థం చ తారాసు రాజా 18**

అవసరమైన పని చేయునపుడు అశుభయోగమున్న స్వర్ణదానము, అశుభ చంద్రుడున్న శంఖము, అశుభ కరణమున్న అన్నము, తిథి అశుభమైన బియ్యము, అశుభ దినమైన రత్నము, అశుభ నక్షత్రమైన గోవు, అశుభనాడియైన స్వర్ణము, అశుభతారయైన ఉప్పు దానము చేసి రాజు తన కార్యమును చేయవలెను.

**గ్రహముల ఫలకాలము :-**

**రాశ్యాదిగౌ రవి - కుజౌ ఫలదౌ సితేజ్యౌ**
**మధ్యే సదా శశిసుతశ్చరమేఽ_బ్జ - మన్దౌ**
**అధ్వాన్న - వహ్నిభయ - సన్మతి - వస్త్ర - సౌఖ్య**
**దు:ఖాని మాసి జనిభే రవివాసరాదౌ 19**

సూర్య కుజులు రాశుల ఆరంభములో (ప్రథమ ద్రేక్కాణము $0^0$ -$10^0$ వరకు) ఫలకారకులగుదురు. శుక్ర గురులు రాశుల మధ్యభాగములో (2వ ద్రేక్కాణము $11^0$ -$20^0$ వరకు) బుధుడు రాశుల అన్నిభాగములలో, చంద్ర శనులు రాశుల చివరిభాగములో (తృతీయ ద్రేక్కాణము $21^0$ -$30^0$ వరకు) ఫలమునిచ్చెదరు. ప్రత్యేకమాసములో రవ్యాది వారములలో జన్మనక్షత్రము వచ్చిన ఫలమీ విధముగా నుండును. రవివారము యాత్ర, సోమవారము అన్నలాభము, మంగళవారము అగ్నిభయము, బుధవారము మంచిబుద్ధి, గురువారము వస్త్రలాభము, శుక్రవారము సుఖము, శనివారము జన్మ నక్షత్రమైన దు:ఖము కలుగును

**నాల్గవ గోచారాధ్యాయము సమాప్తము**

# 5. సంస్కార ప్రకరణము

**ఆద్యరజో దర్శన ప్రశస్త కాలము :-**

**ఆద్యం రజః శుభం మాఘ మార్గ రాధేష ఫాల్గునే**
**జ్యేష్ఠ శ్రావణయోః శుక్లే సర్వదా సద్వారే సత్తనౌ దివా 1**

కన్యల ప్రథమరజోదర్శనము (ప్రథమ ఋతుకాలము)మాఘ,మార్గశిర, వైశాఖ,ఆశ్వయుజ,ఫాల్గుణ, జ్యేష్ఠ, శ్రావణమాసములలో శుక్లపక్షములో,శుభ వారము లలో(సోమ, బుధ, గురు,శుక్ర) శుభలగ్నములలో కలిగిన శుభమగును.

**షోడశ సంస్కారములలో ప్రథమ సంస్కారము గర్భాధానము, గర్భము స్త్రీలకు ఫలమైన, ఋతుస్రావము పుష్పమగును.అందువలన పూర్వాచార్యులు రజోదర్శన శుభా శుభత్వములకు అధికప్రాధాన్యతనిచ్చిరి.ఆయుర్వేదశాస్త్రానుసారము కన్యలకు 12 సంవత్సరముల నుండి 40 సంవత్సరముల వరకు రజోస్రావమగును.రజస్రావము జరిగిన తర్వాతనే స్త్రీలు గర్భధారణకు సమర్థులగుదురు. అందువలన దీని శుభాశుభ విచారము చేయవలెను.**

**రజోదర్శన శుభాశుభ నక్షత్రములు :-**

**శ్రుతిత్రయమృదు క్షిప్రధ్రువస్వాతౌ సితామ్బరే**
**మధ్యం చ మూలాదితిభే పిత్రుమిశ్రే పరేష్వసత్ 2**

శ్రవణము నుండి మూడు శ్రవణ-ధనిష్ఠ-శతభిషము, మృదు, క్షిప్ర ధ్రువసంజ్ఞక (మృగశిర, రేవతి,చిత్త, అనూరాధ,హస్త,అశ్విని,పుష్యమి, ఉత్తరాత్రయం,రోహిణి)స్వాతి నక్షత్రములలో తెల్లని వస్త్రముపై ప్రథమరజో దర్శనము శుభము. మూల, పునర్వసు, మఘ, మిశ్రసంజ్ఞక(విశాఖ, కృత్తిక) నక్షత్రములలో మధ్యమము, మిగిలిన నక్షత్రములలో ప్రథమరజోదర్శనమైన అశుభమగును.

**ఆద్యరజోదర్శన నిషిద్ధకాలము :-**

**భద్రానిద్రా సంక్రమే దర్శిరిక్తా సన్ధ్యాషష్ఠీ ద్వాదశీవైధ్రుతేషు**
**రోగోఽ ష్ఠభ్యాం చన్ద్రసూర్యోపరాగే పాతే చాద్యం నో రజోదర్శనం సత్ 3**

భద్రాకాలములో, నిద్రలో, రవిసంక్రాంతిలో, అమావాస్య, రిక్త(4,9,14) షష్ఠి,ద్వాదశి,అష్టమి తిథులలో వైధృతి వ్యతీపాతయోగములలో, రోగము వచ్చినపుడు, సూర్యచంద్ర గ్రహణ సమయములలో ప్రథమరజోదర్శనము శుభమునీయదు.

**ఋతుమతి స్నానముహూర్తము**

**హస్తానిలాశ్విమృగమైత్రవసుధ్రువాఖ్యైః**
**శాక్రాన్వితైః శుభతిథౌ శభవాసరే చ**

**స్నాయాదథార్తవతీ మృగపౌష్ణవాయు**
**హస్తాశ్విధాత్రుభిరరం లభతే చ గర్భమ్** 4

హస్త,స్వాతి,అశ్విని,మృగశిర,అనూరాధ, ధనిష్ఠ,ధ్రువసంజ్ఞక (ఉత్తరాత్రయం, రోహిణి) జ్యేష్ఠ నక్షత్రములలో,శుభతిథులు,శుభవారములలో ఋతుమతియైన స్త్రీకి స్నానము చేయవలెను. మృగశిర, రేవతి,స్వాతి,హస్త,అశ్విని,రోహిణి నక్షత్రములలో స్నానము చేసిన స్త్రీకి తొందరగా గర్భాధారణ జరుగును.

**ఆధాన నిషిద్ధ కాలము**

**గణ్డాన్తం త్రివిధం త్యజేన్నిధనజన్మర్క్షే చ మూలాన్తకం**
**దాస్రం పౌష్ణమఘోపరాగదివసాన్ పాతం తథా వైధృతిమ్**
**పిత్రోః శ్రాద్ధదినం దివా చ పరిఘాద్యర్ధం స్వపత్నీగమే**
**భాన్యుత్పాతహతాని మృత్యుభవనం జన్మర్క్షతః పాపభమ్** 5

గర్భాధానము కొరకు తనపత్నితో సహవాసము చేయు సమయమున మూడు గండాంతములు (తిథి, నక్షత్ర, లగ్న గండాంతములు) జన్మ, మృదుసంజ్ఞక తారలు, మూల,భరణి,అశ్విని,రేవతి,మఘ నక్షత్రములు,సూర్యచంద్ర గ్రహణ దినములు, వ్యతీపాత, వైధృతి యోగములు, మాతాపితల శ్రాద్ధదినము,పరిఘయోగ పూర్వార్ధము, ఉత్పాతగ్రస్త నక్షత్రము,జన్మనక్షత్ర,జన్మరాశుల నుండి ఎనిమిదవ నక్షత్రము,లేక ఎనిమిదవ రాశి మరియు పాపగ్రహము లతో కూడిన లగ్నము, నక్షత్రములను వదలి పెట్టవలెను.

**గర్భాధాన ముహూర్తము :-**

**భద్రా షష్ఠీపర్వరిక్తాశ్చ సన్ధ్యా భౌమార్కా ర్కీనాద్యరాత్రీశ్చతస్రః**
**గర్భాధానం త్ర్యుత్తరే న్ద్వర్కమైత్రబ్రాహ్మస్వాతీవిష్ణువస్వమ్బుపే సత్** 6

భద్ర,షష్ఠి,పర్వ,(అష్టమి, చతుర్దశి,అమావాస్య,పూర్ణిమ) రిక్త (4,9,14)తిథులు, సంధ్యాకాలము, భౌమ,రవి,శనివారములు, ఋతుకాలము నుండి నాలుగు రాత్రులు గర్భాధానములో వదలవలెను.

ఉత్తరాత్రయము, మృగశిర, హస్త, అనూరాధ, రోహిణి,స్వాతి, శ్రవణ, ధనిష్ఠ, శతభిష నక్షత్రములలో గర్భాధానము శుభమునిచ్చును.

**కేన్ద్రత్రికోణేషు శుభైశ్చ పాపైస్త్ర్యాయారిగైః పుంగ్రహదృష్టలగ్నే**
**ఓజాంశగేఽబ్జేఽపి చ యుగ్మరాత్రౌ చిత్రాదితీజ్యాశ్విషు మధ్యమం స్యాత్** 7

కేంద్ర (1,4,7,10) కోణ(5,9)భావములలో శుభగ్రహముల స్థితియున్న, తృతీయ, ఏకాదశ, షష్ఠభావములలో పాపగ్రహములున్న పురుషగ్రహముల దృష్టి లగ్నముపై నున్న, విషమరాశి నవాంశలలో చంద్రుడున్న ఋతుకాల సమరాత్రులలో గర్భాధానము ప్రశస్తమగును. చిత్త,పునర్వసు,పుష్యమి,అశ్విని,నక్షత్రములలో గర్భాధానము మధ్యమమగును.

**సీమంత సంస్కార ముహూర్తము :-**

**జీవార్కారదినే మృగేజ్య నిరృతిశ్రోత్రాదితి బ్రఘ్నభై:**
**రిక్తా మార్కరసాష్ట వర్జ్యతిథిభిర్మాసాధిపే పీవరే**
**సీమన్తోఽష్టమషష్ఠమాసి శుభదై: కేన్ద్రత్రికోణే ఖలై**
**ర్లాభారిత్రిషు వా ధ్రువాన్త్యసదహే లగ్నే చ పుంభాంశకే** **8**

గురు, రవి, మంగళవారములు, మృగశిర,పుష్యమి, మూల, శ్రవణ, పునర్వసు, హస్త నక్షత్రములలో, రిక్త(4,9,14)అమావాస్య,ద్వాదశి,షష్ఠి, అష్టమి తిథులను విడిచి మిగిలిన తిథులలో, గర్భమాసాధిపతి బలవంతుడైనపుడు, ఎనిమిదవ ఆరవమాసములో, శుభగ్రహములు కేంద్ర,కోణములలో నున్నపుడు పాపగ్రహములు 3,6,11స్థానములలో నున్నపుడు సీమంత సంస్కారము శుభమునిచ్చును. లేనియెడల ధ్రువసంజ్ఞక (ఉత్తరా త్రయం, రోహిణి, రేవతి) నక్షత్రములలో శుభగ్రహవారములలో పురుషలగ్న నవాంశములో సీమంతకర్మ శుభమునిచ్చును.

**గర్భమాసదేవతలు :-**

**మాసేశ్వరా:సితకుజేజ్యరవీన్దుసౌరి చన్ద్రాత్మజాస్తనుప చంద్ర దివాకరా:స్యు:**
**స్త్రీణాం విధోర్బలముశన్తి వివాహగర్భసంస్కారయోరితర కర్మసు భర్తురేవ** **9**

శుక్ర,సోమ, గురు, రవి, చంద్ర, శని, బుధ, గర్భాధానకాలిక లగ్నపతి, చంద్రుడు, సూర్యుడు క్రమముగా గర్భము యొక్క మొదటిమాసము నుండి అధిపతులగుదురు. అనగా మొదటిమాసమునకు శుక్రుడు, రెండవమాసమునకు కుజుడు,మూడవమాసమునకు గురుడు, నాల్గవమాసముకు రవి, ఐదవమాసమునకు చంద్రుడు, ఆరవమాసమునకు శని, ఏడవమాసమునకు బుధుడు, ఎనిమిదవమాసమునకు గర్భాధాన లగ్నాధిపతి, తొమ్మిదవ మాసానికి చంద్రుడు, పదవమాసానికి సూర్యుడధిపతులగుదురు.

వివాహ గర్భాధాన సంస్కారములలో స్త్రీకి చంద్రబలము, ఇతరకార్యములలో పురుషునికి చంద్రబలము చూడవలెను.

**పుంసవన ముహూర్తము :-**

**పూర్వోదితై: పుంసవనం విధేయం మాసే తృతీయే త్వథ విష్ణుపూజా**
**మాసేఽష్టమే విష్ణువిధాత్రు జీవైర్లగ్నే శుభే మృత్యుగృహే చ శుద్ధే** **10**

పూర్వము సీమంతోన్నయన సంస్కారములో తెలుపబడిన తిథి వార నక్షత్రములలో గర్భము తర్వాత మూడవమాసములో పుంసవన సంస్కారము చేయవలెను. దీని తర్వాత ఎనిమిదవ మాసములో శ్రవణము,రోహిణి, పుష్యమి,నక్షత్రములలో అష్టమభావము శుద్ధిగా నున్నప్పుడు గర్భిణీ స్త్రీ విష్ణుపూజచేయవలెను.

**పుంసవన సంస్కారము సీమంత సంస్కారము కన్న ముందు జరుగును. పురుష జాతకము సంస్కార యుక్తముగా చేయుటయే దీని ప్రధాన ఉద్దేశము. పుంసవనమునకు అర్థము 'పుమాన్ సూర్యతే-నేన కర్మణేతి పుంసవనమ్' గర్భస్థశిశువుకు పురుష స్త్రీ విభాజనము మూడవమాసములో జరుగును. అందువలన మూడవమాసములో పుంసవన సంస్కారము చేయబడును.**

**జాతకర్మ - నామకరణ ముహూర్తము :-**

**తజ్జాతకర్మాది శిశోర్విధేయం పూర్వాఖ్యరిక్తోనతిథౌ శుభేఽహ్ని**
**ఏకాదశే ద్వాదశకేఽపి ఘస్రే మృదు ధ్రువక్షిప్రచరోడుషు స్యాత్ 11**

అష్టమి,చతుర్దశి, అమావాస్య ఆది సర్వసంజ్ఞకములు, రిక్త (4,9,14) తిథులను విడిచి మిగిలిన తిథులలో శుభదినములలో, పుట్టిన తర్వాత పదకొండు లేక పన్నెండవ రోజున మృదు-క్షిప్ర, చర సంజ్ఞక (మృగశిర రేవతి,శ్రవణ,ధనిష్ఠ, శతభిష) నక్షత్రములలో నవశిశువుకు జాతకర్మ నామకరణ సంస్కారము చేయవలెను.

**సూతికాస్నాన ముహూర్తము :-**

**పౌష్ణ ధ్రువేన్దు కరవాతహయేషు సూతీస్నానం సమిత్రభరవీజ్య కుజేషుశస్తమ్**
**నార్ద్రాత్రయం శ్రుతిమఘాన్తకమిశ్రమూల త్వాష్ట్రేజ్ఞసౌరివసుషడ్విరిక్త తిథ్యామ్ 12**

రేవతి, ఉత్తరాత్రయం,రోహిణి,మృగశిర,హస్త,స్వాతి,అశ్విని,అనూరాధ నక్షత్రములలో రవి, గురు, మంగళవారములలో సూతికాస్నానము శుభమునిచ్చును. ఆర్ద్ర నుండి మూడు నక్షత్రములు (ఆర్ద్ర,పునర్వసు పుష్యమి) శ్రవణ, మఘ, మిశ్రసంజ్ఞక (విశాఖ,కృత్తిక) మూల,చిత్త నక్షత్రములలో బుధ,శనివారములలో 6,8,రిక్త (4,9,14) తిథులలో సూతికాస్నానము చేయవలెను.

**దంతోత్పతి ఫలము :-**

**మాసే చేత్ప్రథమే భవేత్సదశనో బాహో వినాశ్యైత్స్వయం**
**హన్యాత్స క్రమతోఽను జాతభగినీ మాత్రగ్రజాన్ ద్వాదికే**
**షష్ఠాదౌ లభతే హి భోజమతులం తాతాత్సుఖం పుష్టతాం**
**లక్ష్మీం సౌఖ్యమథో జనౌ సదశనో వోర్ధ్వం స్వపిత్రాదిహా 13**

జన్మించిన తర్వాత మొదటిమాసములో బాలకునికి దంతములు వచ్చిన స్వయముగా బాలకునికి నష్టము(మృత్యువు)కలుగును.రెండవమాసములో దంతోత్పత్తి కలిగిన తమ్మునికి, మూడవమాసములోనైన చెల్లిలికి,నాల్గవమాసములోనైన తల్లికి, ఐదవ మాసములోనైన అన్నకు నాశనము కలుగును.ఆరవమాసములో దంతోత్పత్తి కలిగిన సుఖప్రాప్తి, ఏడవ మాసములో తండ్రికి సుఖము,ఎనిమిదవ మాసములో ఆరోగ్యలాభము, తొమ్మిదవ మాసములో ధనలాభము, పదవమాసములోనైన సుఖప్రాప్తి కలుగును.దంతములతో

కూడి జన్మించిన లేక పైవరుసలో దంతములు వచ్చిన మాతాపితలను నాశనము చేయువాడగును.

**డోలారోహణ చక్రము :-**

**దోలారోహేఽర్కభాత్ పఞ్చశరపక్షేషు సప్తభై:**
**నైరుజ్యం మరణం కార్శ్యం వ్యాధి: సౌఖ్యం క్రమాచ్ఛిశో: 14**

డోలారోహణ సమయములో సూర్య నక్షత్రమునుండి 5,5,5,5,7 నక్షత్రముల విభాగములలో క్రమముగా బాలకునకు ఆరోగ్యము, మృత్యువు, దుర్బలత్వము, రోగము, సుఖము కలుగును. అనగా సూర్య నక్షత్రము నుండి వర్తమాన నక్షత్రము వరకు లెక్కించిన ఐదు నక్షత్రముల వరకు ఆరోగ్యము,తర్వాతి ఐదు నక్షత్రముల వరకు మృత్యువు, తర్వాతి ఐదు నక్షత్రముల వరకు దుర్బలత్వము, తర్వాతి ఐదు నక్షత్రముల వరకు రోగము, తర్వాతి ఏడు నక్షత్రముల వరకు సుఖము డోలారోహణములో కలుగును.

**డోలారోహణ నిష్క్రమణ ముహూర్తము :-**

**దన్తార్క భూపధ్రుతిదిఙ్మితవాసరే స్యాద్**
**ద్వారే శుభే మృదులఘుధ్రువ భై: శిశూనామ్**
**దోలాధిరూఢిరథ నిష్క్రమణం చతుర్థ**
**మాసే గమోక్తసమయేఽర్క మితేఽహ్ని వా స్యాత్ 15**

జన్మసమయము నుండి 32,12,16,18,10 దినములలో శుభగ్రహముల (సోమ బుధ గురు శుక్ర) వారములలో, మృదు, లఘు, ధ్రువసంజ్ఞక (మృగశిర, రేవతి,చిత్త, హస్త,అశ్విని, పుష్యమి,ఉత్తరాత్రయం, రోహిణి) నక్షత్రములలో నవజాతి శిశువును ఉయ్యాలలో వేయవలెను.దీని తర్వాత నాల్గవమాసములో లేక పన్నెండవ దినము, యాత్రకు తెల్పిన ముహూర్తములో నవజాత శిశువును మొదటిసారి బయటకు తీసుకొని వెళ్ళవలెను.

**సూతికలో జలపూజా ముహూర్తము :-**

**కవీజ్యాస్త చైత్రాధిమాసే న పౌషే జలం పూజయేత్సూతికా మాసపూర్తౌ**
**బుధేన్ద్వీ జ్యవారే విరిక్తే తిథౌ హి శ్రుతీజ్యాదితోన్ద్వర్క నైరృత్యమైత్రై: 16**

శుక్ర గురులు అస్తమించిన తర్వాత చైత్ర, పుష్యమాసములలో,అధిక మాసములో ప్రసవకాలము నుండి ఒకమాసము పూర్తయినతర్వాత కూడ బాలెంతరాలు జలపూజను చేయరాదు.బుధ,సోమ,గురువారములలో రిక్త(4,9,14) తిథులను విడిచి మిగిలినతిథులలో శ్రవణ,పుష్యమి,పునర్వసు,మృగశిర,హస్త, మూల, అనూరాధ నక్షత్రములలో ఒకమాసము తర్వాత బాలెంతరాలు జలాశయములో జలపూజను చేయవలెను.

**అన్నప్రాశన ముహూర్తము :-**

**రిక్తానన్దాష్ట దర్శం హరిదివసమథో సౌరిభౌమార్కవారాన్**

**లగ్నం జన్మర్క్ష లగ్నాష్టమగృహలవగం ఈనషమేషాలికం చ**
**హిత్వా షష్ఠాత్సమే మాస్యథ హి మృగదృశాం పఞ్చమాదోజమాసే**
**నక్షత్రైః స్యాత్ స్థిరాఖ్యైః సమృదు-లఘు-చరైర్బాలకాన్నాశనం సత్ 17**

రిక్త(4,9,14) నంద (1,6,11)అష్టమి,అమావాస్య,ద్వాదశి తిథులలో శనివారము, మంగళవారము,రవివారము,జన్మలగ్నము జన్మనక్షత్రము నుండి అష్టమభావములోనున్న రాశి నవమాంశము,మీన,మేష,వృశ్చికకగ్నము వదలి జన్మ సమయము నుండి ఆరవ మాసములో ఆరంభించి సమమాసములో బాలురకు ఐదవమాసము నుండి బేసిమాసములో బాలికకు స్థిర (ఉత్తరాత్రయం,రోహిణి) మృదు(మృగశిర,రేవతి, చిత్త, అనూరాధ) లఘుసంజ్ఞక (హస్త, అశ్విని, పుష్యమి, అభిజిత్తు) చర సంజ్ఞక(స్వాతి, పునర్వసు, శ్రవణ, ధనిష్ఠ, శతభిషం) నక్షత్రములలో పిల్లలకు అన్నప్రాశనము చేయవలెను.

**కేన్ద్ర త్రికోణసహజేషు శుభైః ఖశుద్ధే లగ్నే త్రిలాభరిపుగైశ్చ వదన్తి పాపైః**
**లగ్నాష్ట షష్ఠరహితం శశినం ప్రశస్తం మైత్రామ్బుపానిలజనుర్భమసచ్చ కేచిత్ 18**

కేంద్ర(1,4,7,10) త్రికోణ (5,9) తృతీయభావములలో శుభగ్రహములున్న లగ్న దశమభావములు శుద్ధములై, తృతీయ షష్ఠ ఏకాదశభావములలో పాపగ్రహములున్న, లగ్న,షష్ఠ,అష్టమములలో చంద్రుడు లేకున్న(1,6,8భావములను వదలి చంద్రుడు మిగిలిన భావములలోనున్న) అన్నప్రాశన ముహూర్తము శుభమగును. కొందరి ఆచార్యుల మతము ననుసరించి అనూరాధ,శతభిషం,స్వాతి, జన్మనక్షత్రములు అన్నప్రాశనములో శుభమును కలిగించును.

**అన్నప్రాశమున గ్రహముల స్థానబలము :-**

**క్షీణేన్దుపూర్ణ చన్ద్రేజ్య జ్ఞభౌమార్కార్కి భార్గవైః**
**త్రికోణవ్యయకేన్ద్రాష్టస్థితైరుక్తం ఫలం గ్రహైః 19**
**భిక్షాశీ యజ్ఞకృద్దీర్ఘజీవీ జ్ఞానీచ పిత్తరుక్**
**కుష్ఠీ చాన్నక్లేశ వాతవ్యాధిమాన్ భోగభాగితి 20**

క్షీణచంద్రుడు, పూర్ణచంద్రుడు, బృహస్పతి, బుధుడు, భౌముడు, సూర్యుడు, శని, శుక్రుడు వీరిలో ఏదైనగ్రహము త్రికోణ (5,9) పన్నెండవ,కేంద్ర (1,4,7,10) అష్టమ భావములలోనికి వెళ్ళిన క్రమముగా ఈ విధముగా ఫలితము కలుగును. అన్నప్రాశన సమయమున ఉక్తస్థానములలో క్షీణచంద్రుడున్న భిక్షాన్న భోజనము చేయువాడు, పూర్ణచంద్రుడున్న యజ్ఞము చేయువాడగును. బృహస్పతి యున్న దీర్ఘజీవి, బుధుడున్న జ్ఞాని, కుజుడున్న పిత్తరోగి, సూర్యుడున్న కుష్ఠిరోగి, శనియున్న దారిద్ర్యము,వాతరోగము, శుక్రుడున్న సంపన్నుడగును.

**భూమ్యుపవేశన ముహూర్తము :-**

**పృథ్వీం వరాహమభి పూజ్య కుజే విశుద్ధే**
**ఽ రిక్తే తిథౌ వ్రజతి పఞ్చమమాసి బాలమ్**
**బద్ధా శుభేఽహ్ని కటిసూత్రమథ ధ్రువేన్దు**
**జ్యేష్ఠర్క్ష మైత్ర-లఘుభైరుప వేశయేక్తౌ 21**

భూమిని వరావహావతార విష్ణువుని పూజించి కుజుడు బలవంతుడైనపుడు రిక్త(4,9,14)తిథులను వదలి మిగిలినతిథులలో జన్మ నుండి ఐదవమాసములో శుభ దినములలో ధ్రువసంజ్ఞక (ఉత్తరాత్రయం,రోహిణి) మృగశిర,జ్యేష్ఠ,అనూరాధ, లఘు సంజ్ఞక (హస్త,అశ్విని,పుష్యమి) నక్షత్రములలో బాలుని నడుముకు మొలత్రాడును కట్టి భూమిపై కూర్చుండబెట్టవలెను.

**తస్మిన్కాలే స్థాపయేత్తత్పురస్తాద్వస్త్రం శస్త్రం పుస్తకం లేఖనీం చ**
**స్వర్ణం రౌప్యం యచ్చ గహ్లాతి బాలస్తైరాజీవైస్తస్య వృత్తి: ప్రదిష్టా 22**

బాలకుని భూమ్యుపవేశన(మొదటిసారి భూమిపై కూర్చొనుట) సమయములో అతని ముందు వస్త్రము శస్త్రము పుస్తకము కలము బంగారము వెండి ఉంచవలెను. వాటిలో **ఏవస్తువును బాలకుడు తీసుకొనునో దానికి సంబంధించిన వ్యాపారము బాలకుని జీవనమగును.**

**బాలుని తాంబూల భక్షణ ముహూర్తము :-**

**వారే భౌమార్కిహీనే ధ్రువ మృదులఘుభైర్విష్ణు మూలాదితీన్ద్ర**
**స్వాతీవస్వ భ్యుపేతై ర్మిథునమృగసుతాకుమ్భ గోమీనలగ్నే**
**సౌమ్యై: కేన్ద్రత్రికోణైర శుభగగనగై: శత్రులాభత్రిసంస్థై**
**స్తామ్బూలం సార్ధమాసద్వయమిత సమయే ప్రోక్త మన్నాశనే వా 23**

కుజ శనివారములను వదలి మిగిలిన వారములలో ధ్రువ,మృదు లఘు సంజ్ఞక (ఉత్తరాత్రయం,రోహిణి,మృగశిర,రేవతి చిత్త, అనూరాధ, హస్త, అశ్విని, పుష్యమి, అభిజిత్తు) నక్షత్రములలో శ్రవణ,మూల,పునర్వసు,జ్యేష్ఠ,స్వాతి,ధనిష్ఠ నక్షత్రములలో మిథున, మకర, కన్య, కుంభ, ధను,మీన లగ్నములలో శుభగ్రహములు కేంద్ర (1,4,7,10) కోణ (5,9) భావములలో, పాపగ్రహములు షష్ఠ,తృతీయ, ఏకాదశభావములలో నున్నపుడు పుట్టిన సమయమునకు రెండున్నర మాసముల తర్వాత, లేక అన్నప్రాశన సమయములో శిశువు తాంబూల భక్షణమునకు శుభసమయమును తెల్పెను.

**కర్ణవేధ ముహూర్తము :-**

**హిత్వైతాంశ్చైత్రపౌషావమహరిశయనం జన్మమాసం చ రిక్తాం**
**యుగ్మాబ్దం జన్మతారామృతుమునివసుభి: సమ్మితే మాస్యథోవా**

**జన్మాహోత్పూర్యభూపై: పరిమితదివసే జ్ఞేజ్యశుక్రేన్దువారే ఉ**
**థౌజాబ్దే విష్ణుయుగ్మాదితి మృదులఘుభై: కర్ణవేధ: ప్రశస్త: 24**

జన్మదినము నుండి 30 దినముల వరకు జన్మమాసమగును. చైత్ర,పుష్య, తిథిక్షయ, జన్మమాస,హరిశయన కాల(ఆషాఢ శుక్ల ఏకాదశి నుండి కార్తీక శుక్ల ఏకాదశి వరకు 4 మాసములు) రిక్తతిథి (4,9,14) సమవర్ష,జన్మసంజ్ఞక ప్రథమతార వీటిని వదలి, జన్మమునుండి 6,7,8వమాసములలో లేక జన్మ నుండి 12,16వ దినములలో బుధ,గురు, శుక్ర సోమ వారములలో, విషమవర్షములో శ్రవణ, ధనిష్ఠ, పునర్వసు, మృదుసంజ్ఞక (మృగశిర,రేవతి,చిత్త,అనూరాధ)లఘుసంజ్ఞక (హస్త, అశ్విని, పుష్యమి,అభిజిత్తు) నక్షత్రము లలో కర్ణవేధను (చెవులు కుట్టుట)చేసిన శుభము కలుగును.

**సంశుద్ధే మృతిభవనే త్రికోణకేన్ద్ర త్ర్యాయస్థై: శుభఖచరై: కవీజ్యలగ్నే**
**పాపాఖ్యైరరి సహజాయగేహ సంస్థైర్లగ్నస్థే త్రిదశగురౌ శుభావహ:స్యాత్ 25**

లగ్నమునుండి అష్టమభావము శుద్ధి(గ్రహరహిత)గానున్నపుడు, కేంద్ర (1,4, 7,10)కోణ(5,9) తృతీయ, ఏకాదశభావములలో శుభగ్రహములున్నపుడు శుక్ర గురు లగ్నములలో (వృష,తుల,ధను, మీనములు),పాపగ్రహములు 6,3,11వ భావములలో నున్నపుడు లగ్నములో గురుడున్నపుడు కర్ణవేధ శుభమునిచ్చును.

**కర్ణవేధవిషయములో అష్టమభావశుద్ధి ఉండటము, లగ్నములో గురువు ఉండటము ప్రధానముగా తెలుపబడెను.కర్ణవేధ రంధ్రము అత్యంత సూక్ష్మముగా నుండవలెను.**

**గీర్వాణామ్బుప్రతిష్ఠా పరిణయ దహనాధాన గేహప్రవేశా**
**శ్చౌలం రాజాభిషేకో వ్రతమపి శుభదం నైవ యామ్యాయనే స్యాత్**
**నోవా బాల్యాస్తవార్ధే సురగురు సితయోర్నైవ కేతూదయే స్యాత్**
**పక్షం వార్ధం చ కేఙ్చిజహతి తమపరే యావదీక్షాం తదుగ్రే 26**

సూర్యుడు దక్షిణాయనములో నున్నపుడు (కర్కాటక సంక్రాంతి నుండి ధను సంక్రాంతి చివరి వరకు) దేవతల ప్రాణప్రతిష్ఠ జలాశయ ప్రతిష్ఠ(నిర్మాణము) వివాహము అగ్నిహోత్రధారణము, గృహప్రవేశము, ముండనము, రాజ్యాభిషేకము, వ్రతబంధము, శుభమునీయవు. బాల్యావస్థ, అస్తంగత, వృద్ధావస్థలలోనికి గురు శుక్రులు వెళ్ళునపుడు కేతువు ఉదయించినపుడు, ఉక్తకార్యములు శుభమునీయవు. కొందరి మతముననుసరించి కేతువు ఉదయించినపుడు 15రోజులు లేక 7 1/2 రోజులు వదలవలెను. కొందరి మతము ననుసరించి కేతువుదయ(దర్శనము) ముందువరకు శుభకార్యములను త్యజించవలెను.

**గురు శుక్రుల బాల్య వృద్ధత్వ నిరూపణము :-**

**పుర: పశ్చాత్ భృగోర్బాల్యం త్రిదశాహం చ వార్ధకమ్**

పక్షం పఞ్చదినం తే ద్వే గురో: పక్షముదాహృతే 27

పూర్వపశ్చిమ దిశలలో క్రమముగా మూడు రోజులు పదిరోజులు శుక్రునికి బాల్యావస్థ యగును. పూర్వపశ్చిమ దిశలలో అస్తమించుటకు పూర్వము క్రమముగా 15దినములు 5దినములు వృద్ధావస్థయగును. అనగా పూర్వదిశలో ఉదయమైనపుడు 3రోజులు, పశ్చిమములో ఉదయమైన తర్వాత 10 రోజుల వరకు బాల్యావస్థ యగును. ఇదేవిధముగా పూర్వము నుండి అస్తమగుటకు ముందు 15దినములు, పశ్చిమములో అస్తమగుటకుముందు 5 దినముల వరకు వృద్ధత్వముండును. ఈ రెండు అవస్థలు గురువుకు రెండు దిశలలో (పూర్వపశ్చిమ) ఉదయము తర్వాత 15దినముల వరకు బాల్యావస్థ, అదేవిధముగా అస్తమయమునకు ముందు 15 దినముల వరకు వృద్ధావస్థ కలుగును.

**వాస్తవముగా అన్ని గ్రహములు ఎల్లవేళల ఉదయించి యుండును. స్థానభేదము, సూర్యుని సమీపస్థితి ననుసరించి ఉదయాస్తమయములు కనపడునని సూర్యసిద్ధాంతము లో వ్రాయబడినది. "సూర్యేణాస్తమనం సహ" అనగా సూర్యునికి దగ్గరైన గ్రహము అస్తమయ మగును. గురు శుక్రుల ఉదయాస్తమయములు ముహూర్తపరముగా విశేష మహత్యము కలిగినవి.**

**శుక్రుడు పూర్వదిశలో అస్తమించిన రెండు మాసముల తర్వాత పశ్చిమదిశలో ఉదయించును.ఉదయించిన తర్వాత 8మాసముల 7రోజుల 22దినముల 30 ఘడియలకు పశ్చిమములో అస్తమించును. అస్తమించిన తర్వాత 7 రోజుల 30 ఘడియల తర్వాత పూర్వదిశలో తిరిగి ఉదయించును. ఉదయించిన తర్వాత 8 మాసముల 22 రోజుల 30 ఘడియలకు మరల పూర్వదిశలో అస్తమించును. ఇదేవిధముగా గురుడు అస్తమించి 1 నెల తర్వాత మరల ఉదయించును. ఉదయించిన తర్వాత సుమారుగా 12 నెలల 15 దినముల తర్వాత అస్తమించును.**

తే దశాహం ద్వయో: ప్రోక్తే కైశ్చిత్సప్తదినం పరై:
త్ర్యహం త్వాత్యయికేఽ ప్యన్యైరర్ధాహం చ త్ర్యహం విధో: 28

కొంతమంది విద్వాంసులు గురు శుక్రుల బాలవృద్ధత్వము రెండు,పదేసి దినములని తెల్పిరి. కొంతమంది ఏడేసిదినములని తెల్పిరి. కొంతమంది మూడేసి దినములు బాలవృద్ధత్వ కాలమని తెల్పిరి.

**ముండన ముహూర్తము :-**

చూడా వర్షా త్తృతీయాత్ప్రభవతి విషమేఽ ష్టార్క రిక్తాద్యషష్ఠీ
పర్వోనాహే విచైత్రోదగయనసమయే జ్ఞేన్దుశుక్రేజ్యకానామ్
వారే లగ్నాంశయోశ్చాశ్వభనిధనతనౌ నైధనే శుద్ధియుక్తే

**శాక్రోపేతై ర్విమైత్రై ర్మృదుచర లఘుభైరాయషట్ త్రిస్థపాపై: 29**

జన్మకాలము లేక ఆధానకాలము మొదలుకొని మూడవ సంవత్సరము నుండి విషమవర్షములలో ద్వాదశి, రిక్త(4,9,14) పాడ్యమి, షష్ఠి, అమావాస్య, చతుర్దశిలను విడిచి మిగిలిన తిథులలో, చైత్రమాసము వదలి మిగిలిన ఉత్తరాయణ మాసములలో, బుధ,చంద్ర,శుక్ర,గురువారములలోఈగ్రహముల లగ్నములలో,నవమాంశలలో, తమరాశి లగ్నము నుండి అష్టమరాశిలగ్నములను వదలి, అష్టమభావము శుద్ధిగా నున్నప్పుడు జ్యేష్ఠ,అనూరాధ,మృదు–చర–లఘుసంజ్ఞక (మృగశిర, రేవతి,చిత్త, స్వాతి, పునర్వసు, శ్రవణ ధనిష్ఠ,శతభిష,హస్త,అశ్విని,పుష్యమి)నక్షత్రములలో, లగ్నము నుండి 11,6,3 భావములలో పాపగ్రహములున్నపుడు చూడాకర్మ (పుట్టివెంట్రుకలు తీయించుట) చేసిన శుభము కలుగును.

**మనువు ప్రథమ,ద్వితీయ సంవత్సరములలో ముండనసంస్కారము చేయవచ్చునని తెల్పెను.కశ్యపమతానుసారము అన్నప్రాశనము,ముండనము వ్రతబంధనము, రాజ్యాభిషేకములలో జన్మనక్షత్రము అనుకూలించును.మిగిలిన కార్యములలో జన్మ నక్షత్రమును వదలవలెను.**

**క్షీణచంద్ర కుజసౌరి భాస్కరైర్మృత్యుశస్త్రమృతిపఙ్గుతాజ్వరా:**
**స్యు: క్రమేణ బుధ జీవభార్గవై: కేన్ద్రగైశ్చ శుభమిష్టతారయా 30**

కేంద్రస్థానములోనికి క్షీణచంద్రుడు, కుజుడు శని,సూర్యుడు వెళ్ళిన క్రమముగా మృత్యువు, శస్త్రాఘాతముచే మృత్యువు, కుంటితనము, జ్వరము కలుగును. అనగా ముండన సమయములో కేంద్రములో క్షీణచంద్రుడున్న మృత్యువు, కుజుడున్న శస్త్రము వలన మృత్యువు, శనియున్న కుంటితనము, సూర్యుడున్న జ్వరము కలుగును. బుధ గురు శుక్రులు కేంద్రస్థానములో నున్న, శుభతారలున్న ముండనము శుభమును కలిగించును.

**పఞ్చమాసాధికే మాతుర్గర్భే చౌల శిశోర్న సత్**
**పఞ్చవర్షాధికస్యేష్టం గర్భిన్యామపి మాతరి 31**

ముండన సమయములో తల్లి గర్భవతియైన గర్భము ఐదుమాసముల కన్న అధికమైన బాలకునికి ముండన సంస్కారము శుభమునీయదు. అనగా గర్భము ధరించి 5 మాసముల కన్న తక్కువైన ముండనము చేయవచ్చును. ఒకవేళ బాలునికి ఐదు సంవత్సరములకన్న అధికమైన వయసు వచ్చిన తల్లి గర్భవతి అయినప్పటికి ముండనకర్మ చేయవచ్చును.

**తారాదౌష్ట్యేऽబ్జే త్రికోణోచ్చగే వా క్షౌరం సత్స్యాత్సౌమ్య మిత్రస్వ వర్గే**
**సౌమ్యే భేऽబ్జే శోభనే దుష్టతారా శస్తా జ్ఞేయా క్షౌరయాత్రాది కృత్యే 32**

అశుభతార అయినప్పటికి చంద్రుడు త్రికోణ భావములో లేక తన ఉచ్చరాశిలో (వృషభం) నున్న ముండనకార్యము శుభమునిచ్చును. శుభగ్రహ వర్గము(షడ్వర్గ)లో, మిత్రగ్రహ షడ్వర్గులో లేక తనషడ్వర్గులో చంద్రుడున్న, గోచారములో చంద్రుడు శుభుడైన అశుభతార అయినప్పటికి ముండనము యాత్రదికార్యములు శుభమునిచ్చును.

**ఋతుమత్యా: సూతికాయా: సూనోశ్చౌలాది నాచరేత్**
**జ్యేష్ఠాపత్యస్య న జ్యేష్ఠే కశ్చిన్మార్గేఽపి నేష్యతే 33**

రజస్వల,సూతికాస్త్రీ తన సంతానమునకు ముండనాది సంస్కారము చేయరాదు. అనగా ముండన సమయములో శిశువు తల్లి రజస్వలయైన లేక బిడ్డకు జన్మనిచ్చు సమయము (సూతికాకాలము)లో ముండనముచేయరాదు. జ్యేష్ఠ సంతానమునకు ముండనాది సంస్కారము జ్యేష్ఠమాసములో, కొంతమంది ఆచార్యుల మతానుసారము మార్గశిరమాసములో చేయరాదు.

**రజస్వలస్త్రీ ఐదవరోజున శుద్ధురాలగును. అందువలన ఉక్తముహూర్తములో ఐదవ రోజున స్త్రీతన సంతానమునకు ముండన వివాహాది శుభకార్యములు చేయవచ్చును.**

**సూతికాశుద్ధి విషయములో అనేక మతములున్నవి. సామాన్యముగా 21 రోజుల తర్వాత ప్రసూతిశుద్ధి జరుగును. విష్ణుస్మృతి ననుసరించి పుత్రజన్మములో 20దినముల తర్వాత, పుత్రికా జన్మములో 30 దినముల తర్వాత ప్రసూతిశుద్ధి జరుగును.**

క్షౌర ముహూర్తము :-

దన్తక్షౌరనఖ క్రియాత్ర విహితా చౌలోదితే వారభే
పాతంగ్యాతరవీన్విహాయ నవమం ఘస్రం చ సంధ్యాం తథా
రిక్తాం పర్వనిశాం నిరాసనరణ గ్రామప్రయాణోద్యత
స్నాతాభ్యక్త కృతాశనైర్నహి పున: కార్యా హితప్రేప్సుభి: 34

శని కుజ రవివారములు, క్షౌరదినము నుండి తొమ్మిదవ దినము, ప్రాత:కాలము, సాయంకాలము,రిక్త(4,9,14)తిథి,పర్వకాలము రాత్రికాలములను వదలి ముండన ముహూర్తములలో తెల్పిన దినము,నక్షత్రములలో దంతప్రక్షాళనము, క్షౌరము,గోళ్లు కత్తిరించుకొనుట చేయవలెను. **తమ హితము కోరువారు వ్యక్తులు ఆసనము లేకుండ (ఆసనముపై కూర్చొనకుండ)యుద్ధసమయములో,గ్రామములో యాత్రకు తయారగునపుడు,అభ్యంగస్నానము భోజనముచేసిన తర్వాత క్షౌరాదికార్యములు చేయరాదు.**

**గంగా తటము, భాస్కరక్షేత్రము, మాతాపితల శ్రాద్ధదినము ఆధానము, సోమపాన సమయములందు ముహూర్తములు చూడకనే క్షౌరకర్మ చేసికొనవచ్చును.ఇంతేకాక రాజ్య కార్యము లందు నియుక్తులైనవారు నాటకపాత్రధారులు వేషభూషణములతో జీవనము సాగించువారు క్షౌరము చేసుకొనవచ్చును.ముహూర్తమును చూడవలసిన అవసరములేదు.**

**క్రతు పాణిపీడమృత్తిబంధ మోక్షణే క్షురకర్మ చ ద్విజనృపాజ్ఞయాచరేత్**
**శవవాహతీర్థగమసిన్ధు మజ్జనక్షురమాచరేన్న ఖలు గర్భిణీపతి:** 35

యజ్ఞము, వివాహము,మాతాపితల మృత్యుసమయము, జైలునుండి బయటికి వచ్చినపుడు,బ్రాహ్మణ,రాజుల ఆదేశముతో క్షౌరకర్మ చేసికొనవచ్చును. శవయాత్ర, తీర్థయాత్ర, సముద్రస్నానము, క్షౌరకర్మ, భార్య గర్భిణిగ నున్నపుడు భర్త చేయకూడదు.

**నృపాణాం హితం క్షౌరభే శ్మశ్రుకర్మ దినే పఞ్చమే పఞ్చమేఽస్యోదయే వా**
**షడగ్నిస్త్రిమైత్రోఽష్టక: పఞ్చపిత్రోఽబ్దతోఽబ్ధ్యర్యమా క్షౌరకృన్మృత్యుమేతి** 36

రాజులకు క్షౌరకర్మలో చెప్పబడిన నక్షత్రములలో ఐదేసి దినములకు ఒకమారు లేక క్షీరోక్త నక్షత్రముల ఉదయకాలములో శ్మశ్రుకర్మ (గడ్డము మున్నగున్నగు పనులు) చేయవలెను. ఒక సంవత్సరములో ఆరుమార్లు కృత్తికలో, 3మార్లు అనూరాధలో, 8మార్లు రోహిణిలో, 5మార్లు మఘలో, 4మార్లు ఉత్తరలో క్షౌరకర్మ చేసినవానికి ఒక సంవత్సరములో మృత్యువు కలుగును.

**అక్షరారంభ ముహూర్తము** :-

**గణేశ-విష్ణు-వాగ్రమా: ప్రపూజ్య పఞ్చమాబ్దకే**
**తిథౌ శివాకదిగ్ద్విషట్శరత్రికే రవావుదక్**
**లఘుశ్రవోఽనిలాన్త్యభాదితోశతక్షమిత్రభే**
**చరోనసత్తనౌ శిశోర్లిపిగ్రహ: సతాందినే** 37

గణేశ,విష్ణు,సరస్వతి,లక్ష్మిలకు విధిపూర్వకముగా పూజచేసి ఐదవ సంవత్సరములో ఏకాదశి,ద్వాదశి,విదియ,షష్ఠి,పంచమి, తదియ తిథులలో సూర్యుడు ఉత్తరాయణములో నున్నపుడు లఘుసంజ్ఞక (హస్త,అశ్విని,పుష్యమి,అభిజిత్తు) శ్రవణ స్వాతి, రేవతి,పునర్వసు, ఆర్ద్ర,చిత్త,అనూరాధ నక్షత్రములలో చరలగ్న(1,4,7,10)లను వదలి శుభగ్రహ లగ్నము లలో (2,3,4,6,7,9,12) శుభగ్రహ (చంద్ర,బుధ,గురు,శుక్ర) వారములలో అక్షరాభ్యాసము ప్రారంభించవలెను.

**మృగాత్కరా చ్ఛ్రుతేస్త్రయేఽశ్విమూల పూర్వికాత్రయే**
**గురు ద్వయేఽర్కజీవవిత్సితేఽహ్ని షట్శరత్రికే**
**శివార్క దిగ్ద్వికే తిథౌ ధ్రువాన్త్యమిత్రభే పరై:**
**శుభైరధీతిరుత్తమా త్రికోణకేన్ద్రగై: స్మృతా** 38

మృగశిర, హస్త,శ్రవణ, మూల నుండి మూడేసి నక్షత్రములు అనగా మృగశిర, ఆర్ద్ర,పునర్వసు,హస్త,చిత్త,స్వాతి,శ్రవణ, ధనిష్ఠ,శతభిషం,అశ్విని,మూల, పుబ్బ,పూర్వాషాఢ, పూర్వాభాద్ర, పుష్యమి, ఆశ్లేష, నక్షత్రములలో రవి, గురు,బుధ,శుక్రవారములలో షష్ఠి

పంచమి,తదియ,ఏకాదశి, ద్వాదశి, దశమి, విదియ తుథులలో శుభగ్రహములు కేంద్ర త్రికోణముల(1,4,7,10,5,9)లో నున్నప్పుడు కొంతమంది విద్వాంసుల మతానుసారము ధ్రువసంజ్ఞక (ఉత్తరాత్రయం,రోహిణి) రేవతి, అనూరాధ నక్షత్రములలో విద్యాధ్యయనము ప్రారంభించవలెను.

**వ్రతబంధ ముహూర్తము** :-

**విప్రాణాం వ్రతబంధ నిగదితం గర్భాజ్జనే ర్వాష్టమే**
**వర్షే వాప్యథ పఞ్చమే క్షితిభుజాం షష్ఠే తథైకాదశే**
**వైశ్యానాం పునరష్టమేఽ ప్యథ పున: స్యాద్ద్వాదశే వత్సరే**
**కాలేఽ థ ద్విగుణే గతే నిగదితే గౌణం తదాహుర్బుధా: 39**

గర్భాధాన కాలము లేక జన్మకాలము నుండి ఎనిమిదవ లేక ఐదవవర్షములలో బ్రాహ్మణులకు, ఆరవ పదకొండవ వర్షములలో క్షత్రియులకు, ఎనిమిదవ పన్నెండవ వర్షములలో వైశ్యులకు యజ్ఞోపవీత సంస్కారము చేయవలెను. ఉక్తకాలమును రెట్టింపు సమయము జరిగినపుడు చేయు యజ్ఞోపవీత సంస్కారమును విద్వాంసులు గౌణ(సామాన్య) యజ్ఞోపవీతమనిరి.

**విహితకాలములో లేక ద్విగుణిత కాలములో వ్రతబంధక్రియ చేయవచ్చును. కాని ముఖ్యగౌణ కాలములు సమాప్తమైన తర్వాత చేయు వ్రతబంధము వలన మనుష్యులకు గాయత్రిని చేయు అధికారము సమాప్తమగును.వారు సంస్కారహీనులగుదురు.**

**వ్రతబంధ ముహూర్తము :-**

**క్షిప్రధ్రువాహి చరమూల మృదుత్రిపూర్వారౌద్రేఽ ర్క విద్గురు సితేన్దుదినే వ్రతం సత్**
**ద్విత్రీషురుద్ర రవిదిక్ప్రమితే తిథౌ చ కృష్ణాదిమత్రిలవకేఽ పి న చాపరాహ్ణే 40**

క్షిప్ర సంజ్ఞక(హస్త, అశ్విని,పుష్యమి)ధ్రువసంజ్ఞక(ఉత్తరాత్రయం రోహిణి) ఆశ్లేష, చరసంజ్ఞక (స్వాతి, పునర్వసు, శ్రవణ, ధనిష్ఠ,శతభిషం)మూల, మృదుసంజ్ఞక (మృగశిర, రేవతి, చిత్త) పుబ్బ, పూర్వాషాఢ,పూర్వాభాద్ర,ఆర్ద్ర నక్షత్రములలో రవి, బుధ,గురు,శుక్ర సోమవారములలో 2,3,5,11,12,10 తిథులలో, శుక్లపక్షములో పాడ్యమి నుండి పంచమి వరకు ఉపనయనము శుభమునిచ్చును. మధ్యాహ్నము తర్వాత ఉపనయనము చేయరాదు.

**పైశ్లోకములో నక్షత్ర, తిథి, వారములను తెల్పెను. కాని మాసమును తెలుపలేదు. ఇదే ప్రకరణములో 26వ శ్లోకములో "చౌలం రాజ్యాభిషేకో వ్రతమపి శుభదం నైవ యామ్యాయనే స్యాత్" దక్షిణాయనమును నిషేధించి ఉత్తరాయణములో మాఘమాసము నుండి ఆషాఢమాసము వరకు ఆరుమాసములు వ్రతబంధమును గ్రహింపవచ్చునని తెల్పెను.**

కాశ్యపమతానుసారము బ్రాహ్మణులకు వసంత ఋతువు, క్షత్రియులకు గ్రీష్మఋతువు, వైశ్యులకు శరదృతువు అనుకూలము. సాధారణముగా మాఘమాసము నుండి ఐదు నెలలు అనుకూలము. బ్రాహ్మణులకు చైత్రమాసములో కూడా ప్రశస్తమని తెలుపబడినది. పునర్వసు నక్షత్రము బుధవారములలో బ్రాహ్మణులు ఉపనయనము చేసుకొనరాదు.

**ఉపనయమునకశుభ స్థానములు :-**

**కవీజ్య-చంద్ర-లగ్నపా రిపౌ మృతౌ వ్రతేధమా:**
**వ్యయేఽబ్జ భార్గవౌ తథా తనౌ మృతౌ సుతే ఖలా: 41**

వ్రతబంధములో లగ్నమునుండి ఆరవ,ఎనిమిదవ భావములలో శుక్రుడు, గురుడు, చంద్రుడు, లగ్నేశుడు అశుభులగుదురు. చంద్రుడు, శుక్రుడు పన్నెండు భావములలో అశుభులగుదురు. అశుభగ్రహ లగ్నము, అష్టమ పంచమభావములు అశుభమగును.

**ఉపనయములో లగ్నశుద్ధి :-**

**వ్రతబన్ధేఽష్ట షడ్రిష్ఫ వర్జితా: శోభనా: శుభా:**
**త్రిషడాయే ఖలా: పూర్ణో గోకర్కస్థో విధుస్తనౌ 42**

వ్రతబంధ(ఉపనయన)కాలములో లగ్నము నుండి 8,6,12భావములను వదలి మిగిలినభావములలో శుభగ్రహములు 3,6,11భావములలో పాపగ్రహములు, లగ్నములో బలవంతుడైన చంద్రుడు వృషభకర్కాటక రాశులలోనున్న శుభము కలుగును.

**బ్రాహ్మణాదుల స్వాములు :-**

**విప్రాధీశౌ భాగవేజ్యౌ కుజార్కౌ రాజన్యానామోషధీశో విశాం చ**
**శూద్రాణాం జ్ఞశ్చాన్త్యజానాం శని: స్యాచ్ఛాఖేశా: స్యుర్జీవశుక్రారసౌమ్యా:43**

బ్రాహ్మణవర్ణమునకు స్వాములు గురు శుక్రులు, క్షత్రియులకు రవి కుజులు, వైశ్యులకు చంద్రుడు, శూద్రులకు బుధుడు, అంత్యజులకు స్వామి శనియగును. నాలుగు వేదములకు స్వాములు క్రమముగా గురు శుక్ర కుజ బుధులు. అనగా ఋగ్వేదమునకు గురుడు, యజుర్వేదమునకు శుక్రుడు, సామవేదమునకు కుజుడు, అథర్వణవేదమునకు స్వామి బుధుడగును.

**వర్ణేశుల ప్రయోజనము :-**

**శాఖేశవారతను వీర్యమతీవ శస్తం శాఖేశసూర్యశశిజీవబలే వ్రతం సత్**
**జీవే భృగౌ రిపుగృహే విజితే చ నీచే స్యాద్వేదశాస్త్రవిధినా రహితో వ్రతేన 44**

వేదశాఖలస్వామి,గ్రహవారములు లగ్నము బలముగానున్నప్పుడు వ్రతబంధముత్తమమగును. వేదశాఖస్వామిగ్రహము,సూర్య,చంద్ర,గురులు బలవంతులైన వ్రతబంధము శుభకరమగును. గురు శుక్రులు శత్రుగ్రహరాశిలో నున్న, ఏగ్రహముతోనైన

పరాజితమైన, తమనీచరాశిలో నున్నపుడు వ్రతబంధము చేసిన 'వటుడు' వేదశాస్త్రవిధులు తెలియనివాడగును. ఈ స్థితిలో వ్రతబంధము చేయరాదు.

**వ్రతబంధములో జన్మమాస విచారము :-**

**జన్మర్క్ష మాసలగ్నాదౌ వ్రతే విద్యాధికో వ్రతీ**
**ఆద్యగర్భేఽపి విప్రాణాం క్షత్రాదీనామనాదిమే 45**

బ్రాహ్మణులు ప్రథమగర్భములోనుత్పన్నమైన బాలకుని ఉపనయనము జన్మ నక్షత్రము,జన్మమాసము,జన్మలగ్నములలో చేసిన వటుడు (బాలకుడు) అధిక విద్వాంసు డగును.క్షత్రియ వైశ్యులు ప్రథమగర్భములో ఉత్పన్నమైనవానిని వదిలి ద్వితీయాది పుత్రులకు యజ్ఞోపవీతము జన్మలగ్నము,జన్మమాసము,జన్మనక్షత్రములలో చేసిన విద్వాంసుడగును.

**కొందరు విద్వాంసులు బ్రాహ్మణులకు ప్రథమపుత్రునితో పాటు మిగిలిన పుత్రులకు కూడ జన్మమాస, జన్మనక్షత్ర, జన్మలగ్నములలో ఉపనయనము చేయవచ్చునని తెల్పిరి. అందువలన బ్రాహ్మణులకు పుత్రులందరికి క్షత్రియ వైశ్యులకు ప్రథమపుత్రుని వదలి మిగిలిన వారికి ఉపనయన సంస్కారము చేయవచ్చును.**

**సామాన్యముగా శుభకార్యములలో జన్మమాసము, జన్మనక్షత్రము, జన్మలగ్నముల నిషేధముండును. కానివ్రతబంధ విషయములో జన్మమాసాదులను గ్రహించుట జరిగినది.**

**శుభకర్మ లందు గురు విచారము :-**

**వటు కన్యాజన్మరాశేస్త్రి కోణాయద్వి సప్తగ:**
**శ్రేష్ఠో గురు: ఖషట్‌త్ర్యాద్యే పూజయాన్యత్ర నిన్దిత: 46**

బాలునికి లేక బాలికకు జన్మరాశి నుండి 5,6,11,2,7 స్థానములలో నున్న గురుడు శుభమునిచ్చును.రాశి నుండి 10,6,3,1 స్థానములలో నున్న గురుడు పూజచేసిన తర్వాత శుభుడగును. 4,8,12 స్థానములలో నున్న గురుడు అశుభము నిచ్చును.

**నారద వశిష్ఠాది ఋషుల మతానుసారము గురుబలమును ఉపనయములో కాక వివాహములో గ్రహించవలెను. ఉపనయన కాలము కొరకు తెల్పిన కాలమును ఉల్లంఘున చేయరాదు. అటువంటి పరిస్థితి వచ్చిన గురువుకు శాంతి చేసి ఉపనయనము చేయవలెను.**

**స్వోచ్చే స్వభే స్వమైత్రే వా స్వాంశే వర్గోత్తమే గురు:**
**రిష్ఫాష్ట తుర్యగోఽపీష్టో నీచారిస్థ: శుభోఽప్యసన్ 47**

తన ఉచ్చరాశిలో, తనరాశి (9,12)లో, మిత్రరాశిలో, తన నవాంశలో వర్గోత్తమ రాశిలో నున్న గురుడు ద్వితీయ, అష్టమ చతుర్థభావములలో నున్నప్పుడు శుభుడగును. తననీచరాశి, శత్రుగ్రహరాశిలో నున్న గురుడు శుభుడైనప్పటికి అశుభమునిచ్చును.

**ఉపనయన నిషిద్ధ కాలము :-**

**కృష్ణే ప్రదోషేఽన ధ్యాయే శనౌ నిశ్యపరాహ్ణకే**
**ప్రాక్సంధ్యా గర్జితే నేష్టో వ్రతబంధో గలగ్రహే 48**

కృష్ణపక్షము (షష్ఠి నుండి అమావాస్య వరకు)ప్రదోషకాలము (తృతీయ సప్తమి ద్వాదశిలసంధికాలము) అనధ్యాయము (వ్రతబంధములో నిషేధించిన అనధ్యాయ తిథులు) శనివారము,రాత్రికాలము,అపరాహ్ణము(మధ్యాహ్నము తర్వాత)దుర్దినములో (ప్రాత:కాలము, మేఘముల గర్జనలు కలిగినది) గల గ్రహసంజ్ఞక తిథుల(1,4,7, 8,9, 13,14,15)లో వ్రతబంధము శుభమునీయదు.

**క్రూరో జడో భవేత్పాప: పటు: షట్కర్మకృద్వటు**
**యజ్ఞార్థభాక్ తథామూర్ఖో రవ్యాద్యంశే తనౌ క్రమాత్ 49**

యజ్ఞోపవీతకాల లగ్నములో సూర్యాది గ్రహముల నవాంశఫలము క్రమముగా క్రూరుడు,జడుడు,పాపి,చతురుడు,యజ్ఞయాగాది ఆరు కర్మలకర్త, యజ్ఞకర్త ధనవంతుడు, మూర్ఖుడు అగును. అనగా ఉపనయన కాలములో సూర్యనవాంశయైన వటువు, క్రూరుడు, చంద్ర నవాంశయైన జడుడు, కుజనవాంశయైన పాపి, బుధనవాంశయైన బుద్ధిమంతుడు, గురునవాంశయైన షట్కర్ముడు(యజ్ఞముచేయుట,చేయించుట, అధ్యయనము, అధ్యాపనము, దానమిచ్చుట, తీసుకొనుట) శుక్రనవాంశయైన యజ్ఞము చేయువాడు, ధనవంతుడు, శనినవాంశయైన మూర్ఖుడగును.

**చంద్ర నవాంశ వైశిష్ట్యము :-**

**విద్యానిరత: శుభరాశిలవే పాపాంశగతే హి దరిద్రతర:**
**చన్ద్రే స్వలవే బహుదు:ఖయుత: కర్ణాదితిభే ధనవాన్స్వలవే 50**

చంద్రుడు ఉపనయన సమయములో శుభగ్రహముల నవాంశలోనున్న వటువు విద్యయందాసక్తి కలిగియుండును. పాపగ్రహ రాశి నవాంశలలో నున్న అత్యంత దరిద్రుడు, తనస్వనవాంశలలోనున్న అత్యంత దు:ఖవంతుడగును. చంద్రుడు శ్రవణ, పునర్వసు నక్షత్రము లలో, తన నవాంశలో నున్నపుడు ఉపనయనము చేసిన వటుడు ధనవంతుడగును.

**కేంద్రస్థ గ్రహఫలములు :-**

**రాజసేవీ వైశ్యవృత్తి: శస్త్రవృత్తిశ్చ పాఠక:**
**ప్రాజ్ఞోఽర్థవాన్ మ్లేచ్ఛసేవీ కేన్ద్రే సూర్యాదిఖేచరై: 51**

వ్రతబంధకాలలగ్నములలో కేంద్రస్థానములలో సూర్యుడున్న వటువు రాజసేవకుడు (రాజకీయ కర్మచారి) చంద్రుడున్న వ్యాపారి,కుజుడున్న శస్త్రముతో జీవించు వాడు, బుధుడున్న అధ్యాపకుడు, గురుడున్న బుద్ధిమంతుడు, శుక్రుడున్న ధనవంతుడు, శనియున్న మ్లేచ్ఛులకు సేవకుడగును.

**ఉపనయమున గ్రహయుతి ఫలము :-**

**శుక్రే జీవే తథా చన్ద్రే సూర్య-భౌమార్కి సంయుతే**
**నిర్గుణ: క్రూరచేష్ట: స్యాన్నిర్ఘృణ: సద్యుతే పటు: 52**

వ్రతబంధ కాలములో శుక్రుడు గురుడు చంద్రుడు (ఒకేచోట అందరులేక వేరువేరుగ) సూర్యునితో కలిసియున్న 'వటువు' గుణరహితుడగును. కుజునితో కూడియున్న క్రూరకర్మ చేయువాడు,శనితో కూడియున్న సిగ్గులేనివాడు, దయలేనివాడు అగును. మూడు గ్రహములు శుభగ్రహములతో కూడియున్న వటుడు చతురుడగును.

**చంద్రఫల వైశిష్ట్యము :-**

**విధౌ సితాంశగే సితే త్రికోణగే తనౌ గురౌ**
**సమస్త వేదవిద్ వ్రతీ యమాంశగేఽతి నిర్ఘృణ: 53**

వ్రతబంధ సమయములో చంద్రుడు శుక్రనవాంశలో, శుక్రుడు త్రికోణము (5,9)లో గురుడు లగ్నములోనున్న వటుడు' సమస్త వేదములను తెలిసినవాడగును. చంద్రుడు శనినవాంశములో, శుక్రుడు త్రికోణము, గురుడు లగ్నములోనున్న వటుడు నిర్లజ్జ కలవాడు, దయాహీనుడగును.

**ఉపనయనమునందు అనాధ్యాయములు :-**

**శుచిశుక్ర పౌష తపసాం దిగశ్విరుద్రార్క సఙ్ఖ్య సిత తిథయ:**
**భూతాదిత్రితయాష్టమీ సఙ్క్రమణం చ వ్రతేష్వనద్యాయా: 54**

ఆషాఢ, జ్యేష్ఠ, పుష్య,మాఘమాసములలో శుక్లపక్షములో క్రమముగా 10,2, 11,12 తిథులు (ఆషాఢ శుక్లదశమి, జ్యేష్ఠ శుక్ల విదియ, పుష్య శుక్ల ఏకాదశి, మాఘ శుక్ల ద్వాదశి) అన్నిమాసములలో రెండు పక్షములలో చతుర్దశి నుండి మూడు తిథులు (చతుర్దశి పౌర్ణమి,అమావాస్య)పాడ్యమి,అష్టమి తిథులు,సంక్రాంతి దినములు వ్రతబంధము లో అనధ్యాయ సంజ్ఞకములగును.పైతిథులను వ్రతబంధములో వదలిపెట్టవలెను.

అనధ్యాయ సంజ్ఞక తిథులు వేదాధ్యయనము, వేదాంగాధ్యయనములో నిషేధింప బడినవి.వ్రతబంధములో వటువుకి దీక్ష ఇవ్వబడును. ప్రాచీనకాలములో వ్రతబంధ మైన పిమ్మట విద్యారంభము జరిగెడిది.అందువలన అనధ్యాయసంజ్ఞక తిథులు వ్రతబంధములో కూడ నిషేధింపబడినవి.వీటితో పాటు వజ్రపాతము,భూకంపము, ఉల్కాపాతము,అకాలవర్షము మున్నగు ఆకాశీయ (దైవీ)ఉత్పాతములలో అనధ్యాయము జరుగును.

**ప్రదోష లక్షణము :-**

**అర్క తర్క త్రితిథిషు ప్రదోష: స్యాత్తదగ్రిమై:**
**రాత్ర్యర్ధసార్ధప్రహరయామ మధ్యస్థితై: క్రమాత్ 55**

ద్వాదశి తిథిలో అర్ధరాత్రికి పూర్వము త్రయోదశి తిథియైన, షష్ఠిలో 1 1/2 ప్రహరలోపల సప్తమి తిథియైన, తదియలో ప్రథమ ప్రహరమధ్యలో చవితియైన ప్రదోషకాల దోషమని తెలుపబడును.

**బ్రహ్మౌదన సంస్కారము :-**

**ప్రాగ్బ్రహ్మౌదనపాకాద్ వ్రతబన్ధానన్తరం యది చేత్**
**ఉత్పాతానధ్యయనో త్పత్తావపి శాన్తిపూర్వకం తత్స్యాత్ 56**

వ్రతబంధమైన తర్వాత అదే రోజున సాయంకాలము బ్రహ్మౌదనపాక సంస్కారము ముందు ఏదైన ఉత్పాతము లేక అనధ్యాయము కలిగిన దానికి శాంతి చేసి బహ్మౌదనపాక సంస్కారము చేయవలెను.

**వ్రతబంధమైన తర్వాత 'బహ్మౌదనపాక' విధియుండును. బ్రహ్మచారి దీక్షను తీసికొన్న తర్వాత దీనిని చేయుదురు. బ్రహ్మ ప్రసన్నతకు చేయు పాకకర్మలో ఉత్పాతాది అపశకునములు జరిగిన పాకకర్మ చేయరాదు. శాస్త్రోక్తముగా శాంతి జరిపి బహ్మౌదనపాక విధిని చేయవచ్చును.**

**వ్రతక్రమ నక్షత్రములు :-**

**వేదక్రమాచ్ఛశివాహికరత్రిమూల పూర్వాసు పౌష్ణకరమైత్రమృగాదితీజ్యే**
**ధ్రౌవేషు చాశ్వివసుపుష్యకరోత్తరేశకర్ణే మృగాన్త్యలఘుమైత్ర ధనాదితౌసత్ 57**

నాలుగు వేదముల క్రమములో వేరువేరు వ్రతబంధముల కొరకు నక్షత్రములు తెలుపబడినవి. మృగశిర, ఆర్ద్ర, ఆశ్లేష, హస్త, చిత్త, స్వాతి, మూల, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర ఋగ్వేదీయులకు, రేవతి,హస్త,అనూరాధ మృగశిర, పునర్వసు, పుష్యమి, ధ్రువసంజ్ఞక (ఉత్తరాత్రయం, రోహిణి) నక్షత్రములు యజుర్వేదీయులకు, అశ్విని,ధనిష్ఠ పుష్యమి, హస్త ఉత్తరాత్రయం, ఆర్ద్ర శ్రవణములు సామవేదీయులకు, మృగశిర, రేవతి, లఘుసంజ్ఞక (హస్త అశ్విని,పుష్యమి) అనూరాధ ధనిష్ఠ పునర్వసు, అథర్వవేదీయులకు వ్రతబంధములో శుభమునిచ్చును.

**మాతారజస్వల పరిహారము :-**

**నాన్దీశ్రాద్ధోత్తరం మాతు: పుష్పే లగ్నాన్తరే న హి**
**శాన్త్యా చౌలం వ్రతం పాణిగ్రహ: కార్యోఽన్యథా న సత్ 58**

వివాహాది శుభకార్యములలో నాందీశ్రాద్ధమైన తర్వాత తల్లి రజస్వలయైన అన్యలగ్నములలో ముహూర్తా భావమైన (ముహూర్తము లేకున్న) అదే ముహూర్తములో శాంతికర్మద్వారా దోషనివారణచేసి ముండనము,ఉపనయనము,వివాహాది శుభకార్యములను నిర్వహించవలెను. శాంతి చేయకుండ శుభము కలుగదు.

**శుభకార్యములలో కార్యము ప్రారంభమైన తర్వాత తల్లి రజస్వలయైన అన్యలగ్నము కొరకు చూవలసిన అవసరములేదు. రజస్వలా జన్యదోషపరిహారము కొరకు శాంతి చేసి శుభకార్యమును చేయవచ్చును. రజోదోషము కలిగినప్పుడు మాష(మినిపగింజ) ప్రమాణములో బంగారపు లక్ష్మీప్రతిమను తయారుచేసి విధిపూర్వకముగా పూజించి శ్రీసూక్తమును పఠించి ప్రత్యేక ఋచలతో(మంత్రముతో) పాయసమును ఆహుతినిచ్చి శుభకార్యమును చేయవలెను.**

**ఛురికాబంధ ముహూర్తము :-**

**విచైత్ర వ్రతమాసాదౌ విభౌమాస్తే విభూమిజే**
**ఛురికాబన్ధనం శస్తం నృపాణాం ప్రాగ్వివాహత: 59**

చైత్రమాసమును వదలి, వ్రతబంధములో గ్రహించు మాస–తిథి–వార నక్షత్రము లలో కుజుడస్తమించిన కాలమును మంగళవారమును వదలి మిగిలిన కాలములలో వివాహమునకు పూర్వము (ఉపనయనము తర్వాత) క్షత్రియులకు ఛురికా(ఖడ్గము) ధారణము (ధరించుట) శుభము నిచ్చును.

**కేశాంత సమావర్తన ముహూర్తము :-**

**కేశాన్త షోడశే వర్షేచౌలోక్త దివసే శుభమ్**
**వ్రతోక్తదివసాదౌ హి సమావర్తనమిష్యతే 60**

కేశాంత సంస్కారము (వ్రతబంధము తర్వాత సమావర్తనమునకు పూర్వము జరుగు ముండన సంస్కారము) పదహారవ సంవత్సరములో ముండన ముహూర్తములో తెలిపిన దినములలో చేసిన శుభము కలుగును. వ్రతబంధములో తెల్పిన దిన,నక్షత్ర తిథులలో సమావర్తన (దీక్షాంత సమారోహము)సంస్కారము శుభమునిచ్చును.

**ఐదవ సంస్కారర ప్రకరణము సమాప్తము**



# 6. వివాహ ప్రకరణము

**వివాహ ప్రయోజనము :-**

**భార్యాత్రివర్గకరణం శుభశీలయుక్తా**
**శీలం శుభం భవతి లగ్నవశేన తస్యా:**
**తస్మాద్వివాహసమయ: పరిచిన్త్యతే హి**
**తన్నిఘ్నతాముపగతా: సుతశీలధర్మా: 1**

అనుకూలురాలైన,మంచి నడవడిక కలిగిన భార్య ధర్మ అర్థ కామములకు కారణ మగును. భార్య శీలము, గుణము లగ్నము ననుసరించియుండును. పుత్రుని శీలము ధర్మము ఇవన్ని వివాహలగ్నము నాశ్రయించియుండును. అందువలన ప్రయత్నముతో వివాహకాల నిర్ణయము చేయవలెను.

పదహారు సంస్కారములలో వివాహసంస్కారము మహత్వపూర్ణమైనది. సమావర్తన సంస్కారమైన తర్వాత వివాహ సంస్కారము చేయబడును.

వివాహము ఎనిమిది రకములు. 1. బ్రాహ్మము 2.దైవము 3.ఆర్షము 4. ప్రాజాపత్యము 5. ఆసురము 6. గాంధర్వము 7. రాక్షసము 8. పైశాచికము.

1. వరపూజ చేసి కన్యాదానము చేసిన బ్రాహ్మము.
2. యజ్ఞమును సంపన్నము చేయు బ్రాహ్మణునకు పూజచేసి కన్యనిచ్చిన దైవము.
3. ఒకటి రెండు గోవులను గ్రహించి కన్యాదానము చేసిన ఆర్షము.
4. మీరిరువురు ధర్మబద్ధముగా ఒకరినొకరు స్వీకరింపుడని ఆదేశించి కన్యాదానము చేసిన ప్రాజాపత్యము.
5. వధువు తండ్రికి యథాశక్తి ధనమిచ్చి కన్యను వివాహమాడుట ఆసురము.
6. వధూవరులిరువురు పరస్పరము అనురాగముతో చేసుకొన్న వివాహము గాంధర్వము.
7. బలాత్కారముగా కన్యనపహరించిన చేసుకొన్న వివాహము రాక్షసము
8. మద్యమదముతో బలాత్కారముగా మైథున ప్రవృత్తితో చేసుకొన్న వివాహము పైశాచికము.

ఈ విధముగా పైన తెల్పిన వివాహములు ఉత్తరోత్తరముగా తక్కువ గుణములు కలవిగా గుర్తించవలెను. పైశాచిక వివాహము అత్యంత నింద్యము.

**ప్రశ్న వలన వివాహయోగము :-**

ఆదౌ సంప్పూజ్య రత్నాదిభిరథ గణకం వేదయే త్స్వస్థచిత్తం
కన్యోద్వాహం దిగీశానలహయవిశిఖే ప్రశ్నలగ్నాద్యదీన్దు:
దృష్టో జీవేన సద్య: పరిణయనకరో గోతులాకర్కటాఖ్యం

**వా స్యా త్ప్రశ్నస్య లగ్నం శుభఖచరయుతాలోకితం తద్విదధ్యాత్ 2**

మొదట జ్యోతిష పండితుని ఫలపుష్పాదులతో పూజించి, ప్రసన్నుని చేసుకొని కన్యా వివాహబంధ విషయము గూర్చి ప్రశ్నించవలెను. ప్రశ్న లగ్నమునుండి పదవ, పదకొండవ,మూడవ,ఏడవ,ఐదవభావములలో చంద్రుడుండి గురువుతో చూడబడుతున్న వెంటనే వివాహము జరుగును. ప్రశ్నలగ్నము, వృషభము, తుల,కర్కాటక లగ్నములలో నుండి లగ్నము శుభగ్రహములతో కూడియున్న లేక చూడబడిన వెంటనే వివాహము జరుగును.

**ప్రశ్నలగ్నము వలన వివాహము :-**

**విషమభాంశగతౌ శశిభార్గవౌ తనుగృహం బలినౌ యది పశ్యత:**
**రచయతో వరలాభమిమౌ యదా యుగల భాంశగతౌ యువతిప్రదౌ 3**

ప్రశ్నసమయములో చంద్ర శుక్రులు బలవంతులై విషమ(1,3,5,7,11)రాశు లో, విషమ నవాంశలలో నుండి ప్రశ్నలగ్నమును చూచుచున్న వరుడు లభించును. అనగా కన్యకు వివాహము జరుగును. చంద్ర శుక్రులు బలవంతులై సమ (2,4,6,8,10) రాశులలో సమరాశి నవాంశలలో నుండి ప్రశ్నలగ్నమును చూచుచున్న వరునికి కన్య లభించును. అనగా పురుషునికి వివాహము జరుగును.

**ప్రశ్నలగ్నమున వైధవ్య యోగము :-**

**షష్ఠాష్టస్థ: ప్రశ్నలగ్నాద్యదీన్దుర్లగ్నే క్రూర: సప్తమే వా కుజ: స్యాత్**
**మూర్తావిన్దు: సప్తమే తస్య భౌమో రణ్డా సా స్యాదష్టసంవత్సరేణ 4**

లగ్నమునుండి ఆరవభావములో చంద్రుడున్న, వివాహమైన ఆరుసంవత్సరము లలో స్త్రీవిధవ యగును. ఇదేవిధముగా ప్రశ్నలగ్నములో పాపగ్రహమున్న, ఏడవభావము లో కుజుడున్న, చంద్రుడు లగ్నములో నున్న దానికి ఏడవభావములో కుజగ్రహమున్న వివాహమైన ఎనిమిది సంవత్సరములోపల స్త్రీ విధవయగును.

**ప్రశ్నతనోర్యది పాపనభోగ: పఞ్చమగో రిపుదృష్టశరీర:**
**నీచగతశ్చ తదా ఖలు కన్యాసా కులటా త్వథవా మృతవత్సా 5**

ప్రశ్నలగ్నము నుండి ఐదవభావములో పాపగ్రహమున్న, తన శత్రుగ్రహముల దృష్టి కలిగియన్న, తన నీచరాశిలో నున్నపుడు ఆకన్య కులట లేక మృతవత్స (పుట్టి చనిపోయిన సంతానము) యగును.

**వివాహభంగయోగము :-**

**యది భవతి సితాతిరిక్తపక్షే తనుగృహత: సమరాశిగ: శశాఙ్క :**
**అశుభఖచర వీక్షితోஉరిరన్ధ్రే భవతి వివాహవినాశకారకోஉయమ్ 6**

వివాహసంబంధ ప్రశ్న కృష్ణపక్షములోనైన, ప్రశ్నకాలములో చంద్రుడు సమ

(2,4,6,8,10,12) రాశిలోనున్న, లగ్నమునుండి ఆరు లేక ఎనిమిదవభావములో నున్న, అశుభగ్రహములతో చూడబడిన వివాహభంగము జరుగును.

**వైధవ్య పరిహార యోగము :-**

**జన్మోత్థం చ విలోక్య బాలవిధవాయోగం విధాయవ్రతం**
**సావిత్ర్యా ఉత పైప్పలం హి సుతయా దద్యాదిమాం వా రహ:**
**సల్లగ్నేఽ చ్యుత మూర్తిపిప్పల ఘటై: కృత్వా వివాహం స్ఫుటం**
**దద్యాత్తాం చిరజీవినేఽత్ర న భవేద్దోష: పునర్భూభవ: 7**

ప్రశ్నలగ్నము లేక జన్మలగ్నము వలన ఉత్పన్నమైన బాలవిధవా యోగమును చూచి ఏకాంతముగా కన్యతో సావిత్రి లేక పిప్పల (రావిచెట్టుకి పూజ)వ్రతమును చేయించి కన్యాదానము (కన్యకు వివాహము) చేయవలెను. లేనియెడల శుభలగ్నములో విష్ణుమూర్తికి, రావిచెట్టకు లేక కుంభము(కుండ)తో వివాహము చేసిన తర్వాత లోకాచారము ననుసరించి దీర్ఘాయువుకలిగిన వరునికిచ్చి వివాహము చేయవలెను. ఈ విధముగా చేసిన వివాహము లో పునర్వివాహ దోషముండదు.

వివాహ సమయములో మేలాపకము చూచునపుడు వైధవ్యయోగమును గూర్చి విచారణ చేయవలెను.వైధవ్యయోగ విషయము జాతకగ్రంథములలో స్త్రీ జాతక ప్రకరణములో చేయబడెను. వైధవ్యయోగమున్న కన్యకు దానిపరిహారము చేసిన తర్వాత వివాహము చేయవలెను.పిప్పల (రావిచెట్టు) వ్రతము ఒకమాసము వరకుండును. చైత్రకృష్ణ తదియ నుండి వైశాఖకృష్ణ తదియ వరకు లేక ఆశ్వయుజ కృష్ణ తదియ నుండి కార్తీక కృష్ణ తదియ వరకు వ్రతమును చేయవచ్చును.కన్య లేక కన్యతండ్రి ఇంటిబయట ఏకాంతముగా రావి లేక జమ్మిచెట్టు క్రింద లేక బదరికాశ్రమములో శుభలగ్న ముహూర్తము లో వ్రతము చేయవలెను.

సావిత్రివ్రతము జ్యేష్ఠ కృష్ణ త్రయోదశి నుండి అమావాస్య వరకు మూడుదినములు వట(మర్రి)వృక్షము క్రింద మహాసాధ్వియైన సావిత్రీదేవికి పూజచేయవలెను.అంగములతో కూడిన విష్ణుమూర్తి ప్రతిమను తయారుచేసి ఏకాంతముతో శుభలగ్న ముహూర్తములో కన్యకు వివాహము ప్రతిమతోచేసి ప్రతిమను దానము చేయవలెను.

కుంభ వివాహములో కన్యతండ్రి శుభవివాహ లగ్నములో ఏకాంత మందిరములో కుంభమును తంతువు (దారము)లతో చుట్టి విధిపూర్వకముగా కన్యతో వివాహము చేయవలెను. తర్వాత కుంభ జలముతో పంచపల్లవములతో అభిషేకించి వస్త్రాలంకారము లతో కుంభమును దానము చేయవలెను.

ప్రశ్నలగ్నము వలన సంతానవిషయము :-

ప్రశ్నలగ్న క్షణే యాదృశాపత్యయుక్ స్వేచ్ఛయా కామినీ తత్ర చేదావ్రజేత్

**కన్యకా వా సుతో వా తదా పణ్డితైస్తాదృశాపత్య మస్యా వినిర్దిశ్యతే 8**

ప్రశ్నసమయములో ఎవరైన స్త్రీ ఏసంతానమును తనతో తీసికొని వచ్చునో అటువంటి సంతానము కలుగునని (పుత్రుడైన పుత్రుడు, పుత్రికయైన పుత్రిక) తెలుపవలెను. ప్రశ్నించు స్త్రీ తనతో పుత్రుని తీసుకొని వచ్చిన పుత్రుడని, పుత్రికను తీసుకొని వచ్చిన పుత్రిక కలుగునని తెలుపవలెను.

**శఙ్ఖభేరీవిపఞ్చీరవైర్మఙ్గలం జాయతే వైపరీత్యం తదా లక్షయేత్**
**వాయసో వా ఖర: శ్వాశృగాలోఽపి వా ప్రశ్నలక్షణే రౌతినాదం యది 9**

ప్రశ్నసమయములో శంఖము, మృదంగము,వీణ ఆది మంగళవాద్యములు వినపడిన వివాహములో శుభము జరుగును. కాకి,గాడిద, కుక్క నక్క మున్నగు పక్షుల అరుపులు వినిపించిన అశుభము కలుగును.

**కన్యావరణ ముహూర్తము :-**

**విశ్వస్వాతీవైష్ణవ పూర్వాత్రయమైత్రై ర్వస్వాగ్నేయైర్వా కరపీడోచిత ఋక్షై:**
**వస్త్రాలఙ్కారాది సమేతై: ఫలపుష్పై: సన్తోష్యాదౌ స్యాదను కన్యావరణం హి 10**

ఉత్తరాషాఢ స్వాతి, శ్రవణ, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర అనూరాధ, ధనిష్ఠ, కృత్తిక,లేక వివాహమునకు చెప్పబడిన నక్షత్రములలో మొట్టమొదట వస్త్రములు ఆభరణములు ఫలపుష్పములనిచ్చి కన్యను సంతృప్తిపరచి అనంతరము కన్యావరణము చేయవలెను.

**ద్రాక్ష చెరకు,పుష్పములు,అక్షతలు,తమలపాకులతో పసుపుతో పరిపూర్ణముగా నున్న హస్తములతో శ్రమరహితమై శాంతహృదయముతో నున్న కన్యను వివాహము చేసుకొనవలెను. పంచాంగ శుద్ధి, చంద్రతారాబలము కలిగిన దినమున, మంగళవారము వదలి మిగిలిన వారములలో రిక్తతిథులను వదలి, శుభలగ్నములలో కన్యవివాహము చేయవలెను.**

**వరవరణ ముహూర్తము :-**

**ధరణి దేవోఽథవా కన్యకాసోదర: శుభదినే గీతవాద్యాదిభి: సంవృత:**
**వరవృత్తిం వస్త్రయజ్ఞోపవీతాదినా ధ్రువయుతైర్వహ్ని పూర్వాత్రయైరాచరేత్ 11**

కన్యసోదరుడు శుభదినములలో ఉత్తరాత్రయము,రోహిణి,కృత్తిక,పుబ్బ, పూర్వాషాఢ పూర్వాభాద్రలలో గీతవాద్యాది మంగళకార్యములతో వస్త్రయజ్ఞోపవీతాదులతో (నారికేళము తమలపాకులు) వరుని అంగీకారమును పొందవలెను.

**కులము,శీలము,పెద్దవారి సహకారము, విద్య, ధనము, సుందరరూపము, మంచిపేరు కలిగిన వరుని పరీక్షించి కన్యనిచ్చి వివాహము చేయవలెనని వశిష్ఠమహర్షి తెల్పెను. ఋతుమతియైన కన్య జీవితాంతము వివాహము లేక ఉండవచ్చును కాని గుణహీనునికి ఇచ్చి వివాహము చేయరాదని మను వచనము.**

**గురుశుద్ధి వసేన కన్యకానాం సమచర్షేషు షడబ్దకోపరిష్టాత్**
**రవి శుద్ధివశాచ్ఛుభో వరాణాముభయోశ్చన్ద్ర విశుద్ధితో వివాహ: 12**

కన్యకు ఆరు సంవత్సరముల తర్వాత సమవర్షములలో(8,10,12,14) గురుశుద్ధిచూచి వివాహము చేయవలెను. సూర్యశుద్ధి యున్నపుడు వరునికి, చంద్రశుద్ధి యున్నపుడు వధూవరులిరువురికి వివాహము చేసిన శుభము కలుగును. అనగా వివాహములో కన్యకు గురుశుద్ధి, వరునికి రవిశుద్ధి, ఇద్దరికి చంద్రశుద్ధి ఉండవలెను.

**గ్రహశుద్ధి యనగా జన్మరాశిలో శుభస్థానములలో గ్రహములుండుట. జన్మరాశి నుండి 3,6,10,11స్థానములలో నున్న రవి శుభుడు, 1,2,5,7,9 స్థానములలో రవి పూజ్యుడు. మిగిలిన 4,8,12 స్థానములలో అశుభుడగును. గురువు జన్మరాశి నుండి 2,5,7,9,11 భావములలో శుభుడు,1,2,6,10భావములలో పూజ్యుడు,4,8,12 స్థానములలో అశుభుడు.**

**చంద్రుడు 1వభావములో పూజ్యుడు. 4,8,12 స్థానములలో నిందితుడు మిగిలిన భావములలో శుభుడగును. కొందరి మతముననుసరించి వివాహములో ద్వాదశ చంద్రుడు కూడ శుభుడగును.**

**వివాహ మాసములు :-**

**మిథున కుమ్భమృగాలివృషాజగే మిథునగేఽపి రవౌ త్రిలవే శుచే:**
**అలిమృగాజగతే కరపీడనం భవతి కార్తికపౌషమధుష్వపి 13**

మిథున, కుంభ, మకర, వృశ్చిక, వృషభ,మేషరాశులలో సూర్యుడున్నపుడు వివాహము శుభము. మిథునములో సూర్యుడున్నపుడు ఆషాఢమాస ప్రథమతృతీయాంశము అనగా ఆషాఢశుక్ల దశమి పర్యంతము వివాహము చేయవచ్చును. వృశ్చిక మకర మేషరాశులలో సూర్యుడున్నపుడు క్రమముగా పుష్య చైత్ర మాసములలో వివాహము చేయవలెను. అనగా వృశ్చికరాశిలో సూర్యుడున్నపుడు కార్తీకమాసములో, మకరములో సూర్యుడున్నపుడు పుష్యమాసములో, మేషములో సూర్యుడున్నపుడు చైత్రమాసములో వివాహము చేయవలెను.

**వివాహములో జన్మమాస నిషేధము :-**

**ఆద్యగర్భ సుతకన్యయోర్ద్వయోర్జన్మమాసభతిథౌ కరగ్రహ:**
**నోచితోఽథ విబుధై: ప్రశస్యతే చేత్ ద్వితీయజనుషో: సుతప్రద: 14**

మొదటి గర్భములో పుట్టిన పుత్రుడు లేక పుత్రిక వివాహము వారిజన్మమాస జన్మనక్షత్ర, జన్మతిథులలో చేయరాదు. రెండవగర్భములో ఉత్పన్నమైన వారికి జన్మమాస, జన్మ నక్షత్ర, జన్మతిథులలో వివాహము శుభకారకము సంతానకారకమగును.

**అన్ని శుభకార్యములలో జన్మనక్షత్రము నిషేధింపబడినది.కొన్నిచోట్ల జన్మమాసము కూడా నిషేధింపబడినది.ఈ దోషము జ్యేష్ఠసంతానమునకు వర్తించును. వశిష్ఠుడు అందరికి అశుభమని తెల్పెను. కాని ప్రథమ సంతానమునకు తప్పక మాస తిథి నక్షత్రమును వదిలి పెట్టవలెను.**

**జ్యేష్ఠమాస విచారము :-**

**జ్యేష్ఠద్వయం మధ్యమం సమ్ప్రదిష్టం త్రిజ్యేష్ఠం చేన్నైవ యుక్తం కదాపి**
**కేచిత్సూర్యం వహ్నిగం ప్రోజ్ఝ్యచాహుర్నైవాన్యోన్యం జ్యేష్ఠయో: స్యాద్వివాహ: 15**

రెండు జ్యేష్ఠలున్న వివాహము మధ్యమము, అనగా జ్యేష్ఠమాసము, వరకన్యలలో ఒకరు జ్యేష్ఠులుగా నున్న జ్యేష్ఠద్వంద్వమగును. మూడుజ్యేష్ఠలు అనగా జ్యేష్ఠమాసము వరుడు కన్యలు జ్యేష్ఠులైన త్రిజ్యేష్ఠయగును. వివాహము చేయరాదు. కొందరి ఆచార్యుల మతముననుసరించి జ్యేష్ఠమాసములో సూర్యుడు కృత్తికా నక్షత్రములో నున్న కాలమును వదలి మిగిలిన సమయములో జ్యేష్ఠమాసములో వివాహము చేయవచ్చును.

**స్వకులములో పుత్రకన్యల వివాహ నిషేధము :-**

**సుతపరిణయాత్షణ్మాసాన్త: సుతాకరపీడనం**
**న చ నిజకులే తద్వద్వా మణ్డనాదపి ముణ్డనమ్**
**న చ సహజ యోర్దేయే భ్రాత్రో: సహోదరకన్యకే**
**న సహజసుతోద్వాహోఽబ్దార్ధే శుభే న పితృక్రియా 16**

తనకులములో కుమారుని వివాహము తర్వాత ఆరునెలల లోపుగ కూతురు వివాహము చేయరాదు. ఆరుమాసముల వరకు ముండనము కూడ చేయరాదు. ఇద్దరు సహోదరులకు ఇద్దరు సహోదరకన్యలతో వివాహము చేయరాదు. ఒకపుత్రుడు లేక ఒకకన్య వివాహమైన తర్వాత ఆరుమాసముల వరకు సహోదర సోదరుడు లేక సోదరికి వివాహము చేయరాదు. వివాహాది మంగళకార్యములలో పితృశ్రాద్ధాది క్రియలు చేయరాదు.

**కొందరు ఆచార్యులు కులసంబంధము మూడుతరముల వరకని తెల్పిరి. అనగా మూడు తరములకు సంబంధించిన పరివారములో ఆరుమాసముల వరకు వివాహము చేయరాదు. సోదరుల సంతానమునకు ఒకే మండపములో వివాహము చేయరాదు. కవలపిల్లలైన వారికి చౌల వివాహాది సంస్కారములు ఒకసంవత్సరములో ఒకేదినములో ఒకే మండపము లో చేయవచ్చును.**

**అశౌచములో వివాహముహూర్త నిర్ణయము :-**

**వధ్వా వరస్యాపి కులే త్రిపూరుషే నాశం వ్రజేత్కశ్చన నిశ్చయోత్తరమ్**
**మాసోత్తరం తత్ర వివాహ ఇష్యతే శాన్త్యాథవా సూతకనిర్గమే పరై: 17**

వివాహము నిశ్చయమైన తర్వాత వధువు లేక వరుని వంశములో మూడు

తరాలకు సంబంధించిన వ్యక్తి మృతిపొందిన, మృత్యుదినము నుండి 30దినముల తర్వాత వివాహము చేయవచ్చును. ఇతర ఆచార్యుల మతానుసారము సూతకమైన తర్వాత శాంతి చేసి వివాహము చేయవచ్చును.

**వివాహము తర్వాత ముండన నిషేధము :-**

**చూడావ్రతం చాపి వివాహతో వ్రతాచ్చూడా చ నేష్టా పురుషత్రయాన్తరే**
**వధూప్రవేశాచ్చ సుతావినిర్గమ: షణ్మాసతో వా౾బ్దవిభేదత: శుభ: 18**

వివాహము నుండి ఆరుమాసముల మధ్య ముండనము వ్రతబంధము, వ్రతబంధనము నుండి ఆరుమాసముల మధ్య ముండనము మూడుతరముల వరకు కుటుంబములో చేయుట మంచిదికాదు. గృహములో వధువు (కోడలు) ప్రవేశించిన ఆరుమాసముల తర్వాత లేక కొత్తసంవత్సరము వచ్చిన తర్వాత కన్యకకు వివాహము చేసిన శుభము కలుగును.

**ఫాల్గుణమాసములో యజ్ఞోపవీతాది శుభకార్యములు చేసిన చైత్రమాసములో వర్షపరివర్తన (కొత్తసంవత్సరము)మగును కావున వివాహాది కార్యములు చేయవచ్చును. ఒకే సంవత్సరమైన ఆరుమాసముల తర్వాత వివాహాది శుభకార్యము చేయవచ్చును.**

**శ్వశ్రూ వినాశ మహిజౌ సుతరాం విధత్త:**
**కన్యాసుతౌ నిరృతిజౌ శ్వశురం హతశ్చ**
**జ్యేష్ఠాభజాతతనయా స్వధవాగ్రజం చ**
**శక్రాగ్నిజా భవతి దేవరనాశకర్త్రీ 19**

ఆశ్లేషా నక్షత్రములో జన్మించిన పుత్రుడు లేక పుత్రిక తమ అత్తకు నాశనము కలిగించును. మూల నక్షత్రములో జన్మించిన మామకు నాశనము కలిగించును. జ్యేష్ఠా నక్షత్రములో జన్మించిన కన్య తనబావకు, విశాఖా నక్షత్రములో జన్మించిన తనమరిదికి నాశనము కలిగించునదగును.

**పాదభేదముతో మూలాది నక్షత్ర జాతఫల పరిహారము :-**

**ద్వీశాద్యపాదత్రయజా కన్యా దేవరసౌఖ్యదా**
**మూలాన్త్యపాద సార్పాద్యపాదజాతే తయో:శుభే 20**

విశాఖ నక్షత్రములో మొదటి మూడు పాదములలో జన్మించిన కన్య మరిదికి సుఖమును కలిగించును. మూలనక్షత్ర చివరి చరణములో,ఆశ్లేష నక్షత్ర ప్రథమ చరణములో జన్మించిన వరుడు కన్య అత్తకు మామకు ఇద్దరికి సుఖమును కలిగించును.

**విశాఖ నక్షత్రము చతుర్థపాదములో జన్మించిన కన్య మాత్రమే మరిదికి దోషము కలిగించును.తులారాశిలో నున్న మొదటి మూడు చరణములలో జన్మించిన దోషము కలిగించదు.ఆశ్లేషలో చివరి మూడు చరణములు, మూలా నక్షత్రములో మొదటి మూడు చరణములలో జన్మించిన కన్యవరులు అత్తకు మామకు దోషమును కలిగింతురు.**

**అష్టకూట నామములు :-**

**వర్ణో వశ్యం తథా తారా యోనిశ్చ గ్రహమైత్రకమ్**
**గణమైత్రం భకూటం చ నాడీ చైతే గుణాధికా: 21**

వర్ణము,వశ్యము, తార,యోని,గ్రహమైత్రి,గణము,భకూటము, నాడి ఈ ఎనిమిది కూటములు మేలాపకము కొరకు తెలుపబడినవి. ఈ కూటములకు సంఖ్య క్రమముగా ఒక్కొక్కటి అధికమగును.అనగా వర్ణము-1, వశ్యము-2,తార-3, యోని-4, గ్రహమైత్రి-5, గణము-6,భకూటము-7,నాడి-8 గుణములగును.

**వర కన్యల నక్షత్రముల రాశుల ఎనిమిది కూటముల గుణములను కలిపిన 36 గుణములగును. వీటిలో 18 కన్న అధిక గుణములు వచ్చిన వివాహాము చేయవచ్చును.**

**వర్ణము :-**

**ద్విజా ఝషాలికర్కటాస్తతో నృపా విశోంఽఘ్రిజా:**
**వరస్య వర్ణతోఽధికా వధూర్న శశ్యతే బుధై: 22**

మీన,వృశ్చిక,కర్కాటక రాశులు - బ్రాహ్మణవర్ణము, వీటిముందు రాశులు క్రమముగా క్షత్రియ, వైశ్య, శూద్రవర్ణములగును. అనగా మేష, ధను, సింహరాశులు - క్షత్రియవర్ణము, వృషభ,మకర,కన్యారాశులు వైశ్యవర్ణము,మిథున,కుంభ,తులారాశులు శూద్రవర్ణము. వరవర్ణము కన్న వధువు వర్ణము అధికమైన ఉత్తమముకాదు.
వర్ణగుణము-1 ఒకటి యగును. మేలాపకములో అనుకూలమైన ఒకగుణము వచ్చును లేకున్న శూన్యము(సున్న)వచ్చును.

**వర్ణ గుణబోధక పట్టిక**

| వరుడు —— <br> కన్య | బ్రాహ్మణ <br> కర్కాటక వృశ్చి,మీన | క్షత్రియ <br> మేష,సింహ ధనుస్సు | వైశ్య <br> వృష,కన్య మకర | శూద్ర <br> మిథున తుల,కుంభ |
|---|---|---|---|---|
| బ్రాహ్మణ <br> కర్క,వృశ్చి,మీన | 1 | 0 | 0 | 0 |
| క్షత్రియ <br> మేష,సింహ,ధను | 1 | 1 | 0 | 0 |
| వైశ్య <br> వృష,కన్య,మకర | 1 | 1 | 1 | 0 |
| శూద్ర <br> మిథు,తుల,కుంభ | 1 | 1 | 1 | 1 |

## వశ్య విచారము :-

**హిత్వా మృగేన్ద్రం నర - రాశివశ్యా: సర్వే తథైషాం జలవాస్తు భక్ష్యా:**
**సర్వేऽపి సింహస్య వశే వినాలిం జ్ఞేయం నరాణాం వ్యవహారతోऽన్యత్ 23**

సింహరాశిని వదలి మిగిలిన మేషాదిరాశులన్ని మిథున కన్యా తులారాశులకు వశ్యములగును. జలచరరాశులు నరరాశులకు భక్ష్యములగును. అనగా వశ్యములగును. వృశ్చికమును వదలి మిగిలిన అన్ని రాశులు సింహరాశికి వశ్యములగును. వీటిభిన్న రాశులతో వశ్యాది విచారము వ్యవహారము ద్వారా చేయవలెను.
రాశుల వశ్య విచారము ఈ విధముగా చేయవచ్చును.

| | |
|---|---|
| మేష, వృషభ, సింహ,ధనుస్సులు | చతుష్పదము |
| మిథున,కన్య, తులలు | ద్విపదము (మానవ) |
| కర్కాటక,మకర,కుంభ, మీన | జలచరులు |
| వృశ్చికము | కీటకము |

వశ్యములో మూడు బేధములుండును. సఖ్యము,వైరము,భక్ష్యము, వైరభక్ష్యములలో గుణమురాదు. రెండింటి మిత్రత్వములో 2 గుణములు, వైశ్యవైరములలో 1 గుణము, వశ్యభక్ష్యములో 1/2 గుణము కలుగును.

**వశ్యగుణ బోధక పట్టిక**

| వరవశ్యము / కన్యావశ్యము | మానవ | చతుష్పద | జలచర | కీట |
|---|---|---|---|---|
| **మానవ** | 1 | 1 | 1/2 | 1 |
| **చతుష్పద** | 1 | 2 | 1 | 0 |
| **జలచర** | 1/2 | 1 | 2 | 1 |
| **కీట** | 1 | 0 | 1 | 2 |

## తారా విచారము :-

**కన్యర్క్షాద్వరభం యావత్ కన్యాభం వరభాదపి**
**గణయేన్నవహృచ్ఛేషే త్రీష్వద్రిభ మసత్స్మృతమ్ 24**

కన్య నక్షత్రము నుండి వర నక్షత్రము వరకు, వర నక్షత్రము నుండి కన్య నక్షత్రము వరకు నక్షత్ర సంఖ్యను 9చే భాగించిన శేషసంఖ్యకతార వచ్చును. మూడవ, ఐదవ,ఏడవ తార అశుభమగును.

తారాజ్ఞానము కొరకు తారల నామమును గోచరప్రకరణముల శ్లోకసంఖ్య 11,12లను చూడుడు. తారకు మొత్తము మూడుగుణములుండును. వర కన్యలకు శుభతారలైన 3 గుణములు, ఒకరికి శుభము ఒకరికి అశుభమైన 1 1/2గుణములు, ఇద్దరికి అశుభమైన శూన్యగుణములగును.

**గుణబోధక పట్టిక**

| వరుడు | జన్మ | సంపత్ | విపత్ | క్షేమ | ప్రత్యక్ | సాధన | నైధన | మిత్ర | ప. మిత్ర |
|---|---|---|---|---|---|---|---|---|---|
| కన్య | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| జన్మ-1 | 3 | 3 | 11/2 | 3 | 11/2 | 3 | 11/2 | 3 | 3 |
| సంపత్-2 | 3 | 3 | 11/2 | 3 | 11/2 | 3 | 11/2 | 3 | 3 |
| విపత్-3 | 11/2 | 11/2 | 0 | 11/2 | 0 | 11/2 | 0 | 11/2 | 11/2 |
| క్షేమ -4 | 3 | 3 | 11/2 | 3 | 11/2 | 3 | 11/2 | 3 | 3 |
| ప్రత్యక్-5 | 11/2 | 11/2 | 0 | 11/2 | 0 | 11/2 | 0 | 11/2 | 11/2 |
| సాధన-6 | 3 | 3 | 11/2 | 3 | 11/2 | 3 | 11/2 | 3 | 3 |
| నైధన-7 | 11/2 | 11/2 | 0 | 11/2 | 0 | 11/2 | 0 | 11/2 | 11/2 |
| మిత్ర-8 | 3 | 3 | 11/2 | 3 | 11/2 | 3 | 11/2 | 3 | 3 |
| ప. మిత్ర-9 | 3 | 3 | 11/2 | 3 | 11/2 | 3 | 11/2 | 3 | 3 |

**అశ్విన్యమ్బు పయోర్హయో నిగదిత: స్వాత్యర్కయో: కాసర:**
**సింహో వస్వజపాద్భయో: సముదితో యామ్యాన్త్యయో: కుఞ్జర:**
**మేషో దేవపురోహితానలభయో: కర్ణామ్బునోర్వానర:**
**స్యాద్వైశ్వాభిజితోస్తథైవ నకులశ్చాన్ద్రాబ్జయోన్యోరహి: 25**
**జ్యేష్ఠామైత్ర భయో: కురఙ్గఉదితో మూలార్ద్రయో: శ్వా - తథా**
**మార్జారోఽ దితి సార్పయోరథ మఘాయోన్యోస్తథైవోన్దురు:**
**వ్యాఘ్రో ద్వీశభచిత్రయోరపి చ గౌరర్యమ్ణబుధ్న్యర్క్షయో**
**ర్యోని: పాదగయో: పరస్పరమహావైరం భయోన్యోస్త్యజేత్ 26**

| | | | |
|---|---|---|---|
| అశ్విని, శతభిషము | - అశ్వయోని, | స్వాతి, హస్త | - మహిషము |
| ధనిష్ఠ, పూర్వాభాద్ర | - సింహము, | భరణి, రేవతి | - గజము |
| పుష్యమి, కృత్తిక | - మేషము(మేక), | శ్రవణ,పూర్వాషాఢ | - కోతి |
| ఉత్తరాషాఢ, అభిజిత్తు | - నకులము(ముంగిస), | మృగశిర, రోహిణి | - సర్పము |
| జ్యేష్ఠ, అనూరాధ | - హరిణము(లేడి), | మూల, ఆర్ద్ర | - శ్వానము(కుక్క) |

| | | | |
|---|---|---|---|
| పునర్వసు, ఆశ్లేష | - పిల్లి | మఘ, పుబ్బ - ఎలుక | |
| విశాఖ, చిత్త | - పులి | ఉత్తర, ఉత్తరాభాద్ర - ఆవు | యోనులగును. |

శ్లోకము ప్రత్యేక చరణములో తెలుపబడిన రెండుయోనులు పరస్పరము శత్రువు లగును. వివాహములో వైరయోని నక్షత్రములను వదలవలెను. యోనికి 4 గుణములు, వధూవరులది ఒకే యోనియైన 4,మిత్రయోనియైన 3,ఉదాశీన యోనియైన 2 గుణములు, శత్రుయోనియైన 1గుణము వచ్చును. యోనుల మధ్య వైరమైన శూన్యమగును. యోనులమిత్రాది విచారము యోనుల వ్యవహారము ననుసరించి గ్రహించవలెను.

## యోని గుణబోధక పట్టిక

| వరుడు<br>కన్య | అశ్వ | మహిష | సింహ | గజ | మేష | వానర | నకుల | సర్ప | మృగ | శ్వాన | పిల్లి | ఎలుక | పులి | గోవు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వ | 4 | 0 | 1 | 1 | 3 | 2 | 2 | 1 | 2 | 2 | 2 | 2 | 1 | 2 |
| మహిష | 0 | 4 | 1 | 1 | 3 | 2 | 2 | 1 | 2 | 2 | 2 | 2 | 1 | 3 |
| సింహ | 1 | 1 | 4 | 0 | 1 | 1 | 1 | 2 | 1 | 1 | 1 | 2 | 1 | 1 |
| గజ | 1 | 2 | 0 | 4 | 1 | 1 | 2 | 2 | 2 | 1 | 1 | 2 | 1 | 1 |
| మేష | 2 | 3 | 1 | 1 | 4 | 0 | 3 | 1 | 3 | 2 | 1 | 2 | 1 | 3 |
| వానర | 2 | 2 | 1 | 1 | 0 | 4 | 2 | 1 | 2 | 1 | 2 | 2 | 1 | 2 |
| నకుల | 2 | 2 | 1 | 2 | 3 | 2 | 4 | 0 | 2 | 1 | 2 | 2 | 1 | 2 |
| సర్ప | 1 | 1 | 2 | 2 | 1 | 1 | 0 | 4 | 1 | 1 | 1 | 1 | 2 | 1 |
| మృగ | 2 | 2 | 1 | 2 | 3 | 2 | 2 | 1 | 4 | 0 | 2 | 2 | 1 | 2 |
| శ్వాన | 2 | 2 | 1 | 1 | 2 | 1 | 1 | 1 | 0 | 4 | 1 | 1 | 1 | 1 |
| పిల్లి | 2 | 2 | 1 | 1 | 1 | 2 | 2 | 1 | 2 | 1 | 4 | 0 | 3 | 2 |
| ఎలుక | 2 | 2 | 2 | 2 | 2 | 2 | 2 | 1 | 2 | 1 | 0 | 4 | 2 | 2 |
| పులి | 1 | 1 | 1 | 1 | 1 | 1 | 1 | 2 | 1 | 1 | 3 | 2 | 4 | 0 |
| గోవు | 2 | 3 | 1 | 1 | 3 | 2 | 2 | 1 | 2 | 1 | 2 | 2 | 0 | 4 |

**మిత్రాణి ద్యుమణే: కుజేజ్యశశిన: శుక్రార్కజౌ వైరిణౌ**
**సౌమ్యశ్చాస్య సమో విధోర్బుధ-రవీమిత్రే న చాస్యద్విషత్**
**శేషాశ్చాస్య సమా: కుజస్య సుహృదశ్చన్ద్రే జ్యసూర్యా: బుధ:**
**శత్రు: శుక్రశనీ సమౌ చ శశభృత్సూనో: సితాహస్కరౌ** **27**
**మిత్రే, చాస్యరిపు: శశీ గురు-శనిక్ష్మాజా: సమా గీష్పతే**
**మిత్రాణ్యర్క - కుజేన్దవో, బుధ-సితౌ శత్రూ,సమ: సూర్యజ:**
**మిత్రౌసౌమ్య-శనీ కవే: శశి-రవీ శత్రూ, కుజౌజ్యౌసమౌ**

**మిత్రే శుక్ర-బుధౌ శనే:, శశి-రవి, క్ష్మాజా ద్విషోఽన్య:సమ: 28**

సూర్యునికి కుజ గురు చంద్రులు మిత్రులు, శుక్ర శనులు శత్రువులు. బుధుడు సముడు, చంద్రునికి బుధ సూర్యులు మిత్రులు, మిగిలిన గ్రహములు సములు, చంద్రునికి శత్రువులు లేరు.కుజునికి చంద్ర గురు సూర్యులు మిత్రులు బుధుడు శత్రువు, శుక్ర శనులు సములు. బుధునికి శుక్ర సూర్యులు మిత్రులు, చంద్రుడు శత్రువు, గురు శని కుజుడు సములు. గురువుకు రవి కుజుడు చంద్రుడు మిత్రులు,బుధుడు శుక్రులు శత్రువులు శని సముడు. శుక్రునికి బుధుడు శని మిత్రులు, చంద్ర రవులు శత్రువులు,కుజుడు గురువులు సములు. శనికి శుక్ర బుధులు మిత్రులు, చంద్ర సూర్య కుజులు శత్రువులు, గురువు సముడగును.

**గ్రహమైత్రి పట్టిక**

| గ్రహము | రవి | చంద్ర | కుజుడు | బుధుడు | గురువు | శుక్రుడు | శని |
|---|---|---|---|---|---|---|---|
| మిత్రులు | చం కు బు | ర బు | ర చం బు | ర శు | ర చం కు | బు శ | బు శు |
| శత్రువులు | శు శ | -- | బు | చం | బు శు | ర చం | ర కు చం |
| సములు | బు | కు బు శు శ | శు శ | కు బు శ | శ | కు బు | బు |

**గణ విచారము :-**

**రక్షో-నరామరగణా: క్రమతో మఘాహివహ్న్యిన్ద్ర మూల వరుణానల తక్ష రాధా:**
**పూర్వోత్తరాత్రయ విధాతృయమేశభాని మైత్రాదితీన్దు హరిపౌష్ణమరుల్లఘూని 29**

మఘ,ఆశ్లేష,ధనిష్ఠ,జ్యేష్ఠ మూల,శతభిష, కృత్తిక,చిత్త,విశాఖ నక్షత్రములు రాక్షస గణము. పుబ్బ పూర్వాషాఢ,పూర్వాభాద్ర ఉత్తర ఉత్తరాషాఢ ఉత్తరాభాద్ర రోహిణి భరణి ఆర్ద్ర నక్షత్రములు మనుష్యగణము, అనూరాధ పునర్వసు మృగశిర శ్రవణ రేవతి స్వాతి హస్త అశ్విని పుష్యమి నక్షత్రములు దేవగణమగును.

**నిజ నిజగణమధ్యే ప్రీతిరత్యుత్తమాస్యా**
**దమర-మనుజయో: సామధ్యమా సమ్ప్రదిష్టా**
**అసుర-మనుజయోశ్చే న్మృత్యురేవప్రదిష్టో**
**దనుజ-విబుధయో: స్యాద్వైరమేకాన్తతోఽత్ర 30**

తమ తమ గణములలో ప్రీతికలుగును. అనగా దేవగణము వర కన్య లిరువురికైన వివాహ సంబంధముత్తమ మగును. ఇదేవిధముగా రాక్షస-రాక్షస, మనుష్య-మనుష్యగణ సంబంధముత్తమ మగును. దేవ-మనుష్య గణ సంబంధము మధ్యమము. మనుష్య-రాక్షస

సంబంధము మృత్యుకారకము. దేవ – రాక్షస సంబంధము వైరమును కలిగించును. వర కన్యా మేలాపకములో గణమునకు గుణములు ఆరు ఉండును.

గణవిభాగ పట్టిక

| వరుడు → / కన్య ↓ | దేవగణము | రాక్షసగణము | మనుష్యగణము |
|---|---|---|---|
| **దేవగణము** | 6 | 0 | 5 |
| **రాక్షసగణము** | 0 | 6 | 0 |
| **మనుష్యగణము** | 5 | 0 | 6 |

**రాశికూట విచారము :–**

**మృత్యు: షడష్టకే జ్ఞేయోఽపత్యహానిర్నవాత్మజే**
**ద్విర్ద్వాదశే నిర్ధనత్వం ద్వయోరన్యత్ర సౌఖ్యకృత్** **31**

వర కన్యారాశులు పరస్పరము ఒకదానికొకటి 6,8రాశులైన మృత్యువు 5,9రాశులైన సంతానహాని, 2,12 అయిన నిర్ధనత్వము కలుగును. వీటికి భిన్నమైన (3–11; 4–10; 1–7) స్థానములలో రెండురాశులున్న సుఖము కలుగును.

**రాశి కూట పట్టిక**

| రాశి | మే | వృ | మి | కర్కా | సిం | కన్య | తుల | వృశ్చి | ధ | మక | కుంభ | మీన |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మేష | 7 | 0 | 7 | 7 | 0 | 0 | 7 | 0 | 0 | 7 | 7 | 0 |
| వృష | 0 | 7 | 0 | 7 | 7 | 0 | 0 | 7 | 0 | 0 | 7 | 7 |
| మిథు | 7 | 0 | 7 | 0 | 7 | 7 | 0 | 0 | 7 | 0 | 0 | 7 |
| కర్కా | 7 | 7 | 0 | 7 | 0 | 7 | 7 | 0 | 0 | 7 | 0 | 0 |
| సింహ | 0 | 7 | 7 | 0 | 7 | 0 | 7 | 7 | 0 | 0 | 7 | 0 |
| కన్య | 0 | 0 | 7 | 7 | 0 | 7 | 0 | 7 | 7 | 0 | 0 | 7 |
| తుల | 7 | 0 | 0 | 7 | 7 | 0 | 7 | 0 | 7 | 7 | 0 | 0 |
| వృశ్చి | 7 | 0 | 0 | 0 | 7 | 7 | 0 | 7 | 0 | 7 | 7 | 0 |
| ధను | 0 | 0 | 7 | 0 | 0 | 7 | 7 | 0 | 7 | 0 | 7 | 7 |
| మక | 7 | 0 | 0 | 7 | 0 | 0 | 7 | 7 | 0 | 7 | 0 | 7 |
| కుంభ | 7 | 7 | 0 | 0 | 7 | 0 | 0 | 7 | 7 | 0 | 7 | 0 |
| మీన | 0 | 7 | 7 | 0 | 0 | 7 | 0 | 0 | 7 | 7 | 0 | 7 |

**పురుషరాశి నుండి కన్యారాశి ఐదులోనున్న అశుభమును, పురుషరాశి నుండి కన్యారాశి తొమ్మిదిలోనున్న శుభమునిచ్చును. అనగా 5-9 రాశులు దోషమునీయవు.**

**ఇదేవిధముగా పురుషరాశి నుండి కన్యరాశి రెండులోనున్న అశుభము.పన్నెండులో నున్న శుభమునిచ్చును.సమసప్తకములు శుభమునిచ్చును.కాని వర - కన్యలలో ఒకరాశి మకరము రెండవరాశి కర్కాటకములో నున్న అశుభము కలుగును. దశమ చతుర్థరాశులలో కేవలము తుల-మకరము,వృషభము-సింహము, మేషము-కర్కాటకము, మిథునము-మీనము, ధనుస్సు-కన్యలు, కుంభము- వృశ్చికములు శుభమునీయవు.**

**రాశికూట పరిహారము :-**

**ప్రోక్తే దుష్టభకూటకే పరిణయస్త్వేకాధిపత్యే శుభో**
**ఽథోరాశీశ్వరసౌహృదేఽపి గదితో నాడ్యృక్ష శుద్ధిర్యది**
**అన్యర్క్షే ఽ శపయోర్బలిత్వసఖితే నాడ్యృక్షశుద్ధౌ తథా**
**తారాశుద్ధివశేన రాశివశతాభావే నిరుక్తో బుధై: 32**

పూర్వోక్త అశుభ (6-8, 2-12, 5-9) రాశులలో ఒకవేళ వర-కన్యరాశుల స్వామి ఒకేగ్రహమైన వివాహము శుభమగును. (వరునిరాశి మేషము కన్యారాశి వృశ్చికము లైన షడష్టకములైనప్పటికి శుభమునిచ్చును) రెండు రాశులకు మిత్రత్వమున్న లేక నాడీ నక్షత్రముల శుద్ధియున్న శుభమగును. మిత్రత్వము లేనప్పటికి రెండురాశుల నవాంశము లకు మిత్రత్వముండి అవి బలవంతులైన నాడీ శుద్ధియున్న వివాహము శుభమగును. మిత్రత్వమునకు అభావమైన(లేకున్న)ను తారశుద్ధిని చూచి వివాహము చేయవచ్చునని విద్వాంసులు తెలిపిరి.

**గణ భకూట పరిహారము :-**

**మైత్ర్యాం రాశిస్వామినోరం శనాథద్వంద్యస్యాపి స్యాద్గణానాం న దోష:**
**ఖేటారిత్వం నాశయే త్సద్భకూటం ఖేటప్రీతిశ్చాపి దుష్టం భకూటమ్ 33**

వర - కన్యారాశులకు రెండింటికి మిత్రత్వము, లేక రెండురాశుల నవాంశ స్వాములకు మిత్రతత్వమున్న గణములకు దోషముండదు. ఒకవేళ గ్రహములకు శత్రుత్వమున్న దాని పరిష్కారము శుభ భకూటము వలన జరుగును.అశుభ భకూటముల దోషము పరిహారము మిత్రత్వము వలన కలుగును.

**నాడీ విచారము :-**

**జ్యేష్ఠారౌద్రార్యమామ్భ: పతిభయుగయుగం దాస్రభం చైకనాడీ**
**పుష్యేన్దుత్వాష్ట్ర మిత్రాన్తకవసుజలభం యోనిబుధ్న్యే చ మధ్యా**
**వాయ్వగ్నివ్యాల విశ్వోడుయుగయుగమథో పౌష్ణభం చాపరా స్యాద్**
**దమ్పత్యో రేకనాడ్యాం పరిణయనమ సన్మధ్యనాడ్యాం హి మృత్యు: 34**

జ్యేష్ఠ, ఆర్ద్ర, ఉత్తర శతభిషం నక్షత్రముల నుండి రెండేసి నక్షత్రములు అశ్విని ఆదినాడి సంజ్ఞకమగును. అనగా జ్యేష్ఠ-మూల, ఆర్ద్ర పునర్వసు, ఉత్తర-హస్త,శతభిషం

–పూర్వాభాద్ర, అశ్విని నక్షత్రములు ఆదినాడి యగును. పుష్యమి, మృగశిర, చిత్త, అనూరాధ, భరణి, ధనిష్ఠ, పూర్వాషాఢ,పుబ్బ, ఉత్తరాభాద్ర నక్షత్రములు మధ్యనాడి యగును. స్వాతి, కృత్తిక,ఆశ్లేష, ఉత్తరాషాఢల నుండి రెండేసి నక్షత్రములు అనగా స్వాతి–విశాఖ, కృత్తిక – రోహిణి, ఆశ్లేష–మఘ, ఉత్తరాషాఢ శ్రవణం రేవతి నక్షత్రములు అంత్యనాడి యగును. వర–కన్యలకు ఏకనాడియైన అశుభము. ఇద్దరకు మధ్యనాడియైన తప్పక మృత్యువు కలుగును.

| నాడి | నక్షత్రములు |
|---|---|
| **ఆది** | అశ్విని,ఆర్ద్ర,పునర్వసు,ఉత్తర,హస్త,జ్యేష్ఠ,మూల,శతభిషం,పూర్వాభాద్ర |
| **మధ్య** | భరణి, మృగశిర,పుష్యమి,పుబ్బ,చిత్త,అనూరాధ,పూర్వాషాఢ,ధనిష్ఠ,ఉత్తరాభాద్ర |
| **అంత్య** | కృత్తిక,రోహిణి,ఆశ్లేష,మఘ,స్వాతి,విశాఖ,ఉత్తరాషాఢ,శ్రవణం,రేవతి |

నాడికి ఎనిమిది గుణములుండును.వర వధువులకు ఒకేనాడియైన శూన్యము. భిన్ననాడి యైన ఎనిమిది గుణములగును.

**గుణబోధక పట్టిక**

| | వరుడు | | | |
|---|---|---|---|---|
| | **నాడి** | **ఆది** | **మధ్య** | **అంత్య** |
| **కన్య** | ఆది | 0 | 8 | 8 |
| | మధ్య | 8 | 0 | 8 |
| | అంత్య | 8 | 8 | 0 |

**పౌష్ణేశ శాక్రాద్రస సూర్యనన్దా: పూర్వార్ధమధ్యాపరభాగయుగ్మమ్**
**భర్తాప్రియ: ప్రాగ్యుజి భే స్త్రియా: స్యాన్మధ్యే ద్వయో: ప్రేమపరేప్రియా స్త్రీ 35**

రేవతి ఆర్ద్ర జ్యేష్ఠల నుండి ప్రారంభించి క్రమముగా 6,12,9 నక్షత్రములు పూర్వార్ధము,మధ్యము, అంత్యము యోగినీసంజ్ఞకమగును. అనగా రేవతి, అశ్విని, భరణి, కృత్తిక,రోహిణి, మృగశిర పూర్వార్ధయోగిని, ఆర్ద్ర,పునర్వసు, పుష్యమి, ఆశ్లేష,మఘ, పుబ్బ, ఉత్తర,హస్త,చిత్త,స్వాతి విశాఖ,అనూరాధ, ఈ 12 నక్షత్రములు మధ్యభాగ యోగిని, జ్యేష్ఠ,మూల,పూర్వాషాఢ, ఉత్తరాషాఢ,శ్రవణ,ధనిష్ఠ, శతభిషం,పూర్వాభాద్ర,ఉత్తరాభాద్ర ఇవి తొమ్మిది అంత్య భాగయోగినీ సంజ్ఞకములగును.పూర్వార్ధయోగినీ సంజ్ఞక నక్షత్రములలో స్త్రీతో సమాగమము చేసిన ఆస్త్రీకి పతి అధికప్రియుడగును.మధ్యభాగ యోగినీ సంజ్ఞక నక్షత్రములలో సమాగమమైన స్త్రీ పురుషు లిరువురికి సమానమైన అనురాగము కలుగును. అంత్య యోగినీ సంజ్ఞక నక్షత్రములలో సమాగమమైన పురుషునికి

స్త్రీ అధికప్రియమగును.

**ఈ యోగినీ విచారము వధూప్రవేశ సమయములో చేయవలెను. ప్రాచీన కాలములో రాజభవనములో సేవకులు గణికులు ఉపపత్నుల సమాగమము జరుగు చుండెడిది.ఆ సమయములో ఈవిధమైన పరిశీలనము చేసెడివారు.**

**అ క చ ట త ప యశవర్గా:ఖగేశమార్జారసింహశునామ్**
**సర్పాఖు మృగావీనాం నిజపఞ్చమవైరిణామష్టౌ 36**

గరుడుడు, మార్జాలము(పిల్లి) సింహము, శ్వానము(కుక్క), సర్పము, మూషికము (ఎలుక) మృగము (లేడి) మేషము(మేక) క్రమముగా అ క చ ట త ప య శ వర్గులగును. అనగ గరుడుడు - అ వర్గు, మార్జాలము- క వర్గు, సింహము- చ వర్గు, శ్వానము -ట వర్గు, సర్పము- త వర్గు, మూషికము- ప వర్గు, మృగము-య వర్గు,మేషము- శ వర్గు యగును. తమ వర్గునుండి ఐదవ వర్గు శత్రువర్గు యగును. గరుడుడు అ వర్గు - సర్పము త వర్గు; మార్జాలము క వర్గు- మూషికము పవర్గు; సింహము చ వర్గు- మృగము య వర్గు; శ్వానము ట వర్గు- మేషము శవర్గు శత్రువర్గులగును.

**వర్గ బోధక పట్టిక**

| వర్గు | | శత్రువర్గు | |
|---|---|---|---|
| 1. అ వర్గు | - అ నుండి ఔ వరకు | - త వర్గు | - త థ ద ధ న |
| 2. క వర్గు | - క ఖ గ ఘ - | - ప వర్గు | - ప ఫ బ భ మ |
| 3. చ వర్గు | - చ ఛ జ ఝ - | - య వర్గు | - య ర ల వ |
| 4. ట వర్గు | - ట ఠ డ ఢ ణ | - శ వర్గు | - శ ష స హ |

**రాశ్యైక్యే చేద్భిన్నమృక్షం ద్వయో: స్యానక్షత్ర క్యేరాశియుగ్మం తథైవ**
**నాడీ దోషో నో గణానాం చ దోషో నక్షత్రైక్యే పాదభేదే శుభం స్యాత్ 37**

స్త్రీ పురుషులకు ఒకేరాశియై, నక్షత్రములు వేరైన లేక ఇద్దరికి ఒకే నక్షత్రమైన, భిన్నభిన్న రాశులైన నాడీదోషము, గణదోషము లుండవు.ఇద్దరికి ఒకేనక్షత్రమై పాదములు వేరైన వివాహము శుభకారకమగును.

**నాడీ విచారము అత్యంత మహత్వపూర్ణమైనది. దీనికి పరిహారము తక్కువగా కనపడును. గర్గుని వచనానుసారము రాశీశులు మిత్రులైనప్పటికి, ఏకాదిపత్యము న్నప్పటికి మిగిలిన దోషము పరిహరింపబడును కాని నాడీ దోషపరిహారము కలుగదు. దీని కొరకు మృత్యుంజయ జపముచేసి బ్రాహ్మణులకు సువర్ణాదులను, గోవులను అన్నదానము ను చేయవలెను.**

**జ్యోతిష చింతామణిలో దీనికి పరిహారము తెలుపబడినది. రోహిణి,ఆర్ద్ర,మఘ, విశాఖ, పుష్యమి, శ్రవణ, రేవతి, ఉత్తర, ఉత్తరాభాద్ర నక్షత్రములకు ఏకనాడీ దోషము**

**లేదు. నక్షత్ర ప్రథమ చరణమునకు వేధ చతుర్ధ చరణముతో, చతుర్ధ చరణమునకు వేధ ప్రథమ చరణముతో, ద్వితీయ చరణమునకు తృతీయ చరణముతో, తృతీయ చరణమునకు ద్వితీయ చరణముతో వేధ కలుగును.**

నాడీ వేధ చక్రము

| నక్షత్ర పాదము | వేధపాదము |
|---|---|
| ప్రథమపాదము | చతుర్ధపాదము |
| ద్వితీయపాదము | తృతీయపాదము |
| తృతీయపాదము | ద్వితీయపాదము |
| చతుర్ధపాదము | ప్రథమపాదము |

**పై నియమము వలన వధూవరులకు ఒకే నక్షత్రమైనను, ప్రథమ చతుర్ధపాదములు కలిగినవారు ద్వితీయ,తృతీయపాదములుకలిగిన వధూవరులతో వివాహము చేసికొనవచ్చును.**

**సేవ్య సేవకుల నక్షత్ర మేలాపకము :-**

**సేవ్యాధమర్ణయువతీ నగరాదిభం చేత్పూర్వం**
**హి భృత్యధనిభర్తృ పురాదిసద్భాత్**
**సేవావినాశధననాశన భర్తృ నాశ గ్రామాది**
**సౌఖ్యహృదిదం క్రమశ: ప్రదిష్టమ్ 38**

స్వామి (యజమాని) ఋణి (అప్పు తీసుకొన్నవాడు) స్త్రీ,అభీష్ట నగరముల నక్షత్రములు, సేవకుడు,ధనవంతుడు,(అప్పు ఇచ్చినవాడు) పతి,తమగ్రామ నక్షత్రములకు ముందున్న క్రమముగా సేవకుడు, ధనవంతుడు, పతి, గ్రామసుఖము నాశనమగును. అనగా స్వామి నక్షత్రము సేవకునికి నక్షత్రమునకు ముందున్న (స్వామి నక్షత్రము రోహిణియైన సేవక నక్షత్రము మృగశిర) సేవకు నాశనము కలుగును. ధని నక్షత్రము ఋణి నక్షత్రమునకు ముందున్న ధననాశనమగును. పతినక్షత్రము పత్నినక్షత్రమునకు ముందున్న పతికి నాశనము కలుగును. నగర నక్షత్రము తానుకోరిన గ్రామనక్షత్రము కన్న ముందున్న గ్రామములో సుఖముండదు.

**సేవకుని నియమించుటకు లేక ఏదైన గ్రామములో నివసించుటకు ముందు నక్షత్ర విచారము చేయవలెను. దీనిని 'నృదూర' దోషమందురు. వివాహ విషయములో కూడ వర-కన్యల నక్షత్రముల నృదూరదోషమును పరిశీలించవలెను.**

**కుజ శుక్రసౌమ్య శశిసూర్య చన్ద్రజా: కవిభౌమ జీవశనిసౌరయో గురు:**
**ఇహ రాశిపా: క్రియమృగాస్య తౌలికేన్దుభతో నవాంశవిధిరుచ్యతే బుధై: 39**

కుజ,శుక్ర,బుధ,చంద్ర,సూర్య,బుధ,శుక్ర,కుజ, గురు,శని,శని,గురువులు క్రమముగా మేషాదిరాశులకు స్వాములగును. అనగా మేషమునకు కుజుడు, వృషభమునకు

శుక్రుడు, మిథునమునకు బుధుడు, కర్కాటకమునకు చంద్రుడు, సింహమునకు సూర్యుడు, కన్యకు బుధుడు, తులకు శుక్రుడు, వృశ్చికమునకు కుజుడు, ధనుస్సుకు గురువు, మకర కుంభములకు శని, మీనమునకు గురువు స్వాములగుదురు.

**మేష,మకర,తుల, కర్కాటకముల నుండి నవమాంశ గణన చేయబడును. మేష సింహ ధనూరాశులలో మేషమునుండి, వృషభ కన్య మకరరాశులకు మకరమునుండి, మిథున తుల కుంభరాశులకు తుల నుండి, కర్కాటక వృశ్చిక మీనరాశులకు కర్కాటకము నుండి నవాంశ గణన చేయవలెను.**

**ఒకరాశిలో 30-అంశలుండును.వాటిని తొమ్మిదిచే భాగించిన $3^{0}$-$20^{'}$ ఒక నవాంశ యగును.లగ్నములేక రాశి ఏభాగములోనగునో ఆభాగమునననుసరించి నియ మానుసారము మేష,మకర,తుల కర్కాటకరాశుల నుండి గణించిన నవాంశ రాశి తెలియును.**

**ఉదాహరణకు లగ్నము $2^{0}.12^{'}.30^{''}$, రవి $0^{0}.22^{'}.11^{''}$ ఉన్నప్పుడు లగ్నము మూడవ రాశియైన మిథునము నాల్గవభాగలోనున్నది. మిథున, తుల, కుంభరాశుల గణన తులలో ప్రారంభించి చేయవలెను. అందు వలన తుల నుండి నాల్గవరాశియైన మకరములో నవాంశ లగ్నమైనది.ఇదేవిధముగా మేషరాశి ఏడవభాగలో సూర్యుడున్నప్పుడు అనగా ఏడవరాశియైన తులా నవాంశలో సూర్యుడున్నాడు.**

నవాంశ బోధకపట్టిక

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| అంశములు | 3.20 | 3.20<br>6.40 | 6.40<br>10.00 | 10.00<br>13.20 | 13.20<br>16.40 | 16.40<br>20.00 | 20.00<br>23.20 | 23.20<br>26.4 | 26.4<br>30.0 |
| మేష, సింహ ధనుస్సు | మే | వృష | మిథు | కర్కా | సింహ | కన్య | తుల | వృశ్చి | ధను |
| వృష, కన్య మకరం | మక | కుంభ | మీన | మేష | వృష | మిథు | కర్కా | సింహ | కన్య |
| మిథు, తుల కుంభ | తుల | వృశ్చి | ధను | మక | కుంభ | మీన | మేష | వృష | మిథు |
| కర్కా, వృశ్చి మీనం | కర్కా | సింహ | కన్య | తుల | వృశ్చి | ధను | మకర | కుంభ | మీన |

**హోరాజ్ఞానము :-**

**సమగృహ మధ్యే శశిరవిహోరా**
**విషమభమధ్యే రవిశశినో:సా** **40**

ఒకరాశిలో సగభాగమును హోర అందురు. రాశి ప్రారంభము నుండి 15 అంశముల వరకు ఒకహోర, 15 నుండి 30 అంశముల వరకు రెండవహోరయగును. సూర్యచంద్రుల హోరాధిపతులగుదురు. సమ,విషమ రాశులలో వ్యుత్క్రమముగా (క్రిందికి)

మరియు ఉత్క్రమముగా(పైకి) చంద్ర సూర్యహోర లగును.

హోరాబోధక పట్టిక

| రాశులు | మే | వృ | మి | క | సి | క | తు | వృ | ధ | మ | కు | మీ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ప్రథమహోర $0^0 - 15^0$ | సూ మే | చం మి | సూ సిం | చం తు | సూ ధ | చం కుం | సూ మే | చం మి | సూ సి | చం తు | సూ ధ | చం కుం |
| $15^0 - 30^0$ ద్వితీయహోర | చం వృ | సూ క | చం కన్య | సూ వృ | చం మ | సూ మీ | చం వృ | సూ క | చం క | సూ వృ | చం మ | సూ మీ |

మేషరాశిలో ప్రథమహోర మేషము, రెండవహోర వృషభము, వృషభరాశిలో మొదటిహోర మిథునము, రెండవహోర కర్కాటకము,. ఈ విధముగా క్రమముగా హోరారాశిని గ్రహించి దాని స్వామిని హోరేశునిగా భావించవలెను.

**శుక్రజ్ఞ జీవశనిభూతనయస్య బాణశైలాష్టపఞ్చవిశిఖా: సమరాశిమధ్యే**
**త్రింశాంశకో విషమభే విపరీతమస్మాద్ ద్రేష్కాణకా: ప్రథమపఞ్చ నవాధిపానామ్ 41**

శుక్ర–బుధ–గురు–శని–కుజులకు క్రమముగా 5,7,8,5,5 అంశముల వరకు సమరాశిలో త్రింశాంశ యగును. విషమరాశిలో వ్యతిరేక క్రమములో అనగా 5,5,8,7,5 అంశములకు క్రమముగా కుజ–శని–గురు–బుధ–శుక్రులకు త్రింశాంశయగును. ద్రేక్కాణము (రాశిలో మూడవభాగము) తనరాశి నుండి ప్రథమ,పంచమ, నవమరాశు లలోని స్వామికగును. అనగా ద్రేక్కాణము ($0^0$–$10^0$)తనరాశి స్వామికి ద్వితీయ ద్రేక్కాణము ($10^0$–$20^0$) తనరాశి నుండి ఐదవరాశి స్వామికి. తృతీయ ద్రేక్కాణము ($20^0$–$30^0$) తనరాశి స్వామికి తొమ్మిదవ రాశి స్వామియగును.

**ఒకరాశిలో క్రమముగా 5+7+8+5+5 అంశములు కలిపి త్రింశాంశమందురు. విషమరాశిలో మొదటి అంశములో ఏగ్రహమున్నను అది కుజగ్రహ త్రింశాంశగా గుర్తింపబడును. గ్రహస్థాపనము కుజుని విషమరాశి మేషరాశిలో నగును. ఇదేవిధముగా సమరాశిలో ప్రథమ ఐదు అంశములోనున్న గ్రహము శుక్ర త్రింశాంశగా గుర్తింపబడును. దాని స్థాపనము శుక్రసమరాశి వృషభములో నగును. ఈ విధముగా త్రింశాంశలో గ్రహముల స్థాపన చేయవలెను.**

త్రింశాంశ బోధకపట్టిక

| సమరాశులు | | | | | విషమరాశులు | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| శుక్ర 5 | బుధ 7 | గురు 8 | శని 5 | కుజ 5 | కుజ 5 | శని 5 | గురు 8 | బుధ 7 | శుక్ర 5 |
| 0–5 2 వృష | 5–12 6 కన్య | 12–20 12 మీనం | 20–25 10 మకర | 25–30 8 వృశ్చిక | 0–5 1 మేషం | 5–10 11 కుంభం | 10–18 9 ధను | 18–25 3 మిథున | 25–30 7 తుల |

## ద్రేక్కాణ బోధకపట్టిక

| అంశము | ద్రేక్కాణము | మే | వృ | మి | క | సి | క | తు | వృ | ధ | మ | కు | మీ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 0-10 | ప్రథమ | 1 కు | 2 శు | 3 బు | 4 చం | 5 సూ | 6 బు | 7 శు | 8 కు | 9 గు | 10 శ | 11 శ | 12 గు |
| 10-20 | ద్వితీయ | 5 ర | 6 బు | 7 శు | 8 కు | 9 గు | 10 శ | 11 శ | 12 గు | 1 కు | 2 శు | 3 బు | 4 చం |
| 20-30 | తృతీయ | 9 గు | 10 శ | 11 శ | 12 గు | 1 కు | 2 శు | 3 బు | 4 చం | 5 ర | 6 బు | 7 శు | 8 కు |

**ద్వాదశాంశ జ్ఞానము :-**

**స్యాద్ద్వాదశాంశ ఇహ రాశిత ఏవ గేహం**
**హెూరాஉథ దృక్కనవమాంశకసూర్యభాగా:**
**త్రింశాంశ కశ్చషడిమే కథితాస్తు వర్గా:**
**సౌమ్యై:శుభం భవతి చాశుభమేవ పాపై: 42**

ద్వాదశాంశ ఆరంభము తనరాశి నుండి యగును. 30 అంశములను 12 భాగములు చేసిన $2^0-30'$ ఒక ఖండమగును. ఏఖండములో అభీష్ట గ్రహముండునో ఆఖండము వరకు తనరాశి నుండి గణన చేసిన ద్వాదశాంశ రాశి రాశీశుడు తెలియును. లగ్నము,హెూర,ద్రేక్కాణము,నవాంశము, ద్వాదశాంశము, త్రింశాంశము ఇవి షడ్వర్గులుగా తెలిపెను. ఈ షడ్వర్గులలో శుభగ్రహములున్న శుభము, పాపగ్రహములున్న అశుభఫలము నిచ్చును. షడ్వర్గులలో ఏగ్రహము శుభగ్రహరాశులలో నుండునో అది శుభఫలము, పాపగ్రహరాశులలో నున్న అశుభఫలమును, మిశ్రితమైన మిశ్రమఫలమునిచ్చును.

## ద్వాదశాంశ పట్టిక

| రాశులు/అంశలు | మే | వృ | మి | క | సి | క | తు | వృ | ధ | మ | కు | మీ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 2.30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| 5.00 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 |
| 7.30 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 |
| 10.00 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 |
| 12.30 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 |
| 15.00 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 |
| 17.30 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 20.00 | 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| 22.30 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| 25.00 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| 27.30 | 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| 30.00 | 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 |

**గండాంత దోషము :-**

**జ్యేష్ఠాపౌష్ణభసార్పభాన్త్య ఘటికాయుగ్మం చ మూలాశ్వినీ**
**పిత్రాదౌ ఘటికాద్వయం నిగదితం తద్భస్య గణ్డాన్తకమ్**
**కర్కాల్యణ్డజ భాన్తతో ఉర్ధ ఘటికా సింహాశ్వమేషాదిగా**
**పూర్ణాన్తే ఘటికాత్మకం త్వశుభదం నన్దాతిథేశ్చాదిమమ్ 43**

జ్యేష్ఠ, రేవతి, ఆశ్లేష నక్షత్రముల చివరి రెండేసి ఘడియలు, మూల, అశ్విని,మఘ నక్షత్రముల మొదటి రెండేసి ఘడియలు గండాంత సంజ్ఞకములగును. అనగా జ్యేష్ఠ అంతిమ రెండుఘడియలు మూల ప్రథమ రెండు ఘడియలు మొత్తము నాలుగు ఘడియలు. ఇదేవిధముగా రేవతి అంతిమ రెండు ఘడియలు, అశ్విని మొదటి రెండు ఘడియలు, ఆశ్లేష చివరి రెండు ఘడియలు, మఘ మొదటి రెండు ఘడియలు, మొత్తము నాలుగేసి ఘడియలు నక్షత్ర గండాంతమగును.

కర్కాటక, వృశ్చిక, మీనముల చివరి సగము ఘడియ సింహ ధనూ, మేషముల మొదటి అరఘడియ మొత్తము ఒకఘడియ లగ్న గండాంతమగును. అనగా కర్కాటకాంత అరఘడియ సింహ ప్రథమ అరఘడియ మొత్తము ఒకఘడియ గండాంతమగును. ఇదేవిధముగా వృశ్చికాంత అరఘడియ ధనుస్సు మొదటి అరఘడియ, మీనాంత అరఘడియ మేషాది అరఘడియ లగ్నగండాంతమగును. పూర్ణసంజ్ఞక 5,10,15 తిథులలో చివరకి ఒక్కొక్క ఘడియ, నంద సంజ్ఞక (1,6,11)తిథులలో మొదటి ఒక్కొక్క ఘడియ తిథిగండాంత మగును. ఈ మూడును అశుభమును కలిగించును.

**గండాంతము సంధిని సూచించును. ఒక నక్షత్రము అంతము రెండవ నక్షత్ర ఆరంభము సంధి సంజ్ఞకమగును. నక్షత్రములు రాశులు సమాప్తమై తరువాత నక్షత్రముల రాశుల ప్రారంభ సమయము నక్షత్రసంధి లేక నక్షత్ర గండాంతమగును. మీనరాశి అంతము రేవతి నక్షత్ర అంతముతోనగును. రేవతీ నక్షత్ర అంతిమ ఘడియ మేషరాశిలో అశ్వినీ నక్షత్ర ప్రారంభ ఘడియ నక్షత్రగండాంతమగును. ఇదేవిధముగా ఆశ్లేషతో కర్కాటకరాశి, జ్యేష్ఠతో వృశ్చికరాశి సమాప్తమగును. ఈ క్రమములో ఆశ్లేష, మఘ, జ్యేష్ఠ మూల నక్షత్రములు గండాంత సంజ్ఞకములగును. ఈ రాశుల సంధులు లగ్నగండాంతము లనబడును.**

**నంద, భద్ర,జయ,రిక్త, పూర్ణతిథులు పాడ్యమి నుండి ప్రారంభమై పంచమి వరకు క్రమముగానగును. ఈ తిథులలో పూర్ణ నందలకు సంధి జరుగును. అందువలన పూర్ణిమ - పాడ్యమి, పంచమి - షష్ఠి, దశమి- ఏకాదశి తిథుల మధ్య రెండు ఘడియలు గండాంత సంజ్ఞకములనబడెను.**

**పై వాటితో పాటు పక్ష, మాస, వర్షాది సంధులు త్యజింపబడినవి.వ్యవహారములో**

**వాటి ఉపయోగములు కనపడనందున ప్రముఖ గండాంతదోషములను పండితులు తెల్పిరి.**

**కర్తరీ దోషము :-**

**లగ్నాత్పాపావృజ్వ నృజూ వ్యయార్థస్థౌ యదా తదా**
**కర్తరీ నామ సా జ్ఞేయా మృత్యుదారి ద్ర్యశోకదా** **44**

లగ్నమునుండి పన్నెండవ భావములో ఋజు పాపగ్రహము, ద్వితీయభావములో వక్రియైన పాపగ్రహమున్న కర్తరీయోగమగును. ఈ యోగము మృత్యువు, దారిద్ర్యము, శోకమును కలిగించును.

**లగ్నము నుండి పన్నెండవభావము వక్రియైన పాపగ్రహము, రెండవభావములో ఋజుగతి కలిగిన పాపగ్రహమున్న కర్తరీదోషముండదు.చంద్రుని నుండి పన్నెండవ భావములో ఋజు పాపగ్రహము, ద్వితీయములో వక్రియైన పాపగ్రహమున్నను కర్తరీ దోషముండును. కర్తరీదోషమున్న లగ్న చంద్రులు శుభగ్రహములతో కూడియున్న లేక చూడబడిన కర్తరీ దోషముండదు. అశుభము కలుగదు.**

**చన్ద్రే సూర్యాది సంయుక్తే దారిద్ర్యం మరణం శుభమ్**
**సౌఖ్యం పాపత్న్యవైరాగ్యే పాపద్వయయుతే మృతి:** **45**

**చంద్రయుతి ఫలము** :-

వివాహకాలములో సూర్యాది గ్రహములతో చంద్రుడున్న క్రమముగా దరిద్రము, మృత్యువు, శుభము, సుఖము, సపత్ని ఆగమనము, వైరాగ్యము కలుగును. అనగా చంద్రుడు సూర్యునితో కూడియున్న దరిద్రము, కుజునితో నున్న మృత్యువు, బుధునితో నున్న శుభము,గురువుతో నున్న సుఖము,శుక్రునితోనున్న సపత్నీప్రాప్తి(సవతి వచ్చుట) శనితో కూడియున్న వైరాగ్యము కలుగును. రెండు పాపగ్రహములతో చంద్రుడున్న మృత్యువు కలుగును.

**అష్టమలగ్న ఫలము** :-

**జన్మలగ్నభయోర్మృత్యురాశౌ నేష్ట: కరగ్రహ:**
**ఏకాధిపత్యే రాశీశమై త్ర్యే వా నైవ దోషకృత్** **46**

జన్మలగ్నము లేక జన్మరాశి నుండి అష్టమరాశి లగ్నములో వివాహము శుభము నీయదు. ఒకవేళ లగ్నేశుడు అష్టమేశుడు (ఎనిమిదవ రాశి అధిపతి) ఒకేగ్రహమైన లగ్నరాశీశులకు అష్టమేశునితో మిత్రత్వమున్న దోషము కలుగదు. జన్మలగ్నము మేషము వివాహలగ్నము వృశ్చికమైన జన్మలగ్నము నుండి అష్టమము వివాహలగ్నమైనది. రెండు లగ్నముల స్వామి కుజుడుగుట వలన అశుభము కలుగదు. ఇదేవిధముగా జన్మలగ్నము సింహము, అష్టమలగ్నమైన మీనము వివాహలగ్నమైన అశుభము కలుగదు. లగ్నరాశి అధిపతులైన రవి గురువులకు మిత్రత్వమున్నది.

**మీనోక్ష కర్కాలి మృగస్త్రియోఽష్టమం లగ్నం నాష్టమగేహదోషకృత్**
**అన్యోన్యమిత్రంత్వవశేన సా వధూర్భవేత్సుతాయుర్గృహ సౌఖ్యభాగినీ 47**

వర-వధువుల జన్మలగ్నము లేక రాశినుండి అష్టమరాశి మీన, వృషభ, కర్కాటక, వృశ్చిక,మకర, కన్యలగ్నములైన అష్టమభావములోనున్న దోషము కలుగదు. లగ్నేశ అష్టమేశులకు మిత్రత్వమున్న వివాహిత వధువుకు పుత్రులు, ఆయువు, గృహసుఖము కలుగును.

**మీన, వృషభ,కర్కాటకము, వృశ్చిక, మకర,కన్యారాశులు అష్టమరాశులైనపుడు లగ్నరాశులు క్రమముగా సింహ,తుల,ధను,మేష, మిథున,కుంభములగును. వీటిలో వృషభ, తులలు, మేష వృశ్చికములకు ఏకాదిపత్యమున్నది (రెండు రాశులకు స్వామిఒక్కడే) మిగిలిన రాశులలో పరస్పరము మిత్రత్వమున్నది. అందువలన దోషపరిహారమైనది.**

**ద్వాదశాష్టమ సంబంధ దోషము :-**

**మృతిభవనాంశో యది చ విలగ్నే తదధిపతిర్వా న శుభకర: స్యాత్**
**వ్యయభవనం వా భవతి తదంశస్తదధిపతిర్వా కలహకర: స్యాత్ 48**

వర-వధువుల జన్మలగ్నము నుండి అష్టమభావరాశి దాని స్వామి లేక అష్టమరాశి నవాంశము వివాహ లగ్నములోనున్న అశుభఫలము కలుగును. ఇదేవిధముగా పన్నెండవ భావరాశి దానిస్వామి, దాని నవాంశము వివాహలగ్నములో నున్న కలహకారణమగును.

**నక్షత్రముల విషఘటీ దోషము :-**

**ఖరామతోఽన్త్యాదితివహ్ని పిత్ర్యభే ఖవేదత: కే రదతశ్చ సార్పభే**
**ఖబాణతోఽశ్వే ధృతితోఽయమామ్బుపే కృతేర్భగత్వాష్ట్ర భవిశ్వజీవభే 49**
**మనోర్ద్విద్వైవానిల సౌమ్యశాక్రభే కృపక్షత: శైవకరోఽష్టి తోఽజభే**
**యుగాశ్వితో బుధ్న్యభతోయమామ్యభే ఖచన్ద్రతో మిత్రభవాసవశ్రుతౌ 50**
**మూలేఽఙ్గబాణా ద్విషనాడికాకృతా వర్జ్యా: శుభేథో విషనాడికా ధ్రువా:**
**నిఘ్నా భభోగేన ఖతర్కభాజితా: స్పష్టా భవేయుర్విషనాడికాస్తథా 51**

రేవతి-పునర్వసు-కృత్తిక-మఘ నక్షత్రములలో 30 ఘడియల తర్వాత 4 ఘడియలు విషఘడియలగును. రోహిణిలో 40 ఘడియలు, ఆశ్లేషలో 32 ఘడియలు, అశ్వినిలో 50ఘడియలు, ఉత్తర శతభిషంలలో 18 ఘడియలు, పుబ్బ, చిత్త, ఉత్తరాషాఢ పుష్యమి, నక్షత్రములలో 20 ఘడియలు, విశాఖ, స్వాతి, మృగశిర, జ్యేష్ఠ నక్షత్రములలో 14 ఘడియలు, ఆర్ద్ర, హస్తలలో 21ఘడియలు, పూర్వాభాద్రలో 16ఘడియలు, ఉత్తరాభాద్ర పూర్వాషాఢ భరణిలో 24 ఘడియలు,అనూరాధ, శ్రవణం, ధనిష్ఠలలో 10 ఘడియలు, మూలలో 56 ఘడియల తర్వాత 4 ఘడియలు విషఘడియలగును. వీటిని శుభకార్యములలో వదిలిపెట్టవలెను. వీటిని స్థూలముగా విషఘడియలుగా తలంతురు.

నక్షత్ర సమయమును 4చే గుణించి 60చే భాగించిన విషఘుడియల స్పష్టమానము తెలియును.

**ప్రతి నక్షత్రములో వేరువేరు ఘుడియల అనంతరము నాలుగేసి ఘుడియలు విషఘుడియలుగా తలంచి నక్షత్రమునకు 60 ఘుడియలుగా భావించి తెలుపుట జరిగినది. సూక్ష్మజ్ఞానము కొరకు త్రైమాసికములో అనుపాతము చేయవలెను.**

**ఉదాహరణకు భాగఘుడియలు 65,29,వీటిలో విషఘుడియలు స్పష్టమానమును తెలిసికొనవలెను.**

**65.29 X 4 ÷ 60 = 4.21 స్పష్టఘుడియలు**

**అందువలన ఉత్తరాషాఢ నక్షత్రమునకు 20 ఘుడియలు జరిగిన తర్వాత 4.21 ఘుడియల వరకు విషఘుడియ ఉండును. అనగా ఉత్తరాషాఢ నక్షత్రములో 20 ఘుడియల నుండి 24 ఘుడియల వరకు శుభకార్యములు చేయరాదు.**

నక్షత్ర విషఘుటీ బోధక పట్టిక

| నక్షత్రము | విషఘుడియలు | | నక్షత్రము | విషఘుడియలు | |
|---|---|---|---|---|---|
| | నుండి | వరకు | | నుండి | వరకు |
| అశ్విని | 50 | 54 | స్వాతి | 14 | 18 |
| భరణి | 24 | 28 | విశాఖ | 14 | 18 |
| కృత్తిక | 30 | 34 | అనూరాధ | 10 | 14 |
| రోహిణి | 40 | 44 | జ్యేష్ఠ | 14 | 18 |
| మృగశిర | 24 | 28 | మూల | 56 | 60 |
| ఆర్ద్ర | 21 | 25 | పూర్వాషాడ | 24 | 28 |
| పునర్వసు | 30 | 34 | ఉత్తరాషాఢ | 20 | 24 |
| పుష్యమి | 20 | 24 | శ్రవణం | 10 | 14 |
| ఆశ్లేష | 32 | 36 | ధనిష్ఠ | 10 | 14 |
| మఖ | 30 | 34 | శతభిషం | 18 | 22 |
| పుబ్బ | 20 | 24 | పూర్వాభాద్ర | 16 | 20 |
| ఉత్తర | 18 | 22 | రేవతి | 30 | 34 |
| హస్త | 21 | 25 | | | |
| చిత్త | 20 | 24 | | | |

**చంద్రుడు లగ్నము నుండి కేంద్రము, త్రికోణములో నున్న లగ్నేశుడు కేంద్రములో నున్న విషఘుటీదోషముండదు.శుభరాశిలోనున్న చంద్రుడు లేక లగ్నేశుడు శుభగ్రహములతో చూడబడిన లేక తమ షడ్వర్గములో నున్న విషఘుటీ దోషముండదు.**

**పగలు పదిహేను ముహూర్తములు :-**

**గిరిశభుజగమిత్రా: పిత్ర్యవశ్యమ్బు విశ్వే**
**ఒభిజిదథ చ విధాతాపీన్ద్ర ఇన్ద్రానలౌ చ**
**నిర్రృతి రుదకనాథో౽ప్యర్యమాథో భగ: స్యు:**
**క్రమశ ఇహ ముహూర్తా వాసరే బాణచన్ద్రా: 52**

1. ఆర్ద్ర 2.ఆశ్లేష 3.అనూరాధ 4.మఘ 5.ధనిష్ఠ 6.పూర్వాషాఢ 7.ఉత్తరాషాఢ 8.అభిజిత్ 9.రోహిణి 10.జ్యేష్ఠ 11.విశాఖ 12.మూల 13.శతభిషం 14.ఉత్తర 15.పుబ్బ ఈ పదిహేను ముహూర్తములు క్రమముగా ఒకదినము(పగలు)లోనగును. ఈ నక్షత్రముల స్వామి ముహూర్తములకు స్వామియగును.వారు క్రమముగా గిరీశ, భుజగ, మిత్ర,పిత్రు,వసు, అంబు,విశ్వేదేవ,అభిజిత్తు,విధాత ఇంద్ర,ఇంద్రాగ్ని,నిర్రృతి, ఉదకనాథ,అర్యమ,భగలు.

**రాత్రి పదిహేను ముహూర్తములు :-**

**శివో౽జ పాదాదష్టౌ స్యుర్భేశా అదితిజీవకౌ**
**విష్ణ్వర్క త్వాష్ట్రమరుతో ముహూర్తా నిశి కీర్తితా: 53**

ఆర్ద్ర, పూర్వాభాద్ర – పూర్వాభాద్ర నుండి ఎనిమిది నక్షత్రములు (పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి, అశ్విని,భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర) పునర్వసు,పుష్యమి,శ్రవణ, హస్త,చిత్త,స్వాతి – ఈపదిహేను రాత్రి ముహూర్తములుగా చెప్పబడినవి. ఈ నక్షత్రములకు స్వాములు క్రమముగా శివ,అజపాద, అహిర్బుధ్న్య,పూష, అశ్వినీకుమార, యమ,అగ్ని, బ్రహ్మ, చంద్ర,అదితి,గురు,విష్ణు,సూర్య, త్వాష్ట్ర, వాయువు – ఇవి రాత్రి ముహూర్తములగును

**శుభముహూర్తములు దొరకనపుడు ఈ ముహూర్తములుపయోగపడును.శుభ ముహూర్తములు దొరకనపుడు పగలు రాత్రి తెల్పిన ముహూర్తములలో అనుకూల నక్షత్ర సమయములో శుభకార్యమును నిర్వహించవచ్చును.**

**పగలు నిందితముహూర్తములు :-**

**రవావర్యమా బ్రహ్మరక్షశ్చ సోమే కుజే వహ్ని పిత్ర్యే బుధే చాభిజిత్స్యాత్**
**గురౌ తోయరక్షౌ భృగౌ బ్రహ్మపిత్రే శనావీశసార్పౌ ముహూర్తా నిషిద్ధా: 54**

రవివారము ఆర్యమ, సోమవారము బ్రహ్మ, రాక్షస, మంగళవారము అగ్ని పిత్రు, బుధవారము అభిజిత్తు, గురువారము జల, రాక్షస, శుక్రవారము బ్రహ్మ, పిత్రు, శనివారము ఈశ సర్ప సంజ్ఞకములు నిషిద్ధములగును. అనగా రవివారము ఉత్తరానక్షత్ర సంబంధిత కార్యము అర్యమా ముహూర్తములో చేయరాదు. అదేవిధముగా సోమవారము రోహిణి మూల, మంగళవారము కృత్తిక మఘ, బుధవారము అభిజిత్తు, గురువారము పూర్వాషాఢ మూల, శుక్రవారము రోహిణి మఘ, శనివారము ఆర్ద్ర ఆశ్లేష నక్షత్రములకు సంబంధించిన కార్యములు ఆనక్షత్ర ముహూర్తములలో నిర్వహించరాదు. ఇదేవిధముగా రాత్రి ముహూర్తములు గ్రహించవలెను.

## త్యాజ్యముహూర్త బోధక పట్టిక

| వారములు | త్యాజ్య ముహూర్తము పగలు | త్యాజ్యముహూర్తము రాత్రి | ముహూర్తములు | నక్షత్రము |
|---|---|---|---|---|
| రవివారము | 14 | -- | అర్యమ | ఉత్తర |
| సోమవారము | 9,12 | 8 | బ్రహ్మ రాక్షస | రోహిణి,మూల |
| మంగళవారము | 4 | 7 | వహ్ని పిత్ర్య | కృత్తిక, మఘ |
| బుధవారము | 8 | -- | అభిజిత్తు | అభిజిత్తు |
| గురువారము | 6, 12 | -- | తోయ రాక్షస | పూ.షా,మూల |
| శుక్రవారము | 4. 9 | 8 | బ్రహ్మ పిత్ర్య | రోహిణి,మఘ |
| శనివారము | 1, 2 | 1 | ఈశ సర్ప | ఆర్ద్ర, ఆశ్లేష |

**వివాహమునకు నక్షత్రాదులు :-**

**నిర్వేధై: శశికరమూలమైత్రపిత్ర్య బ్రాహ్మోన్త్యోత్తరపవనై శుభో వివాహ:**
**రిక్తామారహిత తిథౌ శుభేఽహ్నివైశ్వప్రాన్త్యాఙ్ఘ్రి: శ్రుతితిథిభాగతోఽభి జిత్స్యాత్ 55**

వేధరహితమైన మృగశిర,హస్త,మూల, అనూరాధ,మఘ, రోహిణి రేవతి,ఉత్తరా త్రయం,స్వాతి నక్షత్రములు,రిక్తతిథులు (4,9,14) అమావాస్యలను వదలి మిగిలిన తిథులు, శుభగ్రహవారములు వివాహమునకు అనుకూలమైనవి. **ఉత్తరాషాఢ నాల్గవచరణము శ్రవణము మొదటి పదిహేనవభాగము కలిపిన అభిజిత్తు నక్షత్రమగును.**

**ఉత్తరాషాఢ నక్షత్రమానము 63.36 ఘడియలు, శ్రవణ నక్షత్రమానము 64 .45 ఘడియలు** 63.39 ÷ 4 = 15.54.45
64.45 ÷ 15 = 4.19.00
20.13.45 **అభిజిత్తు నక్షత్రమానమగును.**

**పంచశలాక వేధ :-**

**వేధోఽన్యోన్యమసౌ విరిఞ్చ్యభిజితో ర్యామ్యానురాధర్క్షయో**
**ర్విశ్వేన్ద్వోర్హరిపిత్ర్యయోర్గ్రహకృతో హస్తోత్తరాభాద్రయో:**
**స్వాతీవారుణయోర్భవేన్నిరృతిభాదిత్యోస్తథోషాన్త్యయో:**
**ఖేటే తత్ర గతే తురీయ చరణాద్యోర్వా తృతీయద్వయో: 56**

రోహిణి-అభిజిత్తు,భరణి-అనూరాధ, ఉత్తరాషాఢ-మృగశిర, శ్రవణ-మఘు, హస్త - ఉత్తరాభాద్ర,స్వాతి-శతభిషం,మూల-పునర్వసు,ఉత్తర-రేవతి, ఈ రెండేసి నక్షత్రములకు గ్రహమువలన వేధ కలుగును. ఈ నక్షత్రములలో గ్రహము న్నప్పుడు చతుర్ధముతో ప్రథమచరణమునకు, తృతీయముతో ద్వితీయ చరణమునకు వేధ కలుగును. అనగా నక్షత్రము చతుర్ధచరణములో నున్న గ్రహము రెండవ నక్షత్ర ప్రథమపాదమునకు మూడవ చరణమబులో నున్న గ్రహము రెండవపాదమునకు వేధను కలిగించును. శ్రవణానక్షత్ర చతుర్ధపాదములోనున్న గ్రహము మఘ ప్రథమచరణమునకు వేధను కలిగించును.

అదేవిధముగా శ్రవణము తృతీయ చరణములో నున్న గ్రహము మఘనక్షత్ర ద్వితీయ చరణమునకు వేధకలిగించును.

**వేధ శుభగ్రహముతో నైనను పాపగ్రహముతోనైనను అశుభమును కలిగించును. కాని నారదమతానుసారము శుభగ్రహముతో వేధ కలిగిన, వేధ కలిగిన నక్షత్రపాదమును వదిలి పెట్టవలెను. పాపగ్రహముతో వేధ కలిగిన నక్షత్రమును పూర్తిగా వదలిపెట్టవలెను.**

**శాక్రేజ్యే శతభానిలే జలశివే పౌష్ణార్యమర్-వసు**
**ద్వీశే వైశ్వసుధాంశుభే హయభగే సార్పానురాధేమిథ:**
**హస్తోపాన్తిమభే విధాతృవిధిభే మూలాదితీ త్వాష్ట్రభా**
**జాష్ట్రీ యామ్యమఘే కృశానుహరిభే విద్ధే కృభృద్రేఖికే** **57**

జ్యేష్ఠ-పుష్యమి, శతభిషం-స్వాతి, పూర్వాషాఢ-ఆర్ద్ర, రేవతి-ఉత్తర,ధనిష్ఠ-విశాఖ, ఉత్తరాషాఢ-మృగశిర,అశ్విని-పుబ్బ, ఆశ్లేష-అనూరాధ,హస్త-ఉత్తరాభాద్ర, రోహిణి-అభిజిత్తు, మూల-పునర్వసు, చిత్త-పూర్వాభాద్ర,భరణి-మఘ, కృత్తిక-శ్రవణం, వీటికి పరస్పరము వేధ కలుగును. ఈ వేధ సప్తశలాక చక్రము ద్వారా తెలిసికొనవచ్చును.

**సప్తశలాక పట్టిక**

కృత్తిక రోహిణి మృగ ఆర్ద్ర పున పుష్య ఆశ్లేష

భరణి — మఖ
అశ్విని — పుబ్బ
రేవతి — ఉత్తర
ఉ. భాద్ర — హస్త
పూ. భాద్ర — చిత్త
శతభిషం — స్వాతి
ధనిష్ఠ — విశాఖ

శ్రవ అభిజి ఉ. షా పూ. షా మృ జ్యేష్ఠ అనూ

**క్రూరవేధ పరిహారము :-**

**ఋక్షాణి క్రూరవిద్ధాని క్రూరభుక్తాది కాని చ**
**భుక్త్వా చన్ద్రేణ ముక్తాని శుభార్హాణి ప్రచక్షతే** **58**

పాపగ్రహములచే వేధ పొందినవి, పాపగ్రహములచే భుక్తములై వదిలిపెట్టబడినవి. పాపగ్రహముల యోగము కలిగినవి. పాపగ్రహములయోగము కలుగునవియైన నక్షత్రములను శుభకార్యములందు వదిలిపెట్టవలెను. ఒకవేళ ఆనక్షత్రము చంద్రునిచే

భుక్తమై విడువబడిన వివాహాది శుభకార్యముల కనుకూలమగును.

**లత్తాదోషము :-**

**జ్ఞరాహుపూర్ణేన్దుసితా: స్వపృష్ఠే భం సప్తగోజాతి శరైర్మితం హి**
**సంలత్త యుత్తేఽర్కశనీజ్యభౌమా: సూర్యాష్టతర్కాగ్నిమితం పురస్తాత్ 59**

బుధుడు,రాహువు,పూర్ణచంద్రుడు శుక్రుడు - తాము ఆక్రమించిన నక్షత్రములకు వెనుక వైపునున్న 7,9,22,5వ నక్షత్రములను క్రమముగా లత్తితము చేయును. అనగా బుధుడు తానున్న నక్షత్రమునకు వెనుకనున్న ఏడవ నక్షత్రమును, రాహువు తొమ్మిదవ నక్షత్రమును, చంద్రుడు ఇరువదిరెండవ నక్షత్రమును, శుక్రుడు ఐదవ నక్షత్రమును లత్తితము చేయును. ఇదేవిధముగా సూర్యుడు, శని, గురువు, కుజుడు తమ ముందున్న 12,8,6,3 నక్షత్రములను క్రమముగా లత్తితము చేయును.

లత్తాదోషము వివాహములో తప్పక వదలవలెను. రవిలత్త ధనమును హరించును. కుజలత్త మరణము, చంద్రలత్త నాశము బుధలత్త నాశమును, గురులత్త బంధునాశమును, రాహులత్త మరణమును, శుక్రలత్త కార్యనాశనమును కలిగించును.

**పాతదోషము :-**

**హర్షణ వైధృతిసాధ్యవ్యతిపాతకగణ్డ శూల యోగానామ్**
**అన్తే యన్నక్షత్రం పాతేన నిపాతితం తత్స్యాత్ 60**

హర్షణ, వైధృతి, సాధ్య,వ్యతీపాత,గండ, శూలయోగముల అంతిమ క్షణములో నుండు నక్షత్రము పాతదోషమును కలిగించును. దీనిని చండాయుధ యోగమందురు.

**క్రాంతిసామ్య మహాపాతదోషము :-**

**పఞ్చాస్యాజౌ గోమృగౌ తౌలికుమ్భౌ కన్యామీనౌ కర్క్యలీ చాపయుగ్మే**
**తత్రాన్యోన్యం చన్ద్రభాన్వోర్నిరుక్తం క్రాన్తే: సామ్యం నోశుభం మఙ్గలేషు 61**

సింహ - మేష, వృషభ - మకర, తుల - కుంభ, కన్య - మీన, కర్కాటక - వృశ్చిక, ధను - మిథున, ఈ రెండేసి రాశులలో సూర్యచంద్రులున్న క్రాంతిసామ్యనామక దోషమగును. దీనిని మంగళకార్యములలో శుభముగా గ్రహించరు. సింహములో సూర్యుడు మేషములో చంద్రుడు, లేక సింహములో చంద్రుడు మేషములో సూర్యుడున్న క్రాంతి సామ్యదోషమగును. దీనిని మహాపాతదోషమని కూడ అందురు. ఇదేవిధముగా మిగిలిన రెండేసి రాశులను గ్రహించవలెను.

**సూర్యచంద్రుల క్రాంతులలో సామ్యముండుట వలన క్రాంతిసామ్య దోషమగుచున్నది.క్రాంతిసామ్యములో రెండు భేదములున్నవి. 1.వ్యతీపాతము 2. వైధృతి. వ్యతీపాతము-అయనభేద (భిన్నరాశులలో)ముండి సూర్యచంద్రులు ఒకేవృత్తములో క్రాంతి (గమనము) సమానముగానున్న వ్యతీపాతనామక దోషమగును.ఒకేఅయనములో వేరువేరు వృత్తము**

**లలోనున్న సూర్యచంద్రులయోగము పన్నెండు రాశులలో క్రాంతులలో సమానత్వ మున్నప్పుడు వైధృతినామక దోషమగును. అనగా ఒకేరాశిలో సూర్యచంద్రుల గమనము సమానముగానున్న వైధృతి, భిన్నరాశులలో సూర్యచంద్రుల గమనము సమానముగా నున్న వ్యతీపాతమని తెలుపవచ్చును.సూర్యచంద్రుల సమానఅంశముల ప్రభావమువలన లోకములో అరిష్టములుజరుగును.కావున శుభకార్యములలో ఈ దోషమును విడువవలెను.**

**క్రాంతిసామ్య చక్రము**

| | 1 | 12 | 11 | |
|---|---|---|---|---|
| | మేషము | మీనము | కుంభము | |
| 2 వృషభము | | | | మకరము 10 |
| 3 మిథునము | | | | ధనుస్సు 9 |
| 4 కర్కాటకము | | | | వృశ్చికము 8 |
| | సింహము | కన్య | తుల | |
| | 5 | 6 | 7 | |

**ఖర్జూరదోషము,ఏకార్గలాదోషము :-**

**వ్యాఘాతగణ్డవ్యతిపాతపూర్వ శులాన్త్యవజ్రే పరిఘాతిగణ్డే**
**యోగే విరుద్ధే త్వభిజిత్సమేత: ఖార్జూరమార్కాద్విషమే శశీ చేత్ 62**

అభిజిత్తుతో కలిపి సూర్యనక్షత్రము నుండి చంద్ర నక్షత్రము వరకు విషమ సంఖ్యలోనున్న, అదేరోజున వ్యాఘాత,గండ, వ్యతీపాత, విష్కంభ, శూల,వైధృతి,వజ్ర, పరిఘ, అతిగండ యోగములలో ఒకయోగమున్న ఖర్జూరనామక దోషమగును. దీనిని ఏకార్గల దోషమని కూడ అందురు. సూర్యనక్షత్రము నుండి సమసంఖ్యక నక్షత్రములలో చంద్రుడున్న వ్యాఘాతాది దుష్టయోగములున్నను ఖర్జూరదోషము కలుగదు. ఖర్జూరచక్ర నిర్మాణము నారదాది ఋషులు తెలియజేసిరి.

**వ్యాఘాత, శూల,పరిఘ,పాత, విష్కంభ, గండ, అతిగండ, వజ్ర, వైధృతియోగము లలో క్రమముగా పునర్వసు, మృగశిర,మఘ,ఆశ్లేష,అశ్విని,మూల,అనూరాధ, పుష్యమి,చిత్త నక్షత్రములకు ఖర్జూరచక్రశీర్షములో స్థాపించవలెను. ఖర్జూరచక్రనిర్మాణము ఒక నిలువురేఖ పదమూడుఅడ్డ రేఖలతో కలుగును. అభిజిత్తును లెక్కించరాదని తెలిపెను కాని దానిని లెక్కించకున్న విషమనక్షత్రము ఒకరేఖలోరాదు. అందువలన అభిజిత్తును కలిపి లెక్కించవలసి వచ్చును.**

**ఖర్జూర చక్ర పట్టిక**

| | పునర్వసు | |
|---|---|---|
| పుష్యమి | — | ఆర్ద్ర |
| అశ్విని | — | మృగ |
| మఘ | — | రోహిణి |
| పుబ్బ | — | కృత్తిక |
| ఉత్తర | — | భరణి |
| హస్త | — | అశ్విని |
| చిత్త | — | రేవతి |
| స్వాతి | — | ఉ. భాద్ర |
| విశాఖ | — | పూ. భాద్ర |
| అనూరాధ | — | శతభిషం |
| జ్యేష్ఠ | — | ధనిష్ఠ |
| మూల | — | శ్రవణ |
| పూర్వాషాఢ | — | అభిజిత్తు |
| | ఉత్తరాషాఢ | |

**శీర్షస్థ నక్షత్రము**

| యోగము | నక్షత్రము |
|---|---|
| వ్యాఘాతము | పునర్వసు |
| శూల | మృగశిర |
| పరిఘ | మఘ |
| వ్యతీపాత | ఆశ్లేష |
| విష్కంభ | అశ్విని |
| గండ | మూల |
| అతిగండ | అనూరాధ |
| వజ్ర | పుష్యమి |
| వైధృతి | చిత్త |

**ఉపగ్రహ దోషము :-**

**శరాష్ట దిక్శక్రనగాతి ధృత్యస్థిర్ధృతిశ్చ ప్రకృతేశ్చ పఞ్చ**
**ఉపగ్రహా: సూర్యభతోఽబ్జతారా: శుభా నదేశే కురుబాహ్లికానామ్** **63**

సూర్యనక్షత్రము నుండి చంద్ర నక్షత్రము 5,8,10,14,7,19,15,8,21,22, 23,24,25 సంఖ్యలలోనున్న ఉపగ్రహనామక దోషమగును. ఇది కురుబాహ్లిక దేశ వాసులకు శుభమునీయదు.

**పాతోపగ్రహలత్తా దోష పరిహారము :-**

**పాతోపగ్రహలత్తాసు నేష్టోఽఙ్ఘ్రి: ఖేట పత్సమ:**
**వారస్త్రిఘ్నోఽష్ట భిస్తష్ట: సైక: పాదర్థయామక:** **64**

పాత,ఉపగ్రహ,లత్తాదోషములు నక్షత్రములో ఏపాదములో జరుగునో ఆపాదము లను మాత్రమే యోగకారక నక్షత్రములో వదలవలసి యుండును. సూర్యుడు హస్త నక్షత్రము ప్రథమచరణములో చంద్రుడు అనూరాధ నక్షత్రములోనున్న ఉపగ్రహదోష మగును. కాని సూర్యుడు హస్తలో ప్రథమచరణములో నుండుటవలన చంద్రుడున్న అనూరాధ నక్షత్ర ప్రథమచరణమే దోషమును పొందును. మిగిలిన మూడుచరణములు దోషరహిత ములగును.

**కులికదోషము :-**

**శక్రార్కదిగ్వసురసాబ్ధ్యశ్విన: కులికా రవే:**
**రాత్రౌ నిరేకాస్తి థ్యంశా: శనౌ చాన్త్యోఽపి నిన్దితా 65**

రవివారము మొదలుకొని అన్నివారములలో క్రమముగా 14,12,10,8,6,4,2 ముహూర్తములు కులిక సంజ్ఞకములగును. రాత్రిలో పైన తెల్పిన ముహూర్తములలో ఒక ముహూర్తమును తక్కువచేసినకులికమగును. అనగా రవివారములో 14వ,రాత్రి ముహూర్తమునకు 1 తగ్గించి పదమూడవది కులిక ముహూర్తమగును. అదే విధముగా సోమవారము రాత్రిలో ఒకటి తగ్గించిన 11వ ముహూర్తము కులికమగును. ఈ విధముగా మిగిలిన వారములలో గ్రహించవలెను. ఈ కులికముహూర్తములలో శుభకార్యములు చేయరాదు.

| కులిక ముహూర్త పట్టిక | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| **వారము** | రవి | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
| **పగలు ముహూర్తము** | 14 | 12 | 10 | 8 | 6 | 4 | 2 |
| **రాత్రి ముహూర్తము** | 13 | 11 | 9 | 7 | 5 | 3 | 1/15 |

**దగ్ధతిథులు:-**

**చాపాన్త్యగే గోఘటగే పతఙ్గే కర్కాజగే స్త్రీమిథునే స్థితే చ**
**సింహాలిగే నక్రఘటే సమా: స్తుస్తిథ్యో ద్వితీయాప్రముఖాశ్చ దగ్ధా: 66**

ధనుస్సు – మీనము, వృషభము – కుంభము, కర్కాటకము – మేషము, కన్య – మిథునము, సింహము – వృశ్చికము, మకరము – తుల, రాశులలో సూర్యుడున్నపుడు ద్వితీయాది క్రమములో సమతిథులు దగ్ధసంజ్ఞకములగును. అనగా ధనుస్సు మీన రాశులలో సూర్యుడున్నపుడు ద్వితీయతిథి, వృషభ కుంభములలో సూర్యుడున్నపుడు చతుర్థతిథి, కర్కాటక మేషములలో సూర్యుడున్నప్పుడు షష్ఠతిథి, కన్య మిథునములలో సూర్యుడున్నపుడు అష్టమతిథి, సింహ వృశ్చికములలో సూర్యుడున్నపుడు దశమితిథి, మకర తులలలో సూర్యుడున్నపుడు ద్వాదశ తిథి దగ్ధసంజ్ఞకములగును. ఈ దగ్ధతిథులలో శుభకార్యములు చేయరాదు.

**జామిత్రదోషము :-**

**లగ్నాచ్చన్ద్రా న్మదనభావనగే ఖేటే న స్యాదిహ పరిణయనమ్**
**కిం వా బాణాశుగమితలవగే జామిత్రం స్యాదశుభకరమిదమ్ 67**

లగ్న,చంద్రుల నుండి సప్తమభావములో ఏగ్రహమున్నను జామిత్రదోషమగును.

ఈదోషములో వివాహము చేయరాదు. లగ్నము లేక చంద్రుల నుండి 55వ నవాంశములో నున్న గ్రహము కూడా జామిత్రదోషమును కలిగించును. ఇది సూక్ష్మజామిత్రదోషమగును. **ఉదాహరణకు మిథునరాశి రెండవ నవాంశలో లగ్నమున్న మిథునమునకు 8వ నవాంశ+కర్కాటక నవాంశ 9, + సింహనవాంశ 9 , కన్యానవాంశ 9+తులనవాంశ 9 + వృశ్చిక నవాంశ 9+ధనుస్సు 2 = 55వనవాంశ వరకు ఆరు రాశులగును. సప్తమరాశి నవాంశము ధనూరాశికి 55వనవాంశమగును.**

**ఏకార్గలాది దోషపరిహారము :-**

**ఏకార్గలోపగ్రహ పాతలత్తాజామిత్రకర్తర్యుదయాస్త దోషా:**
**నశ్యన్తి చన్ద్రార్కబలేపపన్నే లగ్నే యథార్కాభ్యుదయే తు దోషా: 68**

సూర్యచంద్రులు బలవంతులై యున్నపుడు, సూర్యోదయమగునపుడు అంధకారము నష్టమగునట్లుగా ఏకార్గల, ఉపగ్రహ, లత్త,కర్తరి ఉదయాస్తాది దోషములు నష్టమగును.

**దేశభేదము వలన పరిహారము** :-

**ఉపగ్రహర్క్షం కురుబాహ్లికేషు కలిఙ్గ వఙ్గేషు చ పాతితం భమ్**
**సౌరాష్ట్ర శాల్వేషు చ లత్తితం భం త్యజేత్తు విద్ధం కిల సర్వదేశే 69**

ఉపగ్రహదోషమున్న నక్షత్రము కురుక్షేత్రము(హరియాన) కాశ్మీరములలో, పాత దోషమున్న నక్షత్రము కలింగ వంగదేశములలో, (ఒరిస్సా, బెంగాలు) లత్తాదోషమున్న నక్షత్రము సౌరాష్ట్ర గుజతాత్ రాష్ట్రములలో వదలి పెట్టవలెను. గ్రహములతో వేధింపబడిన నక్షత్రములను అన్నిదేశములలో వదలిపెట్టవలెను.

**శశాఙ్క సూర్యర్క్ష యుతేర్భశేషే ఖం భూయుగాఙ్గాని దశేశతిథ్య:**
**నాగేన్దవోఽఙ్కేన్దుమితా నఖాశ్చేద్భవన్తి చైతే దశయోగసఙ్ఞా : 70**

సూర్యచంద్రులున్న నక్షత్రముల సంఖ్యను కలిపి దానిని 27చే భాగించిన శేషసంఖ్య 0,1,4,6,10,11,15,18,19,20 వచ్చిన క్రమముగా ముందు తెలుపు యోగములగును.

**వాతాభ్రాగ్నిమహీపచోరమరణం రుగ్వజ్రవాదా: క్షతి**
**ర్యోగాఙ్కే దలితే సమే మనుయుతేఽథౌజే తు సైకేఽర్థితే**
**భం దాస్రాదథ సమ్మితాస్తు మనుభీ రేఖా: క్రమాత్సంల్లిఖేద్**
**వేధోఽస్మిన్ గ్రహచన్ద్రయోర్న శుభద: స్యాదేకరేఖాస్థయో: 71**

శూన్యము (సున్న)శేషము వచ్చిన వాతము, 1వచ్చిన మేఘము, 4 వచ్చిన అగ్ని, 6 వచ్చిన మహీపతి, 10 వచ్చిన దొంగ, 11 వచ్చిన మృత్యువు, 15 వచ్చిన రోగము, 18 వచ్చిన వజ్రము,19 వచ్చిన కలహము, 20 వచ్చిన క్షతినామక యోగమగును. శూన్యము శేషము వచ్చిన వాయువు వలన, 1 శేషము వచ్చిన మేఘమువలన భయము కలుగును. ఇట్లే మిగిలిన వాటిని గ్రహింపవలెను. ఈయోగ సంఖ్య సమసంఖ్యయైన

దానిలో సగమునకు 14ను కలిపిన అశ్విన్యాది నక్షత్రసంఖ్య యగును. విషమసంఖ్యయైన దానికి 1కలిపి సగముచేసిన నక్షత్రసంఖ్య వచ్చును.

**పద్నాలుగు రేఖలు గీచి లెక్కించిన వచ్చు నక్షత్రముతో ప్రారంభించి అభిజిత్తుతో కూడి 28 నక్షత్రముల స్థాపన రేఖలలో చేయవలెను. తర్వాత ఏగ్రహము ఏనక్షత్రముపై నున్నదో ఆగ్రహములను ఆయానక్షత్రములపై నుంచవలెను. ఆవిధముగా చేసిన చంద్రునికి ఎదురుగా రేఖపై గ్రహమున్న, చంద్రుడున్న నక్షత్రమునకు వేధ కలిగి అశుభమగును. ఈ వేధను వివాహాది శుభకార్యములలో వదిలిపెట్టవలెను.**

**ఉదాహరణము : 1984 ఆశ్వయుజ శుక్లచతుర్దశి సోమవారము చంద్రుడు పూర్వాభాద్రపద నక్షత్రములో, సూర్యుడు హస్తనక్షత్రములో ఉన్నాడు. అశ్విని నుండి పూర్వాభాద్ర సంఖ్య 25, అశ్విని నుండి హస్త సంఖ్య 13, రెండింటిని కలిపిన 38 వచ్చును. దానిని 27చే భాగించిన శేషము 11 వచ్చును. అనగా మృత్యునామక యోగమైనది. విషమసంఖ్య అగుట వలన 1 కలిపి సగము చేసిన 11+1=12 సగము 6. అశ్విని నుండి లెక్కించిన 6వ నక్షత్రము ఆర్ద్రయగును.**

**వేధచక్రము**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆర్ద్ర | - | మృగశిర | హస్త | - | పూర్వాభాద్ర (చం) |
| పునర్వసు | - | రోహిణి | చిత్త | - | శతభిషం |
| పుష్యమి | - | కృత్తిక | స్వాతి | - | ధనిష్ఠ |
| ఆర్ద్ర | - | భరణి | విశాఖ | - | శ్రవణం |
| మఘ | - | అశ్విని | అనూరాధ | - | అభిజిత్తు |
| పుబ్బ | - | రేవతి | జ్యేష్ఠ | - | ఉత్తరాషాఢ |
| ఉత్తర | - | ఉత్తరాభాద్ర | మూల | - | పూర్వాషాఢ |

**వేధ చక్రములో తాత్కాలిక గ్రహస్థితిని చూచిన చంద్రుడు సూర్యుడు బుధుడు ఒకేరేఖలో నున్నారు. చంద్రనక్షత్రము పూర్వాభాద్రకు రవి బుధగ్రహములు రెండింటితో వేధ కలిగినది. కావున శుభకార్యములు చేయుటకనుకూలముకాదు.**

**పంచబాణ దోషము :-**

**లగ్నేనాఢ్యా యాతతిథ్యోఽఙ్కతష్టా: శేషే నాగద్వ్యబ్ధితర్కేఽన్దు సంఖ్యే**
**రోగో వహ్నీ రాజచౌరౌ చ మృత్యుర్బాణశ్చాయం దాక్షిణాత్య ప్రసిద్ధే 72**

శుక్లపక్ష పాడ్యమి నుండి ప్రారంభించి గడిచిన తిథిసంఖ్యలో లగ్నరాశిని కలిపి 9తో భాగించిన శేషము 8దైన రోగబాణము, 2 యైన అగ్నిబాణము, 4 గైన రాజబాణము, 6యైన చౌరబాణము, 1శేషమైన మృత్యుబాణమగును. ప్రాచ్యఉత్తర పశ్చిమ దేశములో బాణజ్ఞానము దీనికి వేరుగా నుండును. ఈ విధానము దక్షిణదేశములో ప్రసిద్ధమైనది.

**వ్యాసోక్తబాణ పంచకము :-**

**రసగుణశశి నాగాబ్ధ్యా ఢ్య సంక్రాన్తి యాతాం**
**శకమితిరథ తష్టాఙ్కైర్యదా పఞ్చ దోషా:**
**రుగనల నృపచౌరా మృత్యు సంజ్ఞశ్చ బాణో**
**నవహృత శరశేషే శేషకైక్యే సశల్య: 73**

సూర్యసంక్రాంతి అంశమును వేరువేరుగా ఐదుస్థానములలో నుంచి వాటికి 6,3,1, 8,4 లను క్రమముగా జోడించి 6 తో భాగించిన 5శేషము వచ్చిన రోగము, 4 అగ్ని, 3 రాజు, 2 దొంగ, 1 మృత్యు సంజ్ఞక పంచబాణములగును. అన్ని శేష అంశములను తొమ్మిదితో భాగించిన ఐదు శేషము వచ్చిన శశీల్యబాణమగును.

**ఉదాహరణము :**

| | | | | | |
|---|---|---|---|---|---|
| **సూర్యసంక్రాంతి గత అంశములు –** | 17 | 17 | 17 | 17 | 17 |
| | +6 | +3 | +1 | +8 | +4 |
| | 23 | 20 | 18 | 25 | 21 |

**అన్నింటిని వేరువేరుగా 9చే భాగించిన 5,2,0,7,3 శేషములు వచ్చును. ప్రథమస్థనములో 5 శేషము వచ్చిన ఎంతవరకు సూర్యగతాంశము 17 ఉండునో అంతవరకు (ప్రథమ బాణ) రోగనామక బాణముండును.**

**బాణదోష పరిహారము :-**

**రాత్రౌ చౌరరుజౌ దివా నరపతిర్వహ్ని: సదా సన్ధ్యయో:**
**మృత్యుశ్చాథ శనౌ నృపో విది మృతిర్భౌమేఽగ్ని చౌరౌ రవౌ**
**రోగోఽథ వ్రతగేహ గోపనృపసేవాయాన పాణిగ్రహే**
**వర్జ్యాశ్చ క్రమతో బుధై: రుగణలక్ష్మాపాలచౌరా మృతి: 74**

రాత్రిలో చోర, రోగబాణములను, పగలు నృపబాణము ఎల్లప్పుడు అగ్నిబాణము, పాత:కాలము సాయంకాలము మృత్యుబాణమును త్యజించవలెను. శనివారము నృపబాణము, బుధవారము మృత్యుబాణము, మంగళవారము అగ్నిబాణము, చౌరబాణము రవివారము రోగబాణము త్యజించవలెను. వ్రతబంధములో రోగబాణము, గృహచ్ఛాదనము లో అగ్నిబాణము, రాజసేవలో నృపబాణము,యాత్రలో చౌరబాణము వివాహములో మృత్యుబాణమును వదిలిపెట్టవలెను.

**గ్రహదృష్టి విచారము :-**

**త్రాశం త్రికోణం చతురస్రమస్తం పశ్యన్తి ఖేటాశ్చరణాభివృద్ధ్యా**
**మన్దో గురుర్భూమిసుత: పరే చ క్రమేణ సమ్పూర్ణదృశో భవన్తి 75**

తమరాశిలో నున్నప్పుడు అన్ని గ్రహములు తృతీయ దశమభావములలో ఏక పాదదృష్టితో,పంచమ నవమభావములలోనున్న రెండుపాదముల దృష్టితో,చతుర్థ అష్టమ

భావములలో నున్న మూడుపాదముల దృష్టితో, సప్తమములో నున్న నాలుగు పాదముల దృష్టితో(పూర్ణదృష్టి) చూచుట జరుగును. కాని శని గురు, కుజ, మిగిలిన గ్రహాలు పైన తెల్పినస్థానములలో క్రమముగా పూర్ణదృష్టి కలిగియుండును. అనగా శని తృతీయ, దశమములలో,గురుడు పంచమ,నవమములలో,కుజుడు చతుర్థ, దశమములలో ,మిగిలిన గ్రహములు (రవి,చంద్ర, బుధడు, శుక్రుడు) సప్తమభావములో పూర్ణదృష్టి కలిగియుందురు.

**ఉదయాస్త శుద్ధి :-**

**యదా లగ్నాంశేశో లవమథతనుం పశ్యతి యుతో**
**భవేద్వాయం వోఢు: శుభఫలమనల్పం రచయతి**
**లవద్యూనస్వామీ లవమదనభం లగ్నమదనం**
**ప్రపశ్యేద్వా వధ్వా: శుభమితరథా జ్ఞేయమశుభమ్ 76**

వివాహలగ్నములో నవాంశస్వామి, లగ్న నవాంశమును లేక లగ్నమును చూచుచున్న లేక కూడియున్న వివాహము చేసికొను వరునకు శుభము కలుగును. లగ్ననవాంశము నుండి సప్తమరాశి స్వామి, సప్తమ నవాంశమును లేక లగ్నమునుండి సప్తమభావమును చూచుచున్న వధువుకు శుభదాయకమగును. దీనికి వ్యతిరేకమైన అశు భఫలము కలుగును.

**లవేశో లవం లగ్నపో లగ్నగేహం ప్రపశ్యేన్మిథో వా శుభం స్యాద్వరస్య**
**లవద్యూనపోంఽశద్యూనం లగ్నపోఽస్తం మిథోవేక్షతే స్యాచ్ఛుభం కన్యకాయా: 77**

వివాహలగ్న నవాంశస్వామి నవాంశమును చూచుచున్న, లగ్నస్వామి లగ్నమును చూచుచున్న, లేక పరస్పరము నవాంశస్వామి లగ్నమును లగ్నస్వామి నవాంశమును చూచుచున్న వరునకు శుభము కలుగును. లగ్ననవాంశము నుండి సప్తమనవాంశస్వామి, సప్తమనవాంశమును చూచుచున్న లేక లగ్నేశుడు లగ్నము నుండి సప్తమమును చూచుచున్న కన్యకు శుభము కలుగును.

**ఉదయాస్త శుద్ధి :-**

**లవపతి శుభమిత్రం వీక్ష తేఽంశం ద్యూనం వా**
**పరిణయనకరస్య స్యాచ్ఛుభం శాస్త్రదృష్టమ్**
**మదనలవమిత్రం సౌమ్యమీంశం ద్యూనం వా**
**తనుమదనగృహం చేద్వీక్షతే శర్మ వధ్వా: 78**

లగ్న నవాంశస్వామియైన గ్రహమునకు మిత్రుడైన గ్రహము నవాంశ లగ్నము లేక జన్మలగ్నమును చూచుచున్న వివాహము చేసుకొను వరునకు శుభమగును. సప్తమభావములో నున్న నవాంశరాశిస్వామి మిత్రగ్రహము సప్తమములో నున్న నవాంశమును,లగ్నము నుండి సప్తమభావమును చూచుచున్న వధువుకు శుభము కలుగును.

లగ్నేశుని,లగ్న నవాంశేశుని, సప్తమేశుని, సప్తమ నవాంశేశుని శుద్ధి తప్పక ఉండ వలెను. ఈ శుద్ధిని వివాహ లగ్నముతో చూడవలెను. ఒకవేళ దీని శుద్ధి లేనియెడల లగ్నేశుని, లగ్ననవాంశేశుని, మిత్రగ్రహశుద్ధిని చూడవలసి యుండును.

**అర్కాసంక్రాంతి దోషము :-**

**విషువాయ నేష పరపూర్వమధ్యమాన్దివసాంస్త్య జేదితరసఙ్క్రమేష హి**
**ఘటికాసు షోడశ శుభక్రియావిధౌ పరతోఽపి పూర్వమపి సన్త్యజేద్ బుధః 79**

విషువ (మేష, తుల) సంక్రాంతులలో అయన (మకర, కర్కాటక) సంక్రాంతులలో సంక్రాంతి కాలమునకు ముందు మధ్య,తర్వాత (సంక్రాంతికి ఒకదినము ముందు అదే రోజు ఒకరోజుతర్వాత) మూడురోజులు శుభకార్యములను చేయరాదు. మిగిలిన (వృష, మిథున, సింహ, కన్య, వృశ్చిక,ధను, కుంభ, మీన) సంక్రాంతులలో సంక్రాంతి కాలము నకు 16 ఘడియలు పూర్వము,16 ఘడియలు తర్వాత మొత్తము 32 ఘడియలుశుభ కార్యములలో విద్వాంసులు వదలిపెట్టవలెను.

**గ్రహముల సంక్రాంతి ప్రమాణము :-**

**దేవద్వ్యఙ్కర్తవోఽష్టాష్టౌ నాడ్యోఽఙ్కాః ఖనృపాః క్రమాత్**
**వర్జ్యాః సఙ్క్రమణేఽర్కాదేః ప్రాయోఽర్కస్యాతి నిన్దితాః 80**

సూర్యాది గ్రహముల సంక్రాంతులలో క్రమముగా సూర్యునికి 33 ఘడియలు, చంద్రునికి 2 ఘడియలు, కుజునికి 6 ఘడియలు, బుధునికి 6 ఘడియలు,గురువుకు 88 ఘడియలు, శుక్రునికి 9 ఘడియలు, శనికి 160 ఘడియలు వదిలిపెట్టవలెను. వీటిలో విశేషించి సూర్య ఘడియలు అత్యంత నిందితములు.

**గ్రహము ఒకరాశి నుండి రెండవరాశిలోనికి ప్రవేశించుటను సంక్రాంతి యందురు. గ్రహబింబపు ఒకభాగము ఏదైనరాశిలోని ఆరంభ బిందువును స్పర్శించు సమయము నుండి గ్రహబిందువు రెండవభాగము రాశిలో ప్రవేశించు వరకున్న సమయమును క్రాంతి ఘడియలందురు.బింబమానము గ్రహగతులననుసరించి అన్ని గ్రహములకు సంక్రాంతి ఘడియల కాలము భిన్నముగా నుండును. గ్రహబింబపు మధ్యబిందువు రాశ్యారంభ బిందువు మీదికి వచ్చిన సంక్రాంతి మధ్యకాలమగును. సంక్రాంతి జ్ఞానము, బింబకలలు గ్రహగతుల ద్వారా అనుపాతముతో చేయబడును.**

**ఉదాహరణకు సూర్యుని బింబకల** 32.31.33, **మధ్యగతి** 59.8

**సంక్రాంతి కాలము** $60 \times \frac{\text{గ్రహబింబకల}}{\text{గ్రహగతికల}}$

**సూర్య సంక్రాంతి కాలము** 60 × 32.31.33 ÷ 59.8 = 33 **ఘడియలు**

**ఇదేవిధముగా మిగిలిన గ్రహముల సంక్రాంతి కాలసాధన చేయవచ్చును.**

**పంగ్వంధ బధిర లగ్నము :-**

**ఘస్రే తులాలీ బధిరౌ మృగాశ్వౌ రాత్రౌ చ సింహాజవృషా దివాన్ధాః**
**కన్యానృయుక్కర్కటకా నిశాన్ధా దినే ఘటోఽన్త్యో నిశిపఙ్గ సంజ్ఞః 81**

పగలు తుల,వృశ్చికము,రాత్రి మకరము,ధనుస్సు బధిరసంజ్ఞకములు. సింహ, మేష,వృషభ రాశులు పగలు, కన్య, మిథున, కర్కాటక రాశులు రాత్రి అంధ సంజ్ఞకములు కుంభరాశి పగలు, మీనరాశి రాత్రి పంగుసంజ్ఞకమగును.

**పంగ్వంధాదుల మతాంతరము :-**

**బధిరా ధన్వితులాలయోఽపరాహ్ణే మిథునం కర్కటకోఽ ఙ్గనా నిశాన్ధాః**
**దివసాన్ధా హరిగోక్రియాస్తు కుబ్జా మృగకుమ్భాన్తిమభాని సన్ధ్యయోర్హి 82**

ధనుస్సు, తుల,వృశ్చికరాశులు అపరాహ్ణములో బధిర సంజ్ఞకములు, మిథున కర్కాటక, కన్యలు రాత్రిలో అంధసంజ్ఞకములు, సింహ, వృష, మేషములు పగలు అంధ సంజ్ఞకములు, మకర, కుంభ, మీనరాశులురెండు సంధ్యలలో పంగుసంజ్ఞకములగును.

**బధిరాదుల ప్రయోజనము :-**

**దారిద్ర్యం బధిరతనౌ దివాన్ధలగ్నే వైధవ్యం శిశుమరణం నిశాన్ధలగ్నే**
**పఙ్గ్వఙ్గే నిఖిల ధనాని నాశమీయుః సర్వత్రాధిపగురు దృష్టిభిర్నదోషః 83**

బధిరసంజ్ఞక లగ్నములో వివాహము చేసిన దరిద్రము, అంధసంజ్ఞక లగ్నములో పగలు వివాహము చేసిన వైధవ్యము, రాత్రిఅంధక సంజ్ఞక లగ్నములో వివాహము చేసిన సంతానమునకు మృత్యువు, పంగుసంజ్ఞక లగ్నములో వివాహము చేసిన వివిధ విధములైన సంపదలనాశము కలుగును. అన్ని లగ్నములపై లగ్నేశుడు, గురువు వీరిద్దరి దృష్టి ఉన్న వివాహము దోషకారకము కాదు.

**వివాహములో తెల్పిన నవాంశములు :-**

**కార్ముకతౌలిక కన్యాయుగ్మ లవే ఝుషగే వా**
**యర్హి భవేదుపయామస్తర్హి సతీ ఖలు కన్యా 84**

ధనుస్సు,తుల,కన్య,మిథున,మీననవాంశములలో వివాహము చేసిన కన్య పతివ్రత యగును.

**నవాంశములో మతాంతరము :-**

**అన్త్యనవాంశే న చ పరిణేయా కాచన వర్గోత్తమ మిహహిత్వా**
**నో చరలగ్నే చరలవయోగం తౌలిమృగస్థే శశభృతి కుర్యాత్ 85**

లగ్నమునకు చివరి నవాంశములో ఏకన్యకు వివాహము చేయరాదు. వర్గోత్తమ రాశిని వదలి అనగా అంతిమ నవాంశము వర్గోత్తమరాశియైన వివాహము చేయవచ్చును. చంద్రుడు తుల,మకరరాశులలో నున్నప్పుడు లగ్నమునకు చరనవాంశము లో వివాహము చేయరాదు.

**లగ్నభంగ యోగములు :-**

**వ్యయే శని: ఖేఽవనిజ స్తృతీయే భృగుస్తనౌ చన్ద్రఖలా న శస్తా:**
**లగ్నేట కవిగ్లౌశ్చ రిపౌ మృతౌ గ్లౌర్లగ్నేట్శుభారాశ్చ మదే చ సర్వే 86**

లగ్నము నుండి పన్నెండవభావములో శని, పదిలో కుజుడు, తృతీయములో శుక్రుడు, లగ్నములో చంద్రుడు, ఇతరపాపగ్రహములున్న శుభమునీయదు. లగ్నేశుడు శుక్రుడు, చంద్రుడు ఆరవభావములో శుభమునీయరు. చంద్రుడు లగ్నేశుడు ఏదైన శుభ గ్రహము మరియు కుజుడు ఎనిమిదవభావములో శుభమునీయరు. సప్తమములో ఏగ్రహము శుభమునీయదు.

**గ్రహముల శుభస్థానములు :-**

**త్ర్యాయాష్టషట్సు రవికేతు తమోఽర్క పుత్రా**
**స్త్ర్యాయారిగ: క్షితిసుతో ద్విగుణాయ గోఽబ్జ:**
**సప్తవ్యయాష్టరహితౌ జ్ఞగురు సితోఽష్ట**
**త్రిద్యూన షడ్వ్యయగృహాన్ పరిహృత్య శస్త: 87**

వివాహలగ్నము నుండి మూడవ,పదకొండవ,ఎనిమిదవ,ఆరవభావములలో సూర్యుడు, కేతువు రాహువు శని శుభమునిచ్చును. మూడవ పదకొండవ ఆరవభావములలో కుజుడు; మూడవ, పదకొండవ భావములలో చంద్రుడు, ఏడవ, పన్నెండవ ఎనిమిదవ భావములను వదలి మిగిలినభావములలో బుధ గురువులు,ఎనిమిదవ మూడవ ఏడవ ఆరవ పన్నెండవ భావములను వదలి మిగిలిన భావములలో శుక్రుడు శుభము నిచ్చును.

**కర్తర్వాదిదోషోపవాదములు :-**

**పాపౌ కర్తరికారకౌ రిపుగృహే నీచాస్తగౌ కర్తరీ**
**దోషోనైవ సితేఽరినీచగృహగే తత్షష్ఠదోషోఽపి న**
**భౌమేస్తే రిపునీచగే నహి భవేద్భౌమోఽష్టమో దోషకృ**
**న్నీచే నీచనవాంశకే శశిని రి: ఫాష్టారి దోషోఽపి న 88**

కర్తరీయోగకారకమైన పాపగ్రహము శత్రురాశి,నీచరాశులలోనున్న లేక అస్తంగత మైన కర్తరీదోషముండదు. శుక్రుడు శత్రుగ్రహరాశిలో లేక నీచరాశిలోనికి వెళ్ళినచో శుక్రుడు ఆరవభావములోనున్న దోషముండదు. కుజుడు అస్తంగతుడైన,శత్రురాశిలో లేక నీచరాశిలో నున్నపుడు,అష్టమభావములోనికి వెళ్ళిన దోషముండదు. చంద్రుడు తన నీచ రాశిలో,నీచనవాంశలోనున్నపన్నెండవ,ఎనిమిదవ ఆరవభావములోనికివెళ్ళిన దోషముండ దు.

**అబ్దాది దోష పరిహారము :-**

**అబ్దాయనర్తు తిథిమాసభపక్ష దగ్ధ**
**తిథ్యన్ధకాణ బదిరాఙ్గముఖాశ్చ దోషా:**

**నశ్యన్తి విద్గురుసితేష్విహ కేన్ద్రకోణే**
**తద్వచ్చ పాపవిధుయుక్త నవాంశదోష: 89**

వివాహకాలములో బుధ,గురు,శుక్రులు సప్తమభావమును వదలి కేంద్ర(1,4, 7,10),త్రికోణ(5,9)స్థానములలో నున్న వర్ష–అయన–ఋతు తిథి–మాస– నక్షత్ర–పక్ష–దగ్ధ–తిథి–అంధ–కాణ–బధిర–లగ్నాది సంబంధిత దోషములు తొలగును. పాపగ్రహ దోషము,చంద్రుడున్న లగ్నము, లగ్ననవాంశదోషము తొలగును.

**అన్యపరిహారము**

**కేన్ద్రే కోణే జీవ ఆయే రవౌ చ లగ్నే చన్ద్రేవాపి వర్గోత్తమేవా**
**సర్వే దోషా నాశమాయాన్తి చన్ద్రే లాభే తద్వద్దుర్మహూర్తాంశదోషా: 90**

కేంద్ర కోణభావములలో గురుడున్న, పదకొండవ భావములో సూర్యుడున్న లగ్నములో చంద్రుడున్న లేక తమవర్గోత్తమరాశిలో నున్న అన్నివిధములైన దోషములు నాశనమగును. చంద్రుడు పదకొండవభావములో నున్న దుర్మహూర్తము, అశుభనవాంశ (పాపగ్రహములతో కూడిన నవాంశము) దోషము కూడ నశించును.

**కాశ్యపమతానుసారము కేంద్ర,త్రికోణములలో గురు,శుక్ర, బుధులలో ఎవరు న్నను పైనతెల్పిన దోషములు తొలగును. వివాహలగ్నములో ఏకాదశభావములో నున్న చంద్రునికి అధికబలముండును. వివిధ ప్రకారముల్తెన దోషములను కేవలము చంద్రుడు ఏకాదశభావములో నున్న తొలగించును.**

**దోషసమూహ పరిహారము :–**

**త్రికోణే కేన్ద్రే వా మదనరహితే దోషశతకం**
**హలేత్సౌమ్య: శుక్రో ద్విగుణమపి లక్షం సురగురు:**
**భవేదాయే కేన్ద్రేఽఙ్గప ఉత లవేశో యది తదా**
**సమూహం దోషాణాం దహన ఇవ తూలం శమయతి 91**

త్రికోణ(5,9) సప్తమభావములను వదలి మిగిలిన కేంద్రస్థానములలో బుధుడున్న వందదోషములను దూరము చేయును. పైస్థానములలో శుక్రుడున్న 200 దోషములను నశింపజేయును. గురువున్న లక్ష దోషములను నశింపజేయును. లగ్నేశుడు నవాంశేశుడు ఏకాదశభావములో నున్న అగ్ని దూదిని నశింపజేయునట్లుగా దోషసమూహమును నశింపజేయును.

**ద్వౌ ద్వౌ జ్ఞభృగ్వో: పఞ్చేన్దౌ రవౌ సార్ధత్రయోగురౌ**
**రామా మన్దా గుకేత్వారే సార్ధైకైకం వింశోపకా: 92**

వివాహలగ్నములో పూర్ణబలము 20 సంఖ్యతో కొలవబడుతున్నది. లగ్నములో నున్న గ్రహముల స్థితి అనుకూలమైనపుడు బుధ,శుక్రులకు 2, 2,చంద్రునికి 5, సూర్యునికి

3 1/2, గురువుకి 3, శని రాహువు కేతువు కుజులకు 1 1/2 వింశోపకముల బలము కలుగును.

**ఈ అన్ని గ్రహముల బలమును కూడిన 2+2+5+31/2+1 1/2 +1 1/2+1 1/2+1 1/2 = 21 1/2. పూర్ణబలము లభించును. వింశోపక శబ్దమును ప్రయోగించుట వలన మొత్తము 20 ఉండవలెను. కాని ఇక్కడ బలయోగము 21 1/2 కనపడుతున్నది. రాహు కేతువులలో ఒకరు శుభస్థానములో ఉన్నందున మరొకరు అశుభ స్థానమునందుందురు. కావున 1 1/2 తగ్గించిన 20 యోగముల బలమగును. గ్రహముల బలయోగము 5 కన్న ఎక్కువ 10 కన్న తక్కువ వింశోపకమైన కష్టఫలమగును. పదికన్న అధికము 15 కన్న తక్కువ వింశోపకమైన మధ్యమ శుభఫలమగును. 15 నుండి 20 వరకు వింశోపక బలమున్న వివాహసంస్కారములో ఉత్తమోత్తమగును.**

**గ్రహముల వలన శ్వశురాదుల జ్ఞానము :-**

**శ్వశ్రూ: సితోఽర్క: శ్వశురస్తనుస్తనుర్జామిత్రప: స్యాద్దయితో మన: శశీ**
**ఏతద్బలం సమ్ప్రతిభావ్య తాన్త్రికస్తేషాం సుఖం సమ్ప్రవదేద్వివాహత: 93**

శుక్ర బలము వలన అత్తగారిని, సూర్యబలము వలన మామగారిని, లగ్నము వలన కన్య శరీరమును, సప్తమేశుని వలన పతిని, చంద్రుని వలన మనసును తెలిసి కొనవలెను. ఈ గ్రహముల బలాబలములను తెలిసికొని అత్తమామల సుఖ దు:ఖముల భవిష్య ఫలమును జ్యోతిష్కుడు తెలుపవలెను.

**సంకీర్ణ జాతుల వివాహముహూర్తము :-**

**కృష్ణపక్షే సౌరికుజార్కేఽపి చ వారే వర్జ్యే నక్షత్రే యది వా స్యాత్ కరపీడా**
**సఙ్కీర్ణానాం తర్హి సుతాయుర్ధన లాభప్రీతిప్రాప్త్యై సా భవతీహ స్థితిరేషా 94**

కృష్ణపక్షములో శని కుజ రవివారములలో వివాహములో విహిత నక్షత్రము కన్న భిన్నమైన నక్షత్రములలో సంకీర్ణ(మ్లేచ్ఛ సంస్కార రహితులు) జాతుల వివాహము జరిగిన పుత్ర,ఆయు,ధన,పరస్పర ప్రేమలు కలుగును. ఈ జాతుల కొరకు ఇది నియమముగా భావించవలెను.

**గాంధర్వవివాహ ముహూర్తము :-**

**గాంధర్వాది వివాహేఽర్కాద్వేదనేత్ర గుణేన్దవ:**
**కుయుగాఙ్గాగ్ని భూరామాస్త్రిపద్యామ శుభా: శుభా: 95**

గాంధర్వాది (గాంధర్వ,అసుర,పైశాచ) వివాహములలో త్రిపతిచక్రములో సూర్య నక్షత్రము నుండి చంద్రనక్షత్రమువరకు మొదటి 4 నక్షత్రములు అశుభము, తర్వాతి 2 నక్షత్రములు శుభము,3 అశుభము,1 శుభము,1అశుభము,4శుభము,6 అశుభము, 3శుభము,1అశుభము,3శుభనక్షత్రములగును. ఈ శుభనక్షత్రములలో వివాహము చేయవలెను.

**ఉదాహరణకు రోహిణిలో సూర్యుడు పునర్వసులో చంద్రుడున్న రోహిణి, మృగశిర ఆర్ద్ర పునర్వసు ఈ నాలుగు నక్షత్రములలో గాంధర్వ వివాహము అశుభమగును. తర్వాత పుష్యమి ఆశ్లేషలు శుభము. మఖ పుబ్బ ఉత్తర ఈమూడు నక్షత్రములు అశుభమును కలిగించును. ఇదేవిధముగా మిగిలిన నక్షత్రములను గ్రహించవలెను.**

**గాంధర్వాది వివాహములకు కాలప్రతిబంధము లేదు. దీనిని సార్వకాలిక వివాహమందురు. ఏసమయములోనైనను చేసికొనవచ్చును. దీనిలో నక్షత్రశుద్ధిని చూడవలసియుండును.**

**వివాహమునకు ముందు చేయుకార్యములు :-**

**విధోర్బలమవేక్ష్య వా దలనకణ్డనం వారకం**
**గృహాఙ్గణ విభూషణాన్యథ చ వేదికామణ్డపాన్**
**వివాహవిహితోడు భిర్విరచయేత్తథోద్వాహతో**
**న పూర్వమిదమాచరేత్ త్రినవషణ్మితే వాసరే 96**

వరకన్యల చంద్రబలమును గ్రహించి వివాహమునకు పూర్వము చేయు పిండి విసురుట,వడ్లను దంచుట,గృహాంగణమును శుభ్రముచేయుట, మంగళ కలశము, వేదికా నిర్మాణము చేయవలెను. వివాహమునకు ముందు 3,6,9వ రోజులలో పైకార్యములు చేయరాదు.

**వేదికా ప్రమాణాదులు :-**

**హస్తోచ్ఛ్రాయా వేదహస్తై: సమన్తాత్తుల్యా వేదీసద్మనో వామభాగే**
**యుగ్మే ఘస్రే షష్ఠహీనే చ పఞ్చసప్తాహే స్యాన్మణ్డపోద్వాసనం సత్ 97**

గృహమునకు వామభాగములో ఒకహస్తము ఎత్తు నాలుగు హస్తముల వెడల్పు పొడవు కలిగిన వేదికను నిర్మించవలెను.ఆరవరోజు వదిలి మిగిలిన రోజులలో ఐదవ ఏడవ దినములలో వివాహమండపమును నిర్మించవలెను.

**తైలాది లాపనము :-**

**మేషాదిరాశిజ వధూవరయో ర్వటోశ్చ తైలాదిలాపనవిధౌ కథితాత్ర సఙ్ఖ్యా**
**శైలా దిశ: శరదిగక్ష నగాద్రిబాణా బాణాక్షబాణగిరయో విబుధైస్తు కైశ్చిత్ 98**

కొందరు విద్వాంసులు మేషాదిరాశులలో ఉత్పన్నమైన వధూవర వటువుల వివాహ,ఉపనయనములకు పూర్వము తైలాభ్యంగనము కొరకు క్రమముగా 7,10,5,10, 5,7,7,5,5,5,7దినముల సంఖ్యను తెలిపెను. అనగా మేషరాశిలో ఉత్పన్నమైన వధు వర, వటువులకు వివాహమునకు ఏడు దినముల ముందు, వృషభరాశి వారికి 10 దినముల ముందు మిథునరాశివారికి 5, కర్కాటకములో 10, సింహములో 5, కన్యలో 7, తులలో 7, వృశ్చికములో 5, ధనుస్సులో 5, మకరములో 5, కుంభములో 5,

మీనములో ఉత్పన్నమైనవారికి 7 దినముల ముందు తైలాభ్యంగనము చేయవలెను.

**మండపాది స్థాపనము :-**

**సూర్యేఽఙ్గనా సింహ ఘటేషు శైవే స్తమ్భోఽలికోదణ్డ మృగేషు వాయౌ**
**మీనాజకుమ్భే నిరృతౌ వివాహే స్థాప్యోఽగ్నికోణే వృషయుగ్మకర్కే** **99**

వివాహాది కార్యములలో మండపములో స్తంభస్థాపనము సింహ కన్య తులారాశులలో సూర్యుడున్నప్పుడు ఈశాన్యకోణములో, వృశ్చిక, ధను, మకరములలో నున్నప్పుడు వాయవ్యకోణములో,కుంభ, మీన, మేష రాశులలో నున్నప్పుడు నైరృతికోణములో, వృషభ మిధున, కర్కాటక రాశులలో సూర్యుడున్నప్పుడు ఆగ్నేయకోణములో చేయవలెను.

**గోధూళి ప్రశంస :-**

**నాస్యామృక్షం న తిథి కరణం నైన లగ్నస్యచిన్తా**
**నో వా వారో న చ లవవిధిర్నో ముహూర్తస్య చర్చా**
**నో వా యోగో న మృతిభవనం నైవ జామిత్ర దోషో**
**గోధూలి: సా మునిభిరుదితా సర్వకార్యేషు శస్తా** **100**

గోధూళి ముహూర్తము అన్ని శుభకార్యములకు మంగళకరమైనదని మునులు తెలిపిరి. దీనిలో నక్షత్ర,తిథి, కరణ,వార,లగ్న నవాంశ,ముహూర్త, యోగ, అష్టమ భావముల వలన కలుగు దోషములు, సప్తమభావ దోషము మున్నగు వాటిని చూడవలసిన పనిలేదు.

**పిండీభూతే దినకృతి హేమంతర్తౌ స్యాదర్ధాస్తే తపసమయే గోధూలి:**
**సమ్పూర్ణాస్తే జలధరమాలాకాలే త్రేధాయోజ్యా సకలశుభే కార్యాదౌ** **101**

హేమంత ఋతు (మార్గశిర,మాఘ,పుష్య,మాఘ,ఫాల్గుణ)మాసములలో సంధ్యాసమయములో సూర్యబింబము నిస్తేజముగా గోళమువలె కనపడు సమయము గోధూళి యగును.గ్రీష్మఋతువులో చైత్ర వైశాఖ జ్యేష్ఠ ఆషాఢమాసములో సూర్యబింబపు సగభాగము అస్తమించినపుడు, వర్షాకాలములో శ్రావణ,భాద్రపద,ఆశ్వయుజ, కార్తీక మాసములలో సంపూర్ణబింబము అస్తమయమగునపుడు గోధూళియగును. ఈ సమయము లో అన్ని విధములైన శుభకార్యములను చేయవచ్చును.

**గోధూళి కాలవర్జ్యములు :-**

**అస్తం యాతే గురుదివసే సౌరే సార్కే**
**లగ్నాన్మృత్యౌ రిపుభవనే లగ్నే చేన్దౌ**
**కన్యానాశస్తనుమదమృత్యుస్థే భౌమే**
**వోఢుర్లాభే ధనసహజే చన్ద్రే సౌఖ్యమ్** **102**

గురువారము సూర్యాస్తమయమైన తర్వాత, శనివారము సూర్యాస్తమయమునకు పూర్వము గోధూళిశుభమును కలిగించును. గోధూళి కాలములో వివాహ లగ్నమునుండి

అష్టమ,షష్ఠమ లేకలగ్నములో చంద్రుడున్న వధువుకు నాశము కలుగును. లగ్న సప్తమ అష్టమభావములలో కుజుడున్న వరునికి నాశము కలుగును. ఏకాదశ, ద్వితీయ, తృతీయ భావములలో చంద్రుడున్న సుఖకారకమగును.

**మేషాదిరాశులలో రవి గతి :-**

**మేషాదిగేఽర్కేష్టశరా నగాక్షా: సప్తేషవ: సప్తశరా గజాక్షా:**

**గోక్షా: ఖతర్కా: కురసా: కుతర్కా: క్వఙ్గాని షష్టిర్నవపఞ్చ భుక్తి: 103**

మేషాది రాశులలో సూర్యగతి క్రమముగా మేషములో 58, వృషభములో 57, మిథునములో 57, కర్కాటకములో 57, సింహములో 58, కన్యలో 59,తులలో 60, వృశ్చికములో 61, ధనుస్సులో 61, మకరములో 61, కుంభములో 60, మీనములో 59 కలలుండును.

**సంక్రాన్తి యాతఘస్రాద్యైర్గతిర్నిఘ్నీ ఖషడ్హృతా**

**లబ్ధేనాంశాదినా యోజ్యం యాతార్క్షం స్పష్టభాస్కర: 104**

సంక్రాంతి సమయము (సంక్రాంతి దిన ఘటిపలము) నుండి వర్తమాన దిన ఘటిఫలములను (రాశిననుసరించి) సూర్యగతితో గుణించి 60తో భాగించిన లభించిన అంశముల లబ్ధమును సూర్యభుక్తికి కలిపిన ఇష్టకాలిక స్పష్టసూర్యుడగును.

**ఉదాహరణము- 1984 సం.ము ఆశ్వయుజ కృష్ణషష్ఠి రవివారములో 1.50 గంటలకు సూర్యుడు కన్యలో ప్రవేశించెను. స్పష్టసూర్యుడు 5.0.00 ఆశ్వయిజ కృష్ణ అష్టమి మంగళవారము పగలు 3.30 లకు స్పష్టసూర్యుని ప్రమాణము కావలెను.**

**సంక్రాంతి నుండి అభీష్టసమయము వరకు దినములో తేడా -**

**3.03.30 - 1.01.50 = 2దినముల 1గంట 40ని॥ ఘటీపలములో పరివర్తన చేసిన 2రోజుల 4ఘడియల 10విఘడియలు. సూర్యుడు కన్యలో నుండుట వలన 59తో గుణించిన 2.1.40X59= 118.59.2360 ని 60చే భాగించిన 1.59.28.20తో సంక్రాంతి కాలిక సూర్యుని 5.0.0.0 ను కలిపిన 5.1.29.28.20 వచ్చును. ఇది ఇష్టకాలిక స్పష్టసూర్యుని స్థితి అయినది.**

**నవాంశాయనము :-**

**తన్వోరిష్టాంశకాత్ పూర్వం నవాంశా దశసంగుణా:**

**రామాప్తా: లబ్ధమంశాద్యం తనోర్వర్గాదిసాధనే 105**

లగ్నములో అభీష్టనవాంశకు ముందు ఎన్ని నవాంశములు గడిచినవో వాటిని 10చే గుణించి 3తో భాగించిన అభీష్ట నవాంశమగును. లగ్నము యొక్క షడ్వర్గసాధన ఈ విధముగా చేయవలెను.

ఉదాహరణము - ధనుర్లగ్నములో తులానవాంశము కావలెనన్న ధనుర్లగ్నములో ప్రథమ

నవాంశము మేషమగును. అందువలన తుల మేషము నుండి ఏడవనవాంశ మగును. గతనవాంశ సంఖ్య 6, 6×10 = 60÷3 = 20 అంశములతో తులానవాంశ ఆరంభమగును. లగ్నము 8.20.00.00 నుండి 8.23.20.00 వరకు ధనుర్లగ్నములో తులా నవాంశ ముండును.

**లగ్నజ్ఞానము ఇష్టజ్ఞానము :-**

**అర్కాల్లగ్నాత్సాయనాద్భోగ్య భుక్తైర్భాగైర్నిఘ్నాత్స్వోదయాత్ఖాగ్ని భక్తాత్**
**భోగ్యం భుక్తం చాన్తరాలోదయాఢ్యం షష్ట్యా భక్తం స్వేష్టనాడ్యో భవేయు : 106**

సాయనసూర్యుని భోగ్యాంశమును సాయనలగ్న భుక్తాంశమును తమ తమ ఉదయమానముతో గుణించి 30తో భాగించిన వచ్చు లబ్ధఫలము క్రమముగా సూర్య భోగ్యకాలము,లగ్నభుక్తకాలమగును. సూర్యుని భోగ్యఫలములో లగ్నభుక్తఫలమును కలిపి దానిలో సూర్యుని సాయనలగ్నము వరకు మధ్యనున్న రాశుల ఉదయమానమును జోడించి దానిని 60చే భాగించిన సూర్యోదయ అభీష్ట సమయమగును.

గ్రహలాఘవము,నీలంకంఠి మున్నగుగ్రంథములలో లగ్నజ్ఞానము, ఇష్టకాల జ్ఞానముల గూర్చి విశేషవివరణ కలదు.

**చేల్లగ్నార్కౌ సాయనావేకరాశౌ తద్విశ్లేష ఘ్నోదయ: ఖాగ్నిభక్త:**
**స్వేష్ట: కాలో లగ్నమూనం యదార్కాద్రాత్రే శ్శేషోఽర్కాత్సషడ్భాన్నిశాయామ్107**

సాయన సూర్యుడు సాయన లగ్నము ఒకే రాశిపైనున్న, లగ్నములో సూర్యుని తగ్గించి మిగిలిన అంశములను తమరాశి ఉదయమానముతో గుణించి 30తో భాగించిన సూర్యోదయము నుండి ఇష్టకాలమగును. ఒకవేళ లగ్నము సూర్యునికన్న తక్కువైన సాధిక ఇష్టసూర్యోదయమునకు ముందున్నది రాత్రి శేషమగును.

**వివాహవర్జ్య దోషములు :-**

**ఉత్పాతాన్సహ పాతదగ్ధ తిథిభిర్దుష్టాంశ్చ యోగాంస్తథా**
**చన్ద్రేజ్యోశనసామథాస్తమయనం తిథ్యా: క్షయర్ధీ తథా**
**గణ్డాన్తం చ సవిష్ట సంక్రమదినం తన్వంశపాస్తం తథా**
**తన్వంశేశ విధూనథాష్టరిపుగాన్ పాపస్యవర్గాం స్తథా 108**
**సేన్దు క్రూర ఖగోదయాంశముదయాస్తాశుద్ధి చన్డాయుధాన్**
**ఖార్జూరం దశయోగయోగసహితం జామిత్ర లత్తావ్యధమ్**
**బాణోపగ్రహ పాపకర్తరి తథా తిథ్యృక్షవారోత్థితమ్**
**దుష్టం యోగమథార్ధయామ కులికాద్యాన్వారదోషానపి 109**
**క్రూరాక్రాన్త విముక్తభం గ్రహణభం యత్క్రూరగన్తవ్యభం**
**త్రే ధోత్పాతహతం చ కేతుహతభం సన్ధ్యోదితం భం తథా**

**తద్వచ్చ గ్రహభిన్నయుద్ధగతభం సర్వానిమాన్సన్త్యజే**
**దుద్వాహే శుభకర్మసు గ్రహకృతాన్ లగ్నస్య దోషానపి 110**

దివ్య,అంతరిక్ష,భౌమ ఉత్పాతములు,మహాపాతము(క్రాంతిసామ్యము, దగ్ధతిథులు,వ్యతీపాతాది దుష్టయోగములు,చంద్ర–గురు–శుక్రుల అస్తంగతకాలము, తిథులక్షయ వృద్ధులు,తిథి–నక్షత్ర–లగ్న గండాంతములు,భద్రతోకూడిన సంక్రాంతి దినము,లగ్ననవాంశ స్వాముల అస్తమయకాలము,లగ్నేశుడు, నవాంశేశ చంద్రుల షష్ఠ, అష్టమభావస్థితి, పాపగ్రహ షడ్వర్గము,చంద్రునితో కూడినలగ్నము, క్రూరగ్రహములతో కూడిన లగ్నము క్రూరగ్రహము తో కూడిన నవాంశము, గ్రహముల ఉదయాస్తశుద్ధి, చండాయుధ, ఖర్జూర, దశయోగములు,జామిత్ర, లత్త,వేధ,బాణ,ఉపగ్రహ,పాపకర్తరి, తిథి,నక్షత్ర, వారముల వలన ఉత్పన్న మగు దోషములు, క్రూరగ్రహములతో ఆక్రమించ బడిన నక్షత్రము, క్రూర గ్రహముల భుక్తి తర్వాత వదలబడిన నక్షత్రము,గ్రహణ నక్షత్రము, క్రూరగ్రహములతో భోగ్య (ఏనక్షత్రముపై క్రూర గ్రహము వెళ్ళునో) నక్షత్రము, మూడు విధములైన ఉత్పాతముల (దివ్య, అంతరిక్ష, భౌమ) వలన ఆహత (కొట్టబడిన) నక్షత్రము, కేతువు వలన ఆహత నక్షత్రము,సంధ్యాకాలములో ఉదయించు నక్షత్రము, గ్రహములతో భేదించిన నక్షత్రము, గ్రహయుద్ధము వలన దూషితనక్షత్రములను (ఏనక్షత్రముపై గ్రహయుద్ధము జరుగునో) అన్నిగ్రహముల వలన ఉత్పన్నమైన లేకలగ్నముతో ఉత్పన్నమైన దోషములను వివాహ సమయములో శుభకార్యములలో వదిలిపెట్టవలెను.

**ఆరవ వివాహప్రకరణము సమాప్తము**

## 7. వధూప్రవేశ ప్రకరణము

**వధూప్రవేశ కాలము :–**

**సమాద్రి పఞ్చా ఙ్కదినే వివాహాద్వధూప్రవేశోఽష్టిదినాన్తరాలే**
**శుభ: పరస్తాద్విషమాబ్దమాస దినేఽక్ష వర్షాత్పరతో యథేష్టమ్ 1**

వివాహకాలము నుండి 16 దినముల లోపల సమదినములలో (2,4,6,8,10, 12,14,16) 5,7,9 విషమదినములలో వధూప్రవేశము శుభమునిచ్చును. 16 దినముల తర్వాత విషమవర్షము,విషమమాసము,విషమదినములలో వధూప్రవేశము శుభము నిచ్చును. 5 వర్షముల తర్వాత ఇచ్ఛానుసారము ఏసంవత్సరములోనైన శుభసమయము చూచి వధూప్రవేశము చేయవచ్చును.

**వధూప్రవేశ ముహూర్తము :–**

**ధ్రువక్షిప్ర మృదుశ్రోత్ర వసుమూల మఘానిలే**
**వధూప్రవేశ: సన్నేష్టో రిక్తారార్కే బుధే పరై: 2**

ధ్రువసంజ్ఞక (ఉత్తరాత్రయం, రోహిణి) క్షిప్రసంజ్ఞక (హస్త,అశ్విని,పుష్యమి) మృదుసంజ్ఞక (మృగశిర, రేవతి,చిత్త,అనూరాధ) శ్రవణం,ధనిష్ఠ,మూల, మఘ, స్వాతి నక్షత్రములలో రిక్త (4,9,14) తిథులను వదలి మిగిలిన తిథులలో సోమ,రవివారములను వదలి మిగిలిన వారములలో వధూప్రవేశము శుభమగును.కొందరి విద్వాంసుల మతానుసారము బుధవారము కూడ వధూప్రవేశములో త్యాజ్యము (వదలిపెట్టవలసినది)

**వివాహోనంతరము పతిగృహములో మాసఫలము :-**

**జ్యేష్ఠే పతిజ్యేష్ఠమథాధికే పతిం హన్త్యాదిమే భర్తృగృహే వధూ: శుచౌ**

**శ్వశ్రూం సహస్యే శ్వశురం క్షయే తనుం తాతం మధౌ తాతగృహే వివాహత: 3**

వివాహమైన తర్వాత వధువు పతిగృహములో జ్యేష్ఠమాసములోనున్న పతి అన్నగారికి నాశము, మొదటి అధికమాసములో పతిగృహములోనున్న పతికి, మొదటి ఆషాఢములో అత్తకు, మొదటి పుష్యమాసములో మామకు, ప్రథమ క్షయమాసములో పతిగృహములోనున్న తనకు శరీరనాశనమగును. వివాహమైన తర్వాత ప్రథమ చైత్ర మాసములో తన తండ్రి గృహములో నున్న తండ్రికి నాశము కలుగును.

**వివాహమైన తర్వాత చైత్రమాసములో వధువును పతిగృహమునకు తప్పక పంపవలెను. పతిగృహములో నున్న వధువు ప్రథమజ్యేష్ఠ ఆషాఢ పుష్య, అధికమాస, క్షయ మాసములలో తండ్రి గృహమునకు తిరిగి వెళ్ళవలెను. ప్రథమయాత్రా సమయములో కూడ ఈమాసములను విచారణ చేయవలెను.**

ఏడవ వధూప్రవేశ ప్రకరణము సమాప్తము

## 8. ద్విరాగమన ప్రకరణము

**చరేదథౌజహాయనే ఘటాలిమేషగే రవౌ**
**రవీజ్యశుద్ధి యోగత: శుభగ్రహస్య వాసరే**
**నృయుగ్మ మీన కన్యకాతులావృషే విలగ్నకే**
**ద్విరాగమం లఘుధ్రువే చరేஉస్రపే మృదూడుని 1**

వివాహమైన కన్య ఒకసంవత్సరము తర్వాత విషమవర్షములలో కుంభ,వృశ్చిక, మేషరాశులలో సూర్యుడున్నపుడు అనగా ఫాల్గుణ,మార్గశీర్ష,వైశాఖమాసములలో సూర్య గురుల శుద్ధి ఉన్నపుడు, శుభగ్రహదినములలో (సోమ,బుధ,గురు,శుక్ర) మిథున,మీన,కన్య తుల, వృషభలగ్నములలో లఘు-ధ్రువ-చరసంజ్ఞక (హస్త, అశ్విని,పుష్యమి,ఉత్తరాత్రయం, రోహిణి,స్వాతి,పునర్వసు,శ్రవణ,ధనిష్ఠ,శతభిష) మూల మృదుసంజ్ఞక (మృగశిర, రేవతి, చిత్త,అనూరాధ) నక్షత్రములలో ద్విరాగమనము (రెండవసారి అత్తగారింటికి వచ్చుట) చేయవచ్చును.

**సమ్ముఖ చక్రవిచారము :-**

**దైత్యేజ్యో హ్యభిముఖదక్షిణే యది స్యాద్**
**గచ్ఛేయర్న హి శిశుగర్భిణీనవోఢా:**
**బాలశ్చేద్వ్రజతి విపద్యతే నవోఢా**
**చేద్వన్ధ్యా భవతి చ గర్భిణీ త్వగర్భా** 2

శుక్రుడు సమ్ముఖ(వెళ్ళుతున్న)దిశలో, దక్షిణములో నున్నపుడు, పుత్రవతి, గర్భవతి, నవవధువు, ఎప్పుడు పతిగృహమునకు వెళ్ళరాదు. అనగా సమ్ముఖ శుక్రుడు, దక్షిణమువైపు శుక్రుడున్న ద్విరాగమనము చేయరాదు. పుత్రవతి పైన తెల్పిన స్థితిలో యాత్రచేసిన, పుత్రునికి మరణము కలుగును. నవవధువు యాత్ర చేసిన విధవరాలగును. గర్భిణి యాత్రచేసిన గర్భమునకు నష్టము కలుగును.

శుక్రుడు పూర్వదిశలో అస్తమించిన రెండు మాసముల తర్వాత పశ్చిమములో ఉదయించును. ఉదయించిన తర్వాత 8 నెలల 22 1/2రోజుల తర్వాత పశ్చిమములో అస్తమించును. అస్తమించిన 7 1/2రోజుల తర్వాత పూర్వదిశలో తిరిగి ఉదయించును. పూర్వదిశలో శుక్రుడున్నపుడు పూర్వఉత్తర దిశలలో వధువు యాత్ర చేయరాదు. పశ్చిమము లో శుక్రుడున్నపుడు పశ్చిమ దక్షిణదిశలలో యాత్ర చేయరాదు.

**సమ్ముఖ శుక్రదోష పరిహారము**

**నగర ప్రవేశవిషయాద్యుపద్రవే కరపీడనే విబుధ తీర్థయాత్రయో:**
**నృపపీడనే నవవధూప్రవేశనే ప్రతిభార్గవో భవతి దోషకృన్న హి** 3

నూతన నగరములో ప్రవేశించినపుడు, దేశములో యుద్ధము లేక సంక్రామక రోగములుత్పన్నమైనపుడు, వివాహములో, దైవదర్శనములో, తీర్థయాత్రలో, రాజుల వలన పీడింపబడునపుడు, నవ వధూప్రవేశ సమయములో సమ్ముఖ శుక్రదోషముండదు.

**పిత్ర్యే గృహే చేత్కుచపుష్పసంభవ: స్త్రీణాం న దోష: ప్రతిశుక్ర సమ్భవ:**
**భృగ్వఙ్గిరో వత్సవసిష్ఠ కశ్యపాత్రీణాం భరద్వాజమునే: కులేతథా** 4

తండ్రి గృహములో వధువుకు స్తనముల ఉత్పత్తి రజోదర్శనమైన సమ్ముఖ శుక్ర దోషముండదు. భృగు,అంగిరి,వసిష్ఠ,కశ్యప,అత్రి, భరద్వాజ మునుల కులములో ఉత్పన్నమైన అనగా వారిగోత్రముల వారికి సమ్ముఖ శుక్రదోషముండదు. ఈ అపవాదము యాత్రకు మాత్రమే ఉపయోగించును. ద్విరాగమనములో ప్రతి శుక్రదోషమును అన్ని గోత్రముల వారు తప్పక పాటించవలెను.

కొందరి మతముననుసరించి వివాహములో గురుశుద్ధి, ద్విరాగమనములో(రెండవ సారి పతి గృహమునకు వచ్చుట) శుక్రశుద్ధి, తృతీయయాత్రలో రాహుశుద్ధి, అనంతర యాత్రలో కేవలము చంద్రశుద్ధి ఉండవలెనని తెలిపిరి.

**ఎనిమిదవ ద్విరాగమన ప్రకరణము సమాప్తము**

## 9. అగ్న్యాధాన ప్రకరణము

**అగ్న్యాధాన ముహూర్తము :-**

**స్యాదగ్నిహోత్రవిధిరుత్తరగే దినేశే**
**మిశ్రధ్రువాన్త్య శశిశక్ర సురేజ్యధిష్ణ్యే**
**రిక్తాసు నో శశికుజేజ్యభృగౌ న నీచే**
**నాస్తం గతే న విజితే న చ శత్రుగేహే** **1**

సూర్యుడు ఉత్తరాయణములో నున్నపుడు మిశ్రసంజ్ఞక (విశాఖ,కృత్తిక)ధ్రువ సంజ్ఞక (ఉత్తరాత్రయం,రోహిణి) రేవతి,మృగశిర, జ్యేష్ఠ, పుష్యమి నక్షత్రములలో, రిక్త (4,9,14) తిథులను వదలి మిగిలిన తిథులలో శని,కుజ, గురు, శుక్రులు శుభస్థితిలో నున్నపుడు అగ్నిహోత్ర స్థాపనము శుభమునిచ్చును.

**అగ్నిహోత్ర లగ్నశుద్ధి :-**

**నో కర్కనక్రఝష కుమ్భనవాంశలగ్నే**
**నోఽబ్జే తనౌ రవిశశీజ్యకుజే త్రికోణే**
**కేన్ద్రర్క్షషట్త్రిభవగే చ పరైస్త్రిలాభ**
**షడఖస్థితై ర్నిధనశుద్ధియుతే విలగ్నే** **2**

కర్కాటక,మకర,మీన,కుంభ నవాంశములలో లగ్నములలో మరియు లగ్నములో చంద్రుడున్నపుడు అగ్న్యాధానము(అగ్నినుంచుట)చేయరాదు.సూర్యచంద్ర గురు కుజులు త్రికోణ (5,9),కేంద్ర(1,4,7,10)6,3,11భావములలోనున్నపుడు,బుధ,శుక్ర,శనులు 3,6,10, 11భావములలో నున్నపుడు,అష్టమభావము శుద్ధిగానున్నపుడు అగ్న్యాధానము చేయవలెను.

**యాగ కర్తృత్వయోగము :-**

**చాపే జీవే తనుస్థే వా మేషే భౌమేఽమ్బరేద్యునే**
**షట్త్ర్యాయేఽబ్జే రవౌవా స్యాజ్జాతాగ్నిర్యజతిధ్రువమ్** **3**

ధనుర్లగ్నములో గురుడున్నపుడు, మేషలగ్నములో సప్తమ దశమభావములలో కుజుడున్నపుడు 3,6,11భావములలో చంద్రుడు, లేక సూర్యుడున్నపుడు అగ్నిహోత్ర ధారణ వేయువ్యక్తి తప్పక యజ్ఞము చేయువాడగును.

**గుహ్యసూత్రములు,నిబంధ గ్రంథములలో అన్నివర్ణముల వారికి అగ్న్యాధాన విధానము తెలుపబడినది. అగ్న్యాధానము రెండు విధములుగా నుండును. 1.స్మార్త - అగ్న్యాధానము 2. శ్రౌత అగ్న్యాధానము**

**స్మార్త అగ్న్యాధానములో ఆవసథ్య నామక అగ్నిధారణ చేయబడును.గృహస్థుడు ప్రతిదినము పెరుగు, బియ్యము,నెయ్యితో తనచేతితో హవనము చేయును. దీనిని ఔపాసన హవనమందురు. ఔపాసన కర్మలో ప్రధాన దేవత సూర్యుడు. అంగదేవత ప్రజాపతి. అగ్న్యాధానము తర్వాత ప్రతిజీవి జీవించియున్నంత వరకు ప్రతిదినము ఉదయము**

సాయంకాలము ఔపాసన హవనము గృహస్థుడు చేయవలెను.

శ్రౌత అగ్న్యాధానములో గార్హపత్య, ఆవాహనీయ,దక్షిణాగ్ని, సభ్యాగ్ని ఈ నాలుగు అగ్నులను ఆధానము చేయవలెను. శ్రౌతాగ్న్యాధానములో వర్ణముల ననుసరించి కాల నిర్ధారణచేయవలెను.బ్రాహ్మణులు వసంత ఋతువు, క్షత్రియులు గ్రీష్మఋతువు, వైశ్యులు వర్షఋతువులో అగ్న్యాధానము చేయవలెను. ఈశ్రౌతాగ్న్యాధానము శ్రుతి ననుసరించి పుత్రోత్పత్తి తర్వాత వెంట్రుకలు తెల్లబడక ముందు చేయవలెను.

తొమ్మిదవ అగ్న్యాధానాధ్యాయము సమాప్తము

## 10. రాజాభిషేక ప్రకరణము

**రాజాభిషేక కాలము :-**

రాజాభిషేక: శుభ ఉత్తరాయణే గుర్విన్దు శక్రైరుదితైర్బలాన్వితై:
భౌమార్కలగ్నేశ దశేశజన్మపైర్నో చైత్రరిక్తారనిశామలిమ్లుచే 1

ఉత్తరాయణములో సూర్యుదున్నపుడు గురు చంద్ర సూర్యులుదితమైనపుడు కుజుడు, సూర్యుడు, జన్మలగ్నేశుడు వర్తమాన దశాస్వామి, జన్మరాశిస్వామి బలవంతులై నపుడు రాజాభిషేకము శుభము నిచ్చును.చైత్రమాసము, రిక్త(4,9,14) తిథులు, మంగళ వారము రాత్రి అధికమాసములలో రాజాభిషేకము శుభమునీయదు.

**రాజుకు మృత్యువు కలిగిన,రాజకుమారునకు రాజ్యాభిషేకము చేయుటకు ముహూర్తాదులు చూడవలసిన అవసరము లేదు. వెంటనే రాజ్యారోహణము చేయవలెను. రాజు జీవించి ఉన్నపుడు రాజుకుమారునకు రాజ్యాభిషేకము చేయవలసి వచ్చినపుడు శుభముహూర్తమును చూడవలెను.**

**లగ్నశుద్ధి విచారము :-**

శాక్రశ్రవ: క్షిప్రమృదుధ్రువోడుభి: వోపచయే శుభే తనౌ
పాపైస్త్రిషష్ఠాయగతై: శుభగ్రహై: కేన్ద్రత్రికోణాయ ధనత్రిసంస్థితై: 2

జ్యేష్ఠ,శ్రవణ,క్షిప్ర-మృదు ధ్రువసంజ్ఞక (హస్త,అశ్విని,పుష్యమి,మృగశిర, రేవతి, చిత్త,అనూరాధ,ఉత్తర,ఉత్తరాషాఢ,ఉత్తరాభాద్ర,రోహిణి) నక్షత్రములలో,శీర్షోదయ (మిథునము, సింహ,కన్య,తుల,వృశ్చిక,కుంభ)లగ్నములలో,యువరాజుజన్మలగ్నము లేక జన్మరాశి నుండి ఉపచయ (3,6,10,11)రాశుల లగ్నములో (అభిషేకలగ్నము నుండి) 3,6,10,11భావములలో పాపగ్రహములస్థితి ఉన్నపుడు,కేంద్ర (1,4,7,10) త్రికోణ (5,9)11,2,3 భావములలో శుభగ్రహములున్నపుడు రాజాభిషేకము శుభమునిచ్చును. రాజాభిషేకములో3,11భావములలో పాప శుభగ్రహములు రెండునుశుభము నిచ్చును.

**పాపగ్రహస్థితి ఫలము :-**

పాపైస్తనౌ రుజ్‌నిధనే మృతి: సుతే పుత్రార్తిరర్థవ్యయగైర్దరిద్రతా

**స్యాత్కే ఽలసో భ్రష్టపదో ద్యునామ్నుగ్రై: సర్వం శుభం కేన్ద్రగతై: శుభగ్రహై: 3**

రాజాభిషేక లగ్నములో పాపగ్రహములున్న అభిషిక్త రాజుకు రోగము, అష్టమ భావములో పాపగ్రహములున్న మృత్యువు, పంచమభావములో పాపగ్రహములున్న పుత్రులకు కష్టము, ద్వితీయ ద్వాదశభావములలో పాపగ్రహములున్న దరిద్రము, దశమ భావములో పాపగ్రహములున్న ఆలస్యము, సప్తమభావములో పాపగ్రహములున్న రాజ్యభ్రష్టము (రాజ్యము పోవుట) జరుగును. కేంద్రభావములలో శుభగ్రహములున్న అన్ని విధములైన శుభములు కలుగును.

**రాజాభిషేక లగ్న సంపత్తి జ్ఞానము :-**

**గురుర్లగ్నకోణే కుజో ఽరౌసిత: ఖే స రాజా సదా మోదతే రాజలక్ష్మ్యా**
**తృతీయాయగౌ సౌరిసూర్యౌ ఖబన్ధ్వోర్గురుశ్చేద్ధరిత్రీ స్థిరా స్యాన్నృపస్య 4**

రాజాభిషేక లగ్నము నుండి గురుడు లగ్నములో,లేక త్రికోణములో(5,9) కుజుడు షష్ఠభావములో, శుక్రుడు దశమభావములో నున్నపుడు అభిషిక్తుడైన రాజు ఎల్లప్పుడు సుఖసంపదలతో ఆనందము ననుభవించును. లగ్నము నుండి మూడవభావములో శని, పదకొండవభావములో రవి, 10, 4 భావములలో గురుడున్న రాజ్యము స్థిరముగా నుండును.

**పదవ రాజాభిషేకాధ్యాయనము సమాప్తము**

## 11. యాత్రా ప్రకరణము

**యాత్రాముహూర్త విధానము :-**

**యాత్రాయాం ప్రవిదిత జన్మానాం నృపాణాం దాతవ్యం దివసమబుద్ధ జన్మనాం చ**
**ప్రశ్నాద్యై రుదయనిమిత్తమూల భూతైర్విజాతే హ్యశుభశుభే బుధ: పదద్యాత్ 1**

రాజుల జన్మసమయము (జన్మలగ్న నక్షత్రములు) తెలిసిన వారి యాత్ర కొరకు ముహూర్తమును తెలుపవలెను.జన్మాదులు తెలియనపుడు ప్రశ్నలగ్నము, ప్రశ్నకాలిక శకునములఆధారముతో దైవజ్ఞుడు శుభాశుభ యాత్రాముహూర్తములను తెలియ జేయవలెను.

**ప్రశ్న వలన యాత్రాఫలము :-**

**జననరాశి తనూయాది లగ్నగే తదధిపౌ యదివా తత ఏవవా**
**త్రిరిపుఖాయ గృహం యది వోదయో విజయ ఏవ భవేద్వసుధాపతే: 2**

యాత్రా సంబంధమైన ప్రశ్నలగ్నములో ప్రశ్నకర్త జన్మలగ్నము జన్మరాశి ఉన్న లేక జన్మలగ్నేశుడు,జన్మరాశిస్వామి ఉన్న, లేక జన్మలగ్నము జన్మరాశుల నుండి 3,6, 10,11 భావములలో నున్న రాశి ప్రశ్నలగ్నమైన యాత్రలో రాజుకు విజయము కలుగును.

**రిపుజన్మలగ్నభమథాధిపౌ తయోస్తత ఏవ వోపచయసద్మ చేద్భవేత్**
**హిబుకే ద్యునేఽథ శుభవర్గకస్తనౌ యది మస్తకోదయగృహం తదాజయ: 3**

ప్రశ్నకాలములో శత్రువు జన్మలగ్నము లేక జన్మరాశి లేక వాటిఅధిపతి ప్రశ్న

లగ్నము నుండి చతుర్థ,సప్తమభావములలో నున్న లేక శత్రువు జన్మలగ్నము, జన్మరాశి నుండి 3,6,10,11 భావములలో ఏదైన రాశి ప్రశ్నలగ్నము నుండి 4,7 భావములలో నున్న యాత్ర చేయురాజుకు విజయము కలుగును. ప్రశ్నలగ్నములో శుభగ్రహముల షడ్వర్గమున్న, లేక ప్రశ్నలగ్నములో శీర్షోదయరాశులు (3,5,6,9,11)న్న యాత్రలో విజయము కలుగును.

**శకునఫలము : -**

**యది పృచ్ఛితనౌ వసుధా రుచిరా శుభవస్తు యది శ్రుతి దర్శనగమ్**
**యది పృచ్ఛతి చాదరతశ్చ శుభగ్రహదృష్టయుతం చరలగ్నామపి** **4**

ప్రశ్నకాలములో భూమి స్వచ్ఛమైనదైన (పవిత్రభూమిపై కూర్చొని ప్రశ్నించిన) రాజుకు విజయము కలుగును.ప్రశ్న సమయములో శుభవస్తు దర్శనమైన లేక శుభ వస్తువుల వర్ణనవినుట జరిగిన విజయము కలుగును. ప్రశ్నలగ్నము చరసంజ్ఞక (1,4, 7,10) మైన శుభగ్రహములతో కూడిన లేక చూడబడిన రాజుకు విజయము కలుగును.

**యాత్రాభంగ యోగము :**

**విధుకుజయుతలగ్నే సౌరిదృష్టేఽథ చన్ద్రే**
**మృతిభమదనసంస్థే లగ్నగే భాస్కరేఽపి**
**హిబుక నిధనహోరాద్యూనగే చాపి పాపే**
**సపది భవతి భఙ్గః ప్రశ్నకర్తుస్తదానీమ్** **5**

ప్రశ్నకాలములో చంద్ర, కుజులున్న లగ్నమును శని చూచుచున్న ప్రశ్నలగ్నము నుండి సప్తమ అష్టమభావములలో చంద్రుడు, లగ్నములో సూర్యుడున్న, చతుర్థ, అష్టమ, లగ్న, సప్తమభావములలో పాపగ్రహములున్న ప్రశ్నకర్త ప్రశ్నకు భంగము కలుగును. అనగా యుద్ధములో పరాజయము సామాన్యయాత్రలో ఫలితము కలుగదు.

**యాత్రా విశేషము :-**

**త్రికోణే కుజాత్సౌరి శుక్ర జీవా**
**యదైకోఽపి వా నో గమోఽర్కాచ్ఛశీవా**
**బలీయాంస్తు మధ్యే తయోర్యోగ్రహః స్యాత్**
**స్వకీయాం దిశం ప్రత్యుతాసౌ నయేచ్చ** **6**

కుజగ్రహమునుండి త్రికోణ (5,9)భావములలో శని,శుక్ర,బుధ,గురు గ్రహములున్న లేక వాటిలో ఒకగ్రహమున్న యాత్ర జరుగును.సూర్యుని నుండి త్రికోణ భావములలో చంద్రుడున్న యాత్ర జరుగును. రెండింటిలో బలమైన గ్రహము ఏదిశలో నున్నదో ఆదిశలో యాత్ర చేయవలెను.

**యాత్రలో దిక్జ్ఞానము : -**

**ప్రశ్నే గమ్యదిగీశాత్షేటః పఞ్చమగో యః**
**బో భూయాద్బలయుక్తః స్వామాశాం నయతేఽసౌ** **7**

ఏదిశలో యాత్ర చేయవలెనో ఆదిశస్వామి ప్రశ్నలగ్నము నుండి ఏభావములో

నుండెనో దానికి పంచమభావములో నున్న బలవంతుడైన గ్రహము తన దిశకు యాత్రికుని తీసుకొని వెళ్ళును.

**సౌరమాసక్రమములో యాత్రాఫలము :**

**ధనుర్మేష సింహేషు యాత్రాప్రశస్తా శనిజ్ఞో శనో రాశిగే చైవ మధ్యా**
**రవౌ కర్కమీనాలి సంస్థేఽ తి దీర్ఘా జను: పఞ్చసప్తత్రితారాశ్చ నేష్టా: 8**

ధనుర్మేష సింహరాశులలో సూర్యుడున్నప్పుడు యాత్ర శుభకారకమగును. మకర, కుంభ, మిథున,కన్య, వృషభ తులారాశులలో సూర్యుడున్నప్పుడు యాత్ర మధ్యమఫలము నిచ్చును. కర్కాటక,మీన,వృశ్చిక రాశులలో సూర్యుడున్నప్పుడు దీర్ఘకాలములో యాత్ర ఫలితము నిచ్చును.

**సౌరమాసములనాధారము చేసికొని యాత్రావిచారము రాజులకొరకు చేయబడినది. సామాన్య జనులు దీనిగురించి ఆలోచన చేయరాదు. సూర్యుడు సుమారు ఒకమాసము ఒకరాశిలో నుండును.**

| రాశి | - | సూర్యస్థితి కాలము |
|---|---|---|
| మేషము | - | ఏప్రిల్ 13-మే 13 |
| వృషభము | - | మే 14 - జూన్13 |
| మిథునము | - | జూన్ 14- జులై 15 |
| కర్కాటకము | - | జులై 14- ఆగస్టు 15 |
| సింహము | - | ఆగస్టు 15- సెప్టెంబరు 15 |
| కన్య | - | సెప్టెంబరు 15-అక్టోబరు 15 |
| తుల | - | అక్టోబరు 14 -నవంబరు 15 |
| వృశ్చికము | - | నవంబరు 14- డిసెంబరు 15 |
| ధనుస్సు | - | డిసెంబరు 15- జనవరి 14 |
| మకరము | - | జనవరి 13-ఫిబ్రవరి 12 |
| కుంభము | - | ఫిబ్రవరి 12- మార్చి 14 |
| మీనము | - | మార్చి 13 - ఏప్రిల్ 13 |

**యాత్రలో తిథి నక్షత్రయోగ విచారము : -**

**న షష్ఠీ న చ ద్వాదశీ నాష్టమీ నో సితాద్యా తిథి: పూర్ణిమామా న రిక్తా**
**హయాదిత్య మైత్రేన్దు జీవాన్త్య హస్తశ్రవోవాసవైరేవ యాత్రా ప్రశస్తా 9**

శుక్లపక్ష పాడ్యమి షష్ఠి, ద్వాదశి అష్టమి పూర్ణిమ అమావాస్య రిక్తసంజ్ఞక (4,9,14) తిథులు యాత్రలో అశుభములగును. అశ్విని,పునర్వసు,అనూరాధ,మృగశిర,పుష్యమి,రేవతి, హస్త,శ్రవణ,ధనిష్ఠ నక్షత్రములలో యాత్ర శుభమగును.

**వారశూల విచారము : –**

**న పూర్వదిశి శక్రభేన విధుసౌరివారే తథా**
**న చాజపదభే గురౌ యమదిశీనదైత్యేజ్యయో:**
**న పాశిదిశి ధాత్రుభే కుజ బుధేఽర్య మర్క్షే తథా**
**న సౌమ్యక కుభి వ్రజేత్స్వజయ జీవితార్థీ బుధ:** **10**

పూర్వదిశలో జ్యేష్ఠా నక్షత్రమున్న సోమ,శనివారములు, దక్షిణదిశలో పూర్వాభాద్ర నక్షత్రమున్న గురువారము, పశ్చిమదిశలో రోహిణి నక్షత్రమున్న రవి శుక్రవారములు, ఉత్తరదిశలో ఉత్తర నక్షత్రమున్న మంగళ బుధవారములలో ధనము, విజయము, జీవనములందభిలాష కలిగిన వ్యక్తులు యాత్రను చేయరాదు.

**వారశూల దిక్శూల నామముతో ప్రసిద్ధమైనది. పై శ్లోకములో పూర్వాది దిశలలో దిక్శూలదోషము తెలుపబడినది. దిక్శూల పరిహారము కూడ తెలుపబడినది.గురు,శుక్ర, రవివారములలో రాత్రిలో, సోమ, శని,మంగళవారములలో పగలు దిక్శూలదోషముండదు. బుధవారములో రాత్రి పగలు కూడదోషముండును.**

**తాంబూలము, చందనము, మట్టి,పుష్పము, పెరుగు, నెయ్యి, నువ్వులు క్రమముగా రవ్యాదివారములలో దానము,ధారణ,భక్షణచేసిన దిక్శూలదోషము కలుగదు. కొన్ని గ్రంథములలో విదిక్కులలో కూడ దిక్శూలదోషమును తెలిపిరి.**

**దిక్శూల పరిహార పట్టిక**

| దిశలు | దిక్శూల | | పరిహారము | | |
|---|---|---|---|---|---|
| | వారము | నక్షత్రము | తాజ్యకాలము | భక్ష్యపదార్థము | దానము– భక్షణము– ధారణము |
| పూర్వదిశ | సోమ శని | జ్యేష్ఠ | రాత్రి | పాలు మినుములు | చందనము, నువ్వులు |
| ఆగ్నేయము | సోమ శని | × | రాత్రి | పాలు మినిములు | చందనము, నువ్వులు |
| దక్షిణము | గురు | పూ.భాద్ర | పగలు | పెరుగు | పెరుగు |
| నైరృతి | రవి శుక్ర | × | పగలు | నెయ్యి యవలు | తాంబూలము, నెయ్యి |
| పశ్చిమము | రవి శుక్ర | రోహిణి | పగలు | నెయ్యి యవలు | తాంబూలము, నెయ్యి |
| వాయవ్యము | మంగళ | × | రాత్రి | బెల్లము | మట్టి |
| ఉత్తరము | సోమ బుధ | ఉత్తర | రాత్రి పగలు | బెల్లము నువ్వులు | మట్టి, పుష్పము |
| ఈశాన్యము | శని బుధ | × | రాత్రి పగలు | బెల్లము నెయ్యి | పుష్పము, నువ్వులు |

**కాలశూల జ్ఞానము : –**

**పూర్వాహ్ణే ధ్రువమిశ్రభైర్న నృపతేర్యాత్రా న మధ్యాహ్నకే**
**తీక్ష్ణాఖ్యైరపరాహ్ణకే న లఘుభైర్నో పూర్వరాత్రే తథా**
**మిత్రాఖ్యైర్న చ మధ్యరాత్రిసమమే చోగ్రైస్తథా నో చరై**

**రాత్ర్యన్తే హరిహస్తపుష్యశశిభి: స్యాత్సర్వకాలే శుభా** 11

పూర్వాహ్ణము (మధ్యాహ్నమునకు ముందు)లో ధ్రువ మిశ్రసంజ్ఞక నక్షత్రములలో (ఉత్తరాత్రయం,రోహిణి, విశాఖ,కృత్తిక) మధ్యాహ్నములో తీక్ష్ణసంజ్ఞక మూల,జ్యేష్ఠ,ఆర్ద్ర, ఆశ్లేష నక్షత్రములో, అపరాహ్ణములో (మధ్యాహ్నము తర్వాత) లఘు,మిత్రసంజ్ఞక (అశ్వని, అభిజిత్తు) నక్షత్రములలో, రాత్రిపూర్వార్థములో రేవతి, చిత్త,అనూరాధ నక్షత్రములలో, మధ్యరాత్రిలో ఉగ్రసంజ్ఞక (పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, భరణి, మఘ) నక్షత్రములలో, రాత్ర్యంతములో (రాత్రి ఉత్తరార్థము),చరసంజ్ఞక (స్వాతి,పునర్వసు,ధనిష్ఠ,శతభిష నక్షత్రములలో రాజు యాత్ర చేయకూడదు. శ్రవణ హస్త పుష్యమి మృగశిర నక్షత్రములలో ఎల్లప్పుడు యాత్ర శుభకారకమగును.

**త్యాజ్య నక్షత్ర ఘడియలు : -**

**పూర్వాగ్ని పిత్ర్యాన్తకతారాకాణాం భూపప్రకృత్యుగ్రతురఙ్గమా: స్యు:**
**స్వాతీ విశాఖేన్ద్ర భుజఙ్గమానాం నాడ్యోనిషిద్ధా మనుసమ్మితాశ్చ** 12

పుబ్బ,పూర్వాషాఢ,పూర్వాభాద్ర, కృత్తిక,మఘ, భరణి నక్షత్రములు క్రమముగా 16,21,11,7 ఘడియలు అనగా పూర్వాత్రయమునకు 16 ఘడియలు, కృత్తికకు 21, మఘకు 11, భరణికి 7 ఘడియలు యాత్రలో వదిలిపెట్టవలెను. స్వాతి,విశాఖ, జ్యేష్ఠ, ఆశ్లేషలలో 14 ఘడియలు వదిలిపెట్టబడును. మిగిలినవి శుభమునిచ్చును.

**పూర్వార్ధమాగ్నేయ మఘానిలానాం త్యజేద్ధి చిత్రాహియమోత్తరార్ధమ్**
**నృప: సమస్తాం గమనే జయార్థీ స్వాతీం మఘాం చోశనసో మతేన** 13

జయమును కోరు రాజు కృత్తిక,మఘ, స్వాతి, నక్షత్రముల పూర్వార్ధమును చిత్త, ఆశ్లేష,భరణి నక్షత్రముల ఉత్తరార్ధమును అన్నివిధములైన యాత్రలలో వదిలి పెట్టవలెను. శుక్రాచార్య మతానుసారము స్వాతి, మఘ నక్షత్రములను సంపూర్ణముగా వదిలిపెట్టవలెను.

**నక్షత్రముల జీవాదిసంజ్ఞ : -**

**తమో భుక్త తారా: స్మృతా విశ్వసఙ్జ్ఞా:**
**శుభో జీవపక్షో మృతశ్చాపి భోగ్యా:**
**తదాక్రాన్తభం కర్తరీ సంజ్ఞముక్తం**
**తతోఽక్షేన్దు సఙ్ఖ్యం భవేద్గ్రస్తనామ** 14

రాహువు ద్వారా భుక్తమైన 13 నక్షత్రములు 'జీవ పక్ష' సంజ్ఞక మగును. ఇవి శుభము నిచ్చును. 13 భోగ్యనక్షత్రములు (రాహువు వెళ్ళు నక్షత్రములు) మృతసంజ్ఞక మగును. ఏనక్షత్రముపై రాహువుండునో ఆనక్షత్రమును కర్తరీ సంజ్ఞకమందురు. రాహువున్న నక్షత్రము నుండి 15నక్షత్రము గ్రస్తసంజ్ఞకమగును.

**రాహువు ఎల్లప్పుడు విపరీతగతిలో నడుచును.అందువలన రాహువున్న నక్షత్రము**

**నుండి ముందు 13 నక్షత్రములు భుక్తములు, వెనుకనున్న 13నక్షత్రములు భోగ్యములగును.**

**జీవపక్ష నక్షత్ర ఫలములు : -**

**మార్తాణ్డే మృతపక్షగే హిమకరశ్చే జ్జీవపక్షే శుభా**
**యాత్రా స్యాద్విపరీతగే క్షయకరీ ద్వౌ జీవపక్షే శుభా**
**గ్రస్తర్క్షం మృతపక్షత: శుభకరం గ్రస్తాత్తథా కర్తరీ**
**యాయీన్దు: స్థితిమాన్ రవిర్జయకరౌ తౌ ద్వ్యౌ తయోర్జీవగౌ 15**

సూర్యుడు మృతసంజ్ఞక నక్షత్రములలో చంద్రుడు జీవపక్ష సంజ్ఞక నక్షత్రములలో నున్న యాత్ర శుభకారకమగును. సూర్య చంద్రులు విపరీతస్థితిలో నున్న యాత్ర అశుభ కారకమగును. రెండు జీవపక్షములోనున్న యాత్రలో శుభమగును. మృతపక్షములో నున్న క్షయము కలుగును. మృతసంజ్ఞక నక్షత్రముల కన్న గ్రస్త నక్షత్రములు శుభమునిచ్చును. గ్రస్తసంజ్ఞక నక్షత్రముల కన్న కర్తరి సంజ్ఞక నక్షత్రములు శుభమునిచ్చును. చంద్రుడు 'యాయి' సూర్యుడు 'స్థాయి' యగును. రవి చంద్రులిద్దరు జీవపక్షములోనున్న యాయి (యాత్రచేయువాడు, యుద్ధములో ఆక్రమణ చేయువాడు) స్థాయి (ఆక్రమణ చేసినవాడు) లిద్దరకు విజయము కలుగును.

**స్థాయి యాయిల విచారము యుద్ధసమయములో, వాద వివాద సమయములో చేయబడును.వాదప్రతివాదుల సూచకగ్రహములు క్రమముగా చంద్ర సూర్యులై ఇద్దరు జీవపక్షములోనున్న రెండు పక్షములు సమానమగును.సంధి జరుగును.చంద్ర సూర్యులిద్దరు మృతపక్షములో నున్న నాశనము కలుగును. జీవపక్షములో చంద్రుడు, మృతపక్షములో సూర్యుడున్న 'యాయి'కి దీనికి వ్యతిరేక స్థితిలో నున్న 'స్థాయి'కి విజయము కలుగును.**

**అకుల – కుల – కులాకుల సంజ్ఞ:**

**స్వాత్యన్తకాహివసుపౌష్ణకరానురాధా**
**దిత్యధ్రువాణి విషమాస్తిథయోఽకులా: స్యు:**
**సూర్యేన్దుమన్దగురవశ్చ కులాకులా జ్ఞో**
**మూలామ్బుపేశవిధిభం దశషడ్ ద్వితిథ్య: 16**
**పూర్వాశ్వీజ్యమఘేన్దు కర్ణదహనద్వీశేన్ద్ర చిత్రాస్తథా**
**శుక్రారౌ కులసంజ్ఞకాశ్చ తిథయోఽర్కాష్టేన్ద్ర వేదైర్మితా:**
**యాయీ స్యాదకులే జయీ చ సమరే స్థాయీ చ తద్వత్కులే**
**సన్ధి: స్యాదుభయో: కులాకులగణే భూమీశయోర్యుధ్యతో: 17**

స్వాతి,భరణి,ఆశ్లేష,ధనిష్ఠ,రేవతి,హస్త,అనూరాధ,పునర్వసు, ధ్రువసంజ్ఞక (ఉత్తరాత్రయం, రేవతి) నక్షత్రములకు1,3,5,7,9,11,13,15 విషమతిథులు. రవి చంద్ర శని గురువారములు 'అకుల' సంజ్ఞకమగును. బుధవారము మూల,శతభిషం,ఆర్ద్ర, అభిజిత్తు

నక్షత్రములు 10,6,2 తిథులు 'కులాకుల' సంజ్ఞకయగును. పుబ్బ, పూర్వాషాఢ,పూర్వాభాద్ర అశ్విని,పుష్యమి,మఘ,మృగశిర,శ్రవణ, కృత్తిక, విశాఖ,జ్యేష్ఠ, చిత్త నక్షత్రములు శుక్ర మంగళవారములు 12,8,14,4 తిథులు 'కులసంజ్ఞక'మగును.

అకుల సంజ్ఞక తిథి వార నక్షత్రములలో వాదవివాదము యుద్ధము చేసిన యాయికి(వాదించువాడు, ఆక్రమించువాడు) విజయమగును. కులసంజ్ఞక తిథి వార నక్షత్రములో స్థాయి(ఆక్రమణ జరుగువాడు)కి విజయము కలుగును. కులాకుల సంజ్ఞక తిథి వార నక్షత్రములో యుద్ధము చేయువారిద్దరి మధ్య సంధి జరుగును.

కుల,అకుల,కులాకుల సంజ్ఞకముల ఉపయోగము ప్రాచీనకాలములో యుద్ధాది కార్యములలో చేసెడివారు. ఇప్పుడు వీటి ఉపయోగము వాదవివాదములలో చేయవచ్చును.

**కుల అకుల కులాకుల పట్టిక**

| | సంజ్ఞ | నక్షత్రము | తిథి | వారము | పరిణామము |
|---|---|---|---|---|---|
| 2 | అకుల | భరణి,రోహిణి పునర్వసు ఆశ్లేష,ఉత్తర,హస్త,స్వాతి అనూరాధ ఉ.షాఢ ధనిష్ఠ ఉ.భాద్ర, రేవతి | 1,3,5,7,9 11,13,15 | రవివారము సోమవారము గురువారము శనివారము | యాయికి విజయము |
| 3 | కులాకుల | ఆర్ద్ర మూల అభిజిత్తు శతభిషము | 2,6,10 | బుధవారము | యాయి, స్థాయిలకు సంధి |
| 1 | కుల | అశ్విని,కృత్తిక మృగశిర పుష్యమి మఘ పుబ్బ చిత్త విశాఖ జ్యేష్ఠ పూ.షాఢ శ్రవణం పూ.భాద్ర | 4.8.12 | మంగళవారము శుక్రవారము | స్థాయికి విజయము |

**పథిరాహు చక్రము : –**

**స్యుర్ధర్మే దస్రపుష్యోరగ వసుజలపద్వీశమైత్రాణ్యర్థే**
**యామ్యాజాజ్ఘ్రీన్ద్ర కర్ణాదితిపితృపవనోదూన్యథో భాని కామే**
**వహ్న్యార్ద్రాబుధ్న్య చిత్రానిరృతివిధిభగాఖ్యాని మేక్షే ఉ ఛరోహి**
**ణ్యాప్యేన్ద్వన్త్యర్క్ష విశ్వార్యమభదిన కరర్క్షాణి పథ్యాదిరాహౌ** **18**

పథిరాహు చక్రధర్మమార్గములో అశ్విని,పుష్యమి,ఆశ్లేష, ధనిష్ఠ,శతభిషం,విశాఖ, అనూరాధ నక్షత్రములు, అర్థమార్గములో భరణి,పూర్వాభాద్ర,జ్యేష్ఠ,శ్రవణ,పునర్వసు, మఘ, స్వాతి నక్షత్రములు,కామమార్గములో కృత్తిక,ఆర్ద్ర,ఉత్తరాభాద్ర, చిత్త, మూల, అభిజిత్తు పుబ్బ నక్షత్రములు, మోక్షమార్గములో రోహిణి,పూర్వాషాఢ, మృగశిర, రేవతి, ఉత్తరాషాఢ, ఉత్తర,హస్త నక్షత్రములుండును.

**విశిష్టమైన యాత్రలో పథిరాహు చక్ర విచారము చేయబడును. 28 నక్షత్రములు ధర్మ,అర్థ,కామ,మోక్షములుగా విభజింపబడెను. ఈ నాల్గింటిలో సూర్యచంద్రుల స్థితి ననుసరించి శుభాశుభములను గ్రహించవలెను.**

పథిరాహు చక్ర పట్టిక

| మార్గము | నక్షత్రములు |
|---|---|
| ధర్మము | అశ్విని,పుష్యమి,ఆశ్లేష,విశాఖ, అనూరాధ ధనిష్ఠ శతభిషం |
| అర్థము | భరణి, పునర్వసు,మఘ, స్వాతి, జ్యేష్ఠ, శ్రవణం, పూర్వాభాద్ర |
| కామము | కృత్తిక ఆర్ద్ర, పుబ్బ, ఉత్తర, చిత్త,మూల, అభిజిత్తు, ఉత్తరాభాద్ర |
| మోక్షము | రోహిణి,మృగశిర, హస్త, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, రేవతి |

**పథిరాహు చక్ర ఫలము : -**

**ధర్మగే భాస్కరే విత్తమోక్ష శశీ విత్తగే ధర్మమోక్షస్థిత: శశ్యతే**
**కామగే ధర్మమోక్షార్థగ: శోభనో మోక్షగే కేవలం ధర్మగ: ప్రోచ్యతే 19**

పథిరాహుచక్రములో సూర్యుడు ధర్మమార్గములో, చంద్రుడు ధర్మమోక్ష మార్గములో నున్న లేక సూర్యుడు ధనమార్గములో,చంద్రుడు ధర్మ మోక్షమార్గములలో నున్న శుభము కలుగును. కామ మార్గములో సూర్యుడు, ధర్మమోక్షమార్గములలో చంద్రుడున్న లేక మోక్షమార్గములో సూర్యుడు ధర్మమార్గములో చంద్రుడున్న శుభఫలము చెప్పబడినది.

**పౌషే పక్షత్యాదికా ద్వాదశైవం తిథ్యోమఘాదౌ ద్వితీయాదికాస్తా:**
**కామాత్త్రిస: స్యుస్తృతీయాదివచ్చ యానే ప్రచ్యాదౌఫలం తత్ర వక్ష్యే 20**
**సౌఖ్యం క్లేశో భీతిరర్థాగమశ్చ శూన్యం నై: స్వం ని: స్వతా మిశ్రతా చ**
**ద్రవ్యక్లేశో దు:ఖమిష్టాప్తిరర్థో లాభ: సౌఖ్యం మఙ్గలం విత్తలాభ: 21**
**లాభోద్రవ్యాప్తిర్ధనం సౌఖ్యముక్తం భీతిర్లాభో మృత్యురర్థాగమశ్చ**
**లాభ: కష్టద్రవ్యలాభౌ సుఖం చ కష్టం సౌఖ్యం క్లేశలాభౌ సుఖం చ 22**
**సౌఖ్యం లాభ: కార్యసిద్ధిశ్చ కష్టం క్లేశ: కష్టాత్సిద్ధిరర్థో ధనం చ**
**మృత్యుర్లాభో ద్రవ్యలాభశ్చ శూన్యం శూన్యం సౌఖ్యం మృత్యురత్యన్త కష్టమ్ 23**

పుష్యమాసములో పాడ్యమి నుండి ద్వాదశి వరకు 12 తిథులలో, మఘాది మాసములలో ద్వితీయాది 12 తిథులలో పూర్వాది నాలుగు దిశలలో యాత్ర వలన కలుగు ఫలితము తెలియజేయుచున్నాను.త్రయోదశి నుండి మూడు తిథుల ఫలితము తృతీయ, చతుర్థ, పంచమి తిథుల వలె నుండును.

పుష్యమాసము నుండి పాడ్యమి మున్నగు తిథులలో పూర్వాది నాలుగు దిశలలో యాత్రచేయుట వలన కలుగు ఫలితము ఈ విధముగా నుండును.

| దిశలు – పూర్వదిశ | దక్షిణదిశ | పశ్చిమము | ఉత్తరము |
|---|---|---|---|
| 1. సుఖము | 2. కష్టము | 3. భయము | 4. ధనలాభము |
| 1. శూన్యము | 2. నిర్ధనము | 3. అభీష్టలాభము | 4. మిశ్రితము |
| 1. ధనలాభము | 2. దు:ఖము | 3. అభీష్టలాభము | 4. ధనలాభము |
| 1. లాభము | 2. సుఖము | 3. మంగళము | 4. ధనలాభము |
| 1. లాభము | 2. ధనలాభము | 3. ధనము | 4. సుఖము |
| 1. భయము | 2. లాభము | 3. మృత్యువు | 4. ధనలాభము |
| 1. లాభము | 2. కష్టము | 3. ధనలాభము | 4. సుఖము |
| 1. కష్టము | 2. సుఖము | 3. కష్టము | 4. లాభము |
| 1. సుఖము | 2.లాభము | 3. కార్యసిద్ధి | 4. కష్టము |
| 1. క్లేశము | 2. కష్టముతో కార్యసిద్ధి | 3. ధనలాభము | 4. ధనము |
| 1. మృత్యువు | 2. లాభము | 3. ధనలాభము | 4. శూన్యము |
| 1. శూన్యము | 2. సుఖము | 3. మృత్యువు | 4. అత్యంత కష్టము |

## తిథిఫల బోధక పట్టిక

| పు | మా | ఫా | చై | వై | జ్యే | ఆ | శ్రా | భా | ఆ | కా | మా | పూర్వ | దక్షిణ | పశ్చిమ | ఉత్తర |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | సౌఖ్యము | క్లేశము | భయము | ధనలాభము |
| 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 | శూన్యము | నిర్ధనము | దరిద్రము | మిశ్రితము |
| 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | ధనలాభము | దు:ఖము | ఇష్టలాభము | ధనము |
| 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | లాభము | సుఖము | శుభము | ధనలాభము |
| 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 | లాభము | ధనలాభము | ధనము | సుఖము |
| 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 | భయము | లాభము | మృత్యువు | ధనలాభము |
| 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | లాభము | కష్టము | ధనలాభము | సుఖము |
| 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | కష్టము | సౌఖ్యము | క్లేశము | లాభము |
| 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | సుఖము | లాభము | కార్యసిద్ధి | కష్టము |
| 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | కష్టము | కష్టముతో సిద్ధి | ధనలాభము | ధనము |
| 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | మృత్యువు | లాభము | ధనలాభము | శూన్యము |
| 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | శూన్యము | సుఖము | మృత్యువు | కష్టము |

**యాత్రలో సర్వాంక సాధనము :-**

**తిథ్యృక్ష వారయుతిరద్రిగజాగ్ని తష్టా**
**స్థానత్రయేఽత్రి వియతి ప్రథమేఽతిదు:ఖీ**
**మధ్యే ధనక్షతిరథో చరమే మృతి: స్యాత్**
**స్థానత్రయేఽ జ్కయుజి సౌఖ్యజయౌ ని రుక్తౌ** **24**

తిథి నక్షత్రము వారముల సంఖ్యల యోగమును మూడుస్థానములలో నుంచి క్రమముగా 7, 8,3 తో భాగించిన శేషము సున్నవచ్చిన అశుభము కలుగును.

మొదటిస్థానములో సున్నవచ్చిన యాత్రలో దు:ఖము, ద్వితీయస్థానములో సున్న వచ్చిన ధనక్షయము,తృతీయములో సున్నవచ్చిన మృత్యువు కలుగును. మూడు స్థానము లలో శేషము 1 వచ్చిన యాత్రలో సుఖము విజయము కలుగును.

**ఉదాహరణకు చైత్రశుక్ల దశమి రవివారము పుష్యమి నక్షత్రములో యాత్రచేసిన**

| | | |
|---|---|---|
| **తిథిసంఖ్య** | **10** | **19 ని 7చే భాగించిన శేషము 5** |
| **వార సంఖ్య** | **1** | **8చే భాగించిన శేషము 3** |
| **నక్షత్ర సంఖ్య** | **8** | **3చే భాగించిన శేషము 1 వచ్చును.** |
| | **19** | **కావున యాత్రలో శుభము కలుగును.** |

**మహాడల భ్రమదోషములు :-**

**రవేర్భతోఽబ్జ భోన్మితిర్నగావశేషితా ద్వ్యగా**
**మహాడలో న శస్యతే త్రిషపణ్మితా భ్రమో భవేత్** **25**

సౌరనక్షత్రమునుండి చంద్ర నక్షత్రము వరకున్న సంఖ్యను 7చే భాగించిన శేషము 2, 7 వచ్చిన మహాడల నామకయోగమగును. 3,6శేషము వచ్చిన భ్రమనామక యోగమగును. ఈ రెండు యోగములు యాత్రలో అశుభమునిచ్చును.

**ఉదాహరణకు - సౌరనక్షత్రము రేవతి, చంద్ర నక్షత్రము స్వాతి. రేవతి నుండి స్వాతి వరకు లెక్కించిన 16 నక్షత్ర సంఖ్యవచ్చును.దానిని ఏడుచే భాగించిన 2శేషము వచ్చును. ఇది మహాడలనామక యోగమైనది. ఇదేవిధముగా యాత్రనక్షత్రము విశాఖయైన సౌరనక్షత్రము నుండి విశాఖ వరకు 17 నక్షత్రమగును. ఏడుచే భాగించిన మూడు శేషము వచ్చును. ఇది భ్రమనామక యోగమగును.**

**హింబర యోగము :-**

**శశాఙ్కభం సూర్యభతోఽత్ర గణ్యం పక్షాదితిథ్యా దినవాసరేణ**
**యుతం నవాప్తం నగశేషకం చేత్స్యాద్ధిమ్బరం తన్గమనేఽతిశస్తమ్** **26**

సూర్య నక్షత్రమునుండి చంద్ర నక్షత్రము వరకు గణన చేసి దానిలో ప్రథమ తిథినుండి తిథిసంఖ్య సూర్యాది వార సంఖ్యలు కలిపి 9చే భాగించిన 7శేషము వచ్చిన

హింబరనామక యోగమగును. హింబరయోగము యాత్రలో శుభమునిచ్చును.

**భూపఞ్చాఙ్క ద్వ్యఙ్గ దిగ్వహ్ని సప్తవేదాష్టేశా ర్కాశ్చ ఘాతాఖ్యచన్ద్ర:**
**మేషాదీనాం రాజసేవావివాదే వర్జ్యో యుద్ధాద్యే చ నాన్యత్ర వర్జ్య: 27**

మేషాది 12 రాశులకు క్రమముగా ప్రథమ, పంచమ, నవమ, ద్వితీయ, షష్ఠ, దశమ, తృతీయ, సప్తమ, చతుర్థ, అష్టమ, ఏకాదశ, ద్వాదశ చంద్రుడు ఘాతకము కలిగించును. మేషరాశికి మేషములో నున్న చంద్రుడు వృషభరాశి వారికి పంచమ కన్యారాశిగత చంద్రుడు ఘాతకుడగును. ఇట్లే మిగిలిన రాశులు గ్రహించవలెను.

**ఘాతాచంద్రత్యాజ్య నక్షత్ర పాదములు :-**

**ఆగ్నేయ త్వాష్ట్రజలపపిత్ర్యవాసవరౌద్రభే**
**మూలబ్రాహ్మేజపాదర్క్షే పిత్ర్యమూలాజభే క్రమాత్ 28**
**రూపద్వ్యగ్న్యగ్నిభూరామద్వ్యబ్ధ్యగ్న్యబ్ధి యుగాగ్నయ:**
**ఘాతచన్ద్రే ధిష్ణ్యపాదా మేషాద్వర్జ్యా మనీషిభి: 29**

మేషాదిరాశులలో క్రమముగా కృత్తిక ప్రథమపాదము, చిత్త ద్వితీయ, శతభిష తృతీయ,మఘ తృతీయ, ధనిష్ఠ ప్రథమ, ఆర్ద్ర తృతీయ, మూల ద్వితీయ, రోహిణి చతుర్థ, పూర్వాభాద్ర తృతీయ, మఘ చతుర్థ, మూల చతుర్థ, పూర్వాభాద్ర తృతీయ పాదములను విద్వాంసులు విడువవలెనని తెల్పిరి.

**ఘాత తిథులు :-**

**గోస్త్రీఝషే ఘాతతిథిస్తు పూర్ణా భద్రా నృయుక్కర్కటకేఽథ నన్దా**
**కౌ ర్వ్యాజయోర్నక్రఘటే చ రిక్తా జయా ధను: కుమ్భహరౌ న శస్తా: 30**

వృషభ కన్యరాశుల వారికి పూర్ణ (5,10,15) తిథులు, మిథున కర్కాటక రాశుల వారికి భద్ర (2,7,12) తిథులు, వృశ్చిక మేషరాశుల వారికి నంద(1,6,11) తిథులు, మకర,తులారాశుల వారికి రిక్త(4,9,14) తిథులు, ధనుస్సు కుంభ సింహ రాశుల వారికి జయ(3,8,13) తిథులు ఘాతసంజ్ఞకములగును.

**ఘాతవారములు :-**

**నక్రే భౌమో గోహరిస్త్రీషు మన్దశ్చన్ద్రో ద్వన్ద్వేఽర్కోఽజభే జ్ఞశ్చ కర్కే**
**శుక్ర: కోదణ్డాలి మీనేషు కుమ్భే జూకే జీవో ఘాతవారా న శస్తా: 31**

మకరరాశికి మంగళవారము, వృషభ సింహ కన్యారాశులకు శనివారము, మిథునరాశికి సోమవారము, మేషరాశికి రవివారము, కర్కాటకరాశికి బుధవారము, ధను వృశ్చిక మీనరాశులకు శుక్రవారము, కుంభ తులారాశులకు గురువారము ఘాతవారములగును. ఇవి శుభమునీయవు.

**ఘాత నక్షత్రములు :-**

**మఘా కరస్వాతి మైత్రమూల శ్రుత్యమ్బుపాన్త్యభమ్**
**యామ్యబ్రాహ్మేశ సార్పఞ్చ మేషాదేర్ఘాతభం న సత్ 32**

మేషాదిరాశులలో క్రమముగా మఘ,హస్త,స్వాతి,అనూరాధ, మూల శ్రవణ, శతభిషం, భరణి,రోహిణి, ఆర్ద్ర, ఆశ్లేష, ఘాత నక్షత్రములగును. ఇవి శుభమునీయవు.

**ఘాతలగ్నములు :-**

**భూమి ద్వ్యబ్ధ్యద్రి దిక్సూర్యాఙ్గాష్టా జ్కేశాగ్నిసాయకా:**
**మేషాది ఘాతలగ్నాని యాత్రాయాం వర్జయేత్సుధీ: 33**

మేషరాశికి మేషం, వృషభమునకు వృషభము, మిథునమునకు కర్కాటకము, కర్కాటకమునకు తుల,సింహమునకు మకరము,కన్యకు మీనము,తులకు కన్య, వృశ్చికమునకు వృశ్చికము, ధనుస్సుకు ధనుస్సు, మకరమునకు కుంభము, కుంభమునకు మిథునము, మీనమునకు సింహము, ఘాతలగ్న సంజ్ఞకములగును. బుద్ధిమంతుడైన వ్యక్తి ఘాతలగ్నములలో యాత్రను చేయరాదు.

**ఘాతబోధక పట్టిక**

| రాశి | ఘాత చంద్రుడు | నక్షత్ర త్యాజ్య పాదములు | ఘాతతిథి | ఘాత వారము | ఘాత నక్షత్రము | ఘాత లగ్నము |
|---|---|---|---|---|---|---|
| మేషము | మేషము | కృత్తిక 1 | నంద (1,6,11) | రవి | మఘ | మేషము 1 |
| వృషభము | కన్య | చిత్త 2 | పూర్ణ(5,10,15) | శని | హస్త | వృషభం 2 |
| మిథునము | కుంభము | శతభిషం 3 | భద్ర (2,7,12) | సోమ | స్వాతి | కర్కాటకం 4 |
| కర్కాటకము | సింహము | మఘ 3 | భద్ర(2,7,12) | బుధ | అనూరాధ | తుల 7 |
| సింహము | మకరము | ధనిష్ఠ 1 | జయ(3,8,13) | శని | మూల | మకరం 10 |
| కన్య | మిథునము | ఆర్ద్ర 3 | పూర్ణ (5,10,15) | శని | శ్రవణం | మీనం 12 |
| తుల | ధనుస్సు | మూల 2 | రిక్త (4,9,14) | గురు | శతభిషం | కన్య 6 |
| వృశ్చికము | వృషభము | రోహిణి 4 | నంద(1,6,11) | శుక్ర | రేవతి | వృశ్చికం 8 |
| ధనుస్సు | మీనము | పూ,భాద్ర 3 | జయ(3,8,13) | శుక్ర | భరణి | ధనస్సు 9 |
| మకరము | సింహము | మఘ 4 | రిక్త (4,9,14) | భౌమ | రోహిణి | కుంభం 11 |
| కుంభము | ధనుస్సు | మూల 4 | జయ (3,8,13) | గురు | ఆర్ద్ర | మిథునం 3 |
| మీనము | కుంభము | పూ. భాద్ర 3 | పూర్ణ(5,10,15) | శుక్ర | ఆశ్లేష | సింహం 5 |

**యోగినీ వాసజ్ఞానము :-**

**నవభూమ్య: శివవహ్నయోఽక్ష విశ్వేఽర్కకృతా: శక్రరసాస్తురగ్గ తిథ్య:**
**ద్విదిశోఽమావసవశ్చ పూర్వత: స్సృస్తిథయ: సమ్ముఖవామగా న శస్తా: 34**

పూర్వాది దిశలలో క్రమముగా పాడ్యమి నవములు పూర్వదిశలో, తృతీయ ఏకాదశులు ఆగ్నేయములో, పంచమి త్రయోదశులు దక్షిణములో, చతుర్థీ ద్వాదశులు నైర్రుతిలో, షష్ఠీ చతుర్దశులు పశ్చిమములో, సప్తమి పూర్ణిమలు వాయవ్యములో, ద్వితీయ దశమములు ఉత్తరములో,అమావాస్య అష్టములు ఈశాన్యములో యోగినికి నివాసమగును. యాత్రలో ఈ యోగినీ తిథులు సమ్ముఖ మరియు వామభాగములలో శుభమునీయవు.

**కాలపాశ యోగములు :-**

**కౌబేరీతో వైపరీత్యేన కాలో వారేఽర్కాద్యే సమ్ముఖే తస్య పాశ:**
**రాత్రావేతౌ వైపరీత్యేన గణ్యౌ యాత్రా యుద్ధే సమ్ముఖే వర్జనీయౌ 35**

ఉత్తరదిశలో ప్రారంభించి విపరీత క్రమములో రవ్యాది వారములలో కాలయోగ మగును. రవివారము ఉత్తరములో, సోమవారము వాయవ్య కోణములో,మంగళ వారము పశ్చిమములో,బుధవారము నైర్రుతిలో,గురువారము దక్షిణములో,శుక్రవారము ఆగ్నేయములో,శనివారము పూర్వదిశలో కాలయోగమగును. కాలయోగమునకు ఎదురుగా నున్న దిశ పాశయోగమగును. రాత్రిలో విపరీత క్రమములో కాల,పాశయోగముల గణన చేయవలెను.యాత్ర, యుద్ధములలో కాల పాశయోగము లను వదిలిపెట్టవలెను.

**కాల పాశ పట్టిక**

| | | రవి | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|---|
| | కాల | ఉత్తర | వాయవ్య | పశ్చిమ | నైర్రుతి | దక్షిణ | ఆగ్నేయ | పూర్వ |
| **పగలు** | పాశ | దక్షిణ | ఆగ్నేయ | పూర్వ | ఈశాన్య | ఉత్తర | వాయవ్య | పశ్చిమ |
| **రాత్రి** | కాల | దక్షిణ | ఆగ్నేయ | పూర్వ | ఈశాన్య | ఉత్తర | వాయవ్య | పశ్చిమ |
| | పాశ | ఉత్తర | వాయవ్య | పశ్చిమ | నైర్రుతి | దక్షిణ | ఆగ్నేయ | పూర్వ |

**పరిఘుదండ యోగము :-**

**భాని స్థాప్యాన్యబ్ధిదిక్షు సప్తసప్తానలర్క్షత:**
**వాయవ్యాగ్నేయ దిక్సంస్థం పరిఘం నైవ లఙ్ఘయేత్ 36**

పూర్వాదినాలుగు దిశలలో ఏడేసి నక్షత్రములను స్థాపించిన వాయవ్యకోణము నుండి ఆగ్నేయకోణము వరకు పరిఘుదండమగును. వాయవ్యము నుండి ఆగ్నేయకోణము వరకు రేఖ ద్వార పరిఘుదండము నుంచవలెను. ఎప్పుడు కూడ ఈ పరిఘుదండమును ఉల్లంఘున చేయరాదు.

**పరిఘదండ పట్టిక**




మఘ,పుబ్బ,ఉత్తర,హస్త
చిత్త,స్వాతి,విశాఖ

**పరిఘ దండము వలన నక్షత్రములు దిశలు రెండుభాగములగును. ఏదిశలో ఏనక్షత్రమున్నదో ఆదిశలో యాత్ర చేయవలెను.**

**ధనిష్ఠ నుండి ఆశ్లేష వరకు 14 నక్షత్రములలో ఉత్తర, పూర్వాదిశలలో యాత్ర చేయవలెను.మఘ నుండి అనూరాధ పర్యంతము దక్షిణ పశ్చిమదిశలలో యాత్ర చేయవలెను. ధనిష్ఠాది నక్షత్రములలో దక్షిణ పశ్చిమ దిశలలో, మఘాది నక్షత్రము లలో పూర్వఉత్తరదిశలలో యాత్ర చేసిన పరిఘదండమును ఉల్లంఘన చేసినట్లగును.**

**పరిఘదండ పరిహారము :-**

**అగ్నేర్దిశం నృప ఇయాన్పురుహూతదిగ్భై**
**రేవం ప్రదక్షిణగతా విదిశోఽథ కృత్యే**
**ఆవశ్యకేఽపి పరిఘం ప్రవిలఙ్ఘ్యగచ్ఛే**
**చ్ఛూలం విహాయ యది దిక్తనుశుద్ధిరస్తి** **37**

పూర్వదిశా నక్షత్రములలో రాజు ఆగ్నేయకోణములో యాత్ర చేయవచ్చును. ఇదేవిధముగా దక్షిణదిశా నక్షత్రములలో నైరృతి కోణములో పశ్చిమదిశా నక్షత్రములలో వాయవ్యకోణములో, ఉత్తరదిశా నక్షత్రములలో ఈశాన్యకోణములో యాత్ర చేయవచ్చును.

ఆవశ్యక కార్యములలో దిక్ లగ్నశుద్ధి యున్నపుడు నక్షత్ర, వారశూలలను పరిఘ దండములను త్యజించి రాజుయాత్ర చేయవచ్చును.

**యాత్రలో నక్షత్ర లగ్నశుద్ధి :-**

**మైత్రార్కపుష్యాశ్వినభైర్నిరుక్తా యాత్రా శుభా సర్వదిశాసు తజ్ఞైః**
**వక్రీగ్రహః కేన్ద్రగతోఽస్యవర్గో లగ్నే దినం చాస్య గమే నిషిద్ధమ్** **38**

విద్వాంసులు అనూరాధ,హస్త, పుష్యమి, అశ్విని నక్షత్రములు అన్నిదిశలందు యాత్రలో శుభమునిచ్చునని తెల్పిరి. వక్రియైన గ్రహము యాత్రాలగ్నము నుండి కేంద్ర భావములలో నున్న లేక యాత్రా లగ్నమునుండి వక్రీగ్రహమునకు షడ్వర్గమైన, లేక వక్రీగ్రహ వారములో కూడ యాత్ర నిషేధింపబడినది.

**యాత్రలో అయన విచారము :-**

**సౌమ్యాయనే సూర్య - విధూ తదోత్తరాం ప్రాచీం వ్రజేత్తౌ యది దక్షిణాయనే**
**ప్రత్యగ్యమాశాం చ తయోర్దివానిశం భిన్నాయనత్వేఽథ వధోన్యథా భవేత్ 39**

సూర్యచంద్రులు ఇద్దరు ఉత్తరాయణములోనున్న ఉత్తర పూర్వదిశలలో, ఇద్దరు దక్షిణాయణములోనున్న పశ్చిమ దక్షిణదిశలలో యాత్రచేయవలెను. సూర్యచంద్రులు భిన్న అయనములలోనున్న వారిదిశలలో క్రమముగా పగలు,రాత్రులలో యాత్ర చేయవలెను. అనగా సూర్యాయనదిశలో పగలు,చంద్రాయనదిశలో రాత్రి యాత్ర చేయ వలెను. దీనికి వ్యతిరేకముగా యాత్రచేసిన వినాశము కలుగును.

**యాత్రలో సమ్ముఖ శుక్రదోషము :-**

**ఉదేతి యస్యాం దిశి యత్ర యాతి గోలభ్రమాద్వాథ కకుబ్భ సజ్ఞే**
**త్రిధోజ్యతే సమ్ముఖ ఏవ శుక్రో యత్రోదితస్తాం తు దిశం న యాయాత్ 40**

శుక్రుడు పూర్వపశ్చిమ దిశలలో నుదయించును. ఆదిశలో వెళ్ళువారికి సమ్ముఖ శుక్రుడగును. ఉత్తర దక్షిణ గోళముల క్రమములో శుక్రుడు ఏగోళములోనున్న ఆగోళాది ముఖముగా యాత్రచేయువానికి సమ్ముఖ శుక్రుడగును. కృత్తికాది నక్షత్రములకు పూర్వదిశలో న్యాసక్రమముగా ఏదిశలో నక్షత్రముతో శుక్రుడు కూడియుండునో ఆదిశలో యాత్రలో శుక్రసమ్ముఖమగును. ఈ మూడువిధములుగా సమ్ముఖ శుక్రుడగును. యాత్రలో సమ్ముఖ శుక్రుడుండరాదు. సమ్ముఖ శుక్రుని దిశలో యాత్రచేయరాదు. వశిష్ఠుని మతానుసారము సమ్ముఖ శుక్ర దిశలో యాత్రచేయ వలసి వచ్చిన శాంతిచేసి యాత్రచేయవలెను.

**దిశలలో నక్షత్రన్యాస పట్టిక**

| | | |
|---|---|---|
| | ఆర్ద్ర మఘ చిత్త జ్యేష్ఠ అభిజిత్తు పూ.భాద్ర, భరణి | |
| మృగశిర ఆశ్లేష హస్త అనూరాధ ఉ.షాఢ,శతభిష అశ్విని | ఉ / ప / పూ / ద | కృత్తిక పునర్వసు పుబ్బ, స్వాతి మూల శ్రవణం ఉ.భాద్ర |
| | రోహిణి,పుష్యమి ఉత్తర విశాఖ పూ.షాఢ ధనిష్ఠ రేవతి | |

ఏ నక్షత్రములో శుక్రుడుండునో ఆనక్షత్ర దిశలో యాత్రచేయరాదు.

**శుక్ర వక్రత్వ దోషము – అపవాదము :–**

**వక్రాస్తనీచోపగతే భృగో: సుతే రాజా వ్రజన్ యాతివశం హి విద్విషామ్**
**బుధోఽనుకూలో యది తత్ర సఞ్చలన్ రిపూఞ్జయేన్నైవ జయ: ప్రతీన్దుజే 41**

శుక్రుడు వక్రము,అస్తగతమై,నీచరాశిలోనున్నపుడు యాత్రచేయరాదు. శత్రువుకు వశీభూతుడగును. పరాజయము పొందును. ఆస్థితిలో బుధుడనుకూలమైన రాజు శత్రువును జయించును.కాని బుధుడు కూడ సమ్ముఖుడైన రాజుకు విజయము కలుగదు.

**శుక్రుడుదోషకారకుడైనట్లుగా బుధుడుకూడ దోషకారకుడగునని నారదుడు తెల్పెను.వశిష్ఠ మతాను సారము కుజ,బుధ,శుక్రులు ముగ్గురు సమ్ముఖమునందున్న దోషకారకు లగుదురు.**

**ప్రతిశుక్రాపవాదము :–**

**యావచ్చన్ద్ర: పూషభాత్కృత్తికాద్యే పాదే శుక్రోఽన్ధో న దుష్టోఽగ్రదక్షే**
**మధ్యేమార్గం భార్గవాస్తేఽపి రాజా తావత్తిష్ఠేత్సమ్ముఖ త్వేఽపి తస్య 42**

చంద్రుడు రేవతి నుండి కృత్తిక ప్రథమ చరణము వరకుండునంత సమయము శుక్రుడు అంధుడగును.అంధశుక్రుడు సమ్ముఖములో దక్షిణభాగములో దోషకారకుడుకాదు. యాత్ర ప్రారంభించిన తర్వాత మార్గములో శుక్రాస్తమయమైన మరల శుక్రోదయమగు వరకు రాజు ఎదురుచూడవలెను.ఈవిధముగాయాత్రలో శుక్రుడుసమ్ముఖుడైన, అనుకూలుడగు వరకు యాత్ర చేయరాదు.

**యాత్రలో లగ్నశుద్ధి :–**

**కుమ్భ కుమ్భాంశకౌ త్యాజ్యౌ సర్వథా యత్నతో బుధై:**
**తత్ర ప్రయాతుర్నృపతే రర్థనాశ: పదే పదే 43**

యాత్రలో కుంభలగ్నమును, కుంభ నవాంశను విద్వాంసులు ప్రయత్నపూర్వకముగా త్యజించవలెను. కుంభలగ్న, కుంభ నవాంశలలో యాత్ర చేయురాజు ధననాశనమును పొందును.

**అథమీనలగ్న ఉత వా తదంశకే చలితస్య వక్రమిహ వర్త్మ జాయతే**
**జనిలగ్న జన్మభపతీ శుభగ్రహౌ భవతస్తదా తదుదయే శుభో గమ: 44**

మీనలగ్నము మీననవాంశములలో యాత్ర చేయువానికి మార్గము వక్రముగా నగును. ఒకవేళ జన్మలగ్నేశుడు జన్మరాశీశుడు ఇద్దరు శుభగ్రహములైన యాత్రాకాలిక లగ్నములోనున్న యాత్రలో శుభము జరుగును.

**యాత్రలో అశుభలగ్నములు :–**

**జన్మరాశితనుతోఽష్టమేఽథవా స్వారిభాశ్చ రిపుభే తనుస్థితే**

**లగ్నగాస్తదధిపా యదా౽థవా స్యుర్గతం హి నృపతేర్మృతి ప్రదమ్ 45**

జన్మరాశి, జన్మలగ్నము నుండి అష్టమభావరాశి లేక శత్రురాశి నుండి షష్టమభావ లగ్నములో, లేక దానిస్వామి గ్రహము యాత్రాకాలిక లగ్నములో నున్న యాత్రచేయు రాజుకు మృత్యుప్రదమగును.

**శుభలగ్నము :-**

**లగ్నేచన్ద్రే వాపివర్గోత్తమస్థే యాత్రాప్రోక్తా వాఞ్ఛితార్థైకదాత్రీ**
**అమ్భోరాశౌ వా తదంశే ప్రశస్తం నౌకాయానం సర్వసిద్ధిప్రదాయి 46**

యాత్రాకాలిక లగ్నము లేక చంద్రుడు తనవర్గోత్తమ రాశులలోనున్నపుడు యాత్ర చేసిన కోరిన కోర్కెలను తీర్చును. జలరాశులలో (4,10,11,12) లేక జలరాశుల నవాంశలో లగ్నము,మరియు చంద్రుడున్న నౌకాయాత్ర అన్ని విధములైన శుభములనిచ్చును. 44వ శ్లోకములో కుంభ, మీనరాశులకు వాటినవాంశలకు యాత్రలో నిషేధమును తెల్పెను. వాటిని వదిలి మిగిలిన వర్గోత్తమ లగ్నములో లేక వర్గోత్తమ చంద్రస్థితిలో యాత్ర శుభఫలము నిచ్చును.

**దిగ్ద్వార రాశిఫలము :-**

**ద్విగ్ద్వారభే లగ్నగతే ప్రశస్తా యాత్రార్థ దాత్రీ జయకారిణీచ**
**హానిం వినాశం రిపుతో భయం చ కుర్యాత్తథా దిక్ప్రతిలోమలగ్నే 47**

దిగ్ద్వారరాశుల లగ్నములో నున్నపుడు యాత్రచేసిన శుభము, ధనలాభము విజయము, కలుగును. (మేషాదిరాశులలో,ఏరాశి ఏదిశలో చెప్పబడెనో ఆరాశులలో ఆ దిశలలో యాత్ర శుభమునిచ్చును) విపరీతదిశలలో యాత్రచేసిన హాని వినాశము శత్రుభయము కలుగును.

**నాలుగు దిశలలో మేషాదిరాశులను మూడుమార్లు ఆవృత్తి చేసిన దిగ్ద్వారరాశులగును.**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| పూర్వ | - | మేషము | - | సింహము | - | ధనుస్సు |
| దక్షిణ | - | వృషభము | - | కన్య | - | మకరము |
| పశ్చిమ | - | మిథునము | - | తుల | - | కుంభము |
| ఉత్తర | - | కర్కాటకము | - | వృశ్చికము | - | మీనము |

**పూర్వదిశకు మేష,సింహ,ధనుస్సులు దిగ్ద్వారరాశులు, ఈరాశుల లగ్నములలో పూర్వదిశలో యాత్ర శుభమునిచ్చును. పశ్చిమదిశలో అశుభమునిచ్చును. ఇదేవిధముగా మిగిలిన దిశల ఫలితములను గ్రహించవలెను.**

**శుభలగ్నము :-**

**రాశి: స్వజన్మసమయే శుభసంయుతో యో**
**య: స్వారిభాన్నిధన గో౽పి చ వేశి సంజ్ఞ:**
**లగ్నోపగ: స గమనే జయదో౽థ భూప**

**యోగైర్గమో విజయదో మునిభి: ప్రదిష్ట:** **48**

యాత్రికుని జన్మరాశి శుభగ్రహములతో కూడి ఉండి అదేరాశి యాత్రాకాలిక లగ్నము లోనున్న, లేక శత్రువురాశి,లేక లగ్నమునుండి అష్టమరాశి, లేక జన్మసమయములో సూర్యుడు ఏరాశిపై నుండునో దానికి ద్వితీయభావరాశి యాత్రాలగ్నములో నున్న విజయము నిచ్చును.రాజయోగములలో యాత్రచేసిన విజయము ప్రాప్తించునని మునులు తెల్పిరి.

**దిక్కులకు స్వాములు :-**

**సూర్య:సితో భూమిసుతోऽథ రాహు: శని: శశీజ్ఞశ్చ బృహస్పతిశ్చ**
**ప్రాచ్యాదితో దిక్షు విదిక్షుచాపి దిశామధీశా: క్రమత: ప్రదిష్టా:** **49**

పూర్వాదిదిశలకు, విదిశలకు క్రమముగా సూర్యుడు, శుక్రుడు, కుజుడు, రాహువు, శని,చంద్రుడు, బుధుడు, గురువు స్వాములగుదురు. అనగా పూర్వదిశకు సూర్యుడు,ఆగ్నేయ మునకు శుక్రుడు,దక్షిణమునకు కుజుడు, నైరృతికి రాహువు, పశ్చిమమునకు శని, వాయవ్యమునకు చంద్రుడు, ఉత్తరమునకు బుధుడు,ఈశాన్యమునకు బృహస్పతి స్వాములగుదురు.

**దిగీశుల ప్రయోజనము :-**

**కేన్ద్రే దిగధీశే గచ్ఛేదవనీశ:**
**లాలాటిని తస్మిన్ నేయాదరిసేనామ్** **50**

దిశాస్వామి గ్రహము యాత్రాకాలిక లగ్నము నుండి కేంద్రస్థానములో నున్నపుడు రాజు యాత్ర లేక యుద్ధయాత్ర చేయవలెను. దిశాస్వామి లాలాటియోగములో నున్న రాజు శత్రుసేనలపై యుద్ధమునకు వెళ్ళరాదు.

**లలాటి యోగము :-**

**ప్రాచ్యాదౌ తరణిస్తనౌ భృగుసుతో లాభవ్యయే భూసుత:**
**కర్మస్థోऽథ తమో నవాష్టమగృహే సౌరిస్తథా సప్తమే**
**చన్ద్ర: శత్రుగృహాత్మజేऽపి చ బుధ: పాతాలగో గీష్పతి**
**ర్విత్తభ్రాతృగృహే విలగ్న సదనాల్లాలాటికా: కీర్తితా:** **51**

సూర్యుడు లగ్నములోనున్న పూర్వదిశలో, శుక్రుడు 11,12 భావములలోనున్న ఆగ్నేయములో,కుజుడు పదవభావములోనున్న దక్షిణములో, రాహువు 8,9 భావము లలోనున్న నైరృతికోణములో,శని ఏడవభావములో నున్న పశ్చిమములో,చంద్రుడు 5,6 భావములలోనున్న వాయవ్యములో, బుధుడు నాల్గవభావములో నున్న ఉత్తరములో, గురుడు 2,3 భావములలో నున్న ఈశాన్యకోణములో లాలాటిక యోగమగును.

లాలాటిక పట్టిక

| దిశ | పూర్వ | ఆగ్నేయ | దక్షిణ | నైరృతి | పశ్చిమ | వాయువ్య | ఉత్తర | ఈశాన్య |
|---|---|---|---|---|---|---|---|---|
| గ్రహము | రవి | శుక్ర | కుజ | రాహు | శని | చంద్ర | బుధ | గురు |
| భావము | 1 | 11,12 | 10 | 8,9 | 7 | 5,6 | 4 | 2,3 |

**పర్యుషిత యాత్రాయోగము :-**

**మృగే గత్వా శివే స్థిత్వాదితౌ గచ్ఛ ఇజ్ఞయేద్రిపూన్**
**మైత్రే ప్రస్థాయ శాక్రే హి స్థిత్వా మూలే వ్రజంస్తథా** **52**

మృగశిర నక్షత్రములో యాత్రప్రారంభించి మార్గములో ఆర్ద్రా నక్షత్రములో విశ్రమించి పునర్వసు నక్షత్రములో మరల యాత్రప్రారంభించిన రాజు శత్రువులను జయించును. ఇదేవిధముగా అనూరాధ నక్షత్రములో యాత్రప్రారంభించి జ్యేష్ఠనక్షత్రములో విశ్రాంతి తీసుకొని మూలనక్షత్రములో యాత్రచేసిన శత్రువులపై విజయమును పొందును.

**ప్రస్థాయ హస్తేఽనిలతక్షధిష్ణ్యే స్థిత్వా జయార్థీ ప్రవసేత్ ద్విదైవే**
**వస్వన్త్య పుష్యే నిజసీమ్ని చైకరాత్రోషిత:క్ష్మాం లభతేఽవనీశ:** **53**

హస్తలో యాత్ర ప్రారంభించి స్వాతి నక్షత్రములో విశ్రమించి విశాఖ నక్షత్రములో మరల యాత్ర చేసిన విజయాభిలాష కలిగిన వ్యక్తి కోరిక నెరవేరును. ధనిష్ఠ,రేవతి, పుష్యమి,నక్షత్రములలో యాత్ర ప్రారంభించి తనసీమలో ఒకరాత్రి ఆగి తిరిగి యాత్ర ప్రారంభించినరాజు భూలాభమును పొందును. శత్రువును జయించి రాజ్యమును పొందును.

**సమయబలము :-**

**ఉష: కాలో వినాపూర్వాం గోధూలి: పశ్చిమాం వినా**
**వినోత్తరాం నిశీథ: సన్ యానే యామ్యాం వినాభిజిత్** **54**

పూర్వదిశను వదలి మిగిలిన మూడుదిశలలో ఉషాకాలములో (రాత్రి పగలు సంధికాలము) యాత్ర శుభమునిచ్చును. పశ్చిమదిశ వదలి మిగిలిన దిశలలో గోధూళికాలము, ఉత్తరదిశను వదలి మిగిలిన దిశలలో అర్ధరాత్రి,దక్షిణను వదలి మిగిలిన దిశలలో మధ్యాహ్నకాలములలో యాత్ర చేసిన శుభము కలుగును.

**ద్వాదశభావ సంజ్ఞ :-**

**లగ్నాద్భావా: క్రమాద్దేహకోశధానుష్కవాహనమ్**
**మన్త్రోఽరిమార్గ ఆయుశ్చ హృద్వ్యాపారాగమవ్యయా:** **55**

1.దేహము 2.కోశము 3. పరాక్రమము 4. వాహనము 5.మంత్రము 6.శత్రువు 7. యాత్ర 8. ఆయువు 9. హృదయము 10. వ్యాపారము 11. లాభము 12.వ్యయము ఇవి లగ్నము నుండి ప్రారంభించి క్రమముగా పన్నెండు భావములగును.

**గ్రహముల భావఫలము :-**

**కేన్ద్రేకోణే సౌమ్యఖేటా: శుభా: స్యుర్యానే పాపాస్త్ర్యాయషట్ఖేషుచన్ద్ర**
**నేష్టో లగ్నాన్త్యారి రన్ధ్రే శని: ఖేస్తే శుక్రో లగ్నేట్ సగాన్త్యారి రన్ధ్రే 56**

యాత్రాకాలిక లగ్నమునుండి కేంద్ర, త్రికోణ (1,4,7,10, 5, 9)భావములలో నున్న అన్ని శుభగ్రహములు యాత్రలో శుభఫలము నిచ్చును. పాపగ్రహములు 3,11,6,10 భావములలో శుభఫలమునిచ్చును. చంద్రుడు లగ్న,ద్వాదశ, షష్ఠ,అష్టమభావములలో అశుభఫలము, శని దశమభావములో, శుక్రుడు సప్తమభావములో అశుభఫలము నిచ్చును. లగ్నస్వామి గ్రహము 7,12,6,8 భావములలో అశుభఫలము నిచ్చును.

**యోగయాత్రాది బలము :-**

**యోగాత్సిద్ధిర్ధరణిపతీనామృక్ష గుణైరపి భూదేవానామ్**
**చౌరాణామపి శుభశకునైరుక్తా భవతి ముహూర్తాదపి మనుజానామ్ 57**

యోగా యాత్రాబలముతో రాజులకు (క్షత్రియులకు) నక్షత్రబలముతో బ్రాహ్మణులకు, శుభశకునముతో దొంగలకు యాత్రలో శుభము కలుగునని తెలుపబడెను. సామాన్య జనులకు ముహూర్తములననుసరించి కార్యము సిద్ధించును.

**యోగయాత్రాలగ్నము :-**

**సహజే రవిర్దశమభే శశీ తథా శనిమఙ్గలౌ రిపుగృహే సిత: సుతే**
**హిబుకే బుధో గురురపీహ లగ్నగ: స జయత్యరీన్ప్ర చలితోఽచిరాన్నృప: 58**

యాత్రా లగ్నము నుండి తృతీయభావములో రవి, దశమభావములో చంద్రుడు షష్ఠభావములో శని కుజుడు, పంచమభావములో శుక్రుడు, చతుర్థములో బుధుడు, లగ్నములో గురుడున్నపుడు ప్రయాణము చేయురాజు అతిశీఘ్రముగా శత్రువుపై విజయము సాధించును.

**భ్రాతరి సౌరిర్భూమిసుతో వైరిణి లగ్నే దేవగురు:**
**ఆయగతేఽర్కే శత్రుజయశ్చేదనుకూలో దైత్యగురు: 59**

యాత్రాకాలిక లగ్నము నుండి తృతీయభావములో శని, షష్ఠమభావములో కుజుడు, లగ్నభావములో గురుడు, ఏకాదశములో రవి శుక్రులు అనుకూలురైన యోగములో ప్రయాణము చేసిన శత్రువుపై విజయము కలుగును.

**తనౌజీవ ఇన్దుర్మృతౌ వైరిగోఽర్క:**
**ప్రయాతో మహీన్ద్రో జయత్యేవ శత్రూన్ 60**

యాత్రాకాలిక లగ్నములో గురుడు, అష్టమభావములో చంద్రుడు, షష్ఠమభావములో రవియున్న యోగములో యాత్రచేసిన రాజు శత్రువుపై తప్పక విజయము సాధించును.

**లగ్నగత: స్యాద్దేవ పురోధా:**

**లాభధనస్థై: శేషనభోగై: 61**

యాత్రాకాలిక లగ్నములో గురుడున్న మిగిలిన గ్రహములు రెండవ, పదకొండవ భావములలోనున్న సమయములో యత్ర చేయురాజు శత్రువులను జయించువాడగును.

**ద్యూనే చన్ద్రే సముదయగేఽర్కే జీవే శుక్రే విది ధనసంస్థే**

**ఈ దృగ్యోగే చలిత నరేశో జేతా శత్రూన్ గరుడ ఇవాహీన్ 62**

యాత్రాకాలిక లగ్నమునుండి సప్తమభావములో చంద్రుడు, లగ్నములో సూర్యుడు, ద్వితీయములో గురుడు శుక్రుడు బుధులున్న రాజు శత్రువులను, గరుడుడు సర్పములను జయించినట్లు జయించును.

**విత్తగత: శశిపుత్రో భ్రాతరి వాసరనాథ:**

**లగ్నగతే భృగుపుత్రే స్యు: శలభా ఇవ సర్వే 63**

ద్వితీయములో గురుడు, తృతీయములో రవి, లగ్నములో శుక్రుడున్న శత్రువుల స్థితి శలభముల (మిడతలు)వలెనగును. ఈ యోగములో రాజు యాత్రచేసిన శత్రుసేనలు శలభములు స్వయముగా అగ్నిలో పడినట్లుగా నాశనమును పొందెదరు.

**ఉదయే రవిర్యది సౌరిరరిగ: శశీ దశమేఽపి**

**వసుధాపతిర్యది యాతి రిపువాహినీ వశమేతి 64**

లగ్నములో సూర్యుడు, షష్ఠమభావములో శని, దశమములో చంద్రుడున్న యోగములో యాత్రచేసిన రాజు శత్రుసేనను తనవశము చేసుకొనును. శత్రుసేన ఆత్మసమర్పణము చేసుకొనును.

**తనౌ శనికుజౌ రవిర్దశమభే బుధో భృగుసుతోఽపి లాభదశమే**

**త్రిలాభరిపుభేషు భృసుతశనీ గురుజ్ఞ భృగుజాస్తథా బలయుతా: 65**

లగ్నములో శని కుజుడు, దశమములో రవి, పదకొండవ,పదవభావములలో బుధ శుక్రులున్న విజయము కలుగును. తృతీయ,ఏకాదశ దశ షష్ఠభావములలో కుజ శనులున్న,గురు బుధ శుక్రులు బలవంతులైన యాత్రచేయువారికి విజయము కలుగును.

**సముదయగే విబుధగురౌ మదనగతే హిమకిరణే**

**హిబుకగతౌ బుధభృగుజౌ సహజగతా: ఖలఖచరా: 66**

లగ్నములో గురుడు,సప్తమములో చంద్రుడు, చతుర్థములో బుధుడు శుక్రుడు, తృతీయములో దుష్టగ్రహమున్న యాత్రచేయువానికి విజయము కలుగును.

**త్రిదశగురుస్తనుగో మదనే హిమకిరణో రవిరాయగత:**

**సితశశిజావపి కర్మగతౌ రవిసుతభూమిసుతౌ సహజే 67**

గురుడు లగ్నములో, చంద్రుడు సప్తమములో, రవి ఏకాదశములో, శుక్రుడు బుధుడు దశమములో, శని కుజులు తృతీయభావములో నున్నప్పుడు యాత్రచేసిన వానికి విజయము కలుగును.

**దేవగురౌ వా శశిని తనుస్థే వాసరనాథే రిపుభవనస్థే**
**పఞ్చమగేహే హిమకరపుత్ర: కర్మణి సౌరి: సుహృది సితశ్చ 68**

గురువు లేక చంద్రుడు లగ్నములో, షష్ఠమములో రవి, పంచమములో బుధుడు, దశమములో శని, చతుర్థభావములో శుక్రుడున్నపుడు యాత్ర విజయమును కలిగించును.

**హిమకిరణసుతో బలీ చేత్తనౌ త్రిదశపతిగురుర్వి కేన్ద్రస్థిత:**
**వ్యయగృహసహజారి ధర్మస్థితో యది చ భవతి నిర్బలశ్చన్ద్రమా: 69**

బలవంతుడైన బుధుడు లగ్నములో,గురుడు కేంద్రములో,నిర్బలచంద్రుడు 12, 3, 6, 9 భావములలో నున్నప్పుడు యాత్రవిజయము నిచ్చును.

**అశుభ ఖగైరనవాష్టమదస్థైర్హిబుక సహోదరలాభ గృహస్థ:**
**కలిరిహ కేన్ద్రగగీష్పతి దృష్టో వసుచయలాభకర: ఖలుయోగ: 70**

అశుభగ్రహము 9, 8, 7 భావములను వదలి మిగిలిన స్థానములలోనున్న 4,3,11 భావములలో ఏదోఒకభావములో నున్న శుక్రుడు, కేంద్రములో నున్న గురునితో చూడబడినపుడు ఈ యోగములో యాత్రచేయువాడు ధనలాభమును పొందువాడగును.

**రిపులగ్నకర్మహిబుకే శశిజే పరివీక్షితే శుభనభోగమనై:**
**వ్యయలగ్న మన్మథగృహేషుజయ: పరివర్జితేష్వశుభనామధరై: 71**

షష్ఠమ, లగ్న,దశమ,చతుర్థభావములలో బుధుడు శుభగ్రహములతో చూడబడు తున్న, పాపగ్రహములు 12, 1, 7 భావములను వదలి మిగిలిన భావములలో నున్న విజయము కలుగును.

**రాజ్యలాభ యోగము :-**

**లగ్నేయది జీవ: పాపా యది లాభే కర్మణ్యపి వా చేద్రాజ్యాధిగమ: స్యాత్**
**ద్యూనే బుధ శుక్రౌ చన్ద్రో హిబుకే వా తద్వత్ఫలముక్తం సర్వైర్మునివర్యై: 72**

లగ్నములో గురువు, దశమ,ఏకాదశభావములో పాపగ్రహములున్నపుడు యాత్ర చేసిన రాజ్యలాభము కలుగును. సప్తమభావములో బుధ శుక్రులు, చతుర్థభావములో చంద్రుడున్న రాజ్యలాభము కలుగునని మునులు తెలిపిరి.

**విజయప్రద యోగము :-**

**రిపుతనునిధనే శుక్రజీవేన్దవో హ్యథబుధభృగుజౌ తుర్యగేహస్థితౌ**
**మదనభవనగశ్చన్ద్రమా వామ్బుగ: శశిసుతభృగుజాన్తర్గతశ్చన్ద్రమా: 73**

అరవభావములో శుక్రుడు, లగ్నములో గురుడు అష్టమభావములో చంద్రుడున్న

విజయము కలుగును.బుధ శుక్రులు చతుర్థభావములో, చంద్రుడు సప్తమ భావములో నున్న,లేక చతుర్థభావములో నున్న చంద్రుడు బుధ శుక్రుల మధ్యలోనున్న విజయము కలుగును.

**సితజీవ భౌమబుధ భాను తనూజాస్తను మన్మథారిహిబుక త్రిగృహేచేత్**
**క్రమతోఽరి సోదరఖశాత్రవహోరా హిబుకాయగైర్గురుదినేఽఖిల ఖేటై: 74**

శుక్ర గురు కుజ బుధ శనులు క్రమముగా లగ్న,సప్తమ,షష్ఠ,చతుర్థ, తృతీయభావములలో నున్న అనగా శుక్రుడు లగ్నములో, గురుడు సప్తమములో, కుజుడు షష్ఠమములో, బుధుడు చతుర్థములో, శని తృతీయభావములో నున్నపుడు యాత్రచేసిన రాజుకు విజయము కలుగును. గురువారము అన్నిగ్రహములు క్రమముగా 6,3,10,6,1, 4,11 భావములలోనున్న (సూర్యుడు 6,చంద్రుడు 3, కుజుడు 10, బుధుడు 6, గురుడు 1, శుక్రుడు 4, శని 11భావములోనున్న) యాత్రలో రాజుకు విజయము కలుగును.

**సహజే కుజో నిధనగశ్చ భార్గవో మదనే బుధో రవిరరౌ తనౌ గురు:**
**అథ చే త్స్యురిజ్యసితభానవో జలత్రిగతా హిసౌరిరుధురౌ రిపుస్థితౌ 75**

తృతీయభావములో కుజుడు, అష్టమములో శుక్రుడు, సప్తమములో బుధుడు, షష్ఠమములో సూర్యుడు, లగ్నములో గురుడున్న విజయము కలుగును.గురు-శుక్ర-రవులు చతుర్థ లేక తృతీయభావములో నున్న శని కుజులు షష్ఠమభావములో నున్న విజయము కలుగును.

**యోగము - యోగాధియోగము :-**

**ఏకోఙ్జేజ్యసితేషు పఞ్చమ తప: కేన్ద్రేషు యోగస్తథా**
**ద్వౌ చేత్తేష్వధియోగ ఏషు సకలా యోగాధియోగ: స్మృత:**
**యోగే క్షేమమథాధి యోగగమనే క్షేమం రిపూణాం వధం**
**చాథో క్షేమయశోవనీశ్చ లభతే యోగాధియోగే వ్రజన్ 76**

బుధ-గురు-శుక్రులలో ఒకగ్రహము పంచమ నవమ కేంద్ర (1,4,7,10)ము లలో నున్న 'యోగ'నామక యోగమగును. వీటిలో రెండు గ్రహములు ఉక్తస్థానములలో నున్న 'అధియోగ' నామకయోగమగును. మూడు గ్రహములు ఉక్తస్థానములలో నున్న యోగాధియోగమగును.

యోగములో యాత్రచేసిన కళ్యాణము, అధియోగములో చేసిన కళ్యాణము, శత్రునాశము యోగాధియోగములలో చేసిన కళ్యాణము, కీర్తి, రాజ్యలాభము కలుగును.

**విజయదశమి సిద్ధ ముహూర్తము :-**

**ఇషమాసి సితా దశమీ విజయా శుభకర్మాసు సిద్ధికరీ కథితా**
**శ్రవణర్క్షయుతా సుతరాం శుభదా: నృపతేషు గమే జయసన్ధికారీ 77**

ఆశ్వయుజ శుక్లపక్ష దశమి తిథి వజ్రసంజ్ఞకమగును. ఇది శుభకార్యములలో సిద్ధిని కలిగించునదగును. దశమి శ్రవణ నక్షత్రముతో కూడియున్న ఎల్లప్పుడు శుభము నిచ్చును. రాజుల యాత్రలో విజయము సంధిని కలిగించునదగును.

**విజయదశమిని స్వయముగా సిద్ధముహూర్తమందురు. ఆరోజున ముహూర్తమును చూడవలసిన అవసరము లేదు. విజయదశమి రోజున శ్రవణ నక్షత్రమైన అత్యంత ఉత్తమ యోగమగును. ఈయోగము లో యుద్ధయాత్ర చేసిన తప్పక విజయము కలుగును.**

**యాత్రలో శకున విచారము :-**

**చేతో నిమిత్తశకునై: ఖలు సుప్రశస్తై:**
**జ్ఞాత్వా విలగ్నబలముర్వ్యధిప: ప్రయాతి**
**సిద్ధిర్భవేదథ పున: శకునాదితోఽపి**
**చేతోవిశుద్ధిరధికా న చ తాం వినేయాత్ 78**

మనస్సులో ప్రసన్నత, అంగలక్షణాది శుభ నిమిత్తములు, పశుపక్షి ఆకాశముల వలన కలిగిన శుభ శకునములు, శుభలగ్నముల బలమును తెలిసికొని యాత్ర చేసిన రాజు అభీష్టఫలమును పొందును. శకునాదులు మనస్సుకు ప్రసన్నతతో పాటు అధికమహత్త్వ పూర్ణములగును. యాత్రాకాలములో మనసు ప్రసన్నముగా లేకున్న యాత్ర చేయకూడదు.

**యాత్రలో నిషిద్ధకాలము :-**

**వ్రతబన్ధన దేవతాప్రతిష్ఠాకర పీడోత్సవసూతకా సమాప్తౌ**
**న కదాపి చలేదకాలవిద్యుద్ఘనవర్షాతు హినేఽపి సప్తరాత్రమ్ 79**

యజ్ఞోపవీత సంస్కారములో, దేవాలయ ప్రతిష్ఠ సమయములో వివాహ మహోత్సవములో, జన్మసంబంధ సూతకము, మృత్యుసంబంధ సూతక సమాప్తికి పూర్వము యాత్ర చేయకూడదు.

**ఏకదినసీమ యాత్రా విశేషము :-**

**మహీపతే రేకదినే పురాత్ పురే యదా భవేతాం గమన ప్రవేశకౌ**
**భవారశూలప్రతి శుక్రయోగినీ విచారయేన్నైవ కదాపి పణ్డిత: 80**

రాజు ఒక నగరము నుండి యాత్ర ప్రారంభించి అదేరోజున వేరొక నగరమునకు వెళ్ళినపుడు నక్షత్రశూల-వారశూల, సమ్ముఖశుక్రుడు యోగినీ మున్నగు యోగముల విచారము విద్వాంసులు చేయరాదు.

**యద్యేకస్మిన్ దివసే మహీపతేర్నిర్గమ ప్రవేశౌ స్త:**
**తర్హివిచార్య: సుధియా ప్రవేశకాలో న యాత్రికస్తత్ర 81**

రాజుకు యాత్ర ఒకరోజులో సమాప్తమైనపుడు ప్రవేశకాలమును గూర్చి మాత్రమే విచారణ చేయవలెను. యాత్రాకాల విచారము చేయనక్కరలేదు.

**యాత్రలో త్రినవమీ దోషము :-**

**ప్రవేశాన్నిర్గమం తస్మాత్ప్రవేశం నవమే తిథౌ**
**నక్షత్రే చ తథా వారే నైవ కుర్యాత్కదాచన 82**

గృహములో ప్రవేశించు సమయములో నుండు తిథి వారములకు నవమ తిథి నక్షత్ర వారములలో యాత్ర, యాత్రకాలిక తిథినక్షత్ర వారముల నుండి నవమతిథి నక్షత్రవారములలో తిరిగి గృహప్రవేశము చేయకూడదు.

**యాత్రాకాలిక కర్తవ్యము :-**

**అగ్నింహుత్వా దేవతాం పూజాయిత్వా నత్వా విప్రానర్చయిత్వా దిగీశమ్**
**దత్వా దానం బ్రాహ్మణేభ్యో దిగీశం ధ్యాత్వా చిత్తే భూమిపాలోఽధిగచ్ఛేత్ 83**

అగ్నిలో హవనము చేసి, దేవతలను పూజించి బ్రాహ్మణులకు నమస్కరించి దిక్పాలకులను పూజించి , బ్రాహ్మణులకు దానమిచ్చి యాత్రచేయుదిశాస్వామిని ధ్యానించి రాజు యాత్రచేయవలెను.

**యాత్రలో నక్షత్రదోహదము :-**

**కుల్మాషాం స్తిలతణ్డులానపి తథా మాషాంశ్చ గవ్యం దధి**
**త్వాజ్యాం దుగ్ధమథైణమాంస మపరం తస్యైవ రక్తం తథా**
**తద్వత్పాయసమేవ చాషపలలం మార్గం చ శాశం తథా**
**షాష్టిక్యం చ ప్రియంగ్వ పూపమథవా చిత్రాణ్డజాన్ సత్ఫలమ్ 84**

అశ్విని నక్షత్రములో కుల్మాషము (బియ్యము మినుపపప్పు మిశ్రమము) భరణిలో నువ్వులు బియ్యము, కృత్తికలో మినుములు, రోహిణిలో ఆవు పెరుగు, మృగశిరలో ఆవునెయ్యి, ఆర్ద్రలో పాలు, పునర్వసులో మృగమాంసము,పుష్యమిలో మృగరక్తము, ఆశ్లేషలో పాయసము, మఘలో నీలకంఠపక్షి మాంసము, పుబ్బలో మృగమాంసము, ఉత్తరలో కుందేలు మాంసము,హస్తలో షష్టికాన్నము (ఒకవిధమై బియ్యము) చిత్తలో ప్రియంగువు (వృక్షములపై పెరుగు లత) స్వాతిలో అప్పడములు, విశాఖలో విభిన్న వర్ణపక్షి, అనూరాధలో సుందరఫల భక్షణము దర్శనము లేక స్పర్శ చేసి యాత్ర చేయవలెను.

**కౌర్మం సారికగౌధికం చ పలలం శాల్యం హవిష్యం హయా**
**ద్రుక్షే స్యాత్కృసరాన్న ముద్గమపి వా పిష్టం యవానాం తథా**
**మత్స్యాన్నం ఖలు చిత్రతాన్నమథవా దధ్యన్నమేవం క్రమా**
**ద్భక్ష్యా భక్ష్యమిదం విచార్య మతిమాన్ భక్షేత్తథాలోకయేత్ 85**

జ్యేష్ఠలో కచ్ఛపమాంసము, మూలలో సారికాపక్షి మాంసము, పూర్వాషాఢలో ఉడుము మాంసము, ఉత్తరాషాఢలో శల్యకమాంసము, అభిజిత్తులో హవిద్రవ్యము, శ్రవణములో ఖిచిడి,ధనిష్ఠలో మృగము,శతభిషములో యవలధాన్యపు పిండి, పూర్వాభాద్ర

లో చేపలు అన్నము,ఉత్తరాభాద్రలో మిశ్రితరంగుల అన్నము,రేవతిలో పెరుగు అన్నము – ఈ విధముగా బుద్ధిమంతుడైన పురుషుడు భక్ష్యా భక్ష్య విచారము (తినేవి తినకూడనివి) చేసి యాత్రాకాలములో నక్షత్రానుసారము వస్తువుల భక్షణము లేక అవలోకనము చేసి యాత్ర చేయవలెను.

**దిగ్దోహదము :–**

**ఆజ్యం తిలోదనం మత్స్యం పయశ్చాపి యథాక్రమమ్**
**భక్షయే ద్దోహదం దిశ్యమాశాం పూర్వాదికాం వ్రజేత్** **86**

నెయ్యి, నువ్వులు, బియ్యము, చేపలు, పాలు క్రమముగా పూర్వాదిదిశలకు దోహదములు వీటిని సేవించి (భక్షణము దర్శనము స్పర్శ) యాత్ర చేయవలెను. అనగా పూర్వదిశలో నెయ్యి, దక్షిణదిశలో నువ్వులు,బియ్యము,పశ్చిమములో చేపలు, ఉత్తరము లో పాలు సేవించి యాత్రచేయవలెను.

**వారదోహదము :–**

**రసాలాం పాయసం కాఞ్జీం శృతం దుగ్ధం తథా దధి**
**పయోఽ శృతం తిలాన్నం చ భక్షయేద్వారదోహదమ్** **87**

రవివారము శిఖిరిణి (చక్కెర,పెరుగు,కర్పూరములతో నిర్మించు పదార్థము) సోమవారము పాయసము,మంగళవారము కాంజి (చెరుకు, ద్రాక్షరసము వంటి పదార్థము) బుధవారము వేడిపదార్థము, గురువారము పెరుగు, శుక్రవారము పచ్చిపాలు, శనివారము నువ్వులన్నము వారదోహదములగును. వీటిని తిని యాత్రచేయవలెను.

**తిథిదోహదము :–**

**పక్షాదితోఽ ర్కదల తణ్డుల వారిసర్పి: శ్రాణాహవిష్యమపి హేమజలం త్వపూపమ్**
**భక్త్వా వ్రజేద్రుచకమమ్బు చ ధేనుమూత్రం యావాన్నపాయస గుడాన**
**సృగన్న ముద్గాన్** **88**

పాడ్యమిలో మదారపత్రము, తదియలో బియ్యపుజలము, విదియలో నెయ్యి, చవితిలో బార్లి, పంచమిలో హవిష్యాన్నము, షష్ఠిలో బంగారము కడిగిన నీరు, సప్తమిలో అప్పములు, అష్టమిలో నిమ్మ, నవమిలో జలము, దశములో గోమూత్రము, ఏకాదశిలో యవాన్నము,ద్వాదశిలో పాయసము, త్రయోదశిలో బెల్లము, చతుర్దశిలో రక్తము, పూర్ణిమ అమావాస్యలలో అన్నము,మినుములు తిథి దోహదములగును. వీటిని సేవించి యాత్రచేయవలెను.

**ఉద్ధృత్య ప్రథమతఏవ దక్షిణాంఘ్రి ద్వాత్రింశద్పదమధిగత్య దిశ్యయానమ్**
**ఆరోహేత్తిలఘృతహేమ తామ్రపాత్రం దత్వాదౌగుణకవరాయ చ ప్రగచ్ఛేత్** **89**

యాత్రను ప్రారంభించునపుడు మొదట కుడిపాదమును ఎత్తి ముప్పదిరెండు

అడుగులు నడిచి యాత్ర చేయు దిశలోనున్న వాహనము నధిరోహించవలెను. నువ్వులు–నెయ్యి–బంగారము–వెండిపాత్ర దైవజ్ఞునకు దానముచేసి యాత్ర చేయవలెను.

**దిశాయానము :–**

**ప్రాచ్యాం గచ్ఛేద్గజేనైవ దక్షిణస్యాం రథేన హి**
**దిశి ప్రతీచ్యామశ్వేన తథోదీచ్యాం నరైర్నృప: 90**

పూర్వదిశలో ఏనుగుపైకి ఎక్కి, దక్షిణదిశలో రథముపై కూర్చొని, పశ్చిమదిశలో గుఱ్ఱముపై ఉత్తరదిశలో పల్లకిపైనెక్కి రాజుయాత్ర చేయవలెను.

**యాత్రలో నిర్గమస్థానములు :–**

**దేవగృహాద్వా గురుసదనాద్వా స్వగృహాన్ముఖ్యకలత్ర గృహాద్వా**
**పాశ్య హవిశ్యం విప్రానుమత: పశ్యన్ శృణ్వన్మఙ్గల మేయాత్ 91**

దేవతాగృహము,గురుగృహము,స్వగృహము,ముఖ్యపత్నీగృహము,నుండి హవిష్యాన్న భోజనము చేసి, బ్రాహ్మణుల అనుమతి తీసుకొని మంగళ వస్తువులను చూచి, మంగళ వచనములు విని రాజుయాత్ర చేయవలెను.

**వర్ణానుసార యాత్రా వస్తువులు :–**

**కార్యార్థైరిహ గమనస్య చేద్విలమ్బో భూదేవారిభిరుపవీతమాయుధం చ**
**క్షౌద్రం చామలఫలమాశు చాలనీయం సర్వేషాం భవతి యదేవ హృత్ప్రియంవా 92**

యాత్రచేయవలసిన ముహూర్త సమయము ఆలస్యమైన బ్రాహ్మణాది వర్ణముల వారు క్రమముగా యజ్ఞోపవీతము, అస్త్రము,మధువు,ఉసిరికాయను వెళ్ళవలసిన దిశలో వెంటనే పంపవలెను. అనగా బ్రాహ్మణులు యజ్ఞోపవీతము, క్షత్రియులు అస్త్రము, వైశ్యులు, తేనె, శూద్రులు ఉసిరిని లేక తనకు ఇష్టమైన వస్తువులను వెంటనే వెళ్ళవలసిన ప్రదేశమునకు ముహూర్త సమయములో పంపవలెను.

**ప్రస్థాన ప్రమాణము :–**

**గేహాద్గేహాన్తరమపి గమస్తర్హి యాత్రేతిగర్గ:**
**సీమ్న: సీమాన్తరమపి భృగుర్బాణ విక్షే పమాత్రమ్**
**ప్రస్థానం స్యాదితి కథయతేఽథో భరద్వాజ ఏవం**
**యాత్రా కార్యా బహిరిహ పురాత్స్యాద్వసిష్ఠోబ్రవీతి 93**

తనగృహము నుండి ఇతరుల గృహమునకు వెళ్ళుటకు గర్గుడు యాత్ర అని తెల్పెను. ఒకనగరము నుండి వేరొక నగరమునకు వెళ్ళిన యాత్ర యగునని భృగుడు తెల్పెను. ఒకహస్తముతో వేసిన బాణము ఎంతదూరము వెళ్ళునో అంతదూరము వరకు భరద్వాజుడు యాత్ర అని తెల్పెను. గ్రామ, నగరముల నుండి వేరొక గ్రామ నగరములకు వెళ్ళుటను యాత్రయని వశిష్ఠుడు తెల్పెను.

ప్రస్థానమత్ర ధనుషాం హి శతాని పఞ్చ
కేచిచ్ఛతద్వయముశన్తి దశైవచాన్యే
సమ్ప్రస్థితో య ఇహ మన్దిరత: ప్రయాతో
గన్తవ్యదిక్షు తదపి ప్రయతేన కార్యమ్ 94

యాత్రలో దూరమును గూర్చి తెల్పుతు కొంతమంది ఆచార్యులు గృహమునుండి 50 ధనుస్సుల అనగా 2000 హస్తములని,కొందరు 200 ధనుస్సులు, కొందరు ఇంటినుండి 10 ధనుస్సుల దూరమును యాత్రా క్షేత్రముగా తెల్పిరి. యాత్ర కొరకు తన ఇంటినుండి బయలుదేరి గంతవ్య (వెళ్ళుతున్న) దిశకు ప్రయాణము చేయవలెను.

ప్రస్థానే భూమిపాలో దశదివసమభి వ్యాప్య నైకత్ర తిష్ఠేత్
సామన్త: సప్తరాత్రం తదితరమనుజ: పఞ్చరాత్రం తథైవ
ఊర్ధ్వం గచ్ఛేచ్ఛుభాహేఽ ప్యథ గమన దినాత్సప్తరాత్రాణి పూర్వం
చాశక్తౌ తద్దినేఽ సౌ రిపువిజయమనా మైథునం నైవ కుర్యాత్ 95

యాత్రచేయు రాజు ఒకే స్థలములో పదిరోజులకన్న ఎక్కువ కాలముండరాదు. సామంతరాజు ఏడుదినములు, సామాన్యజనులు ఐదురోజులు కన్న అధికముగా ఒక స్థలములోనుండరాదు. చెప్పబడిన దినములకన్న ఎక్కువ రోజులుండవలసి వచ్చిన ఇంటికి తిరిగి వచ్చి శుభముహూర్తములో మరల యాత్ర చేయవలెను. శత్రువుపై విజయమును కోరురాజు యాత్రచేయు దినము నుండి ఏడుదినముల ముందు నుండి మైథునము చేయరాదు. ఏడు దినములు బ్రహ్మచర్యము పాటించలేనపుడు యాత్రాదినమున సంభోగము చేయరాదు.

**యాత్రలో త్యాజ్యవస్తువులు :-**

**దుగ్ధం త్యాజ్యం పూర్వమేవ త్రిరాత్రం క్షౌరం త్యాజ్యం పఞ్చరాత్రంచ పూర్వమ్**
**క్షౌద్రం తైలం వాసరేఽ స్మిన్వమిశ్చ త్యాజ్యం యత్నాద్భూమి పాలేన నూనమ్ 96**

యాత్రాకాలమునకు ముందు మూడు దినముల నుండి పాలు, ఐదుదినము నుండి క్షౌర కర్మ (క్షౌరము గడ్డము చేయించుకొనుటము) రాజు వదిలి పెట్టవలెను. యాత్ర చేయురోజున తేనె నూనె సేవించటము,వాంతి చేసికొనటము ప్రయత్న పూర్వకముగా చేయకూడదు. అనగా యాత్రచేయురోజున శరీరము స్థిరరూపములో నుండునట్లు చూచుకొనవలెను.

**త్యాజ్యవస్తుసేవనము వలన దుష్పరిణామము :-**

భుక్త్వా గచ్ఛతి యది చేత్తైలగుడక్షారపక్వమాంసాని
వినివర్తతే సరుగ్ణ: స్త్రీద్విజమవమాన్య గచ్ఛతో మరణమ్ 97

నూనె, బెల్లము, ఉప్పు,వండినమాంసము సేవించి యాత్ర చేయువాడు రోగియై

తిరిగి వచ్చును. స్త్రీలను బ్రాహ్మణులను అవమానించి యాత్రచేయువానికి మృత్యువు కలుగును.

**అకాలవృష్టి జన్యదోషము :-**

**యది మాస్తు చతుర్షు పౌషమాసాదిషు వృష్టిర్హి భవేదకాలవృష్టి:**
**పశుమర్త్యపదాఙ్కితా న యావద్వసుధా స్యాన్నహి తావదత్రదోష: 98**

పుష్యాది (పుష్యము, మాఘము, ఫాల్గుణము, చైత్రము) నాలుగుమాసములలో వర్షము కురిసిన అకాలవర్షమనబడును. భూమిపై పశువుల మనుష్యుల పాదచిహ్నములు పడనంత వరకు అకాలవృష్టి దోషముండదు. అధికవర్షము వలన భూమిపై పాదముద్రలు కనపడిన అకాలవృష్టి దోషమగును.

**పుష్యాది మాసములలో మేఘములకు గర్భాధారణ జరుగును. ఈ మాసములలో వర్షించిన మేఘగర్భమునకు నష్టము కలుగును. దాని ప్రభావము వర్షాకాల వర్షముపై పడును.**

**అకాలవృష్టి దోషశాంతి :-**

**అల్పాయాం వృష్టౌ దోషోఽల్పే భూయస్యాం దోషో భూయాన్**
**జీమూతానాం నిర్ఘోషే వృష్టౌ వా జాతాయాం భూప:**
**సూర్యేన్ద్వోర్బిమ్బే సౌవర్ణే కృత్వా విప్రేభ్యో దద్యాద్**
**దు:శాకున్యే సాజ్యం స్వర్ణం దత్వా గచ్ఛే త్స్వేచ్ఛాభి: 99**

అల్పవృష్టి కురిసిన అల్పదోషము, అధికవర్షము కురిసిన అధికదోషమగును. అసమయ మేఘగర్జనము, వర్షము కురిసిన రాజు సూర్య చంద్రులమూర్తులను బంగారముతో చేసి దానము చేయవలెను. యాత్రాకాలమున అపశకునములు కనపడిన నెయ్యితోపాటు బంగారము దానము చేసి ఇచ్ఛానుసారము యాత్రచేయవలెను.

**శుభశకునములు :-**

**విప్రాశ్వేభ ఫలాన్నదుగ్ధదధి గోసిద్ధార్థ పద్మామ్బరం**
**వేశ్యావాద్యమయూర చాషనకులా వద్ధైక పశ్వామిషమ్**
**సద్వాక్యం కుసుమేక్షు పూర్ణ కలశచ్ఛత్రాణి మృత్కన్యకా**
**రత్నోష్ణీష సితోక్ష మద్యససుతస్త్రీ దీప్త వైశ్వానరా: 100**
**ఆదర్శాఞ్జన ధౌత వస్త్రరజకా మీనాజ్య సింహాసనం**
**శావం రోదన వర్జితం ధ్వజమధుచ్ఛాగాస్త్ర గోరోచనమ్**
**భారద్వాజనృయానవేదనినదా మాఙ్గల్యగీతాఙ్కుశా**
**దృష్ట: సత్ఫలదా: ప్రయాణసమయే రిక్తౌ ఘట: స్వానుగ: 101**

బ్రాహ్మణులు, గుర్రము, ఏనుగు, ఫలములు, అన్నము, పాలు, పెరుగు, ఆవు ఆవాలు,

కమలము,వస్త్రము,వేశ్య,వాద్యము, మయూరము,నీలకంఠము,ముంగిస,బంధించిన పశువు,మాంసము,మంచిమాటలు, పుష్పము, చెరుకు, పూర్ణకలశము, ఛత్రము, మట్టి, కన్య, రత్నము,తపపాగ, తెల్లనిఎద్దు, సుర,(సారాయి) పుత్రునితో కూడినస్త్రీ, మండుతున్న అగ్ని, అద్దము, కాటుక, ఉతికిన బట్టలతో చాకలివాడు, చేప,సింహాసనము, మృతశరీరము, పతాకము, తేనె, మేక, అస్త్రము, గోరోచనము, భారధ్వాజపక్షి, పల్లకి, వేదధ్వని, మాంగలిక గీతము, అంకుశము, ఖాళీకుండ, యాత్రికుని వెనుక వైపునుండి వెళుతు యాత్రా సమయము లో కనపడిన శుభఫలదాయకమగును.

**అశుభ శకునములు :–**

**వన్ధ్యా చర్మ తుషాస్థి సర్పలవణాఙ్గారేన్ధనక్లీబవిట్**
**తైలోన్మత్త వసౌషధారిజటిల ప్రవ్రాట్ తృణవ్యాధితా:**
**నగ్నాభ్యక్త విముక్త కేశపతితా వ్యఙ్గ క్షుధార్తా అసృక్**
**స్త్రీపుష్పం సరత: స్వగేహదహనం మార్జారయుద్ధం క్షుతమ్ 102**
**కాషాయీగుడ తక్ర పఙ్క విధవాకుబ్జా: కుటుమ్బే కలి**
**ర్వస్త్రాదే: స్ఖలనం లులాయసమరం కృష్ణాని ధాన్యాని చ**
**కార్పాసం వమనం చ గర్ధభరవో దక్షేఽతిరుట్ గర్భిణీ**
**ముణ్డార్ద్రామ్బర దుర్వచోఽన్ధ బధిరోదక్యో న దృష్టా: శుభా: 103**

వంధ్యస్త్రీ (సంతానము లేనిస్త్రీ) చర్మము, పొట్ట, ఎముకలు, ఉప్పు, బూడిద, కర్రలు, నపుంసకుడు, మలము, నూనె, పిచ్చివాడు, కొవ్వు, ఔషధము,శత్రువు, జటాధారి, సన్యాసి, గడ్డి,రోగి, వస్త్రహీనుడు, నూనెరాసుకున్న వ్యక్తి, చెదిరిన జుట్టు కలిగిన స్త్రీ పురుషుడు, ఊసరవెల్లి, తన ఇల్లు కాలుట, పిల్లులయుద్ధము, తుమ్ము, కషాయవస్త్రధారి, బెల్లము,మజ్జిగ,బురద, విధవస్త్రీ, గూనివాడు, కలహము, శరీరము నుండి వస్త్ర చత్రాదులు పడుట, దున్నపోతుల యుద్ధము, నల్లని అన్నము (మినుములు మున్నగునవి) దూది, వాంతి, దక్షిణ భాగములో గాడిదధ్వని,అతికోపముతో నున్న ప్రాణి,గర్భిణీస్త్రీ, తలగొరిగించుకున్న వ్యక్తి, తడిసిన వస్త్రము, అపశబ్దము వినుట, గ్రుడ్డివాడు, చెవిటివాడు, రజస్వలస్త్రీ, వీరు యాత్రచేయు సమయములో కనపడిన శుభము కలుగదు.

**ఇతరశకునములు :–**

**గోధాజాహకసూకరాహిశశకానాం కీర్తనం శోభనం**
**నో శబ్దో న విలోకనం చ కకపిఋక్షాణామతో వ్యత్యయ:**
**నద్యుత్తారభయప్రవేశసమరే నష్టార్థసంవీక్షణే**
**వ్యత్యస్థా: శకునా నృపేక్షణవిధౌ యాత్రోదితా: శోభనా: 104**

ఉడుము, జాహకము,(మెడ చిన్నగా నుండు జంతు విశేషము) పంది, సర్పము,

కుందేలు, వీటిదర్శనము లేక వాటినామోచ్ఛారణము యాత్రా సమయములో శుభము నీయవు. కోతి ఎలుగుబంటి ఉడుము మున్నగువాటివలన వ్యతిరేక ఫలితము కలుగును. వీటిశబ్దము దర్శనము నామోచ్ఛారణము అశుభఫలము నిచ్చును.నది దాటే సమయములో, భయము కలుగునపుడు, భయముతో పరిగెత్తు సమయము, గృహప్రవేశము, యుద్ధము, పోయిన వస్తువులు వెదికే సమయములలో విపరీత శకునములు కూడ శుభఫలము నిచ్చును. రాజదర్శన సంబంధిత కార్యములలో యాత్రా విషయములో ముందు తెల్పిన శుభ శకునములే శుభఫలమునిచ్చును.

**వామాజ్గే కోకిలా పల్లీపోతకీ సూకరీరలా**
**పిజ్గలా ఛుచ్ఛుకాశ్రేష్ఠా: శివా: పురుష సంజ్ఞితా: 105**

కోకిల, బల్లి, పోతకి(పక్షి విశేషము) పంది, రల(పక్షి విశేషము) పింగల చుంచెలుక, నక్క పురుష సంజ్ఞ పక్షులు, (పావురము, ఖంజనము, తిత్తిరపక్షి హంస) యాత్రా సమయములో శుభమును కలిగించును.

**ఛిక్కర: పిక్కకో భాస: శ్రీకణ్ఠో వానరో రురు:**
**స్త్రీ సంజ్ఞకా: కాకఋక్షశ్వాన: స్యుర్దక్షిణా: శుభా: 106**

ఛిక్కరమృగము,ఏనుగుపిల్ల,భాసపక్షి,నెమలి, కోతి, రురుమృగము, స్త్రీసంజ్ఞక పక్షులు, కాకి,ఎలుగుబంటి కుక్క యాత్రా సమయములో దక్షిణభాగములో నున్న శుభము నిచ్చును.

**ప్రదక్షిణగతా: శ్రేష్ఠా యాత్రాయాం మృగపక్షిణ:**
**ఓజా మృగా వ్రజన్తోఽతిధన్యా వామే ఖరస్వన: 107**

యాత్రా సమయములో దక్షిణభాగములో వెళుతున్న మృగములు పక్షులు శుభ ఫలముల నిచ్చును.విషమసంఖ్యలో మృగములున్న అధికఫలితమునిచ్చును.వామ భాగములో గాడిదశబ్దము వినపడిన యాత్రలో శుభము కలుగును.

**అశుభ శకునముల పరిహారము :–**

**ఆద్యేఽపశకునేస్థిత్వా ప్రాణానేకాదశ వ్రజేత్**
**ద్వితీయే షోడశప్రాణాం స్తృతీయే న క్వచిద్ వ్రజేత్ 108**

యాత్రా సమయములో మొదటిసారి అపశకునము కనిపించిన 11 ప్రాణముల (11 మార్లు శ్వాసవచ్చు వరకు) సమయము వరకు ఆగి యాత్ర చేయవలెను.రెండవసారి అపశకునము కనపడిన 16ప్రాణముల సమయము ఆగి యాత్ర చేయవలెను. మూడవసారి అపశకునము కనిపించిన యాత్రచేయరాదు.

**యాత్రానివృత్తౌ శుభదం ప్రవేశనం మృదుధ్రువై: క్షిప్రచరై: పునర్గమ:**
**ద్వీశేఽనలే దారుణభే తథోగ్రభే స్త్రీగేహ పుత్రాత్మ వినాశనం క్రమాత్ 109**

యాత్ర సమాప్తి అయిన తర్వాత మృదుసంజ్ఞక (మృగశిర, రేవతి, అనూరాధ,

చిత్త) ధ్రువసంజ్ఞక (ఉత్తరాత్రయం, రోహిణి) నక్షత్రములలో తమ గృహములో ప్రవేశము శుభమునిచ్చును. క్షిప్రసంజ్ఞక (అశ్విని, పుష్యమి, హస్త, అభిజిత్తు) చరసంజ్ఞక (స్వాతి, పునర్వసు, శ్రవణము, ధనిష్ఠ,శతభిషం) నక్షత్రములలో ప్రవేశించిన తిరిగి యాత్రచేయ వలసి వచ్చును. విశాఖనక్షత్రములో (యాత్ర జరిగిన తర్వాత తన గృహములో) ప్రవేశించిన స్త్రీనాశము, కృత్తికలో ప్రవేశించిన గృహనాశము, దారుణసంజ్ఞక (మూల, జ్యేష్ఠ, ఆర్ద్ర, ఆశ్లేష) నక్షత్రములలో ప్రవేశించిన స్వయముగా తనకు వినాశనము కలుగును.

**యాత్రలో నిషిద్ధ యోగములు :-**

**అయనర్క్ష మాసతిథి కాలవాసరోద్భవశూల సమ్ముఖసితజ్ఞదిక్పపా:**
**గురువక్రతాది పరిఘాఖ్య దణ్డక ప్లుతుజాద్య శౌచమపిచోత్సవాదికమ్ 110**
**మృతపక్ష రిక్తరవితర్క సంఖ్యకాస్థిథయశ్చ సౌరిరవిభౌమవాసరా:**
**అపి వామపృష్ఠగవిధుస్త థాడలో వసుపఞ్చకాభిజిదథాపి దక్షిణే 111**

అయన-నక్షత్ర-మాస-తిథి-కాల-దినముల వలన ఉత్పన్నమైన శూలాది దోషములు, సమ్ముఖ శుక్ర బుధ దిశాస్వామి గ్రహములు, గురుని వక్రత్వము అతిచారాది దోషములు, జననాశౌచము, మరణాశౌచము, దీపమాలిక, హోలిక ఆదిపర్వములు, వ్రతబంధ వివాహాది ఉత్సవములు మృతపక్షము రిక్త (4,9,14) 12, 6 తిథులు, శని-రవి-మంగళ వారములు,వామ,పృష్ఠ భాగములలో నున్న చంద్రుడు, ఆడలయోగము వదిలిపెట్టబడినవి. ధనిష్ఠా పంచకము (ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములు) అభిజిత్తు ముహూర్తము దక్షిణదిశ యాత్రలో వదిలి పెట్టవలెను.

**పైదోషములు వివాహాది ప్రకరణములలో తెలుపబడినవి. మరల గుర్తు చేయుటకు వాటిని విశేషించి తెలిపెను.**

**లగ్నే జన్మర్క్ష తన్వోర్మృతిగృహమహితర్క్షాచ్చ షష్ఠం తదీశా**
**వాలగ్నే కుమ్భమీనర్క్ష నవలవతనూ చాపి పృష్ఠోదయం చ**
**పృష్ఠాశా సంస్థమృక్షం దశమశనిరథో సప్తమే చాపి కావ్య:**
**కేన్ద్రే వక్రాశ్చ వక్రిగ్రహ దివస వివాహోక్త దోషాశ్చ నేష్టా: 112**

జన్మరాశి, జన్మలగ్నము నుండి అష్టమరాశి;తనశత్రురాశి నుండి షష్ఠమరాశి లేక షష్ఠమభావ స్వామి గ్రహము, కుంభ మీనరాశులు వీటినవాంశము పృష్ఠోదయ (5,6,7,8,11) రాశులు షష్ఠభాగములో నున్న నక్షత్రము యాత్రాకాలిక లగ్నములో వదలిపెట్టవలెను. యాత్రాలగ్నము నుండి దశమభావములో శని,సప్తమములో శుక్రుడు, కేంద్రములో (1,4,7,10) వక్రగ్రహములు అశుభమును కలిగించును. వక్రగ్రహముల దినములు,పగలందు వివాహప్రకరణములో తెల్పిన దోషములు యాత్రలో శుభమునీయవు.

**పదకొండవ యాత్రాప్రకరణము సమాప్తము**

# 12. వాస్తు ప్రకరణము

**స్థాన శుభాశుభ విచారము :-**

**యద్భం ద్వ్యఙ్కసుతేశ దిఙ్మితమసౌ గ్రా: శుభో నామభాత్**
**స్వం వర్గం ద్విగుణం విధాయ పరవర్గాఢ్యం గజైః శేషితమ్**
**కాకిణ్యస్త్వనయోశ్చ తద్వివరతో యస్యాధికాః సోఽర్థ**
**దోఽథ ద్వారం ద్విజవైశ్యశూద్ర నృపరాశీనాం హితం పూర్వత: 1**

తన నామరాశి నుండి అభీష్ట(కోరిన) స్థాన నామరాశి 2,9,5,10,11సంఖ్యతో నున్న అభీష్టస్థానములో నివాసము శుభమగును. అ,క,చ,ట, త, ప, య, శ –ఈ వర్గము లలో తన నామ రాశివర్గ సంఖ్యను రెట్టింపు చేసి దానికి స్థానవర్గును కలిపి ఎనిమిదిచే భాగించిన మిగిలిన శేషము ఆవ్యక్తికి కాకిణి యగును. ఇదే విధముగా స్థానవర్గ సంఖ్యను రెట్టింపు చేసి పురుషవర్గ సంఖ్యతో కలిపి ఎనిమిదిచే భాగించిన మిగిలిన శేషము స్థానకాకిణి యగును. రెండు కాకిణులలో అధికమగునది ధనము నిచ్చునదగును. (పురుష కాకిణి కన్న స్థానకాకిణి అధికమైన శుభమగును)

బ్రాహ్మణ–వైశ్య–శూద్ర–క్షత్రియవర్ణ రాశివారికి క్రమముగా పూర్వ దక్షిణపశ్చిమ, ఉత్తర దిశలలో గృహద్వారము శుభమునిచ్చును. అనగా బ్రాహ్మణవర్ణ (కర్కాటక, వృశ్చిక మీన)రాశులవారికి పూర్వదిశలో, వైశ్యవర్ణ (వృషభ,కన్య,మకర) రాశివారికి దక్షిణదిశలో, శూద్రవర్ణ (మిథున,తుల, కుంభ) రాశివారికి పశ్చిమదిశలో, క్షత్రియవర్ణ (మేష,సింహ, ధనుస్సు) రాశులవారికి ఉత్తరదిశలో గృహద్వారము శుభమునిచ్చును.

**ఉదాహరణకు - సత్యనారాయణ కొరకు నారాయణపురము గ్రామము శుభమా కాదా విచారించవలెను.**

**సత్యనారాయణ వర్గ సంఖ్య 8, నారాయణపురము వర్గసంఖ్య 5**

**8 X 2 + 5 = 16 + 5 = 21 ÷ 8 = శేషము 5 సత్యనారాయణకు కాకిణియైనది.**

**5 X 2 + 8 = 10 + 8 = 18 ÷ 8 శేషము 2,**

**5 - 2 = 3 సత్యనారాయణ కాకిణి అధికమైనది కావున నారాయణపురము గ్రామము సత్యనారాయణకు నివాసయోగ్యము కాదు.**

**2) సత్యనారాయణకు కాళ్ళకూరు అనుకూలమా కాదా చూడవలసిన**

**8 X 2 + 2 = 18 ÷ 8 = శేషము 2 సత్యనారాయణకు కాకిణియైనది.**

**2 X 2 + 8 = 12 ÷ 8 శేషము 4,**

**4- 2 = 2 కాళ్ళకూరు కాకిణి అధికమైనది కావున ఆగ్రామము సత్యనారాయణ కనుకూలమైనది.**

**రాశివశమున నిషిద్ధ స్థానములు :-**

**గోసింహ నక్రమిథునం నివసేన్న మధ్యే**
**గ్రామస్య పూర్వకకుభోऽలిఝషాఙ్గనాశ్చ**
**కర్కో ధనుస్తులభమేష ఘటాశ్చ తద్వత్**
**వర్గాః స్వపఞ్చమపరాబలినః స్యురైన్ద్ర్యాః** **2**

వృషభ, సింహ, మకర, మిథునరాశి వారు గ్రామమధ్యములో, వృశ్చికరాశివారు పూర్వదిశలో మీనరాశివారు ఆగ్నేయదిశలో,కన్యారాశివారు దక్షిణదిశలో, కర్కాటకరాశి వారు నైరృతిలో,ధనూరాశివారు పశ్చిమములో,తులారాశివారు వాయవ్యములో, మేషరాశి వారు ఉత్తరములో ,కుంభరాశివారు ఈశాన్యకోణములో నివాసముండరాదు. ఇదేవిధముగా పూర్వాదిదిశలలో క్రమముగా ఎనిమిదివర్గులు బలమైనవగును.పూర్వదిశలో అ వర్గు, ఆగ్నేయములో క వర్గు, దక్షిణములో చ వర్గు, నైరృతిలో ట వర్గు,పశ్చిమములో త వర్గు, వాయవ్యములో ప వర్గు, ఉత్తరములో య వర్గు, ఈశాన్యములో శ వర్గు బలమైనవగును. తనవర్గుకు పంచమవర్గు శత్రువర్గుయగును. శత్రువర్గులో నివాసముండరాదు.

**ఉదాహరణకు - రమేశ్ వర్గు య వర్గు అయినది. య వర్గుకు ఐదవ వర్గు చ వర్గు అయినది. చ వర్గు దిశ దక్షిణము అందువలన దక్షిణదిశ అనుకూలముకాదు. రమేశ్‌కు ఉత్తరదిశ ఉత్తమమైనది. దక్షిణము వదలి మిగిలిన దిశలు మధ్యమఫలము నిచ్చునని తెలిసికొనవలెను.**

**నామానుకూల వర్ణపట్టిక**

| | | | | |
|---|---|---|---|---|
| వాయవ్యము | | ఉత్తరము | | ఈశాన్యము |
| | 6<br>తుల<br>ప వర్గు | 7<br>మేషము<br>య వర్గు | 8<br>కుంభము<br>శ వర్గు | |
| పశ్చిమము | 5<br>ధనుస్సు<br>త వర్గు | 9<br>వృష,సింహ<br>మకర మిథున | 1<br>వృశ్చికము<br>అ వర్గు | పూర్వదిశ |
| | 4<br>కర్కాటక<br>ట వర్గు | 3<br>కన్య<br>చ వర్గు | 2<br>మీనము<br>క వర్గు | |
| నైరృతి | | దక్షిణము | | ఆగ్నేయము |

ఏకోనితేష్ట ర్క్షహతా ద్వితిథ్యో రూపోనితేష్టాయహతేస్దునాగై:
యుక్తా ఘనైశ్చాపి యుతా విభక్తా భూపాశ్విభి: శేషమితో హి పిణ్డ: 3
స్వేష్టాయనక్షత్రభవోఽథ ధైర్ఘ్య హృత్వాద్విస్తృతిర్విస్తృతిహృచ్చ దీర్ఘతా
ఆయాధ్వజో ధూమహరిశ్వగోఖరేభధ్వాజ్క్షకా: పిణ్డ ఇహాష్టశేషితే 4

అభీష్ట నక్షత్ర సంఖ్యలో 1 తగ్గించి మిగిలిన సంఖ్యను 152చే గుణించవలెను. అభీష్టఆయములో ఒకటి తగ్గించి శేషమును 81తో గుణించవలెను. రెండింటిని జోడించి దానికి 17 కలిపి 216తో భాగించిన శేషము ఇష్టఆయము ఇష్ట నక్షత్రము ద్వారా ఉత్పన్నమగు గృహపిండమగును. అభీష్ట పొడవుతో పిండమును భాగించిన వెడల్పు, అభీష్ట వెడల్పుతో పిండమును భాగించిన పొడవు వచ్చును. పిండమును 8చే భాగించిన ఏకాది శేషక్రమములో 1.ధ్వజము 2.ధూమ్రము 3. సింహము 4. శ్వానము 5. వృషభము 6. ఖరము 7. గజము 8. ధ్వాంక్ష సంజ్ఞక ఆయములగును.

**ఇష్ట నక్షత్ర కల్పన మేలాపకము ననుసరించి చేయవలెను. గృహస్వామి నామ నక్షత్రముతో ఏనక్షత్రమునకు మేలాపకము అనుకూలమగునో ఆనక్షత్రమును కల్పన చేయవలెను. ఇష్టనక్షత్ర కల్పన చేయునపుడీ విషయమును కూడ గ్రహించవలెను. ఒకేనాడిలో వచ్చు నక్షత్రములను గ్రహించవచ్చును. ఇదేవిధముగా ఆయకల్పనలో విషమాయము 1,3,5,7 (ధ్వజ, సింహ, వృషభ, గజ)లను గ్రహించవలెను.**

**ఉదాహరణకు - గృహస్వామి సూర్యనారాయణ - నక్షత్రము శతభిషము, గృహనక్షత్రము పూర్వాభాద్రపద ఆయము వృషభాయము కల్పనచేసిన ఇష్టనక్షత్ర సంఖ్య 25, ఆయసంఖ్య 5 .** **25-1 = 24 X 152 = 3648**

**5 - 1 = 4 X 81 = 324**

**3648 + 324 + 17 = 3789 ÷ 216 = 101 శేషము. గృహపిండము 101 అయినది.**

**గృహము వెడల్పు 9 హస్తములైన 101 ÷ 9 = వెడల్పు 11 హస్తముల 5 అంగుళముల 2 యవలగును. ఆయసాధనకు గృహపిండమును 8 చే భాగించిన 101 ÷ 8 = శేషము 5 వచ్చును. వృషభాయమైనది.**

**ఆయవశమున ద్వారజ్ఞానము :-**

ధ్వజాదికా: సర్వదిశి ధ్వజే ముఖం కార్యం హరౌపూర్వయమోత్తరే తథా
ప్రాచ్యం వృషే ప్రాగ్యమయోర్గజేఽథవా పశ్చాదుదక్పూర్వయమే ద్విజాదిత: 5

ధ్వజ,సింహ,వృషభ, గజాయములలో క్రమముగా ద్వారవిచారము ఈ విధముగా చేయవలెను. ధ్వజాయమునకు అన్నిదిశలలో,సింహాయమునకు పూర్వ దక్షిణ ఉత్తర

దిశలలో,వృషభాయమునకు పూర్వదిశలో, గజాయమునకు పూర్వ దక్షిణదిశలలో ద్వారనిర్మాణము చేయవలెను.వర్ణవిభాగముననుసరించి బ్రాహ్మణులకు పశ్చిమము, క్షత్రియులకు ఉత్తరము, వైశ్యులకు పూర్వము, శూద్రులకు దక్షిణములో ద్వారము శుభము నిచ్చును.

**గృహారంభములో కాలశుద్ధి :-**

> **గృహేశత త్ర్రీసుతవిత్తనాశోఽర్కే ద్వీజ్య శుక్రే విబలేఽస్తనీచే**
> **కర్తు: స్థితిర్నో విధువాస్తునోర్భే పుర: స్థితే పృష్ఠగతే ఖని: స్యాత్ 6**

సూర్య, చంద్ర,గురు,శుక్రుల నిర్బలులై,అస్త,నీచరాశులలో నున్న క్రమము గా గృహస్వామికి, గృహేశుని పత్నికి,సుఖము, ధనములకు నాశము కలుగును. సూర్యుడు నిర్బలుడై నీచరాశిగతుడైన గృహస్వామికి,చంద్రుడు నిర్బలుడైన నీచరాశిగతుడైన గృహపత్నికి, గురుడు నిర్బలుడై నీచరాశిగతుడైన సుఖమునకు, శుక్రుడు నిర్బలుడై అస్త నీచరాశిగతుడైన ధనమునకు నాశము కలుగును. చంద్ర నక్షత్రము వాస్తు నక్షత్రములు రెండు గృహమునకు ఎదురుగానున్న దిశలోనున్న గృహస్వామికి నివాసమునకా గృహమను కూలించదు. ఉక్త రెండు నక్షత్రములు గృహమునకు పృష్ఠ (వెనుక) భాగమున నున్న దొంగల వలన భయము కలుగును.

**గృహద్వారముండు దిశలో గృహపిండము వలన ప్రాప్తించు నక్షత్రము, గృహారంభదిన నక్షత్రమున్నప్పుడు గృహయజమానికి ఆదిశలో నివసించిన నష్టము కలుగును.ముఖ్యద్వారము నకు విపరీతదిశలో రెండు నక్షత్రములున్న పృష్ఠ నక్షత్రము లగును.దీనిలో గృహారంభముచేసిన దొంగల వలన భయము కలుగును. అనగా గృహద్వారమునకు వామ దక్షిణదిశలలోదైనిక నక్షత్రము వాస్తు నక్షత్రములున్న గృహారంభము శుభము నిచ్చును. నక్షత్రదిశా జ్ఞానము సప్తశలాక చక్రము వలన తెలియును.**

**వ్యయ అంశల జ్ఞానము :-**

> **భం నాగతుష్టం వ్యయ ఈరితోఽసౌ ధ్రువాదినామాక్షరయుక్ సపిణ్డ:**
> **తష్టో గుణైరిన్ద్ర కృతాన్తభూపా హ్యంశా భవేయుర్న శుభోఽన్తకోఽత్ర 7**

గృహనక్షత్ర సంఖ్యను 8చే భాగించిన శేషము వ్యయమగును. వ్యయసంఖ్యను గృహపు ధృవాది నామాక్షర సంఖ్యతో కలిపి దానికి గృహపిండమును జోడించి 3చే భాగించిన 1 శేషము వచ్చిన ఇంద్ర, 2 శేషము వచ్చిన యమ, 3 శేషము వచ్చిన భూప నామక అంశమగును. వీటిలో యమాంశము మంచిదికాదు.

ఉదాహరణకు - గృహనక్షత్రము పూర్వాభాద్ర, సంఖ్య 25

$25 \div 8$ = శేషము 1, అందువలన వ్యయము 1

**ధ్రువాంక సాధనము :-**

**దిక్షు పూర్వాదిత: శాలాధ్రువా భూద్వ్యోకృతా గజా:**
**శాలా ధ్రువాఙ్కసంయోగ: సైకో వేశ్మ ధ్రువాదికమ్** **8**

పూర్వాది నాలుగు దిశలలో క్రమముగా 1,2,4,8 శాలాధ్రువాంకములగును. (అనగా పూర్వదిశలో 1, దక్షిణములో 2,పశ్చిమములో 4,ఉత్తరములో 8 శాలాధ్రువాంకము లగును) ఏఏదిశలలో గృహద్వారములు కావలెనో ఆయాదిశలలో ధ్రువాంక యోగములో ఒకటి కలిపిన ధ్రువాదిగృహముల సంఖ్య యగును.

**తిథ్యర్కాష్టాష్టి గోరుద్రశక్రే నామాక్షరం త్రయమ్**
**భూ ద్వ్యబ్ధీష్వఙ్గదిగ్వహ్నివిశ్వేషు ద్వౌ నగేఽబ్ధ యః** **9**

శాలాధ్రువాంకపు యోగమునకు ఒకటి కలిపిన 15,12,8,16,9,11,14 సంఖ్యలైన గృహనామము మూడు అక్షరములదగును. ఉక్తయోగము 1,2,4,5,6, 10,3,13 సంఖ్యలైన గృహనామము రెండు అక్షరములదగును. ఉక్తయోగము 7 సంఖ్యయైన నామాక్షర సంఖ్య నాలుగగును.

**ధ్రువధాన్యే జయనన్దౌ ఖరకాన్తమనోరమం సుముఖ దుర్ముఖోగ్రం చ**
**రిపుదం విత్తద నాశే చాక్రన్ద విపుల విజయాఖ్యం స్యాత్** **10**

1.ధ్రువ 2.ధాన్య 3.జయ 4.నంద 5.ఖర, 6. కాంత, 7.మనోరమ 8. సుముఖ 9.దుర్ముఖ 10.ఉగ్ర 11. రిపుద 12. విత్తద 13. నాశ 14.ఆక్రంద 15.విపుల 16.విజయ ఇవిక్రమముగా గృహనామములు.

**ఉదాహరణము - ధ్రువాది నామసాధనము గృహములో పూర్వ మరియు ఉత్తరద్వారముల భీష్టములైన శాలాధ్రువాంక యోగము 1 + 8 = 9, 9 + 1 = 10 యోగసంఖ్య 10 అయినది. పదవగృహనామము ఉగ్ర రెండు అక్షరములదగును.**

**అంశ సాధనము పూర్వసాధితవ్యయము 1, ధ్రువాది గృహనామాక్షరము సంఖ్య 2 గృహపిండము 101, 1+2 = 3+101 = 104÷3 = శేషము 2 అందువలన యమ అంశమగును.**

**పింద అంశాదుల సాధనము :-**

**పిణ్డే నవాఙ్కా ఙ్గ గజాగ్నినాగనాగాబ్ధి నాగైర్గుణితే క్రమేణ**
**విభాజితే నాగనాగాఙ్క సూర్య నాగార్క్ష తిథ్యుక్ష ఖభానుభిశ్చ** **11**
**ఆయోవారాంశకో ద్రవ్యమృణమృక్షం తిథిర్యుతి:**
**ఆయుశ్చాథ గృహేశర్క్షం గృహభైక్యం మృతిప్రదమ్** **12**

గృహపిండమును తొమ్మిది స్థానములలో నుంచి క్రమముగా 9,9,6,8,3,8, 8,4,8 అంకెలతో గుణించి గుణన ఫలమును 8,7, 9, 12, 8, 27, 15, 27, 120 తో

భాగించిన వచ్చు శేషము క్రమముగా ఆయ, వార, అంశ, ద్రవ్య, ఋణ, నక్షత్ర, తిథి, యోగ, ఆయువులగును. గృహనక్షత్రము, గృహస్వామి నక్షత్రము ఒకటేయైన మృత్యుదాయకమగును.

**ఆయాదిసాధన పట్టిక**

ఆయపిండము 101 అనుకొనిన

101 × 9 – 909 ÷ 8 శేషము – 5 ఆయము

101 × 9 – 909 ÷ 7 శేషము – 6 వారము

101 × 6 – 606 ÷ 9 శేషము – 3 అంశము

101 × 8 – 808 ÷ 12 శేషము – 4 ద్రవ్యము

101 × 3 – 303 ÷ 8 శేషము – 7 ఋణము

101 × 8 – 808 ÷ 27 శేషము – 25 న–త్రము

101 × 8 – 808 ÷ 15 శేషము – 13 తిథి

101 × 4 – 404 ÷ 27 శేషము – 26 యోగము

101 × 8 – 808 ÷ 120 శేషము – 88 ఆయువు

**గృహారంభములో వృషభవాస్తు చక్రము :–**

**గేహాద్యారమ్భేఽర్క భాద్వత్సశీర్షే రామైర్దాహో వేదభైరగ్రపాదే**
**శన్యంవేదైః పృష్ఠపాదే స్థిరత్వం రామైః పృష్ఠే శ్రీర్యుగైర్దక్షకుక్షౌ 13**
**లాభోరామైః పుచ్ఛగైః స్వామినాశో వేదైర్త్రైః స్వం వామకుక్షౌముఖస్థైః**
**రామైః పీడా సన్తతం వార్కాధిష్ణ్యాదశ్వై రుద్రైర్దిగ్భి రుక్తం హ్యసత్సత్ 14**

గృహనిర్మాణములో సూర్యనక్షత్రము నుండి ఏడునక్షత్రములు వృషభ(చక్ర)శీర్షముపై అగ్నిదాహము చేయునవి, 4నక్షత్రములు ముందు కాళ్ళపై శూన్యములు, నాలుగు నక్షత్రములు వెనుకకాళ్ళపై స్థిరప్రదానములు, మూడు నక్షత్రములు వీపుపై ధనమునిచ్చునవి, నాలుగు నక్షత్రములు దక్షిణకుక్షిపై లాభమునిచ్చునవి, మూడు నక్షత్రములు తోకపై స్వామినాశన కారకములు, ముఖముపై నిరంతరము పీడను కలిగించునవి యగును. సూర్యనక్షత్రము నుండి ఏడు నక్షత్రములు అశుభములు 11 నక్షత్రములు శుభములు, 10నక్షత్రములు అశుభమునిచ్చునవని తెలిసికొనవలెను.

**గృహారంభములో వృషభచక్ర శుద్ధి తప్పకచూడవలెను. శుభఫలనక్షత్రములైన (సూర్య నక్షత్రము నుండి ఎనిమిదవ నక్షత్రము నుండి 18 వరకు శుభఫలదాయకములు) గృహనిర్మాణము చేయవలెను.**

వృషభ చక్ర పట్టిక

| సూర్యదిష్ఠిత | 3 | 4 | 4 | 3 | 4 | 3 | 4 | 3 |
|---|---|---|---|---|---|---|---|---|
| నక్షత్ర సంఖ్య వృషభచక్ర అంగములు | శీర్షము | అగ్ర పాదము | పృష్ఠి పాదము | పృష్టము | దక్షిణ కుక్షి | పుచ్ఛము | వామ కుక్షి | ముఖము |
| ఫలము | దాహము | శూన్యము | స్థిరత | ధనము | లాభము | స్వామి నాశము | నిర్ధనత | పీడ |
| నిష్కర్ష | 7 అశుభము | | 11 శుభము(గ్రాహ్యము) | | | 10 అశుభము(త్యాజ్యము) | | |

**కుమ్భేఽర్కే ఫాల్గునే ప్రాగపదముఖగృహం శ్రావణే సింహకర్కో:**
**పౌషే నక్రే చ యామ్యోత్తరముఖ సదనం గోజగేఽర్కేచ రాధే**
**మార్గే జూకాలిగే సద్ ధ్రువమృదువరుణస్వాతి వస్వర్కపుష్యై:**
**సూతీగేహం త్వదిత్యాం హరిభవిధిభయోస్త్ర శస్త: ప్రవేశ:** **15**

ఫాల్గుణమాసములో కుంభరాశిలో సూర్యుడున్న పూర్వపశ్చిమ ముఖద్వారములు, శ్రావణమాసములో కర్కాటక సింహరాశులలో, లేక పుష్యమాసములో మకరములో సూర్యుడున్నప్పుడు పూర్వపశ్చిమ ముఖద్వారములు నిర్మాణము చేసిన శుభము కలుగును. వైశాఖమాసములో వృషభ మేషరాశులలో, లేక మార్గశిర మాసములో తులా వృశ్చికరాశు లలో సూర్యుడున్నపుడు ఉత్తర దక్షిణదిశ ముఖగృహము నిర్మాణము శుభము నిచ్చును. ధ్రువసంజ్ఞక (ఉత్తరాత్రయం,రోహిణి) మృదుసంజ్ఞక (మృగశిర,రేవతి,చిత్త,అనూరాధ ) శతభిషం స్వాతి,ధనిష్ఠ,హస్త, పుష్యమినక్షత్రములలో గృహనిర్మాణము,పునర్వసు నక్షత్రములో సూతికా గృహనిర్మాణము శుభమునిచ్చును. శ్రవణ,అభిజిత్తు నక్షత్రములలో సూతికా గృహప్రవేశము శుభమునిచ్చును.

**గృహారంభములో మతాంతరము :-**

**కైశ్చిన్మేషరవౌ మఘౌ వృషభగే జ్యేష్ఠే శుచౌకర్కటే**
**భాద్రే సింహగతే ధటేఽశ్వయుజి చోర్జేఽలౌ మృగే పౌషకే**
**మాఘే నక్రఘటే శుభం నిగదితం గేహం తథోర్జే న సన్**
**కన్యాయాం చ తపా ధనుష్యపి న సన్ కృష్ణాది మాసాద్భవేత్** **16**

కొంతమంది ఆచార్యుల మతానుసారము మేషములో సూర్యుడున్న చైత్ర మాసములో, వృషభములో సూర్యుడున్న జ్యేష్ఠమాసములో, కర్కాటకములో సూర్యుడున్న

ఆషాఢమాసములో, సింహములో సూర్యుడున్న భాద్రపదమాసములో, తులలో సూర్యుడున్న ఆశ్వయుజమాసములో, వృశ్చికములో సూర్యుడున్న కార్తీకములో, మకరములో సూర్యుడున్న పుష్యమాసములో, మకర కుంభరాశులలో సూర్యుడున్న మాఘ మాసములో గృహనిర్మాణము శుభమగును. కన్యారాశిలో సూర్యుడున్న కార్తీకమాసములో, ధనూరాశిలో సూర్యుడున్న మాఘమాసములో గృహనిర్మాణము శుభమునీయదు. ఇక్కడ మాసగణన కృష్ణపక్ష పాడ్యమి నుండి శుక్లపక్ష పూర్ణిమ వరకు తీసికొనబడినది.

**తిథివశమున ద్వార నిషేధము :-**

**పూర్ణేన్దుత: ప్రాగ్వదనం నవమ్యాదిషూత్తరాస్యం త్వథ పశ్చిమాస్యమ్**
**దర్శాదిత: శుక్లదలే నవమ్యాదౌ దక్షిణాస్యం న శుభం వదన్తి** **17**

పూర్ణిమ నుండి ప్రారంభించి కృష్ణపక్ష తిథి పర్యంతము పూర్వాభిముఖము, నవమి నుండి కృష్ణపక్ష చతుర్దశి వరకు ఉత్తరాభిముఖము, అమావాస్య నుండి శుక్లపక్ష అష్టమి వరకు పశ్చిమాభిముఖము, నవమి నుండి శుక్లపక్ష చతర్దశి వరకు దక్షిణాభి ముఖ గృహము నిర్మాణము చేసిన అశుభము కలుగును.

**గృహారంభములో పంచాంగ శుద్ధి :-**

**భౌమార్కరిక్తామాద్యూనే చరోనేఽజ్గే విపఞ్చకే**
**వ్యష్టాన్త్యస్థై: శుభైర్గేహారమ్భ స్త్ర్యాయారిగై: ఖలై:** **18**

మంగళవారము రవివారము రిక్త (4,9,14) అమావాస్య పాడ్యమి తిథులను వదలి మిగిలిన తిథివారములలో, చరలగ్నములను వదలి మిగిలిన లగ్నములలో పంచక (ధనిష్ఠ,శతభిషం,పూర్వాభాద్ర,ఉత్తరాభాధ్ర,రేవతి)నక్షత్రములు వదలి మిగిలిన నక్షత్రము లలో,లగ్నము నుండి 8,12భావములు వదలి మిగిలిన భావములలో శుభగ్రహములు, తృతీయ, షష్ఠ, ఏకాదశభావములలో పాపగ్రములున్నపుడు గృహారంభము శుభమునిచ్చును.

**దేవాలయాది నిర్మాణములో రాహుముఖ జ్ఞానము :-**

**దేవాలయే గేహవిధౌ జలాశయే రాహోర్ముఖం శమ్భుదిశో విలోమత:**
**మీనార్క సింహార్క మృగార్కతస్త్రిభే ఖాతే ముఖాత్ పృష్ఠవిదిక్శుభా భవేత్** **19**

దేవాలయ గృహ జలాశయ నిర్మాణములో క్రమముగా మీన,సింహ,మకర రాశుల నుండి మూడేసి రాశులలో సూర్యుడున్నపుడు రాహుముఖము ఈశాన్యకోణములో ప్రారంభించి విపరీత క్రమములో నాలుగు కోణములలో నుండును. (మీన మేష,వృషభము లలో సూర్యుడున్నపుడు దేవాలయ నిర్మాణములో రాహుముఖము ఈశాన్యకోణములో, మిథునము కర్కాటక సింహరాశులలో సూర్యుడున్నపుడు వాయవ్యకోణములో, కన్యాతుల వృశ్చికములలో సూర్యుడున్నపుడు నైర్ృతికోణములో, ధను,మకర,కుంభములలో సూర్యుడున్నపుడు రాహుముఖము ఆగ్నేయకోణములో నుండును.) ఏకోణములో

రాహుముఖముందునో దానికి వెనుకభాగములో గోతిని త్రవ్వటమారంభించవలెను. రాహుముఖము నైరృతికోణములోనున్న గోతిని త్రవ్వటం వాయవ్యకోణములో చేయవలెను.

రాహుముఖ పృష్ఠ బోధక పట్టిక

| రాహుముఖము | ఈశాన్యము | వాయువ్యము | నైరృతి | ఆగ్నేయము | |
|---|---|---|---|---|---|
| దేవాలయము | 12,1,2 | 3,4,5 | 6,7,8 | 9,10,11 | సూర్య క్రాంతరాశులు |
| గృహము | 5,6,7 | 8,9,10 | 11,12,1 | 2,3,4 | -- |
| జలాశయము | 10,11,12 | 1,2,3 | 4,5,6 | 7,8,9 | -- |
| రాహుపృష్ఠము | ఆగ్నేయము | ఈశాన్యము | వాయవ్య | నైరృతి | -- |

**కూపనిర్మాణ ఫలము :-**

**కూపే వాస్తోర్మధ్యదేశేఽర్థనాశస్త్వైశాన్యాదౌ పుష్టిరైశ్వర్యవృద్ధి:**
**సూనోర్నాశ: స్త్రీవినాశో మృతిశ్చ సమ్పత్పీడా శత్రుత: స్యాచ్చసౌఖ్యమ్** 20

వాస్తుమధ్యలో కూపమున్న గృహస్వామికి ధననాశము, ఈశాన్యకోణములో నున్న పుష్టి,పూర్వదిశలో ఐశ్వర్యవృద్ధి,అగ్నికోణములో పుత్రనాశము,దక్షిణములో స్త్రీనాశము, నైరృతిలో మృత్యువు, పశ్చిమములో సంపత్తి, వాయవ్యములో శత్రుపీడ, ఉత్తరదిశలో కూపమున్న సౌఖ్యము కలుగును.

**స్నానాగ్ని పాకశయనాస్త్ర భుజశ్చ ధాన్య**
**భాణ్డారదైవత గృహాణి చ పూర్వత: స్యు:**
**తన్మధ్యతస్తు మథనాజ్యపురీష విద్యా**
**భ్యాసాఖ్యరోదన రతౌషధ సర్వధామ** 21

పూర్వాది ఎనిమిదిదిశలలో క్రమముగా పూర్వదిశలో స్నానగృహము, ఆగ్నేయములో పాకగృహము,దక్షిణములో శయనాగారము, నైరృతిలో శస్త్రాగారము, పశ్చిమములో భోజనస్థానము, వాయవ్యములో అన్న సంగ్రహాలయము, ఉత్తరములో ధనాగారము, ఈశాన్యములో పూజాగృహము నిర్మాణము చేయవలెను. పూర్వఅగ్నికోణముల మధ్యలో దధిమంథన గృహము,ఆగ్నేయ దక్షిణదిశలమధ్యలో ఘృత(నెయ్యి) సంగ్రహగృహము,దక్షిణ నైరృతుల మధ్యలో శౌచాలయము, నైరృతి పశ్చిమముల మధ్యలో విద్యాభ్యాస గృహము, పశ్చిమవాయవ్యముల మధ్యలో రోదనగృహము, వాయవ్య ఉత్తరముల మధ్యలో రతి గృహము,ఉత్తరఈశాన్యముల మధ్యలో ఔషధగృహము,ఈశాన్య పూర్వదిశల మధ్యలో వస్తువుల గృహము నిర్మాణము చేయవలెను.

**ప్రాచీన వాస్తు శాస్త్రజ్ఞులు వస్తువులు వాటి వలన కలుగు ఉపయోగము లననుసరించి వాటిస్థానములను నిర్దేశించుట జరిగినది. ఉపకరణములుచిత స్థానములందుడుట వలన గృహస్థులకు తగిన విధముగానుపయోగపడును.**

గృహవిభాగ పట్టిక

| | వాయవ్యము | ఉ.వాయ | ఉత్తరము | ఉ.ఈశాన్య | ఈశాన్యము | |
|---|---|---|---|---|---|---|
| | అన్న గృహము | రతి గృహము | ధనా గారము | ఔషధ గృహము | పూజా గృహము | |
| ప.వాయ | రోధన గృహము | | | | సర్వవస్తు గృహము | పూ.ఈశాన్యము |
| పశ్చిమము | భోజన గృహము | | | | స్నాన గృహము | పూర్వదిశ |
| ప.నైరృతి | అధ్యయన గృహము | | | | మంథన గృహము | పూ.ఆగ్నేయము |
| నైరృతి | అస్త్రా గారము | శౌచా లయము | శయన గృహము | ఘృత గృహము | పాకశాల | ఆగ్నేయము |
| | | ద.నైరృతి | దక్షిణము | ద,ఆగ్నేయ | | |

**లగ్నము వలన గృహఫలము :-**

**జీవార్క విచ్ఛుక్రశనైశ్చరేషు లగ్నారిజామిత్ర సుఖత్రిగేషు**
**స్థితి: శతం స్యాచ్ఛరదాం సితార్కారేజ్యే తనుత్ర్యఙ్గసుతే శతేద్వే** **22**

గృహారంభ లగ్నములో గురుడు, షష్ఠభావములో రవి, సప్తమభావములో బుధుడు, చతుర్థభావములో శుక్రుడు, తృతీయభావములో శనియున్న గృహము వంద సంవత్సరము లుండును. శుక్రుడు లగ్నములో,రవి తృతీయములో,కుజుడు షష్ఠమములో గురుడు పంచమములో నున్న 200 సంవత్సరముల వరకు గృహముండును.

**లగ్నామ్బరాయేషు భృగుజ్ఞభానుభి:**
**కేన్ద్రే గురౌ వర్షశతాయురాలయ:**
**బన్ధౌ గురుర్వ్యోమ్ని శశీ కుజార్కజౌ**
**లాభే తదాశీతి సమాయురాలయ:** **23**

గృహారంభ లగ్నములో శుక్రుడు, దశమములో బుధుడు, ఏకాదశమములో రవి, కేంద్రములో(1,4,7,10) గురుడున్న గృహము 100 సంవత్సరముండును. చతుర్థ భావములో గురుడు, దశమములో చంద్రుడు, ఏకాదశములో కుజ శనులున్న గృహము

80 సంవత్సరమయలు ఆయువు కలిగియుండును.

**చిరాయుయోగము :-**

**స్వోచ్చేశుక్రే లగ్నగే వా గురౌ వేశ్మగతేఽథవా**
**శనౌస్వోచ్చే లాభగే వా లక్ష్మ్యా యుక్తం చిరం గృహమ్ 24**

ఉచ్చరాశి మీనలగ్నములో శుక్రుడు, లేక ఉచ్చరాశి కర్కాటకములో గురుడు చతుర్థభావములో లేక తన ఉచ్చరాశి తులలోనున్న శని లాభభావములోనున్న ధన ధాన్యములతో చిరస్థాయిగా గృహముండును.

**గృహ హస్తాంతర యోగము :-**

**ద్యూనామ్బరే యద్యైకోఽపి పరాం శస్థో గ్రహోగృహమ్**
**అబ్దాన్త: పరహస్తస్థం కుర్యాచ్చేద్వర్ణపోఽబల: 25**

గృహారంభ సమయములో ఏదైన ఒకగ్రహము శత్రుగృహ నవమాంశములో నున్న, వర్ణస్వామి గ్రహము నిర్బలమైన ఒక సంవత్సరము లోపల గృహము ఇతరుల చేతికి వెళ్ళును.

**గృహారంభ నక్షత్ర వార ఫలములు :-**

**పుష్యధ్రువేన్దుహరిసర్పజలై: సజీవై:**
**తద్వాసరేణ చ కృతం సుతరాజ్యదం స్యాత్**
**ద్వీశాశ్వితక్ష వసుపాశిశివై: సశుక్రై**
**ర్వారే సితస్య చ గృహం ధనధాన్యదం స్యాత్ 26**

గురువుతో కూడిన పుష్యమి, ధ్రువసంజ్ఞక (ఉత్తరాత్రయం, రోహిణి) మృగశిర శ్రవణం ఆశ్లేష,పూర్వాషాఢ నక్షత్రములలో గురువారమునాడు ప్రారంభించిన గృహము పుత్ర రాజ్యసుఖము నిచ్చునదగును. శుక్రునితో కూడిన విశాఖ, అశ్విని, చిత్త,ధనిష్ఠ, శతభిషం, ఆర్ద్ర నక్షత్రములలో శుక్రవారమునాడు ప్రారంభించిన గృహము ధనధాన్యముల నిచ్చునదగును.

**సారై: కరేజ్యాన్త్యమఘామ్బుమూలై: కౌజేఽహ్నివేశ్మాగ్ని సుతార్తిదం స్యాత్**
**సజ్ఞై: కదాస్రార్యమతక్ష హస్తై: జ్ఞస్యైవ వారే సుఖపుత్రదం స్యాత్ 27**

కుజునితో కూడిన హస్త,పుష్యమి, రేవతి,మఘ, పూర్వాషాఢ,మూల నక్షత్రములలో మంగళవారమునాడు ప్రారంభించిన గృహము అగ్నిభయమును,పుత్రులకు కష్టము నిచ్చున దగును. బుధునితో కూడిన రోహిణి, ఉత్తర, చిత్త, హస్త, నక్షత్రములలో బుధవారమునాడు ప్రారంభించిన గృహము సుఖమును పుత్రులనిచ్చును.

**అజైకపాదహిర్బుధ్న్య శక్రమిత్రానిలాన్తకై:**

**సమన్దైర్మన్దవారే స్యాద్రక్షోభూతయుతం గృహమ్** **28**

శనితో కూడిన పూర్వాభాద్ర,ఉత్తరాభాద్ర, జ్యేష్ఠ, అనూరాధ, స్వాతి, భరణి, నక్షత్రములలో శనివారమునాడు నిర్మించిన గృహము రాక్షస భూత ప్రేతములకు నిలయమగును.

**ద్వారచక్ర మతాంతరము :-**

**సూర్యర్క్షాద్యుగభై: శిరస్యథ ఫలం లక్ష్మీస్తత: కోణభై**
**ర్నాగైరుద్వసనం తతో గజమితై: శాఖాసు సౌఖ్యం భవేత్**
**దేహల్యాం గుణభైర్మృతిర్గృహఫతే ర్మధ్యస్థితై ర్వేదభై:**
**సౌఖ్యం చక్రమిదం విలోక్య సుధియాద్వారం విధేయం శుభమ్** **29**

సూర్యుడున్న నక్షత్రము నుండి నాలుగు నక్షత్రములు ద్వారచక్ర శిరము నందుండును. వీటిలో ద్వారస్థాపన లక్ష్మీప్రదమగును. తర్వాత ఎనిమిది నక్షత్రములు కోణములో నుండును. అవి గృహస్వామికి ఉద్వేగమును కలిగించును. తర్వాత ఎనిమిది నక్షత్రములు ద్వారశాఖపై నుండును. సుఖమును కలిగించును. తర్వాత మూడు నక్షత్రములు చౌకట్టులో నుండును. అవి మృత్యుకారకమగును. చివరి నాలుగు నక్షత్రములు ద్వారమధ్య భాగములో నుండును. వీటిలో ద్వారము స్థాపించిన సుఖదాయకమగును. బుద్ధిమంతుడైన పురుషుడు ఈద్వారచక్రమును చూచి శుభఫలము నిచ్చు నక్షత్రములో ద్వారస్థాపన చేయవలెను.

**ద్వారఫల పట్టిక**

| సూర్య నక్షత్రసంఖ్య | 4 | 8 | 8 | 3 | 4 |
|---|---|---|---|---|---|
| ద్వారస్థానము | శిరస్సు | కోణము | శాఖ | చౌకట్టు | మధ్య |
| ఫలితము | లక్ష్మీప్రాప్తి | ఉద్వేగము | శుఖము | అశుభము | సుఖము |

**పన్నెండవ వాస్తు ప్రకరణము సమాప్తము**

## 13. గృహప్రవేశ ప్రకరణము

**సౌమ్యాయనే జ్యేష్ఠ తపోఽన్త్యమాధవే**
**యాత్రానివృత్తౌ నృపతేర్నవే గృహే**
**స్యాద్వేశనం ద్వాఃస్థమృదు ధ్రువోడుభి**
**ర్జన్మర్క్ష లగ్నోపచయోదయే స్థిరే** **1**

సూర్యుడుత్తరాయణములో నున్నప్పుడు జ్యేష్ఠ, మాఘ, ఫాల్గుణ, వైశాఖ మాసములలో గృహమునకు ముఖ్యద్వార దిశకు సంబంధించిన మరియు మృదు (మృగశిర, రేవతి,చిత్త, అనూరాధ) ధ్రువ (ఉత్తరాత్రయం,రోహిణి) సంజ్ఞక నక్షత్రములలో జన్మరాశి జన్మలగ్నము నుండి ఉపచయ (3,6,10,11) స్థిర(2,5,8,11) లగ్నములలో యాత్రను పూర్తి చేసిన రాజు తనగృహములో పున:ప్రవేశము, అదే విధముగా నూతన గృహప్రవేశము శుభమునిచ్చును.

**గృహప్రవేశము మూడువిధములు : 1. అపూర్వ ప్రవేశము 2. సపూర్వప్రవేశము 3. ద్వంద్వాభయ ప్రవేశము. కొందరు విద్వాంసులు వధూప్రవేశమును కూడ వీటితో పాటు నాల్గవ ప్రవేశముగా తెల్పెను. నూతనగృహప్రవేశము అపూర్వ సంజ్ఞక ప్రవేశము. ఒకసారి ముహూర్తానుసారము యాత్ర ప్రారంభించి తర్వాత ముహూర్తానుసారము రాజప్రాసాదములో తిరిగి ప్రవేశించిన అది సపూర్వసంజ్ఞక ప్రవేశమగును. జలము, అగ్ని,రాజకోపముల వలన పీడింపబడిన వ్యక్తి ఇతరగృహములో ప్రవేశించిన అది ద్వంద్వాభయ ప్రవేశమగును. వసిష్ఠుడు ఈ మూడు విధములైన ప్రవేశములను తెల్పెను.**

**జీర్ణగృహ ప్రవేశ ముహూర్తము :-**

**జీర్ణేగృహేఽగ్న్యాదిభయాన్నవేఽపి మార్గోర్జయో: శ్రావణికేఽపి సన్స్యాత్**
**వేశోఽమ్బుపేజ్యానిలవాసవేషు నావశ్యమస్తాది విచారణాత్ర** **2**

గృహము జీర్ణమైనపుడు, అగ్ని,రాజకోపముల వలన నష్టపోయినపుడు తిరిగి కొత్తగా నిర్మించిన గృహములో మార్గశీర్ష,కార్తీక, శ్రావణమాసములలో శతభిషం,పుష్యమి, స్వాతి, నక్షత్రములలో గృహప్రవేశము చేయవచ్చును. ఆసమయములలో గురు శుక్రుల అస్తాది విచారణ చేయవలసిన అవసరము లేదు.

**మృదుధ్రువక్షిప్ర చరేషు మూలభే వాస్త్వర్చనం భూతబలిం చ కారయేత్**
**త్రికోణ కేన్ద్రాయ ధనత్రిగై: శుభైర్లగ్నే త్రిషష్ఠాయగతైశ్చ పాపకై:** **3**
**శుద్ధామ్బురన్ధ్రే విజనుర్భమృత్యౌ వ్యర్కారిరిక్తాచర దర్శచైత్రే**
**అగ్నేఽమ్బుపూర్ణం కలశం ద్విజాంశ్చ కృత్వా విశేద్వేశ్మ భకూట శుద్ధమ్** **4**

మృదుసంజ్ఞక (మృగశిర,రేవతి,చిత్త,అనూరాధ) ధ్రువసంజక (ఉత్తరాత్రయం, రోహిణి) చరసంజ్ఞక (స్వాతి పునర్వసు శ్రవణ,ధనిష్ఠ,శతభిషం) మూల నక్షత్రములలో వాస్తుపూజ చేసి భూతబలి (హవనము తర్వాత ఇచ్చు క్షేత్రపాలకుని బలి) నివ్వవలెను. అనంతరము ఏలగ్నము నుండి త్రికోణము (5,9) కేంద్ర (1,4,7,10) 11,2,3భావములలో శుభ గ్రహములుండునో, 3,6,11భావములలో పాపగ్రహములుండునో 4,8 భావములు శుద్ధముగా నుండునో, గృహయజమాని జన్మలగ్నము లేక జన్మరాశి నుండి అష్టమరాశి ప్రవేశలగ్నము కాకుండ ఉండునో అటువంటి సమయములో రవివారము, మంగళవారము, రిక్త(4,6,14) తిథులు, చర (1,4,7,10) లగ్నములు అమావాస్య చైత్రమాసములను వదలి భకూటము (2×12, 5×9, 6×8లను వదలి) శుద్ధముగా నున్నపుడు జలముతో నిండిన కలశమును బ్రాహ్మణులను ముందుంచి గృహప్రవేశము చేయవలెను.

**వామార్క జ్ఞానము :–**

**వామోరవిర్మృత్యుసుతాథలాభతోఽర్కే పఞ్చమే ప్రాగ్వదనాది మన్దిరే**
**పూర్ణేతిథౌ ప్రాగ్వదనే గృహేశుభో నన్దాదికే యామ్యజలోత్తరాననే 5**

అష్టమ,పంచమ,ద్వితీయ ఏకాదశభావముల నుండి ఐదేసిభావములలో సూర్యుడున్నపుడు పూర్వాది దిశలలో ముఖ్యద్వారముగల గృహములలో ప్రవేశము చేయు సమయమున వామరవి యుండును. అనగా ప్రవేశ లగ్నము నుండి 8,9,10, 11,12 భావములలో సూర్యుడున్న పూర్వాభిముఖగృహములో,5,6,7,8,9 భావములలో సూర్యుడున్న దక్షిణాభిముఖగృహములలో,2,3,4,5,6భావములలో సూర్యుడున్న పశ్చిమా ముఖములో,11,12,1,2,3భావములలో సూర్యుడున్న ఉత్తరాభిముఖ గృహములలో ప్రవేశించు సమయములో వామరవియుండును. ఆప్రవేశము శుభము నిచ్చును. పూర్ణ (5,10,15) తిథులలో పూర్వాభిముఖ గృహములో,నంద(1,6,11) తిథులలో దక్షిణాభిముఖ గృహములో,భద్ర(2,7,12)తిథులలో పశ్చిమాభిముఖ గృహములో, జయ (3,8,13) తిథులలో ఉత్తరాభిముఖ గృహములో గృహప్రవేశము శుభమునిచ్చును.

**గృహప్రవేశ కుంభజ్ఞానము :–**

**వక్త్రే భూరవిభాత్ప్రవేశ సమయే కుమ్భేఽగ్నిదాహః కృతాః**
**ప్రాచ్యాముద్వసనం కృతా యమగతా లాభః కృతాః పశ్చిమే**
**శ్రీర్వేదాః కలిరుత్తరే యుగమితా గర్భే వినాశోగుదే**
**రామాః స్థైర్యమతః స్థిరత్వమనలాః కణ్ఠే భవేత్సర్వదా 6**

గృహప్రవేశ సమయములో సూర్యుడున్న నక్షత్రము కుంభచక్రముఖము నందుండును. దీనిలో ప్రవేశించిన అగ్నిభయము, దీనితర్వాత నాలుగు పూర్వనక్షత్రములలో

ప్రవేశించిన ఉద్వేగము, తర్వాత నాలుగు దక్షిణ నక్షత్రములలో ప్రవేశించిన లాభము, తర్వాత నాలుగు పశ్చిమ నక్షత్రములలో ప్రవేశించిన స్త్రీలాభము, తర్వాత నాలుగు ఉత్తరదిశా నక్షత్రములలో ప్రవేశించిన కలహము, తర్వాత గర్భములోనున్న నాలుగు నక్షత్రములు వినాశకారకము,తర్వాత కలశమునకు నీచభాగములో నున్న మూడు నక్షత్రములలో ప్రవేశించిన స్థిరత్వము, తర్వాత మూడు కంఠ నక్షత్రములలో ప్రవేశించిన ఎల్లప్పుడు స్థిరముగా నుండుట జరుగును.

**కుంభఫల పట్టిక**

| సౌర నక్షత్ర సంఖ్య | 1 | 4 | 4 | 4 | 4 | 4 | 3 | 3 |
|---|---|---|---|---|---|---|---|---|
| స్థానము | ముఖము | పూర్వ | దక్షిణ | పశ్చిమ | ఉత్తర | గర్భము | గుదము | కంఠము |
| ఫలితము | అగ్ని దాహము | ఉద్వేగము | లాభము | స్త్రీలాభము | కలహము | నాశము | స్థిరత్వము | స్థిరత్వము |

**ఉపసంహారము :-**

**ఏవం సులగ్నే స్వగృహం ప్రవిశ్య వితానపుష్పశ్రుతిఘోష యుక్తమ్**
**శిల్పజ్ఞ దైవజ్ఞ విధిజ్ఞపౌరాన్ రాజార్చయేద్భూమిహిరణ్య వస్త్రైః** **7**

ఈ విధముగా తెలుపబడిన శుభలగ్నములలో మండపపుష్పమాలలు వేద ధ్వనులతో గృహములో ప్రవేశించి రాజు శిల్పి జ్యోతిష పురోహిత నాగరికులకు భూమి స్వర్ణము వస్త్రాదులనిచ్చి గౌరవించవలెను.

**పదమూడవ గృహప్రవేశ ప్రకరణము సమాప్తము**

## 14. గ్రంథకర్త వంశ వర్ణనము

**ఆసీర్ధర్మపురే షడఙ్గనిగమాధ్యేతృద్విజైర్మణ్డితే**
**జ్యోతిర్విత్తిలకః ఫణీన్ద్రరచితే భాష్యే కృతాతిశ్రమః**
**తత్తజ్జాతక సంహితాగణిత కృన్మాన్యో మహాభూభుజాం**
**తర్కాలఙ్కృతి వేదవాక్యవిలసద్బుద్ధిః స చిన్తామణిః** **1**

ఆరు అంగము (శిక్ష, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషము) లతో కూడిన వేదముల అధ్యయనము అధ్యాపనము చేయువాడు, బ్రాహ్మణులతో సుశోభితుడు, ధర్మపురనామక గ్రామములో జ్యోతిషులలో సర్వశ్రేష్ఠుడు, శేషనాగముచే రచింపబడిన మహాభాష్యములో కఠినమైన పరిశ్రమ చేసినవాడు హెూర, సంహిత,

గణితశాస్త్రములలో గ్రంథరచన చేసినవాడు, మహారాజులచే పూజింపబడినవాడు, న్యాయాలంకార మీమాంసాశాస్త్రములలో నిపుణుడు బుద్ధిమంతుడైన చింతమణి పేరుతో నాపితామహుడుండెను.

**జ్యోతిర్విద్గణ వన్దితాఙ్ఘ్రి కమలస్తత్సూనురాసీత్కృతీ**
**నామ్నానన్త ఇతి ప్రథామధిగతో భూమణ్డలాహస్కర:**
**యో రమ్యాం జనిపద్ధతిం సమకరోద్దుష్టాంశ యద్ధ్వంశినీమ్**
**టీకాం చోత్తమకామధేను గణితేఽకార్షీత్సతాం ప్రీతయే** **2**

దైవజ్ఞులచే పూజింపబడిన చరకమలములవాడు, అధ్యయన, అధ్యాపనములలో కుశలుడు, భూమిపై సూర్యునితో సమానమైన తేజస్సు కలవాడు, చింతామణి దైవజ్ఞ పుత్రుడు అనంతనామముతో విఖ్యాతుడైన నాతండ్రి ఉండెను. అతడు ఫలితశాస్త్రములో ఆసక్తి కలిగినవాడు, సంశయములను దూరము చేయువాడు, రమణీయమైన జాతక రచనచేసినవాడు, సజ్జనుల ప్రసన్నత పొందుటకు కామధేను నామక, ఉత్తమ గ్రంథమునకు వ్యాఖ్యానము వ్రాసెను.

**గ్రంథకార పరిచయము :-**

**తదాత్మజ ఉదారధీర్విబుధనీల కణ్ఠానుజో**
**గణేశపదపఙ్కజం హృది నిధాయ రామాభిధ:**
**గిరీశనగరే వరే భుజభుజేషు చన్ద్రైర్మితే**
**శకే వినిరమాదిమం ఖలు ముహూర్తచిన్తామణిమ్** **3**

అనంత దైవజ్ఞుని పుత్రుడు,ప్రసిద్ధ దైవజ్ఞుడు నీలకంఠుని సోదరుడు ఉదార హృదయముగల రామ దైవజ్ఞుడు, భగవానుడు శంకరుని నగరమైన కాశీలో గణేశుని చరణ కమలములను హృదయము నందు ధరించి 1522 శకాబ్దములో ఈ ముహూర్త చింతామణి గ్రంథ రచన చేసెను.

**శ్రీరామ దైవజ్ఞ విరచిత ముహూర్త చింతామణి గ్రంథము సమాప్తము**





## గ్రంథకర్త పరిచయం

జ్యోతిషవిశారద - వాస్తు సమ్రాట్

# డా॥ ముదుండి విశ్వనాథరాజు
# పి.హెచ్.డి.

జననం : 01.11.1952

జన్మస్థలం : పాలకోడేరు (మండలం) పశ్చిమగోదావరిజిల్లా.

విద్యార్హతలు : భాషా ప్రవీణ.ఎం.ఏ.తెలుగు, హిందీ, సంస్కృతం, ఎం.ఏ జ్యోతిషం.(యూనివర్సిటీలో ప్రథములుగా ఉత్తీర్ణత) జ్యోతిర్వాస్తు డిప్లొమ, కన్నడ భాషా డిప్లొమ. వాస్తు శాస్త్రంలో పి.హెచ్.డి.

అధ్యాపకత్వం : ప॥గో॥జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలల్లో 1976 నుండి 1982 వరకు తెలుగు భాషా బోధన (ప్రస్తుతం) నేషనల్ పోలీసు అకాడమీలో ఐ.పి.ఎస్ అధికారులకు తెలుగు కన్నడ భాషల బోధన.
తెలుగు యూనివర్సిటీ జ్యోతిష విభాగంలో వాస్తు, జ్యోతిషశాస్త్ర బోధన.

రచనలు : కాలేజీ విద్యార్థుల కొరకు తెలుగు వ్యాకరణం, ఇంగ్లీషు తెలుగు హిందీ భాషలలో డిక్షనరీలు, స్వబోధినులు, కన్నడ హిందీ ఇంగ్లీషు సంస్కృత భాషల అనువాదాలు.
విశ్వకర్మ ప్రకాశము, ప్రాచీన వాస్తు శాస్త్రాలు - ఆధునిక వాస్తు పరిశీలన నారద సంహిత, మయమతము, వాస్తురాజ వల్లభము, బృహత్సంహిత

అభిలాష : ప్రాచీన ఆధునిక వాస్తుల సమన్వయంతో భవన నిర్మాణ సలహాలను, జ్యోతిష శాస్త్ర ప్రయోజనాలను సామాన్యులకు కూడా అందజేయాలని.....

Deepthi Printers, Hyd. 9949703224